# ఆదర్శ ప్రేమ

★

రచన:

రవీంద్రనాథ ఠాగూరు



★



శ్రీ నిత్యకళ్యాణి పబ్లిషర్సు
విజయవాడ-2.

# 1

జమీందారు ముకుందబాబు, మాజీ మేనేజరు కూతురు, ప్రస్తుత మేనేజరు భార్య ఇంద్రాణీదేవి ఏదో అశుభముహూర్తంలో తమ జమీందారుగారింటికి విందుకు వచ్చింది. యిది వారి కోడలు ప్రప్రథమంగా వచ్చిన సందర్భంలో చేసినవిందు.

దీనికి ముందు చరిత్ర కొంత చెబితే బాగా అర్థమవుతుంది.

యిప్పుడు ముకుందబాబు లేడు. ఆయన దివాన్ గౌరీశంకరూ లేడు. ఉన్నప్పుడు యిద్దరూ చాలా స్నేహంగా ఉండేవారు. తల్లితండ్రులు లేని గౌరీశంకర్ ముఖం చూచి విశ్వసించి తన జమీందారీయంతా నిర్వహించమని ఆజ్ఞాపించాడు ముకుందబాబు. తరువాత అతనేమీ తప్పు చేయడని నిరూపించుకున్నాడు. చెదలు తనకాశ్రయం కోసరం నిరంతరం ప్రయత్నిస్తున్నట్లే, స్వర్గప్రాప్తికోసరం పుణ్యాన్ని పోగు చేసుకొనే మాదిరిగానే గౌరీశంకర్ కూడా ప్రతిరోజూ తన కఠినపరిశ్రమవల్ల జమీందారు ఆస్తి పెంచుతున్నాడు. తన తెలివితేటలతో అతిచౌకగా పొరుగుజమీందారు భూమంతా కొని ముకుందబాబు జమీందారీలో కలిపారు. ముకుందబాబు వంశగౌరవము పెరిగింది. పెద్ద పెద్ద జమీందార్ల శ్రేణిలో

గణుతికెక్కాడు. యజమాని అభివృద్ధితోపాటు నౌకరుకూడా వృద్ధిలోకి వచ్చాడు. నెమ్మది నెమ్మదిగా మంచియిల్లు, పొలముపుట్ర, పూజోత్సవాలు అన్నీ పెరిగినయ్. ఒకప్పటి తాశీల్దారుకూడా నెమ్మది నెమ్మదిగా దివానులవుతున్నారు.

ఇదీ వారి పూర్వవృత్తాంతం. ఇప్పుడున్న జమీందారు వారి దత్తపుత్రుడు వినోదలాల్. ఆయనదగ్గర గౌరీశంకర్ అల్లుడు సుశిక్షితుడైన అంబికాచరణుడు మేనేజరుగా ఉంటున్నాడు. కొడుకు రమాశంకరుణ్ని విశ్వసించలేకపోవడం వల్ల కొడుకును వదిలివేసి అల్లుణ్ణి తనస్థానంలో నియమింపజేశాడు గౌరీశంకరుడు.

పనంతా సక్రమంగానే సాగుతోంది, అప్పటికి యిప్పటికి ఒకటే తేడావుంది. అదివరకు ముకుందలాల్ బాబుకు గౌరీశంకర్‌కు మధ్య ఆత్మీయసంబంధముండేది. ఇప్పుడలా కాక కేవలం పనిలో కన్పిస్తుందా సంబంధం. యిదివరకు డబ్బుకు విలువెక్కువుండేదికాదు. హృదయంకూడా తేలికగానే లభించేది. ఇప్పుడు హృదయాల్ననవసరంగా వ్యయపరచకుండా తన వారి వరకే హద్దులు నిర్మించుకుంటున్నారు. బయటవాళ్ళకు యిందులో స్థానం ఉండటంలేదు.

యీమధ్యే కొత్తకోడలు రావడంవల్ల జమీందారుగారింట విందు జరిగింది. ఆ సందర్భంలోనే దివాన్‌కూతురు ఇంద్రాణీదేవి విచ్చేయడం జరిగింది.

అసలు ఈ ప్రపంచమంతా ఏమిటికి కుతూహలప్రియులకు, అదృష్టశాలురకు ఇది ఒక రసాయినిక ప్రయోగశాలవంటిది. దీనిలో చిత్రవిచిత్ర స్వభావాలుగల మనుష్యులు

కూడి ప్రతిరోజు సంయోగవియోగాల చిత్రవిచిత్రానుభూతుల చరిత్రలు అంకితంచేస్తూ, చెరుపుతూ వుంటాయి. వీటికేమి అంతం లేదు.

ఈవిందు ఆనందోత్సవంలో రెండురకాల దృక్పథాల మహిళలు కలిశారు. చూస్తూచూస్తూనే ఒకేరకమైన నూలు నేతలో కొత్తరకపు నూలు కలిసినట్లయింది. మధ్యలోముడి పడిపోయింది.

భోజనాదికాలన్నీ పూర్తి చేసుకుని ఇంద్రాణి జమీం దారుగారింటికి ఆలస్యంగా వచ్చింది. వినోదలాల్ భార్య నయనతార దీనికి కారణమడిగింది. యింట్లో పనిపూర్తి కాక పోవడము, వంట్లో బాగుండకపోవడం మొదలైన కారణా లన్నీ వాళ్ళ నసంతృప్తి పరిచినయ్.

అసలు కారణం దాచిపెట్టినా అందరూ అర్థం చేసు కున్నారు. ముకుందబాబు వంశము జమీందార్ల వంశ మయినా, ధనవంతులైనప్పటికి, కులముకు గౌరీశంకర వంశమే మిన్న యయినది. ఇంద్రాణి కులగౌరవాన్ని మరచిపోలేదు. యజమానుల యింట్లో భోజనము చేయడము యిష్టంలేకనే ఇంద్రాణి ఇంత ఆలస్యంగావచ్చింది. ఆమె ఆంతర్యం కని పెట్టి అందరూ ఏదైనా తినిపించాలని పట్టుబట్టారు కాని ఎవరూ దానిలో సఫలీకృతులు కాలేకపోయారు.

యిదివరకు ముకుందలాల్, గౌరీశంకరులకు మధ్య యిటువంటి సమస్యే వుత్పన్నమయింది. ఆ సంఘటన కూడ యిక్కడ వివరింపవలసిన అవసరమున్నది.

ఇంద్రాణి అతి లావణ్యవతి. బంకిమ్‌బాబు భాషలో

సుందరిని సౌదామినితో పోల్చినప్పటికి, కొన్ని విషయాలలో అది సరిపోవడంలేదు. ఇంద్రాణి తనలోని వుద్వేగాన్ని, ప్రజ్వలిస్తున్న అగ్నిని తన స్వాభావిక సహజ గంభీరతతో తన శరీరంలోనే అణచుకుంది. విద్యుత్ ఆమె ముఖం, నేత్రాలు, శరీరం అంతటా మెరుస్తూంటుంది. కాని దానిలో విద్యుత్ కుండే చాంచల్యంలేదు.

యీ సుందరిని చూచి ముగ్ధుడై ముకుందబాబు తన దత్తత పుత్రుడికిచ్చి వివాహం చేయాలనుకున్నాడు. గౌరీ శంకరునివద్ద యిదే ప్రస్తావన తీసుకువచ్చాడు. గౌరీశంకర్ ప్రభు భక్తిపరాయణుడు. యజమానికోసం ప్రాణాలనుసైతం అర్పిస్తాడు. యజమాని మిత్రత్వంతో తన్నెంత వున్నత మెునర్చినప్పటికీ, (తన అంతస్తు పెరిగినప్పటికి) అయన తన యజమాని గౌరవాన్ని మరచిపోయేవాడుకాదు. కాని ఈ వివాహ ప్రస్తావన కాయన అంగీకరించలేకపోయాడు. ప్రభు భక్తి, కర్తవ్యపరాయణత విషయంలో ఏమరుపాటు లేకుండా వుండేవాడు. కాని తన కులగౌరవాన్ని వదలుకో లేడు. ముకుందలాల్ కుమారుడికి తన కూతురు నివ్వడాని కెలాగూ వొప్పుకోలేదు.

తనదగ్గర నౌకరుచేసే గౌరీశంకర్ కులగౌరవ గర్వము ముకుందలాల్ కు అసహ్యమనిపించింది. గౌరీశంకర్ ఇటువంటి వాడనుకోలేదు. తన కొడుకుకు చేసుకుని అతన్ని, అతని వంశాన్ని వున్నతస్థితికి తీసుకువెళ్ళాలనే ముకుందలాల్ తల చాడు. ముకుందలాల్ గౌరీశంకర్ తో మాట్లాడటం మాని వేశాడు. ఇది గౌరీశంకర్ హృదయంలో శూలంవలె గ్రుచ్చు

కుంది. చాలా మానసిక క్లేశ మనుభవించాడు. అప్పటికి లొంగిపోకుండా తన కూతురును తల్లి, దండ్రిలేని ఒక బీద పిల్లవాడికిచ్చి తన కులంలోనే వివాహం చేశాడు. అతనికి విద్యాబుద్ధులు నేర్పించుతూ యింట్లోనే వుంచుకున్నాడు.

ఆ కులగర్వికూతురే ఇంద్రాణి. ఈ రోజు యజమానుల యింట్లోవిందు జరుగుతున్నా, ఏమీ భుజించకుండానే త్రోసిపుచ్చింది. జమీందారిణి నయనతార మనసులో ఈ విషయం ఎటువంటి శూలంవలె గ్రుచ్చుకొని వుంటుందో అర్థంచేసుకోవచ్చు. ఈర్ష్యాపూరిత నయనతార దృక్పథంలో ఇంద్రాణి నేరాలనేకం కనిపిస్తున్నాయి.

మొదటిది- ఇంద్రాణి చాలా నగలు ధరించి దర్జాగా రావడం. యజమానుల ఇంటికి వచ్చి తన దర్జాతోపాటు మాకు చాలా ధనం ఉంది యని భాగ్యశాలితనం చూపవలసిన అవుసరమేముంది?

రెండవది - ఇంద్రాణికి రూప సౌందర్య గర్వం అధికం ఇంద్రాణి రూపవతే. కాదనను. కాని నిమ్నశ్రేణి ఉద్యోగం చేస్తున్నవాళ్ళకు ఇంత అందము ఉండటం మంచిదికాదు. అనవసరంకూడాను. వేలమందిలో ఇంద్రాణి వంటి అందకత్తె ఒకర్తె లభించుతుంది. ఆమెలో గర్వం చూచిందీ అంటే అది నయనతార దృక్పథం తప్ప మరేమీ కాదు. సౌందర్యాన్ని ఎవరూ దూషించకూడదు. చెడునే వెతికేవారు అంతకంటె ఇంక దేనిని విమర్శిస్తారు!

మూడవది-ఇంద్రాణి చాల గర్విష్ఠి. దానికి కారణం ఇంద్రాణిది గంభీరస్వభావం. తనకు చాలా ప్రియంగానూ,

పరిచితులుగా ఉన్నవారితోతప్ప యితరులతో మాట్లాడదు, కలిసి మెలసి ఉండదు. పిలవని పేరంటాలకి బయలుదేరి ఏదో ఓవని కల్పించుకుని చేయడం ఆమె స్వభావానికే విరుద్ధం.

ఉన్నవీ లేనివి అనేకమైన అనవసరమైన సందేహాలతో నయనతార ఇంద్రాణిదేవిని తృణీకరిస్తోంది. ఆ కోపంతోనే ఇతరులకు "మేనేజరుభార్య" యనో "దివాన్ కూతుర" నో పరిచయం చేసి తడవతడవకు ఖిన్నపరుస్తోంది. ఒకదాసీకి బాగా బోధించింది. అదెప్పుడూ ఇంద్రాణీదేవినే అంటిపెట్టుకుని ఉంటుంది. మాటిమాటికి నగలవంక చూపించి విమర్శిస్తూ ఉంటుంది. "అక్కా! దీనిమీద బంగారం పూదించవా?" అని అడుగుతుంది.

ఇంద్రాణి గంభీరంగా నేజవాబిస్తుంది-"లేదే, రాగివి".

నయనతార ఇంద్రాణిని సంబోధిస్తూ అంది. "నువ్వక్కడ నిల్చుని ఏంచేస్తున్నావ్? ఈవిస్తళ్ళు బయటవల్లకీలో పెట్టిరా. దగ్గరే యింటిదాసీది నిలచి ఉంది".

ఒక్కక్షణంపాటు బరువెక్కిన రెప్పలను పైకి లేపి దయాదృష్టితో నయనతార ముఖంవంక తిలకించింది. మరుక్షణమే తియ్యని పదార్థాలతోనింపిన విస్తర్లుతీసుకుని ఇంద్రాణి క్రిందికి వెళ్ళింది.

ఈ మిఠాయిలు పంచిపెడుతున్నప్పుడు తీసుకొనే వాళ్ళంతా "మీరీ పనిచేయకండి. దాసీని పిలవండి" యని దాసీకోసరం వేగిరపడ్డారు.

ఇంద్రాణి ఒప్పుకోకుండానే "ఆ ఇదెంతపని! దాసీ

డెందుకు"? యంటూ వెళ్ళిపోయింది.

"అయితే మాకివ్వు మేమే పల్లకీలో యిచ్చివస్తాం".

"వద్దు"అంటూనే అన్నపూర్ణ పలెస్నిగ్ధగంభీర మృదు మధుర ప్రసన్నచిత్తముతో ప్రేమతో ఇంద్రాణి పల్లకీలో మిఠాయిలు ఉంచింది. ఆ రెండు నిముషాలలోనే ధనిక జమీందారింటి క్రొత్తకోడలు అల్పభాషిణి, మృదుహాసిని ఇంద్రాణితో చెలిమిచేసుకోవడానికి ఆరాటపడింది.

ఈ విధంగా నయనతార స్త్రీసహజమైన కటువ్యంగ్య అవమాన బాణాలతో ఇంద్రాణిని ఎంత పరాభవం చేసినా అది ఆమె దేహాన్ని స్పృశించలేదు. అవన్నీ ఆమె సహజ స్వాభావిక తేజస్వంతమైన, స్వభావసిద్ధమైన డాలుముందు ముక్క ముక్కలై విరిగిపోయినై. ఆమె అవిచలిత గంభీర స్వభావానికి నయనతార మరింత క్రోధితురాలయింది. ఇంద్రాణి ఇదంతా అర్థంచేసుకొని ఎవరితోనూ ఏమీ చెప్ప కుండా, ఎప్పుడో తప్పించుకుని ఇంటికి వెళ్ళిపోయింది.

# 2

శాంతంగా అన్నీ సహించేవారికి మానసికంగా చాలా గాఢమైన దెబ్బతగులుతుంది. ఇంద్రాణికి ఈ అవమానాన్ని త్రోసిపుచ్చినప్పటికి హృదయంలో చాలా గాఢమైన ప్రహా రమే తగలింది.

ఒకసారి ఇంద్రాణితో వినోదలాల్ వివాహ ప్రసక్తి వచ్చిన మాదిరిగానే, ఇంద్రాణి బాబాయి కుమారుడు

భామాచరణుడితో నయనతార వివాహం ప్రస్తావన వొచ్చింది. ఆ భామాచరణుడే ఇప్పుడు వినోదలాల్‌వద్ద మామూలు గుమాస్తా చేస్తున్నాడు. నయనతార తండ్రి కూతుర్ని తీసుకుని భామాచరణుడికి తన కూతురుకు వివాహం చేయించమని తన యింటికి వచ్చి గౌరీశంకరుడ్నెంతో ప్రార్థించాడు. ఇంద్రాణికీవిషయం ఇప్పటికీ బాగా గుర్తు ఉంది. ఆ చిన్నపిల్ల నయనతార ప్రగల్భచాతుర్యాలకు దివాన్ యింటిలో అందరూ ఆశ్చర్యపోయారు. ఈ నయన తార అకాల పాండిత్యం ముందు ఇంద్రాణి తనకేమీ తెలియదని, తన బలహీనతను వ్యక్తపరచుకుంది. గౌరీశం కర్ కూడా ఆ అమ్మాయిని చూచి చాలా ముగ్ధుడయాడు. కాని కులగౌరవలోపంవల్ల భామాచరణుడి కియ్యడానికి అంగీకరించలేదు. చివరకి ఆయన ప్రయత్నంవల్లే వినోద లాల్‌కు నయనతారనిచ్చి వివాహం చేయించాడు.

యీ మాటలన్నీ గుర్తుకు వచ్చినా ఇంద్రాణికి ఓదార్పు కలుగడానికి బదులు అవమానభారం యింకా అధిక మయింది. మహాభారతంలో శుక్రాచార్యుడి కూతురు దేవయాని, శర్మిష్ఠసంగతి గుర్తుకొచ్చింది. దేవయాని తమ ప్రభువు కూతురు శర్మిష్ఠను దాసీగా చేసుకుంది. అలాగే తనుకూడా నయనతారను దాసిగా చేసుకోనిదే ప్రతీకారం కాదు. ఒకప్పుడు దైత్యరాజు, దైత్యగురువు శుక్రాచా ర్యుల మాదిరిగానే ముకుందబాబుకు తన తండ్రి గౌరీశంకర్ చాలా ముఖ్యుడుగా ఉండేవాడు. ముకుందబాబు తన తండ్రి ఎదుట హీనత్వాన్ని ఒప్పుకొనేవాడు. కాని గౌరీశంకర్

ముకుందబాబు జమీందారీని పొంది ఉన్నత మైనర్చాడు. దానితో పిళ్ళంతా తను గొప్పతనాన్ని చాటుకోగలుగుతున్నారు. ఇప్పుడు బహుశా ఆ సంగతి గుర్తుతెచ్చుకుని ఇంద్రాణికి కృతజ్ఞులుగా ఉండాలనే సంగతి వారికి గుర్తు లేదు. తన తండ్రి టాంకాగడ్ జమీందారీయంతా స్వయంగా కొనుక్కోగల శక్తివంతుడు. అంతధనం తనదగ్గర వుండి కూడా తన యజమానికి చౌకగా కొనియిచ్చాడు. యిది ఒకవిధమైన దానమే అవుతుంది. మేమిచ్చిన ధనగర్వంతో నే మీరు మమ్మవమాన పరుస్తున్నారు. ఇంద్రాణి ఈ విధమైన ఆలోచన వరంపరలతో తన మనస్సును చికాకు పరచుకుంది.

తన భర్త యజమాని యింటివద్ద ఆహ్వానం, ఆఫీసులో పనినుండి నివృత్తిపొంది ఇంటికివచ్చి పేపరు చదువుకుంటూ విశ్రాంతి తీసుకుంటున్నాడు. తానింటికి రావడంతోనే ఇంద్రాణి గమనించింది.

చాలామంది భార్యాభర్తల స్వభావం ఒకేమాదిరిగా వుంటుందనుకుంటారు. ఎక్కడైనా భార్యాభర్తలలో ఏకత్వంచూచి అదే తగినదని, అనుసరణీయమని భావిస్తారు. అందరూ అలాగే వుంటారనికూడా తలుస్తారు. అంబికాచరణుడికి ఇంద్రాణికి ఒకటి రెండు విషయాలలో ఏకత్వం కనిపిస్తుంది. అంబికాచరణుడిది ఎవరితో కలిసిమెలసివుండే స్వభావంకాదు. బయటకువెళ్ళి పనికోసరం, పనిపూర్తిచేసుకుని, యితరులతో పనిచేయించుకుని యింటికి చేరగానే బయటవాళ్ళ ఆక్రమణనుండి రక్షణపొందటానికి దుఃఖసాధ్యమైన కోటలో ప్రవేశించినట్లుంది. బయటవున్నప్పుడు ఆయన,

ఆయనవని వుండనే వున్నాయ్. ఇంట్లో ఇంద్రాణి తాను, ఇందులోనే ఆయన జీవితమంతా నిబిడీకృతమయింది. ఇదే చాలుననుకుని తృప్తిపడతాడు.

నగల వెలుగుచిమ్ముకుంటూ ఇంద్రాణి గదిలోకి వచ్చింది. రావటంతోనే హాస్యంగా మాట్లాడాలనుకున్నాడు అంబికాచరణుడు. కాని ఆమెముఖం చూడడంతోనే ఆగిపోయి విచారంగా అడిగాడు "ఏం అలావున్నావ్ ?"

ఇంద్రాణి సంగతంతా హాస్యంగా ఎగరగొట్టడానికి ప్రయత్నిస్తూ అంది "యిప్పుడే మారాణి రత్నంను కలుసుకున్నాను."

పేపరు నేలమీద పారవేస్తూ అంబికాచరణు డడిగాడు. "అయితే ఏంజరిగింది ?"

ఇంద్రాణి నగలుతీస్తూ అంది "రాణిగారింట చాలా గొప్పగౌరవం జరిగింది."

అంబికాచరణు డడిగాడు "గొప్పగౌరవాని కర్థమేమిటి ?"

ఇంద్రాణి భర్తదగ్గర కుర్చీచేయిమీద కూర్చొని భర్తను కౌగలించుకుంటూ అంది "మీాకు జరిగే సన్మానం లాంటిదికాదు." పూర్తి వృత్తాంతం వినిపించింది. భర్తకి ప్రసంగం తెలియజేయకూడదనుకుంది. కాని తన ప్రతిజ్ఞా భంగం జరిగింది. లోగడకూడ ఇలాగే ఎన్నోసార్లు అనుకుని విఫలమయింది. బయటవాళ్ళముందు ఎంతగంభీరంగావున్నా, భర్తముందు తన ప్రకృతి శాసనాలన్నిటిపై తెంచివేసి చంచలురాలైపోతుంది. అక్కడ తన్నుతాను మరుగుపరచు

కోలేకపోతుంది.

వృత్తాంత మంతా విని అంబికాచరణుడు మండి పడ్డాడు. "ఇవాళే మేనేజరుపనికి రాజీనామా యిచ్చేస్తాను," అంటూ వినోద్‌బాబుకు ఉత్తరం వ్రాయడానికిసిద్ధమయ్యాడు.

ఇంద్రాణి కుర్చీమీదనుంచి క్రింద చాపమీద భర్త కాళ్ళవద్ద కూర్చుంటూ అంది "ఇంత తొందరపడకండి. ఉత్తరమివాళ మానేయండి. దీన్నిగురించి శేపాలోచించ వచ్చు."

ఇంద్రాణి తన తండ్రి హృదయ మందాకినిలో ఒక పుష్పంలాగా పుష్పించి వికసించింది. తండ్రి హృదయంలోని ప్రేమభావాన్ని పొందినట్టే ఆయన మానసిక భావాలను కూడ అనుగమించింది. ముకుందబాబు పరివారంపట్ల తన తండ్రికున్న ప్రభుభక్తి తనకు లేకపోయినా తన మనస్సులో ప్రభు పరివారంకోసం జీవితమర్పించాలనే భావం సగూఢ పరచుకుంది. తన భర్త ప్లీడరీచేయగలడు, యింకాయేదైనా గౌరవప్రదమైన వృత్తిననుసరించగలడు. ఇంద్రాణి కోర్కెననుసరించి వినోద్‌బాబు జమీందారీనిసరిదిద్దడానికి సంతోష పూర్వకంగా పూనుకున్నాడు. ఇంద్రాణి మనస్సు తీవ్రంగా గాయపడింది. అయినా ఎందుకనో జమీందారువద్ద తనభర్త ఉద్యోగం వదలుకోవడానికి మనసంగీకరించడంలేదు.

ఇంద్రాణి భర్తను మార్చడానికి మృదు మధుర స్వరంలో అంది. "దీనిలో వినోద్‌బాబు తప్పేముంది! ఆయన భార్యమీద కోపంతో ఆయనతో పోట్లాట పెట్టుకోనడము మంచిదా"!

యిదివిని వినోద్ బాబు బిగ్గరగా నవ్వాడు. తన నిర్ణయం తననే హాస్యాస్పదమనిపించింది. "ఏది ఏమైనప్పటికి ఇహనెప్పుడూ జమీందారుగారింటికి వెళ్ళవద్దు" అన్నాడు.

యీ విధంగా తుఫానుగాలి వీచి ఆరోజు మేఘాలన్నిటిని ఛిన్నాభిన్నా మొనర్చింది. గృహం మళ్ళీ కళకళలాడింది. భర్త ప్రేమపాశంలో బయటి కటువ్యంగ్యము, అవమానము అన్నీ మరచిపోయింది ఇంద్రాణి.

# 3

జమీందారు వినోద్‌లాల్ తన జమీందారీ యంతా అంబికా చరణుడిమీద వదలివేశాడు. భర్తభార్య నుపేక్షించినట్లే వినోద్‌లాల్ జమీందారీవట్ల వుపేక్షాభావం కలిగి ఉంటున్నాడు. జమీందారి పని ముట్టుకోడు. జమీందారి మీాద వచ్చే ఆదాయం కూడా చాలాకొద్ది. అందువల్ల అదంటే ఏమాత్రం ఆకర్షణలేదు.

ఏదైనా చిన్న సొరంగంగుండా ఎవరికీ తెలియకుండా వెళ్ళి రాత్రిపూట కుబేరుడి ధనాగారంలో తనకు కావలసినంత ధనం తీసుకురావాలనే కోరిక వినోద్‌లాల్‌కుంటుంది. దీనిని గురించి అనేకమందితో రహస్యమంతనాలు జరిపాడు. విచిత్ర పరిస్థితులలో చిక్కుకుంటాడు. హిందూదేశంలోఉన్న తుమ్మచెట్లన్నీ కంట్రాక్టుతీసుకుని బండిచక్రాలు తయారు చేసే కార్ఖానా పెట్టాలనుకుంటాడు. సుందరవనంలోని తేనెటీగల తేనెపట్టునుండి తేనెతీసి భారతదేశమంతటా సప్లయి

చేస్తే లాభం వస్తుందని ఆశపడతాడు. పశ్చిమ ప్రాంతపు అడవులన్నీ కంట్రాక్టు మాట్లాడిరమ్మని అప్పుడప్పుడు మనిషిని పంపిస్తాడు. కాని ఈ సంగతులు బయటకు పొక్కనీయడు. యితరులు వింటే జమీందారుగారికి ఈ పనులేమిటని పరిహాసించవచ్చు. రహస్యం తెలిస్తే, చేసిందంతా వృధా అవుతుందని ఎవరికి తెలియనీయడు. అంబికాచరణుడికి తెలిస్తే అనవసరంగా డబ్బంతా వృధాగా వ్యయంచేస్తున్నాడని అంటాడేమో! ఈవుద్దేశ్యంతో అతనికి తెలియకుండా బాగా జాగ్రత్తపడుతున్నాడు. తనే జమీందారైనా, ఆయనకు జమీందారు అంబికాచరణుడు లాగా వుంటుంది తాను వూరికే కూర్చుని జీతంతో కాలం వెళ్ళబుచ్చుకున్నట్లు భావిస్తాడు.

విందు జరిగిన మర్నాటినుంచి నయనతార వినోదలాల్‌కు బోధిస్తోంది. "మీకు జమిందారీ వ్యవహారాలేమీ పట్టినట్టులేవు. అంబికా చరణుడెంత యిస్తే అంతే పుచ్చుకుంటారు. ఇలాగైతే తొందరలోనే మనం సర్వనాశనమైపోతాం. నిన్న ఇంద్రాణిని చూస్తే కళ్ళు తిరిగిపోయినై. అబ్బ! యేమి నగలు! ఈ పురానికొచ్చి యిన్ని సంవత్సరాలయింది. జమీందార్ల ఫాయీలో వుంటున్నా మన కటువంటి నగలు లేవు. ఈ నగలు ఎక్కడినుంచి వచ్చినై? మనదగ్గర నౌకరీచేసేవాళ్ళకు మన దగ్గరనుంచి గాక ఇంకెక్కడినుంచి వస్తాయి! పైగా దానికెంత గర్వం! ఎంత మిడిసిపాటనుకున్నారు. దాసీదానితో యేమేమిటో చెప్పిందట!" యీ విధమైన మాటలతో వినోదలాల్‌ను విరక్తుడ్ని

చేయడాని కుద్యమించింది.

వినోద్ దుర్బలుడు. అతడు యితరుల్ని విశ్వసించడు. దానికితోడు ఎవరైనా సందేహం కలిగిస్తే వెంటనే దాన్నే నిజమని నమ్ముతాడు. మేనేజరు దొంగతనం చేస్తూండవచ్చనే ఆరోపణ అతను గట్టిగా నమ్మాడు. ఇప్పుడతన్ని ఒక జటిల సమస్య ఎదుర్కొంది. తనకా జమీందారీ గొడవ తెలియదు. తానెప్పుడూ ఆ లెక్కల జోలికి పోలేదు. ఇప్పుడతని దొంగతనం బయటపడే మార్గమేమిటి? అంతకంటె కఠినమైన సంగతి, మేనేజరుతో ఈ సమస్య ఎలా ప్రస్తావించాలి? అనేది. తనలో అతనిముందు యిటువంటి సమస్య ప్రస్తావించే సామర్థ్యం లేదు.

అంబికాచరణుడి ఏకైకాధిపత్యానికి అందరూ లోలోనే ద్వేషిస్తున్నారు. ముఖ్యంగా బామాచరణుడిలో ద్వేషం బాగా పెరిగిపోయింది. దానికి కారణం బంధుత్వం. తాను మాజీదివాన్ మేనల్లుడు. ఆయనే తన్ను వుద్యోగంలో చేర్పించాడు. అదేకాకుండా యింకా అనేక సమాన ఫాయిదా వ్యవహారాల్లో కూడ అతడ్ని ద్వేషిస్తున్నాడు. అంబికాచరణుడు తనకు దగ్గర బంధువైకూడ తన్ను వున్నతోద్యోగంలోకి తీసుకోలేదు. పదవితో పాటే దానిని నిర్వహించే యోగ్యత లభిస్తుందని అతని వుద్దేశ్యం. మేనేజరు పదవి అతనికి చాలా చులకనగా వుంటుంది. పూర్వకాలంలో రథంపైన ధ్వజం కట్టిఉండేది. ఆఫీసు మేనేజరు కూడా అంతే. రథం లాగుతూంటే ముందున్న గుర్రాలు పరుగిడుతుండేవి. ధ్వజం ఆకాశంలో తన ఘనతను చాటుకొంటుండేది.

వినోద్ ఎప్పుడూ జమిందారీని గురించి అడిగేవాడు కాదు. తనకెప్పుడైనా డబ్బు కావలిస్తే సరాసరి కోశాధ్యక్షుడి "దగ్గరకెళ్ళి ఖజానాలో ఇప్పుడెంత రొఖ్ఖముంది"యని అడిగేవాడు. కోశాధికారి తన లెక్క చూసి చెప్పేవాడు. ఎవరూ చూడకుండా గుప్తంగా కొంతడబ్బు అడిగి తీసుకునేవాడు సంతకం పెట్టి మొదలకుండా వెళ్ళిపోయేవాడు. దీనికికూడా అతనికి భయమే. కొన్ని రోజులవరకూ అంబికా చరణుడికి కనబడటానికి సిగ్గుపడేవాడు.

అంబికా చరణుడు ఇటువంటి సమయాలలో చాలా బాధపడాల్సి వచ్చేది. జమీందారుగారి ఖాతాలో ఖర్చుపోను మిగతాభాగం ఖజానాలో వుండేది. ఇది ఎవరికైనా చెల్లించవలసిందిగాని, ఏదైనా ఖర్చుకుగాను వుంచినది. తన క్రింద పనిచేసే వుద్యోగుల కందరికీ దీనిలో నుంచే జీతములివ్వడం జరుగుతుంది. జమీందారు తీసుకున్న పైకంవల్ల ఏదో వాళ కార్యక్రమం కుదించుకోవలసి వచ్చేది. డబ్బు తీసుకున్న వినోద్ దొంగలాగు తప్పించుకు తిరుగుతాడు. ముఖాముఖిన మాట్లాడటానికి తటస్థపడడు. వుత్తరం వ్రాస్తే దానికి జవాబుండదు. దానికి కారణం లజ్జ అతని కళ్ళల్లోనే ఉంటుంది. హృదయాంతరాళంలో ఆ సిగ్గుకు, పరితాపానికి తావుండదు. అందుకనే అతను ఎదుట పడటానికి భయపడతాడు.

వినోద్ ఖర్చు మితిమీరడం చూచి అంబికా చరణుడు ఇనుపపెట్టె తాళం చెవులు తనదగ్గరే వుంచుకుంటున్నాడు. వినోద్ తన యిష్టంవచ్చినట్లు డబ్బు తీసు

కోవడం ఆగిపోయింది. యజమానై వుండి కూడ తన దుర్బలత్వంవల్ల ఏవిధమైన బలప్రయోగంచేసి డబ్బు తీసుకో లేకపోతున్నాడు. విముఖురాలైన లక్ష్మి తాళంచేతులున్నా తనకు లభిస్తుందనేముంటి? దీనివల్ల దుష్పరిణామమే జరిగింది.

వినోద్ లోలోపల అంబికాచరణుడిమీద మండి పడుతున్నాడు. సమయానికి నయనతార తెలిపిన వార్త అతనికి చాల సంతోషం కలిగించింది. అప్పటినుండి నెమ్మది నెమ్మదిగా ఉద్యోగస్తులను పిలిపించి అంబికాచరణుడి గుట్టు తెలుసుకొనడానికి ప్రయత్నిస్తున్నాడు. దీనికంతా ముఖ్య పరిశోధకుడు శ్యామాచరణుడే.

ముకుందలాల్ కాలంలో చుట్టుపట్ల జమీందార్ల భూమి కూడ జబర్దస్తీగా దఖలుపరచుకునేవారు. ఆ విధంగా చాలా భూమి స్వాధీనమైంది. అంబికాచరణుడి కది యిష్టం లేదు. కోర్టుకు వెళ్ళాల్సి వచ్చినా సంధి, సంప్రదింపుల ద్వారా రాజీ జరిపేవాడు. శ్యామాచరణుడు దీన్నే వినోద్ లాల్‌కు విస్తృతంగా వర్ణించి దృష్టాంతరంగా పేర్కొన్నాడు. అంబికా చరణుడు యితర జమీందార్ల వద్ద లంచం పుచ్చు కొంటూ ఉండవచ్చు. లంచం తిని శ్రీవారికి అపకారం చేస్తు న్నాడు. ఇది శ్యామాచరణుడు చాడీకోసం చెప్పిందికాదు. ఇది అతని దృఢ విశ్వాసం. సర్వేసర్వత్రగా చలామణి అవుతున్నప్పుడు లంచం తినకుండా వుంటాడా? లంచం తినటానికి తన్ను చంపేసినా తా నంగీకరింపడు.

అనేకమంది యీ విధంగా వినోద్‌కు బాగా బోధిం చారు. అతనిలో సంశయ జ్వాల రోజురోజుకు అతిశయిస్తోంది.

అయినా తానేమీ చేయలేడు. దానికి కారణం ఉంది. ప్రత్యక్షాధారమేమీ లేదు, పైగా అంబికా చరణుడు వ్యవహారాలలో దిట్ట. అతను తన్ను సర్వనాశనం కూడ చేసి వేయవచ్చు.

ఆఖరుకు భర్తకు తెలియకుండానే నయనతారఅంబికా చరణుడ్ని పిలిపించింది. పరదా చాటునుండి అంది-"బాబూ చరణునికి జమీందారీ వ్యవహారాలన్ని అప్పగించి నువ్వు వెళ్ళిపో, యిహ నీ అవసరం లేదు."

వినోద్ బాబు దర్బారులో తనను గురించి చాలా రోజులనుండి చర్చ జరుగుతుందని, తనతప్పు పట్టడానికి ప్రయత్నిస్తున్నారని అంబికా చరణుడు ముందే విన్నాడు. నయనతార యిచ్చినతీర్పు అతని ఆశ్చర్యం కలిగించలేదు. సరాసరి వినోదలాల్ దగ్గరకు వెళ్ళి అడిగాడు - "మీరు నన్ను ఉద్యోగంనుండి విరమించుకోమన్నారా ?"

వినోద్ బాబు- "లేదే".

అంబికాచరణుడు మళ్ళీ ప్రశ్నించాడు - మీ సందేహానికేమైనా ఆధారం లభించిందా ? వినోద్ బాబు లజ్జితుడవుతూ అన్నాడు. "లేదే" "లేదు".

అంబికాచరణుడు నయనతార ఆజ్ఞను ఎత్తకుండా ఆఫీసునుండి ఇంటికి వచ్చేశాడు. ఇంద్రాణికి సంగతి తెలియజేయలేదు.

కొన్నిరోజులు గడిచినయ్.

కొద్దిరోజుల తర్వాత అంబికాచరణుడు యిన్ఫ్లూ ఎంజాతో బాధపడుతున్నాడు. చాలా తీవ్రంగా బాధపడు తుండడంవల్ల ఆఫీసుకు వెళ్ళడంలేదు.

అది పన్నులు వసూలుచేసేసైము. యింకెన్నో పను లున్నాయ్. ఒకరోజు ఉదయం జబ్బుతోనే లేచి ఆఫీసుకు వెళ్ళాడు.

ఆ రోజెవరూ కూడా మేనేజరు వస్తాడని ఆశించలేదు అందరూ ! మీ ఆరోగ్యం సరిగాలేదు. యింటికి వెళ్ళండి, అంటున్నారు.

తన శారీరక బలహీనత నుపేక్షించి అంబికాచరణుడు తన సీటులో కూర్చున్నాడు. ఆఫీసులో ఉన్న గుమాస్తా లందరూ గడగడ లాడుచున్నారు. అవసరమైన కృత్రిమ శ్రద్ధతో పనిలో నిమగ్నమయారు.

అంబికాచరణుడు డ్రాయరు తెరిచాడు. దానిలో ఒక్క కాగితం కూడ లేదు. ప్రశ్నార్థకంగా అందరివంక చూచాడు. అందరూ అప్పుడే ఆకాశమునుంచి వూడిపడట్లు ముఖంపెట్టారు. ఏ దొంగో, భూతమో ఎత్తుకుపోయా రన్నట్లు తమకేమీ తెలియనట్లు వాళ్ళముఖాలు చెబు తున్నయ్.

బామాచరణుడన్నాడు - నిజం చెప్పడానికి భయ మెందుకు! కాగితాలు జమీందారు బాబుగారు అడిగి పట్టు కెళ్ళారనే సంగతి అందరకీ తెలుసు.

అంబికాచరణుడి ముఖం అణచుకొంటున్న కోపంలో వివర్ణమైంది - "ఎందుకు" యని ప్రశ్నించాడు.

శ్యామాచరణుడు రిజిష్టరులో ఏదో వ్రాస్తూఅన్నాడు ఆ ప్రశ్నకు జవాబు మీమీలా చెప్పగలం.

అంబికాచరణుడు రాకపోవడంవల్ల శ్యామాచరణుడి సలహా ననుసరించి వినోదలాల్ మారుతాళంచెవి తయారు చేయించాడు. దానిలో కాగితాలన్నీ తీరిగ్గా పరిశీలించడానికి యింటికి పట్టుకెళ్ళాడు. చతురుడు శ్యామాచరణుకు ఆసంగతి దాచిపెట్టలేదు. యీ విధంగా అవమాన క్రోధంలో అంబికా చరణుడు రాజీనామా పెట్టవచ్చు. తనకోరిక నెరవేరుతుంది.

డ్రాయరుకు తాళంవేసి అంబికాచరణుడు వినోద్ బాబువద్దకు వెళ్ళాడు. చాలా తీవ్రంగా తలనొప్పితో బాధ పడుతున్నానని వినోద్ కబురంపాడు. యింటికి వెళ్ళి బల హీనంవల్ల మంచంమీద పడిపోయాడు. హృదయాన్నంతా అంబికాచరణుణ్ణి కప్పివేస్తున్నట్టు ఇంద్రాణి పరుగెత్తి వచ్చింది. శాంతచిత్తతతో పరిస్థితినంతా వింది.

యినాళ ఇంద్రాణి తన స్థిరత్వాన్ని కోల్పోయింది. ఆమె హృదయం పగిలిపోతోంది. విచ్చిపోయిన నల్లని మేఘాలవంటి ఆమె పెద్దపెద్ద నేత్రాలు వేరైపోయినై. వాటిల్లో మెరపు మెరుస్తోంది. "నా భర్తనేనా అవమాన పరచింది. విశ్వాసానికి కృతజ్ఞతకు పరిణామం యిదేనా?

ఇంద్రాణి యీ తీవ్రక్రోధాన్ని చూచి అంబికా చరుణు కోపం చల్లారింది. దైవాజ్ఞనుంచి పాపిని రక్షించ

ప్రయత్నిస్తున్నట్లు ఇంద్రాణి చేయిపట్టుకుని అంబికాచరణు డన్నాడు- "వినోద్ యింకా పసివాడు. దుర్బలుడు. యితరులు చెప్పేవి నమ్మి అతని మనస్సు వికలమై ఉంటుంది."

యీ మాటలువిని ఇంద్రాణి తన రెండు చేతుల్నీ భర్త కంఠానికి పెనవైచి, చాలాసేపటివరకు ఆవేశంతో హృదయానికి హత్తుకొని వుండిపోయింది. ఆమె కండ్లల్లో జ్వలిస్తున్న అగ్నికణాలు చల్లారిన్నై. వాటివెంట జలజల కన్నీరు కారుతోంది. తన హృదయాధి దేవతను ప్రపంచంలోని సమస్త అన్యాయాలు, అవమానాల బారినుండి రక్షించి బాహుబంధనంలో నిలుపుకుని, తన హృదయంలో నిక్షిప్త మొనర్చుకో గోరుతుంది.

అంబికాచరణుడు రాజీనామా చేయడం నిశ్చయమైంది. ఎవరూ దానిని వ్యతిరేకించలేదు. జమీందారే స్వయంగా తీసివేయదలచినప్పుడు అతనిపట్ల గౌరవ మెవరికి వుంటుంది? రాజీనామాతో అంబికాచరణుడు శాంతించాడు. అన్నివిధాల విశ్రాంతి సౌఖ్యమూ అనుభవిస్తున్న ఇంద్రాణి మనస్సు అవమాన పరితాపాగ్నిలో రగుల్తూనే వుంది.

## చరమాధ్యాయము

ఇంతలో నౌకరువచ్చి ఆఫీసునుంచి కోశాధ్యక్షులు వచ్చారని తెలియజేశాడు. బహుశా సిగ్గుపడే స్వభావం కావడంవల్ల వినోద్ తాను స్వయంగా తీసివేస్తున్నానని ముఖతః చెప్పలేక కోశాధ్యక్షుడిద్వారా చెప్పిస్తున్నాడు

కాజోలనుకున్నాడు అంబికాచరణుడు వెంటనే రాజీనామా పత్రము పూర్తిచేసి బయటకువచ్చి కోశాధికారి చేతిలో పెట్టాడు.

పుత్తరం చూడకుండానే కోశాధికారి అన్నాడు. సర్వనాశనమైంది మేనేజరుబాబూ! సర్వనాశనమైపోయింది. అంబికాచరణు డడిగాడు — ఏమిటి!

దానికి జవాబుగా వచ్చినదాని సారాంశమిది. తాళం చేతులు స్వాధీనం చేసుకొన్నప్పటినుంచి ఖజానా నుంచి వినోద్‌కు డబ్బు లభించలేదు. అందువల్ల వినోద్‌బాబు అనేకచోట్ల నోట్లురాసి అప్పు తీసుకున్నాడు. అనేకరకాలైన వ్యాపారాలు చేశాడు. ప్రతిదానిలోను నష్టమే వచ్చింది. నష్టం వచ్చిన కొలది పట్టుదల హెచ్చింది. తమరు జబ్బుపడటంతో సమయంకనిపెట్టి ఖజానాలో వున్న డబ్బంతా గుంజుకపోయాడు. బాంకాగడ్ పరగణా చాలాకాలంనుంచి తాకట్టుపెట్టివుంది. ఆ జమీందారు తాకట్టురూపంలో తనబాకీ బాగా పెరగనిచ్చాడు. ఇప్పుడు వినోద్‌బాబు కంఠంలోతు అప్పుల్లో మునిగివున్నాడు. ఇదే అదను అనుకొని ఆ జమీందారు దావా తేవడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఇదివిని అంబికాచరణుడు కొంచెంసేపు స్తంభీభూతుడై మౌనం వహించాడు. చివరికి అన్నాడు. ఇవాళ నేనేమీ ఆలోచించలేను. రేపు దీనిని గురించి ఏం చేయాలో చెబుతాను.

కోశాధికారి లేవబోతూంటే అంబికాచరణుడు రాజీ నామా పత్రం మళ్ళీ తిరిగి తీసుకున్నాడు.

లోపలికివెళ్ళి అంబికాచరణుడు ఇంద్రాణి దేవికి యావత్ వృత్తాంతం వినిపించాడు. వినోద్‌ను యిటువంటి సమయంలో వదలి రాజీనామా చేయడం భావ్యం కాదు అన్నాడు.

ఇంద్రాణి చాలసేపటివరకు పాషాణ ప్రతిమ మాదిరి మౌనంగా కూర్చుంది. తనలోని విరోధ ద్వంద్వశక్తుల నణచుకుని తీవ్రంగా నిట్టూరుస్తూ అంది-"యజమానిని ఇప్పుడు వదలకూడదు."

డబ్బెక్కడినుంచి వసుంది అనే ఆలోచన అనేక విధాల ఆలోచించారు. అవుసరానుకూలంగా డబ్బు లభించ లేదు. ఇంట్లో నగలు నక్కట్టు అమ్మి అవుసరాన్ని తీర్చమని అంబికాచరణుడు వినోద్‌ను వత్తిడిచేశాడు. లోగడ వినోద్ బాబు వ్యాపారానికి యిటువంటి ప్రయత్నం చేశాడు. కాని వృథాయయింది. ఇప్పుడు అనేకవిధాల ప్రార్థించాడు. వినయంగా చెప్పాడు. ప్రేమతో లాలించి బోధించాడు. ఈ ప్రయత్నాలన్నీ వృథాయైనయ్. నయనతార యేమాత్రం అంగీకరించలేదు. ఆమె ఆలోచిస్తూంది. ఈ ఆస్తిపాస్తులన్నీ పోనేపోతున్నై. ఉన్నదికూడ జారవిడచుకోవడం దేనికి! కాబట్టి మరింత పట్టుదలతో నగలు తన దగ్గరనుంచిపోకుండా భద్ర పరచుకుంది.

డబ్బెక్కడా దొరక్క పోయేప్పటికి ఇంద్రాణి ప్రతీ కారేచ్ఛ ఆనందంతో ఉప్పొంగింది. భర్తచేయి నొక్కుతూ నెమ్మదిగా అంది. "నీ కర్తవ్యం నువ్వు పాలించావు. ఇంకా నీకిబాధ దేనికి ! ఏం జరుగుతుందో జరగనియ్."

భర్త నవమాన మొనర్చినందుకు తనభార్యలో చెల రేగిన క్రోధాగ్ని యింకా ఆరనందుకు అంబికాచరణుడు మనస్సులోనే నవ్వుకున్నాడు. ఆఖరుసారి విపత్తులో కంఠం వరకు మునిగి వినోద్ పసిపిల్లవాడిలా తనమీద భారము మోపాడు. అంబికాచరణుడుకి దయ కలిగింది. ఇప్పు డేవిధం గాను అతడ్ని వదలి వేయడానికి వీలులేదు, ఇహ నెటూ వీలు గాకపోతే తన స్వంత ఆస్తి కుదవబెట్టి అతడ్ని రక్షించ డానికి ప్రయత్నిస్తాడు.

మన ఆస్తి ఏ విధంగాను వ్యయపరచవద్దని ఇంద్రాణి ఒట్టు వేసుకుంది.

అంబికాచరణుడు ద్వంద్వంలో చిక్కుకున్నాడు. ఎంతనెమ్మదిగా ఇంద్రాణికి నచ్చేట్లు బోధించుదామనుకొన్నా ఇంద్రాణి తడవ తడవకు మాట్లాడకముందే వారిస్తోంది. చివ రకు చింతితుడై మెదలకుండా వూరుకున్నాడు.

కొంచెంసేపువున్న తర్వాత ఇంద్రాణి ఇనపపెట్టె తెరచి తన నగలన్నీ ఒక పెద్ద పళ్ళెంనిండా నింపింది. రెండు చేతులతో ఎత్తి మోయలేక మోయలేక మోసుకుంటూ వచ్చినవ్వుతూ భర్త పాదాలవద్ద ఉంచింది.

పుట్టినప్పటినుంచి వివాహమయ్యే వరకు తన తండ్రి తన ప్రేమను అమూల్యమైన నగలద్వారా వ్యక్తం చేశాడు. పెండ్లియైన తర్వాతకూడా భర్త బిడ్డలులేని రమణి సౌందర్యాన్ని ఆభరణాలతోనే ఇనుమడింపజేశాడు. ఆ బంగారు ఆభరణాలన్నీ భర్తకాళ్ళముందుంచి ఇంద్రాణి అంది- "నా తండ్రి దానంచేసిన నగలు మళ్ళీ నాతండ్రి యజమానుల కుటుంబానికి దానంచేస్తున్నాను " యీ మాటలు చెబుతూ కళ్ళుమూసుకుని తలవంచుకుని కల్పించుకుంది. తెల్లని కేశాలు కలిగి, శాంత ప్రేమభరిత నగుమోముతో, బుద్ధిమంతుడు, ఆజానుబాహుడైన తండ్రి తన ఎదుటికి వస్తున్నాడు. దగ్గరకువచ్చి తన చల్లని ప్రేమపూరిత హస్తాలను తన శిరముపై నుంచి ఆశీర్వదిసున్నాడు.

బాంకాగడ్ పరగణా మళ్ళీ కొన్నారు. ప్రతిజ్ఞాభంగ మొనర్చుకొని, ఆభరణరహిత ఇంద్రాణి,నయసతార ఇంటికి విందుకు వెళ్ళింది. ఇప్పుడామె మనసులో అవమానపు వేదన లేదు.

—:(o):—

౨౨

# అతిథి

కటహాలియా జమీందారు మోతీలాల్ బాబు సపరి వారముగా పడవలో కలకత్తానుంచి తన గ్రామము వెళ్తు న్నాడు. మధ్యాహ్నము ఒక చిన్న కుగ్రామమువద్ద ఆగి భోజన ప్రయత్నములు పూర్తి చేసుకుంటున్నారు. ఒక బాల కుడు వచ్చి, "బాబుగారూ! తమరేవూరు వెళ్తున్నారు" అని అడిగాడు. ప్రశ్నించిన ఈ బాలకునివయస్సు పదునైదు, పదహారు సంవత్సరాలకంటె ఎక్కువ వుండదు.

మోతీలాల్ జవాబిచ్చాడు "కటహాలియా."

బాలకుడు - "నన్ను త్రోవలో నందీగ్రామములో దించండి బాబూ"!

మోతీలాల్ అంగీకరిస్తూ అడిగాడు- "నీ పేరేమిటి?"

బాలకుడు - "తారాచంద్."

బాలకుని దేహచ్ఛాయ ఎరుపు. అందంగా కన్పిస్తు న్నాడు. పెద్దపెద్ద కండ్లు, కాటుకతోడు చిరునవ్వుచిందుతూ చక్కటి పెదిమలు అతనిలోని సౌకుమార్యాన్ని ప్రకటిస్తు న్నవి. ఒకచిన్న పంచె మినహా అతని శరీరముమీద ఎటు వంటి బట్టలుగాని, ఇంకేతరమైన వస్తువులుగాని లేవు. కళా కారుడు ఎంతో నేర్పుతో గుండ్రముగా వంపులు తిరిగి వన్నె గలిగిన అతని అందమైన శరీరాన్ని ఏ విధమైన వికా

రము లేకుండా తయారు చేసినట్లుంది. అతను మునికుమారుని వలె కన్పిస్తున్నాడు. తపస్సు ఫలితముగా అతని శరీరము లోని కొద్ది భాగము క్షీణించి బ్రాహ్మణ్యమును, దాని ఔన్నత్యమును కనపరచుచున్నది.

మోతీలాల్ బాబు ప్రేమతో పిలిచారు. "నాయనా! నువ్వు వెళ్ళి స్నానముచేసిరా. ఇక్కడ భోజనము చేయవచ్చు."

తారాచందు సరేనంటూ అప్పటికప్పుడే కలిసికట్టుగా సందేహించకుండానే వంటయింటిపనిలో నిమగ్నుడయ్యాడు. జమీందారు నౌకరు చేపలు వండటంలో నేర్పరికాడు. తారాచంద్ తానే ఆపని తీసుకుని త్వరత్వరగా ఇంకొకటి రెండు కూరలుకూడ తనకు చేతనైన పద్ధతిలో తయారు చేశాడు. వంటపని పూర్తిచేసి నదిలో స్నానము చేశాడు. తాను తెచ్చిన పొట్లము విప్పి ఉతికిన పంచె కట్టుకున్నాడు. కొయ్యదువ్వెన పైకితీసి ముందుకుపడిన జారువెంట్రుకలు వెనుకకు దువ్వుకున్నాడు. తన జంధ్యమును సరిచేసుకుంటూ మోతీలాల్ బాబు కడకు వెళ్ళి నిలిచాడు.

మోతీలాల్ బాబు అతన్ని పడవలోపలికి తీసుకు వెళ్ళారు. అక్కడే జమీందారు భార్య అన్నపూర్ణ తొమ్మిది సంవత్సరాల కుమార్తె కూర్చునివున్నారు. అన్నపూర్ణ బాలకుని చూచి అమితానంద భరితురాలయింది. "ఇంత అందమైన పిల్లవాడు ఎవరి బిడ్డయో. ఆతల్లి ఇతన్ని వదలి ఎలా ఉండగలుగుతుందో" యని మనసులో అనుకుంది

మోతీలాల్ బాబు సరసనే పిల్లవానికికూడ పీటవేశారు.

బాలకుడు తారాచంద్ భోజనప్రియుడు కాదు. అతను సిగ్గు వలన సరిగా భోజనము చేయలేకపోతున్నాడనుకుంది అన్నపూర్ణ. కూరలవంక చూపిస్తూ వాటి రుచులు వర్ణిస్తూ అవి తినమని తారాచందును బ్రతిమాలింది. కాని అవేవీ తిన కుండానే తారాచందు ముక్తసరిగా భోజనం పూర్తిచేశాడు. బాలకుడు తన ఇష్టమొచ్చినట్లే చేస్తాడు. అలా చేయడంలో కూడ అసభ్యతగాని, ఇతరులకు కష్టము కలిగించేటట్లుగాని ప్రవర్తించడనేది బోధపడింది. అతనిది సిగ్గుపడే స్వభావం కాదు.

అందరి భోజనాలు పూర్తయిన తరువాత అన్నపూర్ణ తారాచందును తన దగ్గర కూర్చోబెట్టుకుని అతని జీవిత విశేషాలు అడిగింది. కాని విశేషవృత్తాంతము లేమీ తెలియ లేదు. ఏ డెనిమిది సంవత్సరాల వయసులోనే యింటి నుండి పారిపోయి వచ్చినట్లు అతను చెప్పినదానిసారాంశము తేలింది.

అన్నపూర్ణ - "నీకు తల్లి లేదా?"

తారాచంద్ - "ఉన్నది."

అన్నపూర్ణ - "ఆమెకు నీవంటే ప్రేమలేదా!"

తారాచంద్ ఈప్రశ్నను నవ్వులాటగా త్రోసివేస్తూ చెప్పాడు; "తల్లి ఎందుకు ప్రేమించదు?"

అన్నపూర్ణ-"అయితే నీ వెందుకుపారిపోయివచ్చావు?"

తారాచందు-"ఆమెకు ఇంకా నలుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు ఉన్నారు."

ఈ అత్యాశ్చర్యకర సమాధానానికి బాధపడుతూ అన్నపూర్ణ అన్నది. "చేతికి అయిదు వ్రేళ్ళున్నవి. ఒక వ్రేలిని మనము చేతినుండి తీసివేస్తామా ?"

తారాచందు వయసులో చిన్నవాడు. అతనిచరిత్ర కూడా పెద్దదికాదు. అతడు చాలా విచిత్ర స్వభావి. తన తల్లి దండ్రులకు నాలుగవ కుమారుడుగా జన్మించాడు. ఇతని బాల్యములోనే తండ్రి మరణించాడు. పిల్లలు ఎక్కువగా కలిగిన ఆ కుటుంబంలో ఈతని గౌరవానికి ఏలోపము లేదు. ఇంటిలోని వారేగాక ఆ గ్రామంలోని వారంతా అతన్ని ఆదరించేవారు. ఆఖరుకు పాఠశాలలోని మాష్టరుగారు కూడ అతనిని ఎప్పుడూ కోపగించిగాని, కొట్టిగాని ఎరగడు. ఎప్పుడైనా ఎవరైనా కొట్టినా వారు గ్రామస్తుల కోపభాజనులు కావలసిందే. ఇక ఇంటినుండి పారిపోయి రావలసిన అగత్యమేమీ అతనికి లేదు. చాటుమాటుగా అనేక చెట్ల ఫలములు తినడానికి అలవాటు పడిన కుర్రవాడు. ఒకనాడు తనతల్లి బోధనలు పడలేక ఒక నాటక సమాజములో కలిసి గ్రామము వదలి పారిపోయాడు.

గ్రామస్తులు అతన్ని వెదకి తిరిగి ఇంటికి తీసుకు వెళ్ళారు. అతని తల్లి అతన్ని హృదయానికి హత్తుకొని వెక్కి వెక్కి యేడుస్తూ కన్నీరు కార్చింది. అతని చెల్లెళ్ళు కూడా చాలా దుఃఖించారు. పెద్ద అన్నగారు తన గృహయజమాని కర్తవ్యాన్ని నిర్వర్తించుతూ తియ్యతియ్యగా, మెత్తమెత్తగా చీవాట్లు పెట్టారు. తర్వాత తానే మనసులో బాధపడుతూ

అతన్ని దగ్గరకు తీసుకొని లాలించిరి. గ్రామసులంతా తమ తమ ఇండ్లకు పిలిచి ఎంతో ప్రేమతో రకరకాల ఆశలతో అతన్ని పూరించుతూ గ్రామంలోనే ఉండవలసినదని బోధించారు. చివరకు ఈ ప్రేమ బంధనము కూడ అతను భరించలేక పోయాడు. అతని జన్మనక్షత్రము అతన్ని ఇంటినుండి వేరు చేసింది. ఏదైనా నావచూసినా, ఎవరైన సాధు సన్యాసులను చూచినా, లేక బంజారాలు నదిఒడ్డున గుడిసెలునిర్మించుకొని వెదురుగడలనుండి పేళ్ళు చీల్చి, చిన్న పెద్దబుట్టలు అల్లుతుండడము చూచిన అతని హృదయము బహిః ప్రపంచపు స్నేహ సౌజన్యముల కొఱకు విలపించేది. ఈ విధముగా అతను మూడుపర్యాయములు పారిపోయాడు. నాలుగవసారి తల్లి, సోదరులేగాక గ్రామసులకూడా అతని ఎడవుండే సద్భావాన్ని వదలుకోవలసి వచ్చింది.

మొట్టమొదట ఒకరోజు అతను నాటకం కంపెనీ వాళ్ళతో కలసి పారిపోయాడు. ఈ కంపెనీ యజమాని నాటకాలు వేసే చిన్న, పెద్ద యాక్టర్లు అంతా అతన్ని ప్రేమతో చూచేవారు. ఎక్కడ ఎవరియింట నాటకమాడినా గృహ యజమానే కాక యజమానురాలి ఆదర సత్కారాలుకూడా అతనికి లభించేవి. ఈ అమిత అవ్యాజానురాగములుకూడ అతన్ని అక్కడ బంధించలేక పోయినవి. చివరికి ఒకరోజు ఆ కంపెనీని వదలి పారిపోయాడు.

తారాచంద్ హృదయము పీతహారిణము వలె ఉంటుంది. స్వేచ్ఛ అతనికి ప్రాణము. బంధనము అతనికిప్రాణ సంకటము. హరిణముకు వలెనే అతనికి సంగీతము చాలా

యిష్టము. నాటకాలలోని తియ్యని పాటలు అతన్ని యిల్లు వదలి పారిపోవటానికి వివశపరచినవి. పాటల రాగ, తాళ, లయలు అతని శరీరపు ప్రతి అవయవములోను సంచలనము కలిగించినవి. చిన్నతనములో అతను సంగీతసభల్లో కూర్చుని రసమగ్నుడై, పెద్దలమాదిరి గంభీరముగా రసాస్వాదనము చేస్తూ వూగిసలాడుతూ వుంటే పెద్దలందరూ నవ్వేవారు. ఇట్లు వచ్చువచ్చుని ఆకులపై మేఘములు వర్షించినా, ఆకాశములో మేఘములు ఘర్జించినా, మాతృవిహీనదైత్య బాలకుని రోదనమాదిరి అడవులలో గాలి జోరుగా వీచినా అతని హృదయంలో వుద్వేగం కలిగేది. నిశ్శబ్దసుధ్యాహ్న వాతావరణంలో గ్రద్దలు అరచినా, వర్షకాలపు సాయంత నాలలో కప్పలు బెకబెకలాడినా, అర్ధరాత్రమున నక్క కూతలు వినినా అతని హృదయంలో ఘోర సంచలనము చెలరేగెడిది. ఈ సంగీత ప్రేమతోనే అతను ఒక గాయక బృందములో కలసిపోయాడు. ఆ బృంద యజమాని ఎంతో ఆసక్తితో అతనికి అనేక పాటలు నేర్పాడు. తన హృదయ పంజరములోని పక్షిమాదిరిగా చూచుకుంటూ ప్రేమతో ఆదరించాడు. పక్షి కొన్ని పాటలు నేర్చుకుంది. ఒకరోజు అకస్మాత్తుగా తెల్లవారుజామునే ఎగిరిపోయింది.

చివరిసారి అతను ఒక నట బృందములో చేరాడు. జ్యేష్ఠ ఆషాడమాసాలలో ఈ ప్రాంతములో అనేక చోట్ల ఉత్సవాలు జరుగుతాయి. నాటకాలు, కవి సమ్మేళనములు, జానపదగేయ గానగోష్ఠులు, నృత్యములు మొదలైన వినోద కళలు ప్రదర్శింపబడతవి. ఈనటులు ఒక చోటునుండి ఇంకొక

చోటికి పడవలలో ప్రయాణము చేస్తూ ఉంటారు. క్రిందటి సంవత్సరము ఇలా ప్రయాణించే ఒక నటబృందములోనే తారాచందు చేరాడు.

ఈ దళమునుండి పారిపోవడమే అతని చివరిసారి పారిపోవడం. నందీగ్రామపు జమీందారు ఉత్సాహంగా ఒక నాటక కంపెనీ తయారు చేస్తున్నారని అతనికి తెలిసింది. బట్టలు ఒక పాకెట్‌లో కట్టుకుని ప్రయాణమైనాడు. మోతీబాబు పరిచయం అతనికి లభించింది.

తారాచందు అనేక దళాలలో కలసియున్నప్పటికి యే దళమునుండి కూడ ఏమీ నేర్చుకోలేకపోయాడు. అతను సర్వస్వతంత్రుడు. ప్రపంచంలోని అనేక చెడులగురించి అతను విన్నాడు. అనేక కుకృత్యాలు స్వయముగా చూచాడు. అయినా ఇవన్నీ అతని హృదయంలో నిలిచిపోలేదు. అనేక బంధనాలవలెనే ఏవీ అతన్ని బంధించలేకపోయినవి. పంకిలయుక్త జలములో శుభ్ర శ్వేత హంసరాజమువలె అతను ఈ ప్రపంచములో అనేక అనుభవములు గడిస్తున్నాడు. కుతూహలముతో అతను ఆజలములో మునకలు వేసినా ఆ రాజహంస రెక్కలలో ఏవిధమైన మాలిన్యము అంటలేదు. అందువల్లనే గృహము వీడినా అతని ముఖము తారుణ్యముతో దేదీప్యమానమై వెలుగొందుతూ ఉంది. మోతీలాల్‌బాబు అతన్ని చూచి ముగ్ధుడవడానికి కూడ ఇదే కారణం. అందుకనే ఏవిధమైన సందేహము లేకుండానే అతనికి తన పడవలో ఆశ్రయమిచ్చాడు.

# 2

భోజనములు ముగియడముతో పడవ ప్రయాణము ప్రారంభమయింది. అన్నపూర్ణ ప్రేమతో అతని బంధువుల గురించి అనేక ప్రశ్నలడిగింది. తారాచంద్ అన్నిటికి ముక్త సరిగా జవాబిచ్చి బయటకు వచ్చాడు. వర్షపునీటితో నది ఒడ్డులు ఒరుసుకుపోతూ ప్రవహిస్తూంది. తన చాంచల్యంతో ప్రకృతిమాతను ముగ్ధపరుస్తూఉంది. మేఘరహితమైన తెల్లటి ఎండ సగము సగము నదీజలములలో మునిగిన పచ్చని పచ్చ గడ్డి తలలపైని మెరుస్తూంది. దట్టమైన చెరుకు పొలములు, దూరాన భూమి నంటుతున్నట్లున్న ఆకాశపు నీలిరంగు రేఖ క్రింది అనేక వనములు గారడీవాడు తన కర్రను అటునిటు త్రిప్పి నూతనసృష్టి నవచైతన్య భరితముగాసృష్టించి అందర్నీ ముగ్ధపరుస్తున్నట్లుగా వుంది. నలువైపుల వృక్షములు సజీవముగాను, చైతన్యవంతముగాను, ప్రకాశముతో వెలుగొందుచు నవ్యసురుచిర సుందర ప్రకాశముతో పరిపూర్ణత నొందుచున్నవి.

తారాచందు పడవ పై భాగమున కూర్చున్నాడు. అనేక మైదానములు, నీట మునిగిన పీఠభూములు, పచ్చగా పెరిగిన వరిచేలు, రేవులనుండి గ్రామముల వైపుకు పోయే కాలిత్రోవలు, నీడనిచ్చే వృక్షముల చాటునుండే గ్రామాలు అతని కండ్లకు కట్టినట్లున్నయ్. జలము, పృథ్వి, ఆకాశము, దూరాన నలుదిక్కులా ప్రతిబింబిస్తున్న సజీవ సౌందర్యము పైన, క్రింద నలువైపులా వ్యాపించిన సృష్టి వైచిత్ర్యము,

సుమారాన కన్పించే ప్రకృతిలోని గంభీరత నిశ్శబ్దంతో నిలిచిన ఈ సృష్టియంతా ఆ లేత హృదయానికి ఎంతో ప్రియమైనది. అయినప్పటికి యివన్నీ ఆ చంచల బాలకుడ్ని తన బంధనాలతో బంధించుకోలేవు. నది ఒడ్డున ఒక లేదూడ తోక పైకెత్తి పరుగిడుతూంది. ఒక గుఱ్ఱము బంధించబడిన కాళ్ళతో గెంతుతూ వచ్చవివచ్చిక మేస్తూవుంది. నీటికాకులు పల్లెవాళ్ళు పన్నిన వలల వాసములపై నిలచి నీటిలో ఎగిరే చేపలను ఎగిరెగిరి పట్టుకుని తింటున్నవి. పిల్లలు నీటిలో ఆటలాడుతున్నారు. స్త్రీలు రొమ్ములోతు నీళ్ళలో స్నానము చేస్తూ పకపకలతో హాస్యమాడుకుంటున్నారు. ఈ దృశ్యాలన్నిటినీ తన అలుపులేని చిరనూతన కుతూహలముతో ఆ బాలకుడు వీక్షిస్తున్నాడు. ఎంతసేపు చూచినా అతని కుతూహలము తీరిపోవడము లేదు.

ఆ తర్వాత అతను పడవ నడుపువానితో కబుర్లు చెప్పుతూ కాలం వెళ్ళబుచ్చాడు. మధ్య మధ్య వెనుకగడతోయు పల్లెవాడు చుట్టకాల్చ కుతూహల పడినప్పుడు తాను గడతీసుకుని ఎంతో నేర్పుతో పడవను అవసరమైన వైపుకు త్రోసేవాడు.

సాయంత్రము కాకపూర్వమే అన్నపూర్ణ అతన్ని పిలచి రాత్రి భోజనానికి నీకేమి కావాలి యని అడిగింది.

తారాచంద్ జవాబిచ్చాడు—"మీరేమి పెట్టినా తింటాను. ఒక్కొక్కరోజు యేమీలభించకపోయినా అలాగే వుండిపోతాను."

ఆ బాలకుడు చూపిన అనాసక్తి అన్నపూర్ణకు కొంచెముకష్టము కలిగించింది. గృహచ్యుతుడైన ఈ బాలకుని అన్నపానాదులతో తృప్తిపరచవలెనని ఆమె కుతూహలము. కాని అతనికి యేమిపెడితే సంతోషిస్తాడో అదెవరికి తెలుసు. పడవ వొడ్డుకు చేర్చబడిని నావికుల కాజ్ఞాపించి దగ్గర గ్రామంలో పాలు, పెరుగు, తియ్యని పదార్థములు తీసుకు రమ్మని తొందరచేసింది. తారాచందు పొట్టనిండా భోజనము చేశాడు. పాలుత్రాగలేదు. మౌనంగా వుండే మోతీలాల్ అతన్ని పాలు త్రాగమని చెప్పాడు. కాని అతను త్రాగ లేదు. "నాకు రుచించవు" అని జవాబిచ్చాడు.

ఇలాగే రెండు మూడు దినములు గడిచిపోయినవి. వంటచేయడము దగ్గరనుండి అన్ని పనులలోను స్వేచ్ఛగా పాల్గొంటూ పోతున్నాడు. అందమైన దృశ్యము చూచి నప్పుడు అతని హృదయము ఆహ్లాదపరవశమయ్యేది. అతని చూపు, ఆ మనస్సు, కాళ్ళు, చేతులు అన్నీ ఎల్లప్పుడూ అనేక పనులలో నిమగ్నమవుతూనే ఉండేవి. అందువల్లనే అతను సజీవమైన ఉత్సాహంతో ఏ విధమైన చీకూ చింతా లేక క్రియాత్మక కార్యకలాపములలో మునిగి తేలుతూఉండే వాడు. ప్రతిమనిషి తన స్వతంత్ర సృష్టిని సృష్టించుకుంటాడు. కాని తారాచందు నీలాంబరాచ్ఛాదితమైన ఈ విశ్వప్రవాహమున నీలోజ్జ్వలమైన తరంగమువలె, భూత భవిష్యద్వర్తమాన బంధన రహితుడై, ముందు చూపే ప్రధానముగా గొని నడుస్తూ పోతున్నాడు.

అనేక మండలిలలో కలసి అనేక రకాలైన మనోరంజక విద్యల నభ్యసించాడు. ఏ విధమైన బాధలు లేకపోవుట వలన అతని నిర్మల మస్తిష్కములో ప్రతిదీ సరళంగా అంకితమైపోతూ ఉండేది. గీతాలు, కథలు, హరికథా సంకీర్తనలు, యాత్రావదములు, నాటకాలలోని పెద్దపెద్ద పాఠములు అన్నీ అతనికి గుర్తున్నాయి. మోతీలాల్ బాబు ఎప్పటి మాదిరిగానే తన భార్య, కూతురుకు రామాయణము చదివి విని పిస్తున్నారు. కుశలవుల కథ ప్రారంభమైంది. ఇది విని తారాచందు తన ఉత్సాహాన్నాపుకోలేకపోయాడు. పడవ పై భాగమునుండి దిగివచ్చి లోనికేగాడు. "పుస్తకము అలా ఒక వైపు ఉంచండి. నేను కుశలవుల పాట వినిపిస్తాను వినండి" అంటూ పాట పాడ నారంభించాడు. పిల్లనగ్రోవికంటె తియ్యని స్వరముతో దాసురాయ్ రచించిన పదములు పాడుతున్నాడు. పల్లెకారులంతా పడవలోనికి తొంగి చూశారు. హాస్య, కరుణ, సంగీత సమ్మిశ్రిత స్వరములతో ఆ సంధ్యా వేళ ప్రకృతి యంతా ఒక అపూర్వమైన రస స్రవంతిలో స్నానమాడింది. రెండు వైపుల తటములు తమ కుతూహాలమును వ్యక్తపరచినవి. దగ్గరలోనే వెళ్తున్న పడవ ప్రయాణీకులు కుతూహాలముతో చెవులొగ్గించారు. పూర్తికాగానే అందరూ బాధతో "అప్పుడే పూర్తయిపోయిందా ఇంకా లేదూ ?" అని అడిగారు.

సజల నయనములతో అన్నపూర్ణ బాలకుని ఒడిలోనికి తీసుకుని హృదయానికి హత్తుకుని ప్రేమ వ్యక్తపరచాలనుకుంది. ఈ బాలకుడ్ని దగ్గరకు తీసుకుని వుంచుకుంటే బొంగ

బిడ్డలు లేనికొరత తీరుతుందని మోతీలాల్ బాబుకు అనిపించింది ఒక చిన్న బాలిక చారుశశి మనసుమాత్రము ఈర్ష్యాద్వేషములతో నిండిపోయింది.

# 3

చారుశశి తల్లిదండ్రులకు ఏకైకపుత్రిక యగుటవల్ల వారి ప్రేమకు ఏకైక అధికారిణి కాగలిగింది. కోరికలకు, పట్టుదలలకు ఎక్కడా అంతూవంతూ కానరావడంలేదు. అన్నపానాదులలోను, దుస్తులు ధరించడంలో, కేశాలంకరణలోనూ అన్నివిషయాలలోను శశిదే పట్టుదల. ఎక్కడికైనా వెళ్ళవలసివచ్చినా, ఎవరైనా ఆహ్వానించినా తల్లి మొదటినుంచే గాభరావడుతుంటుంది. సరిగా సమయానికి కూతురు యేమి పేచీపెట్టగలదో! కేశసంస్కారములో ఎప్పుడైనాఒకవిధమైన జడ అల్లి అది శశికి బాగుండి మరల అలాంటిదే అల్లకపోయినా, ఇంకొకపద్ధతి అవలంబించినా చారుశశి ఏడుపుకెక్కడా హద్దు ఉండదు. ప్రతివిషయమూ ఇంతే. ఒకప్పుడు గుణముకుదిరి సంతోషించినా మరియొకప్పుడు అలాగేచేస్తే పేచీరావడంకూడా సహజమైపోయింది. ఇంకొకప్పుడు అత్యంత అనురాగముతో తల్లిని కౌగలించుకుని నవ్వుతూ, ఏవేవో కబుర్లు చెబుతూ ఆనందములో ఓలలాడిస్తుంది. అసలు ఈ చిన్నపిల్ల తల్లిదండ్రులు కిద్దరికీ అనూహ్యముగానే కన్పిస్తూంది.

ఈ పిల్ల తన సంపూర్ణమైన స్వేచ్ఛతో, మనస్సులోని తీవ్రమైన ద్వేషముతో తారాచందుని తిడుతూంది; కొడుతూంది. తల్లిదండ్రుల్ని కూడ ఈ చేష్టలు కలవరపరచినయ్. భోజనంచేసేటప్పుడు ఏడ్చి అలిగి పళ్ళెముతీసి దూరముగా విరిసి వేస్తుంది. ఏకూర వండినా రుచించదు. ఇంటిలోవుండే దాస దాసీలనుకొడుతుంది. ఏవేవో వాళ్ళమీద అర్థంలేని ఫిర్యాదులు చేస్తుంది. తారాచందు అనేక విద్యలతో అందరికీ మానసికంగా అహ్లాదము కలిగిస్తూ ఉంటే శశికి వాటివల్ల కోపము పెరుగుతూంది. తారాచందులో ఏదో విశిష్టగుణము ఉండటము శశికి ఇష్టంలేదు. అతనిఖ్యాతి పెరుగుతున్న కొద్దీ ఆమెలోని జుగుప్సకూడ పెరుగుతూనేవుంది. పడవలో తారాచందుపాడిన పాటవిన్న అన్నపూర్ణ, ఈ మృదుమధుర సంగీతానికి అరణ్యమృగములుకూడ ముగ్ధమై నాట్యంచేసి ఉంటాయి. చారు శశిహృదయం ద్రవించి యుండవచ్చునని భావించింది. ఆమె అడిగింది -"ఏం తల్లి ! పాటబాగుందా!" కూతురు జవాబివ్వడానికి బదులు తల ఇటూఅటు విసురుగా త్రిప్పింది. దీనికి సరియైన అనువాదభాష నా కేమీ బాగుండలేదు. నాకెప్పుడు బాగుండబోదు! అనేదేయని మనము అర్థంచేసుకోవాలి.

తారాచందుయెడ శశి హృదయంలో ఈర్ష్య కలిగిందని అన్నపూర్ణ భావించింది. శశి ఎదుట తారాచందు పట్ల ప్రేమ చూపడం మానివేసింది. రాత్రికాగానే భోజనముచేసి చారుశశి నిద్రించి నప్పుడు అన్నపూర్ణ ద్వారము

వద్దకూర్చొనేది. మోతీబాబు, తారాచంద్ ఇద్దరూ బయట కూర్చునేవారు. అన్నపూర్ణ కోరిక ననుసరించి తారాచంద్ పాట ప్రారంభించేవాడు. నదీ తటమున ఉన్న గ్రామములు సంధ్యాసమయపు నీలి అంధకారములో విలీనమై తారా చంద్ పాటవింటూ ప్రశాంతంగా వుండేవి. అతని పాట విని అన్నపూర్ణ ప్రేమ, సౌజన్యరసములలో మునిగి వుక్కిరి బిక్కిరవుతూ వుండేది. అప్పుడే చారుశశి ప్రక్కమీాదనుండి లేచి వస్తూ రోషనేత్రములతో ఏడుస్తూ అంది "ఈగోలతో నాకు నిద్రపట్టడంలేదు. నన్ను నిద్రపోనియ్యండి." ఆపిల్లను నిద్రపోనిచ్చి తల్లిదండ్రులు తారాచంద్ పాట వినడం సహించలేక పోయింది. ఈ పిల్ల ప్రకాశవంతమైన నల్లని నేత్రములలోని సహజక్రోధము తారాచందులో కుతూహలము జనింపజేసింది. చారుశశికి కథలు, పాటలు, పిల్లనగ్రోవి మొదలైన వెన్నో వినిపించి తనువశపరచుకోవడానికి ప్రయత్నించాడు. చివరికి విఫలమనోరథుడై వూరుకున్నాడు. మధ్యాహ్నపు వేళ నదీ జలములో స్నానమాడుతున్నప్పుడు అతని ఎర్రని శరీరము అటు నిటూ ఈదుతూంటే శరీరపు అనేక భంగిమలను చూచి చారు శశి జలదేవత క్రీడలు జరుపుతున్నట్లు భావించేది. అప్పుడు శశి హృదయం తారాచంద్‌పట్ల ఆసక్తి ప్రదర్శించేది. రోజూ ఆమధ్యాహ్నపు వేళకోసము నిరీక్షించేది. ఆసమయానికి స్వెట్టరు అల్లుతూన్నట్లు నటిస్తూ ఆ అబోధ హృదయం ఎంతో అభిలాషతో ఈదుతున్న తారాచందుని కనుకొనలతో చూస్తూవుండేది.

# 4

నందిగ్రామము ఎప్పుడు దాటిపోయిందో తారాచందుకు తెలియనేలేదు. ఈ పెద్దపడవ ఒకప్పుడు తెరగాలి సహాయంతోనూ, ఇంకొకప్పుడు త్రాడులాగేవారి సహాయముతోనూ వివిధ నదుల శాఖోపశాఖలనుండి నడచిపోతూవుంది. పడవ యాత్రీకుల జీవితములు కూడ ఈ నదుల ప్రశాంత సౌందర్యస్నిగ్ధ సహజ సౌమ్యచలనముతో మృదుమధుర కలకల స్వరములమధ్య ప్రవహించి పోతూవుంటాయి. మధ్యాహ్నము స్నానపానాదులతో చాలా సమయము గడిచిపోతుంది. సాయంత్రమయేసరికి ఏదో ఒక పెద్ద గ్రామమువద్ద రేవులో పడవ ఆగిపోతుంది. కిచకిచ కీచురాళ్ళ ధ్వనులతో, మిణుగురుపురుగుల మిలమిలలతో వెలుగొందుతూండే అరణ్యప్రదేశములో పడవ కట్టబడియుంటుంది.

పదవ రోజు పడవ కటహాలియా చేరింది. జమీందారు వచ్చిన ఆనందమును పురస్కరించుకుని నదివొడ్డుకు పల్లకీలు తీసుకొని అనేక గుఱ్ఱములతో రాజ సైనికులు, ఆఫీసర్లు వచ్చారు. తుపాకులు ధరించిన కావిభంట్లు, తడవ తడవకు తుపాకులు గాలిలో ప్రేలుస్తూ ఘనమైన స్వాగతమిచ్చారు.

ఈ ఉత్సవాలలో చాలా ఆలస్య మవుతూంది. ఇంతలో తారాచంద్ పడవదిగి గ్రామమంతా ఒకసారి పర్యటించి తిరిగి వచ్చాడు. ఏమండి అన్నగారు, బాబాయిగారు, మామగారు రకరకాల సంబోధనలతో స్నేహం కలుపు

కుంటూ రెండు మూడు గంటలలోనే ఎంతోమంది స్నేహం సంపాదించుకున్నారు. ఎక్కడా ఏవిధమైన బంధనము అతనికి లేకపోవడమే అతడు ఇంతమందితో త్వరలోనే సఖ్యత కుదుర్చుకోవడానికి ముఖ్యకారణం. కొద్ది రోజులలోనే ఎంతోమంది హృదయాలలో స్థానమేర్పరుచుకున్నాడు.

తారాచంద్ ఇంతమందితో స్నేహము కలిగి వుండటానికి ముఖ్యకారణం అతనిలోని సరళ స్వభావమే. అతనిలో ఏ విధమైన విశేష సంస్కారమూ లేదు. అన్ని పనులలోనూ అతనికి ఎంతో కొంత ప్రవేశముంది. చిన్నపిల్లల మధ్య పిల్లవానివలే వ్యవహరిస్తాడు. పెద్దలతో పెద్దగాను వృద్ధులతో వృద్ధుడుగా గాకపోయినా చాకచక్యముగా వ్యవహరించగలడు. పశుకాపరుల మధ్య పశుకాపరిగా కనిపిస్తాడు. అయినప్పటికీ అతడు బ్రాహ్మణుడే. మిఠాయిదుకాణములో అంగడివానితో రకరకాల కబుర్లు చెబుతుంటాడు. కొద్దిసేపులో అంగడివాడు ఈతనిమీద దుకాణపు భారము వదలి ఇంకొక పని చూచుకోబోతాడు. రకరకాలమిఠాయిలు తయారు చేయడంకూడ ఇతనికి తెలుసు. అల్లకం పనిలోకూడ ప్రావీణ్యం సంపాదించాడు. కుమ్మరి సారెమీద కుండలు తయారుచేసే పనికూడ అతనికి తెలియనిదికాదు.

గ్రామాన్నంతటనీ వశపరచుకోగలిగినా తారాచందు ఒక బాలికయొక్క ఈర్ష్యను మాత్రం జయించలేకపోయాడు. గ్రామంనుండి చాలాదూరానికి పంపించివేయ గోరుతోందనే రహస్యం తెలిసే, తారాచందు ఈ గ్రామంలో ఇంత ఎక్కువ

కాలం నిలచిపోయాడేమో! స్త్రీ హృదయ రహస్యము ఎవరూ భేధింపరానిదని చారుశశి తన బాల్య జీవితంలోనే రుజువు చేసుకుంది.

నిసరానీ కూతురు సోనామణి అయిదవ ఏటనే విధవ అయింది. చారుశశి సమవయస్కురాలు, స్నేహితురాలు. ఆరోగ్యం బాగుండక పోవడంవల్ల కలకత్తానుండి తిరిగి వచ్చిన తన స్నేహితురాల్ని త్వరగా కలుసుకోలేకపోయింది. కాని కలుసుకోవడానికి వచ్చిన రోజునే ఇద్దరు స్నేహితురాండ్ర లోనూ పోట్లాట జరిగింది.

చారుశశి పెద్ద భూమికతో కథ ప్రారంభించింది. తాను నూతనముగా సంపాదించిన రత్నము తారాచందు వృత్తాంతమంతా విస్తారముగా వినిపించి తన స్నేహితురాలి మనసులో కుతూహలము, విస్మయము కలుగజేయాలను కుంది. తారాచందుని సోనామణి లోగడే ఎరుగునని, వాళ్ళ తల్లిని మామ్మగారూ అంటూ తారాచందు పిలుస్తాడని, తాను అన్నయ్యా యని పిలుస్తుందని, వాళ్ళకు పిల్లనగ్రోవి వినిపించడమేగాక ఒకటి తయారుచేసి యిచ్చాడని, రోజూ చెట్టుపైకెక్కి రేగిపండ్లు కోసిపెడుతున్నాడని విన్నప్పుడు చారుశశి హృదయములో ఎఱ్ఱగా కాల్చిన శూలము గుచ్చి నట్లయింది తారాచందు తనవాడేనని, అతని రహస్యము ఇతరులకు తెలియదని చారుశశి భావించింది. ఇతరుల కెవరి కైనా తెలిసినా పూహోగానమేగాని వాస్తవస్థితి యేమీ తెలి యదని, అందరూ ఇటువంటి రత్నాన్ని తాను సంపాదించు

కున్నందుకు ప్రశంసిస్తారని తలంచిది. ఇలాంటి ఆశ్చర్యకర మైన వ్యక్తి, బ్రాహ్మణబాలకుడు సోనామణి కెలా పరిచితు డయాడు? ఇంత ప్రయత్నించి అతన్ని ఇక్కడికి తీసుకురాక పోతే సోనామణికి అతనికి స్నేహ మెట్లాకలిసేది! సోనామణికి అన్నయట! ఇది వినగానే ఆమె శరీరం తుకతుకలాడింది.

ఇంతకాలము మనస్సులో ద్వేషిస్తూ వచ్చిన తారా చందుపైన ఆమెకు ఏకైకాధికార మెలా వచ్చింది? ఈ రహస్య మెవరికి అర్థమవుతుంది!

ఆ దినము ఈ చిన్నవిషయానికి సోనామణితో చారు శశి స్నేహము విడిచిపెట్టింది. అప్పుడే తారాచందు గది లోనికి పరుకెత్తి పిల్లనగ్రోవి కాలిక్రిందపడవైచి త్రొక్కి బద్దలుచేసి వేసింది.

ఘోర ఆవేశములో పిల్లనగ్రోవి నాశనముచేస్తూన్న సమయానికే తారాచందు ఎక్కడినుండో వచ్చాడు. ఈ బాలిక ప్రళయరౌద్రరూపాన్ని చూచి విస్మితుడయాడు. "శశీ! నాపిల్లనగ్రోవి ఎందుకు విరక్కొట్టివేశావ్" అని అడి గాడు. "విరగగొట్టాను. ఇంకా విరగకొడతాను" అంటూ ఎగిరెగిరి గంతులువేస్తూ విరిగినముక్కల్ని గట్టిగా అణగ త్రొక్కింది. రోషావేశకంపిత కంఠముతో రోదిస్తూ ఆ బాలిక గదినుండి బయటకు వెడలిపోయింది. తారాచందు విరిగిన పిల్లనగ్రోవి అటు నిటూ త్రిప్పిచూశాడు. అది పూర్తిగా పాడయిపోయింది. తనపాతనేస్తముమీద చారుశశికి కలిగిన అకారణ క్రోధకారణము అతనికి బోధపడలేదు. చారుశశి

రోజు రోజూ అతని ఎదుట నిత్యనూతన నిగూఢరహస్యముగా పరిణమించింది.

అతనికింకొక కుతూహలంకూడ వుంది. మోతీబాబు లైబ్రరీలో అనేక ఇంగ్లీషు పుస్తకాలున్నై. వాటిల్లో అనేక బొమ్మలు అతనికి ఆనందము కలుగజేస్తున్నాయి ప్రపంచంలో అతనికి బాగా పరిచయముంటుంది. కాని ఈ బొమ్మల ప్రపంచంతో అతని కెప్పుడూ పరిచయం లభ్యంకాలేదు. అనేక రకాలుగా వూహించుకుని తృప్తి పడేవాడు. కాని అతని మనస్సు కెప్పుడూ సంతృప్తి కలుగలేదు.

తారాచందు బొమ్మల పుస్తకాలను ప్రేమించడము చూచి ఒకరోజు మోతీలాల్ బాబు అడిగారు—"ఇంగ్లీషు నేర్చుకుంటావా ? అన్ని బొమ్మలను నువ్వు బాగా అర్థం తెలుసుకోగలవు."

తారాచంద్ వెంటనే--"నేర్చుకుంటాను" అన్నాడు.

మోతీలాల్ చాలా సంతసించారు. ఆవూరి స్కూలు హెడ్ మాస్టరు తామరరతన్ బాబును పిలిపించి ప్రతిరోజూ సాయంత్రము వచ్చి పాఠము చెప్పిపోయే ఏర్పాటు చేశారు.

# 5

తారాచందు తన తీక్షణమైన జ్ఞాపకశక్తి, అఖండమైన దీక్షతో ఇంగ్లీషు నేర్చుకుంటున్నాడు. తానేదో తెలియని రాజ్యములో సంచారము చేస్తున్నట్లుంది. పాతప్రపంచాన్ని

మరిచిపోయాడు. గ్రామజనులకు కన్పించుటలేదు. నిర్జన నదీ తటమున ప్రశాంత సాయంత్రపు వాతావరణములో అటు నిటూ తిరుగుతూ ఇంగ్లీషు పాఠము వల్లించేవాడు. అప్పుడు అతడు ప్రేమించే బాహ్యము దూరానవుండి అతన్ని గమనిస్తూ ఆతని చదువుకు అంతరాయము కలిగించడానికి సాహసించేదికాదు.

చారుశశికి కూడ అతనిప్పుడు ఎక్కువగా కన్పించుట లేదు. ఇదివరకు అంతఃపురములో అన్నపూర్ణ ముందర కూర్చుని భోజనము చేసేవాడు. అంతసేపు ఆమెడ ప్రేమ వాత్సల్యములు అతనిమీద ప్రసరిస్తూ వుండేవి. ఇప్పుడు ఆలస్యము కాకుండా భోజనం బయటనే ఏర్పాటు చేసుకున్నాడు. అన్నపూర్ణ అభ్యంతరము చెప్పింది. కాని మోతీబాబు జవాబుకు చేసేదిలేక అంగీకరించింది. తారాచందు చదువు మోతీబాబుకు చాలా సంతోషము కలిగించింది. దాన్ని చెరపడం ఆయన కిష్టంలేదు.

ఒకరోజు చారుశశి తానుకూడ ఇంగ్లీషు చదువుతానని పట్టుబట్టింది. తల్లిదండ్రులు ఈ పెంకిపిల్ల ప్రస్తావనను హాస్యముగా గణించి ప్రేమపూరిత వినోదములో ఎగరగొట్టివేశారు. పెంకిపిల్ల ఈ పరిహాసాన్ని సహించక అశ్రుధారలు ప్రవహింపజేసి మాలిన్యమును శుభ్రపరచినపుడు వారికి ఆ బాలిక ప్రస్తావనను అంగీకరింపక తప్పిందికాదు. చారుశశి తారాచందుతో కలిసి ఆ మాష్టరువద్దనే చదువుకుంటూంది.

ఈ చంచలచిత్త బాలికను చదువు అంటలేదు తాను

చదువుకోనకపోగా తారాచందు చదువు కూడ విఘ్నము కలుగజేస్తూంది. పాఠాలు రావడములేదు. వెనుకపడుతుంది. పైగా తారాచందుతో కలిసే చదవాలని మొండి పట్టుదల, తారాచంద్ ముందుకు పోవాలంటే విపరీతమైన క్రోధము, దానితోపాటు ఏడ్పు మొదలిడుతుంది. పాతపుస్తకము పూర్తి చేసి కొత్త పుస్తకము తారాచంద్ తెచ్చుకుంటే తనకూ కొత్తపుస్తకము కావలసిందే ఖాళీసమయములో తారాచందు వ్రాసుకుంటూ ఉండేవాడు. పఠము వల్లి వేసే వాడు. ఇదికూడా ఆ బాలిక సహించేదికాదు. అతను లేన ప్పుడు చాటుగా గదిలోకి ప్రవేశించి అతను వ్రాసిన పుస్త కముమీద సిరా వొలకపోసేది. కలముదాచివేసేది. చదువు కునే పుస్తకములో కాగితాలు చింపివేసేది. తారాచందు ఈ బాలిక ఉపద్రవాలన్నీ సహనంతో, కుతూహలముతో గమనిస్తున్నాడు. అప్పుడప్పుడూ కొడుతూ వుండేవాడు. అయినా ఎప్పుడూ ఆ బాలికను వశపరచుకో గలిగేవాడు కాదు.

అకస్మాత్తుగా అతనికొక ఉపాయము తోచింది ఒక రోజు బాగా కోపంవచ్చింది. కాని వివశుడై ఏమీ చేసేది లేక, తన పుస్తకాన్ని ముక్కలు ముక్కలుగా చింపి అవతల పారవేశాడు. విచారంగాకూర్చుని ఆలోచిస్తున్నాడు. గదిలో ప్రవేశిస్తూనే చారుశశి ఇవాళ దెబ్బలు తప్పవనుకుంది. కాని అలా జరగలేదు. తారాచంద్ ఏమీ అనకుండానే మెదల కుండా కూర్చున్నాడు. అటూ నిటూ గది అంతా తిరిగింది. అతని దగ్గరలోకి వెళ్ళి పట్టుబడటానికి యత్నించింది.

తారాచంద్ చారుశశిని పట్టుకుని వీపుమీద దెబ్బకొట్ట గలిగినంత దూరంలో నిలబడింది. అయినా ఆతడు మిన్న కుండటముచూచి శశికి చాలా బాధగలిగింది. ఏమిచేయాలి? "క్షమార్పణ కోరుకోనడమా?" ఇది తన జీవితములో ఎన్నడూ నేర్వని విద్య. తన సహాపాఠకుడ్ని క్షమయాచించ డము హీనత్వాన్ని సూచించదా? అన్ని విధాల సఫలు రాలై అక్కడే పడివున్న ఒక కాగితంముక్క తీసిదానిమీద- "ఇక నెప్పుడూ పుస్తకాలమీద సీరా వొలకపోయను అని వ్రాసింది. తారాచందు చూడడానికి అనేకవిధాల ప్రయాస పడుతోంది. తారాచందు సంతోషము పట్టలేకపోయాడు. బిగ్గరగా నవ్వాడు. చారుశశి లజ్జితురా లవడమేగాక క్రోధ ముతో పిచ్చిదై అప్పటికప్పుడు విసురుగా గదినుండి బయ కిటి వెళ్ళిపోయింది. తాను తన దీనతను ప్రకటించిన కాగి తము సర్వనాశనముచేసి ఎక్కడా కనిపించకుండా చేయనిదే ఆమె హృదయానికి వూరట కలిగేదికాదు.

సోనామణి ఒకటి రెండురోజులు బయటనుండే పాఠ శాలను వీక్షించి వెడలిపోతూఉండేది. చారుశశి పట్ల ఆమెకు అమిత అనురాగం ఉంది. కాని తారాచందు విషయంలో ఆమె చారుశశిని శంకిస్తూంది. చారుశశి లోపల ఎక్కడో ఉండటం చూసి గబాలునవచ్చి తారాచందు ఎదుట నిల బడింది. తారాచందు ఎంతో ఆప్యాయతతో ప్రశ్నించాడు "సోనా! ఏమిటి విశేషాలు! అమ్మగారు బాగున్నారా?"

"నువ్వువచ్చి చాలా రోజులయింది. అమ్మపిలుచుకు

రమ్మన్నది. అమ్మకు నడుం నొప్పికదూ! అందుకనే రాలేక పోయింది." అంది సోనామణి.

ఇంతలో వారిద్దరిమధ్య చారుశశివచ్చి కూర్చుంది. సోనామణి తన స్నేహితురాలు సొత్తు అపహరించవచ్చినట్లు భయపడుతూంది. చారుశశి బిగ్గరగా కళ్ళు వురుముతూ అర చింది. "సోనా! చదువుకునేటప్పుడు అల్లరి చేయడానికి వచ్చావా! మా నాన్నగారికి చెప్పివస్తావుండు." తానే తారాచందు సంరక్షకురాలైనట్లు, అతని చదువు కేవిధమైన ఆటంకము కలిగించడము తనకు సుతరామూ ఇష్టములేనట్లు పలికింది. కాని చారుశశి అప్పుడు ఆ గదిలోకి ఎందుకు వచ్చిందీ ఆ భగవంతు డెరుగును. తారాచందుకు కూడా తెలుసు. సోనామణిభయపడి అనేక రకరకాల సమాధానాలు చెప్ప ప్రయత్నించింది. చివరికి "నువ్వు వొట్టి అబద్ధాల కోరువు" అనే చారుశశి మాటవినగానే లజ్జా వ్యాకుల భరిత హృదయముతో ఇంటికి వెళ్ళిపోయింది. ఇది చూచి తారాచందు హృదయం ద్రవించింది. "సోనా! సాయంత్రం మీ యింటికి వస్తాను. మాఅమ్మగారికి చెప్పు" అనిచెప్పాడు. చారుశశి త్రాచుపామువలె బుసలుకొడుతూ-"ఆ, ఎందుకు వెళ్ళవూ? పాఠాలు చదవడముందా ఏమైనానా? మాస్టరు గారితో చెప్తాలే వుండు." అని బెదిరించింది.

చారుశశి శాసనాన్ని వుల్లంఘించి తారాచందు రెండు మూడు రోజులు సోనామణి ఇంటికి వెళ్ళాడు. నాల్గవ సారి శాసనము చేయక అతని గదితలుపులు బిగించి తాళము

వేసింది. చాలా సేపటివరకు అతను ఆ ఖైదులోనే వుండి పోవలసివచ్చింది. భోజనము వేళవరకు అతనికి విముక్తి కలుగ లేదు. తారాచందు కోపంతో అప్పటి కప్పుడే సోనామణి యింటికి వెళ్ళడానికి ప్రయాణమయ్యాడు. ఆ చింతాక్రాంత హృదయ బాలిక కేల్ మొగిడ్చి ప్రార్థిస్తూ అతన్ని అనేక విధాల వేడుకుంది-- నీ కాళ్ళపడతాను. ఇహ నేనెప్పుడూ అలా చేయను. ఈసారికి క్షమించు. భోజనముచేసి వెళ్ళు." అప్పటికీ తారాచందు అలిమికా లేదు. అధీరురాలై ఏడ్చింది. చివరికి తారాచందు భోజనము చేయక తప్పలేదు.

అనేక పర్యాయములు తారాచందు యెడ సద్భావము, సహృదయతలతో మెలగాలని, క్షణపాటుకూడ కష్ట పెట్టకూడదని నిర్ణయించుకుంది. కాని తారాచందును సోనామణి, తదితరుల మధ్య చూచిన ఆమె స్వభావము ఎలా పరిణతి చెందుతుందో దురూహ్యము. ఎక్కువరోజులు చారుశశి ప్రశాంతముగా వూరుకున్నా, తారాచందు హృదయంలో ఏదో రాజోపు విప్లవాన్ని సూచిస్తూ సందేహము పొడముతూనే వుండేది. ఆక్రమణ ఎటువైపునుంచి, ఎలా ? ఏ విషయముపైన ఆధారపడి ప్రారంభమవుతుందో ఎవరికీ తెలియని సంగతి. ఆక్రమణ తరువాత ప్రచండమైన తుఫాను చెలరేగుతుంది. దాని తరువాత అవిరళ అశ్రుస్రవంతి ప్రవహిసుంది. చివరికి ఆనందమూ, శాంతి సర్వత్రా తన స్నిగ్ధ స్నేహ సౌజన్యాన్ని వెదజల్లుతాయి.

# 6

ఇలాగే రెండు సంవత్సరములు గడచినవి. ఇంత ఎక్కువకాలము అతను ఎక్కడా పట్టుబడి యుండలేదు. బహుశా చదువే అతన్ని అక్కడ బంధించి యుంచి వుండవచ్చు. వయస్సు పెరుగుతున్నకొలదీ నైజములో మార్పు రావడంకూడ దీనికి కారణము కావచ్చు. ప్రపంచములోని ఆనందపు అంచుల నందుకొనడానికి తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను వినియోగించుకుంటున్నట్లుంది. ఆ బాలికసత్యమూ తన గంభీరమైన ప్రకృతితో ప్రచ్ఛన్నముగా అతనిని వలలో వేసుకుంటూ వుండటములో కూడ ఆశ్చర్యమేమీ లేదు.

చారుశశి వయసు పదకొండు సంవత్సరాలు దాటుతూంది. మోతీబాబు అనేక వివాహ సంబంధాలు వెదికించారు. రెండు మంచి సంబంధాలతో వ్యవహారం చేశారు. పిల్ల పెద్దదయింది. బయటికి వెళ్ళనీయడం మంచిదికాదని తలచి ఇంట్లోనే వుండ నాజ్ఞాపించారు. కాని ఈ ఆకస్మిక అవరోధమువల్ల చారుశశి ఇంటిలో పెద్ద కల్లోలము లేపింది.

ఒకరోజు అన్నపూర్ణ తన భర్తను పిలచి చెప్పింది– "మీరు వరుడుకోసం ఇంత యాతన ఎందుకు పడతారు? తారాచంద మంచి పిల్లవాడే. అమ్మాయికికూడ అతనంటే చాలా యిష్టము."

ఇదివిని మోతీబాబుకు ఆశ్చర్యం కలిగింది. తారాచంద కులగోత్రం మంచిచెడ్డలు మనకు తెలియవు. మనకున్న

ఒక కుమార్తెను ఏదైనా సద్వంశములో యివ్వడం మంచి దని నా అభిప్రాయం అన్నారు.

రాయగఢ జమీందారు వైపువాళ్ళు పిల్లను చూడ డానికి వచ్చారు. చారుశశిని అందముగా అలంకరించి బయ టికి తీసుకురావడానికి ప్రయత్నాలు జరిగినై. శశి తనగదిలో తలుపులన్నీ బంధించుకుని కూర్చుంది. ఎంతప్రయత్నించినా ఎంత నచ్చజెప్పినా కోపపడినా వృధాప్రయాస యయింది. తప్ప ఏమిఫలితము కానరాలేదు. "అకస్మాత్తుగా అమ్మాయి ఆరోగ్యము చెడిపోయిందని, ఇవాళ చూడటం తటస్థించదని మోతీబాబు వచ్చినవాళ్ళకు తెలియజేశారు. "ఏదో లోపము వుండటంవల్లనే ఈ వంక పెట్టారని" అనుకొంటూ వాళ్ళు తిరిగి వెళ్ళిపోయారు.

తారాచంద్ మంచిపిల్లవాడు. అతన్ని యింట్లోనే వుంచుకోవచ్చు. అమ్మాయి బయటికి వెళ్ళినా పరాయి యింట ఈ చంచలత్వమూ, పెంకితనమూ అత్తవారు సహిం చక పోవచ్చునని మోతీబాబు వూహించాడు.

మోతీబాబు అన్నపూర్ణతో అనేక విషయాలు సంప్ర దించి తెలుసుకున్నారు. తారాచంద్ కుటుంబ స్థితిగతులు, మంచిచెడ్డలు తెలుసుకోవడానికి అతనివూరు ఒక మనిషిని పంపారు. ఆ మనిషి తిరిగివచ్చి కుటుంబము మంచిదని ఆస్తి పాస్తులు లేవని తెలియజేశాడు. పిల్లవాని తల్లికి, సోదరులకు వివాహ ప్రస్తావన తెలియజేశారు మోతీబాబు. అందుకు వారు అమితానందము జెంది తమ సమ్మతిని తెలిపారు.

కటహాలియాలో శశి తల్లిదండ్రులు వివాహలగ్నము నిశ్చయించే ప్రయత్నాలలో, వున్నారు. స్వభావసిద్ధము గానే తన మనస్సులోని రహస్యములు ఎవరికీ తెలియనీయని మోతీబాబు వివాహ విషయముకూడ అన్యులెవరికి తెలియ నీయ లేదు.

శశి కాలు కట్టివేసి వుంచడము ఆ తల్లిదండ్రులకు సాధ్యముకాలేదు. శశి అప్పుడప్పుడు తారాచంద్ గదికి పెద్ద తుఫానువలె వెళ్ళివస్తూనేవుంది స్నేహము, క్రోధ ముల మధ్య అతని శాంతికి భంగము కలుగుతూనేవుంది. అనేకసార్లు పాపమాతడు విసిగిపోతున్నాడు. అత్యంతస్వేచ్ఛా స్వభావము కలిగిన ఈ చంచల బాలకుని హృదయమువేదో చెప్పరాని నూతన ఆవేదనతో, విద్యుత్ వలె చంచ లత్వముతో పురకలు వేస్తూంది. నిత్యము కాలప్రవాహము వలె ముందుకు చొచ్చుకుపోతూ వాటి అలలలోనే ప్రవహించి పోయే బాలకుడు, అన్యమనస్కతతో దివాంధకార దివ్య స్వప్నాలలో మునిగి తేలుతున్నాడు. చదువు మానివేసి మోతీబాబు లైబ్రరిలో రకరకాలైన బొమ్మలు పుస్తకాలు తిరగవేస్తూ గడుపుతున్నాడు. వివిధచిత్రభావ మిశ్రితకల్ప నలలో నూతన సృష్టి నిర్మించుకుంటున్నాడు. కాని ఈ సృష్టి వెనుకటి జీవితానికి పూర్తిగా భిన్నమైనది. చారుశశి అద్భుత చాంచల్యము చూచి ఇప్పుడు పరిహసించాడు. అల్లరిచేస్తే కొట్టడం మానేశాడు. తన ఈ నిగూఢమైన మార్పు, పైన వేసుకున్న అనురాగము అతనికీ ఒక నూతన స్వప్నమువలె తోస్తూంది.

శ్రావణ మాసములో ఒక శుభముహూర్తము నిశ్చయించుకుని మోతీబాబు తారాచందు తల్లిని, అన్నల్ని తీసుకురమ్మని మనిషిని పంపించారు. తారాచందు కీ సంగతి తెలియనీయకుండా దాచివుంచారు. కావలసిన వస్తువులు తెలియ జేస్తూ ఒక పెద్ద లిస్టు తన కలకత్తా ఆఫీసుకు పంపించారు. పోలీసు బ్యాండు వాయిద్యాలు పెళ్ళికి ఏర్పాటు చేయించారు.

ఆకాశములో దశదిశలా మేఘాలు వ్యాపించినవి. ఇప్పటివరకు నది ఎండిపోయి అక్కడక్కడా గోతులలో మాత్రము మురికినీరు నిలిచి వుంది. ఎండిన నది మధ్యమున బండ్ల రహదారులు ఏర్పడి బాటలు ఏర్పడినవి. పుట్టింటి నుండి తిరిగి వచ్చిన పార్వతి మాదిరి గ్రామపు ఎండిపోయిన హృదయములో ఎక్కడనుంచియో జలధార వేగముగా ప్రవహించింది. గ్రామపు బాలబాలికలు నగ్నశరీరులై నదీతీరాన రేవులో చేరారు. ఆనందముతో నాట్యముచేశారు. నీళ్ళల్లో దిగి స్నానమాడారు. గృహిణులు తమతమ ప్రియురఖురాంద్రతో నదీతటాని కరుచెంది నిర్జీవ గ్రామసీమల్ని ఆనంద డోలికలలో వూగిస లాడిస్తూ సజీవ సౌందర్యం సృష్టించారు. అనేక చిన్న పెద్ద వచ్చేపోయే నావలతో, పల్లెకారుల పాటలతో నది ప్రతిధ్వనించింది. రెండు ఒడ్డుల ఇదే వృత్తులలో వుంటున్న గ్రామీణ పల్లెకారులు అపూర్వ సంతోషముతో తమ కార్యకలాపాలలో తిరిగి ప్రవేశించారు.

కుండల కూటములో ఆ రోజుల్లోనే రథోత్సవాలు

జరుగుతూంటాయి. ఒకరోజు చంద్రుని చల్లని వెన్నెలలో తారాచందు నదీ తీరాన నదిని చూస్తూ నిలచాడు. అందు అనేక పడవలలో, ఒక పడవలో వ్యాపారస్తులు, ఒకదానిలో నాటకాలాడే నటులు, ఇంకొకదానిలో భజంత్రీలు, మరి యొకదానిలో గాయకులు, వివిధ రకాలయిన వాయిద్యసమ్మేళనములమధ్య వివిధ సంగీతములతో కోలాహలముగా వుత్సవాలకు వెళుతున్నారు. తారాచందు హృదయం ఆనందంతో పరవశ మయింది. తూర్పుదెసను నల్ల నల్లటి మేఘాలు క్రమ్ముకుంటూ చంద్రబింబాన్ని కప్పివేసినయ్. వాయువు వేగముగా వీస్తూవుంది నదిజలముకలకలస్వరములో నవ్వింది. ఆందోళిత వనప్రాంతాన గాఢాంధకారము తీవ్రముగా వ్యాపించింది. కప్పలు, కీచురాళ్ళు బెకబెకలు, కిచకిచలతో అంధకారము ఛేదించడానికి యత్నిస్తున్నాయి. తారాచందు కళ్ళముందర రథయాత్ర ప్రారంభమయింది. బరువైన రథచక్రాల ధనధన ధ్వనులతో భూమిని కంపింపచేస్తూ కదిలినయ్. ఆకాశంలో మేఘాలు క్రమ్ముకుంటున్నవి. గాలి వేగముగా వీస్తూంది. నది ప్రవహించి పోతూవుంది. నావలు రకరకాల వాద్యసమ్మేళనముల మధ్యనడచిపోతున్నవి. చూస్తూ చూస్తూండగానే మేఘాలు గర్జించినయ్. విద్యుత్ మెరిసింది. దూరదూరాలవరకువ్యాపించిన గాఢాంధకారములో కుంభవృష్టి కురిసే లక్షణాలు ప్రస్ఫుటిత మౌతున్నాయి. నదీ తీరాన కటహాలియా గ్రామమంతా దీపాలు తగ్గించి ప్రశాంతముగా నిద్రపోతూవుంది.

మరుసటి దినము తారాచందు, తల్లి, అన్నలు, కట హాలియా చేరారు. వాళ్ళకు వెనుకనే మూడు పెద్ద పెద్ద నావలు సామాన్లు నింపుకుని కలకత్తానుండి వచ్చి కట హాలియా చేరినవి.

ఆనాటి వుదయము సోనామణి దోన్నెలో పూరగాయ, ఇంకొకదానిలో మామిడి తాండ్ర తీసుకొని భయపడుతూ నెమ్మదిగావచ్చి తారాచందు గది గుమ్మములో నిలచింది. తారాచందు జాడ ఎక్కడా కనిపించలేదు. స్నేహాము-ప్రేమ-మైత్రి వీటి షడయంత్ర బంధనము ఆ బ్రాహ్మణ బాలకుడ్ని బంధించకముందే గ్రామస్తుల వాత్సల్యాన్ని చూరగొని, ఆ మేఘాచ్ఛాదిత అంధకార పూర వర్షము రాత్రే తన మమత్వాన్ని విడచి తారాచందు ఈ విశాల విశ్వపు ఒడిలో ఎక్కడ దాగడానికి వెళ్ళిపోయాడో ఎవరూ తెలుసుకోలేకపోయారు.

---

# పుత్రకామేష్టి

బైజనాథుడు గ్రామానికంతటికి తెలివిగలవాడు, అనుభవజ్ఞుడు. ముందాలోచన లేకుండా ఆయన యే పనీ చేయడు. వివాహము చేసుకున్నప్పుడు కూడా ఆయనకు భార్య కంటె భార్యకు కలుగబోయే పుత్రోదయాన్ని గురించే ఎక్కువ ఆలోచనకలిగింది. తన వివాహం విషయములోకూడ ఆయన తగు వ్యవహార దక్షతతోనే మెలిగాడు "పుత్రార్థే క్రియతే భార్యః" అను శ్లోకాన్ననుసరించి ఆయన ప్రేమ కంటె, పుత్ర ప్రాప్తికే ప్రాధాన్యత యిచ్చాడు.

కాని పక్కా వ్యవహారికుల మనుకునే వాళ్ళే ప్రపంచంలో మోసపోవడం కద్దు. సంపూర్ణ యౌవ్వనంలో వుండి కూడా వినోదినికి సంతానం కలుగకపోవడం ఆయనకు కలవర పరచింది. ఇది పున్నాం నరకంకంటే కూడ మిక్కుటముగా తలచాడు. తాను చనిపోయిన తర్వాత అపార సంపదల కెవరు అధికారి యవుతారు! ఈ భవిష్యత్తు కల్పనలో తన సంపదల భోగాన్నే మరచిపోయాడు.

వినోదిని ఇంత దూరాలోచన పరురాలు కాదు. అమూల్యమైన సంపద, తన నవ వికసిత యవ్వనము ప్రేమ రహితమై వృథాయై పోతున్నది. పారలౌకిక ప్రాప్తికి సాధనమైన పుత్రోదయాన్ని మరచి, ఇహలోక విలాసాలకోసం పరితాపము చెందుతూంది. మనువు రచించిన విధానంవల్ల

కలిగిన బైజునాథుని ఆధ్యాత్మికవ్యథ ఆమె హృదయంలోని ఆరాటాన్నేమాత్రము తగ్గించలేదు.

ఎందుకు ఎన్ని రకాలుగా చెప్పినప్పటికి, ఈ వయస్సులో ప్రేమించడం, ప్రేమ పొందడమే స్త్రీలకు సర్వస్వం. దీనిముందు ప్రపంచంలోని సర్వమూ సుఖరహితమైనదే. ఏ కర్తవ్యమూ దానిముందు నిలువలేదు.

వినోదినికి ఆ ప్రేమ లభించలేదు. దానికి బదులు భర్త, అత్త, ఇంటిలోని పెద్దలు, పెద్దల శ్రేణికి చెందిన వ్యక్తుల ఈసడింపులు, కోపతాపాలకు గురికావలసివచ్చింది. కోమల సుకుమార పుష్పము, వెలుతురు, గాలి కోల్పోయి అంధకారములో క్రుంగిపోయినట్లే వినోదిని యవ్వనము తన కాంతిని కోల్పోతూంది.

రాత్రింబవళ్ళు ఒకటే గుసగుసలు, విసవిసలతో విసుగు చెంది వినోదిని పొరుగింటి కుసుమతో పేకాడటానికి వెళ్తూండేది. అక్కడ పురుషులెవరూ లేకపోవడం వలన హాస విలాసాలలోను, రకరకాల కబుర్లలోను కాలం వెళ్ళబుచ్చేది.

ఆట ఆడటానికి స్నేహితురాండ్రు దొరకనప్పుడు కుసుమ తన యువక మరది నగేంద్రుడ్ని పిలిచేది. వినోదిని వద్దని వారించేది. కాని నగేంద్రుడు హాస్యములో మరపించి ముక్కలు కలిపి అందరికీ పంచేవాడు. ప్రపంచంలో మనుష్యుడు తానొకటి తలుస్తాడు. కాని దైవమింకొకటిగా మారుస్తుంది. ఈ పేకాట ఇంకొక విధంగా పరిణమించి విపత్తును

కాని తెస్తుందని చిన్నతనంలో ఎవరూ విశ్వసించరు.

నగేంద్రుడిన్ని గురించిన సంకోచము కూడ నెమ్మది నెమ్మదిగా పోయింది. ఆతను పిలవకుండానే రోజూ పేకాటకు వస్తున్నాడు. రోజూ ఇలా వినోదినితో నగేంద్రుడు కలుస్తున్నాడు.

నిర్జీవమైన పేకముక్కలపైనకంటె సజీవసౌందర్యరాశి వినోదిపైపే అధికధ్యానముంచుటవల్ల నగేంద్రుడు ప్రతిసారీ ఓడిపోయేవాడు. అసలుకారణం వినోదిని, కుసుమలిద్దరూ గ్రహించారు. కర్మఫలమహాత్మ్యాన్ని పిన్న వయస్కులు వూహించలేరని నేను మొదటే తెలియజేశాను. కుసుమ దీనిని ఆనందంగా భావించింది. ఈ ఆనందం పరిణితిచెంది పదహారణాల పూర్ణత్వం పొందాలని వూహించేది. కొందరు యువతులు నవ ప్రేమాంకురములలో చాటుమాటున నీరుపోసి వాటి పరిణతిని కుతూహలంగా చూస్తూ వుంటారు.

వినోదిని కిది అసహ్యమనిపించలేదు. హృదయాన్ని జయించే అస్త్రాన్ని పరాయి పురుషుడిపైన ప్రయోగించి పదును పెట్టడం అన్యాయం కావచ్చు, కాని అస్వాభావికం మాత్రం కాదు.

ఈ చీట్ల పేకాటలమధ్య రెండు హృదయాలు ఎప్పుడు ఐక్యమైనాయో ఆ పరమేశ్వరుడికిగాక ఇంకొకవ్యక్తికి తెలుసు. కాని ఆ వ్యక్తికి దీనివల్ల అపారమైన సంతోషం కలిగింది.

# 2

ఒకరోజు మధ్యాహ్నము వినోదిని, కుసుమ, నగేం ద్రుడు ముగ్గురూ పేకాడ ఆడుతున్నారు. రోగగ్రస్తుడైన బిడ్డ ఏడుపు విని కుసుమ మధ్యలోనే లేచి వెళ్ళిపోయింది. నగేంద్రుడు వినోదినితో మాట్లాడుతున్నాడు. ఇద్దరూ ఏమి సంభాషించారో ఇద్దరిలో ఏ ఒకరికీ అర్థముకాలేదు. ఇద్దరి హృదయాలు పరవళ్ళు త్రొక్కుతూంది.

హఠాత్తుగా నగేంద్రుని వున్మత్తయవ్వనము కట్టలు తెంచుకుని వినోదిని రెండు బాహుల్లతలను తనవైపుకు పొదవికొని ముఖమును ముద్దిడుకుంది. వినోదిని నగేంద్రుని చేతిలో క్రోధ, క్షోభ, లజ్జావనతయై అతని చేతులనుండి విడివడుటకు పెనుగులాడినది. అప్పుడే హరిద్రృష్టి మూడవ వ్యక్తి గదిలో ప్రవేశించడం గమనించింది. నగేంద్రుడు శిరమూ వంచి బయటకు పారిపోవడానికి యత్నించాడు.

అమ్మగారు మిమ్మల్ని పిలుస్తున్నారండీ, అని గంభీరంగా దాసి వినోదినితో చెప్పింది.

క్రోధారుణ నేత్రాలతో వినోదిని నగేంద్రునిపై పిడుగుల వర్షింపజేసి దాసివెంట వెళ్ళిపోయింది.

దాసి తాను చూచినదానిలో కొంత తగ్గించి, చూడనిది కొంచెం ఘాటు పెంచి వర్ణించినది. బైజనాదు డింటో దీనితో పెద్ద తుఫాను లేచింది. వినోదిని పరిస్థితి ఏమి జరిగిందో వర్ణించడంకంటె వూహించు కోవడంలోనే సహజత్వ

ముంటుంది, తన నిరపరాధాన్ని నిరూపించుకోవడానికి వినోదిని ప్రయత్నించలేదు. తనమీద వేసే ప్రతి అభాండాన్ని నతమస్తకయై సహించింది.

తన పుత్రవాంఛితము అసంభవమని యెంచి బైజనాధుడు వినోదినితో అన్నాడు - "కళంకితురాలా, నీవు నా యింట తగవు, బయటకు వెళ్ళిపో."

తన గదిలో తలుపులన్నీ గడియ బిగించి వినోదిని ప్రక్కపైన పడుకొని రోదిస్తోంది. మధ్యాహ్నపు ఎడారి మండుతున్నట్లు వేడికన్నీరు నయనములనుండి జారుతోంది. నలువైపులా అంధకారం వ్యాపించింది. పక్షుల కలకలరవము సద్దుమణగింది. మినుకుమినుకు మను నక్షత్రములతో ఆకాశం కనిపించింది. తల్లిదండ్రులను తలచుకుని దుఃఖిస్తోంది. ఆమె చెక్కిళ్ళ నుండి అశ్రువులు ప్రవహిస్తున్నాయి.

ఆరాత్రియే వినోదిని తన భర్తను, భర్త గృహమును వదలి ఎక్కడికో వెళ్ళిపోయింది. ఎవరూ ఆమెను వెదకడానికి కూడా ప్రయత్నించలేదు.

మాతృత్వ సౌభాగ్యము తన కప్పటికే సంప్రాప్తించినదని పాపము వినోదిని ఎరుగదు. భర్త పారలౌకిక సద్గతికి కారకుడైన పుత్రుడు ఇదివరకే ఆమె గర్భంలో ఆశ్రయం పొందాడు.

# 3

ఆ సంఘటన తర్వాత పది సంవత్సరములు గడిచి పోయినవి.

భైజనాథుడి ఆస్తి మొదటికంటె ఇప్పుడనేక రెట్లు పెరిగింది. గ్రామమువదలి కలకత్తాలో మంచి భవనముకొని దానిలో వుంటున్నాడు.

ఆస్తి పెరిగిన కొలది, వారసత్వము కొరకతనిమనస్సు వ్యధిత మౌతూంది.

ఆ తర్వాత రెండుసార్లు వివాహం చేసుకున్నాడు. పుత్రోదయానికి బదులు కలహ దర్శనమే కలుగుతోంది. జ్యోతిష్కులు, సన్యాసులు, సిద్ధాంతులతో రోజూ ఇల్లునిండి పోతూంది. రకరకాలు ఔషధాలు, మంత్రాలు, తంత్రాలు, రక్షరేకులు, తాయెత్తులు మొదలైనవన్నీ ఆయన ప్రయోగించి చూచాడు. కాళీఘట్టములో మేకపిల్లల్ని అనేకసార్లు బలి యిచ్చాడు. వాటి ఎముకల్ని ప్రోగుచేసి స్థూపముకట్టిస్తే కుంటి పైమూరు కట్టించిన విర్జివ-విజతా స్తంభము వెలా వెలాపోయునదే. అయినప్పటికీ, కొద్దిమాంసము, ఎముకలతో గూడిన, చిన్నబిడ్డ భైజనాద్ విశాల భవన భాగము నాక్ర మించలేదు. ఇదే దుఃఖములో ఎప్పుడో ఈ ప్రాణి ఎగిరి పోతుంది. ఎవరో ఇతరులబిడ్డవచ్చి ఈ ఆస్తినంతా సంక్రమించు కుంటాడు. తన యిష్టమొచ్చినట్లు తింటాడు తిరుగుతాడు. తాను కష్టించి ఆర్జించిన ఆస్తియంతా వుఫ్‌మని వూది వేస్తాడు.

ఇదేమాదిరి ఆలోచనలలో అన్నపానీయాలు రుచించిన సం లేదు. చివరకు ఏ విషయమూ అతనికి పట్టినట్లు తోచుటలేదు.

ప్రపంచములో ఆశకు మితిలేదు. కన్యాభారగ్రస్తులైన ఇండ్లలో కన్యలకు కరువులేదు. భైజనాథుడు ఇంకొక వివాహం కూడ చేసుకున్నాడు.

ఈ కన్య పుత్రస్థానములో శుభయోగ ముందని జ్యోతిష్కులు జన్మపత్రిక చూచి చెప్పారు, కాని ఆరు సంవత్సరాలు గడిచిపోయినా పుత్రయోగం కలుగలేదు.

భైజనాథునికి పూర్తిగా నిరాశ ఆవరించింది. పండితులను పరామర్శించి మహా యజ్ఞము చేయుటానికి సంకల్పించాడు. అనేకమంది బ్రాహ్మణులకు ఎన్నో మాసాలనుండి భోజనాలు పెడుతున్నాడు.

అప్పుడే దేశంలో కరువు వ్యాపించింది. బీద జనులు అలమటించి పోతున్నారు. ఆకలో అన్నో లక్షణాయంటూ అంగలారుస్తూ ప్రజలు తిండికి వాచిపోతున్నారు. "నా ఆస్తినెవ రనుభవిస్తారు" అని భైజనాథు డాలోచిస్తున్నప్పుడే ప్రజలు "ఏమి తినాలి ఎక్కడ దొరుకుతుంది" అని లోతుకుపోయిన పొట్టలు పుచ్చుకుని కుములుతున్నారు.

ఆ రోజుల్లోనే భైజనాథుని నాలగవ భార్య ప్రతిరోజూ వందమంది బ్రాహ్మణుల పాదోదకము సేవిస్తూంది. ప్రతిదినము పుదయం వందలకొలది బారులు పెంచుకున్న బ్రాహ్మణులకు భోజనం, సాయంత్రం బొజ్జనిండా రకరకాల

పిండివంటలు, ఫలహారములు, నెయ్యి, పంచదార, మిఠాయిలు పెరుగు మొదలైన వాటితో నిండారగిస్తున్నారు. వీటి వాసన తగిలి, గేటువద్ద మూగిన క్షామపీడిత భిక్షుకగుంపుల్ని నౌకర్లు చెల్లాచెదురు చేస్తున్నారు. భైజనాథుడు పోలీసుల కీవిషయం ముందుగానే తెలియజేసినట్లుంది.

ఒకనాడు భైజనాథుని విశాల భవన ప్రాంగణములో పాలరాతి అరుగుపై ఆసనమువైచి కూర్చున్న ఒక సాధు పుంగవుడు అరవీశలడ్డూలు, వానితోపాటు ఒకటిన్నర శేర్ల పాలు సేవిస్తున్నాడు. భైజనాథుడు పట్టువస్త్రములు ధరించి ఎదురుగా కూర్చుండి ఆ మహాత్ముని ఆశీర్వాదము కొరకు తపిస్తున్నాడు. అప్పుడే నౌకర్లు చూడకుండా ఒక రోగివలె నున్న స్త్రీ, చిరిగి చివికిపోయిన మురికిగుడ్డల బక్కచిక్కిన కుర్రవాడ్ని వెంట నిడుకొని లోనికివచ్చి తన క్షీణకంఠంతో అన్నది-బాబూజీ-తినడానికేమైనా ... ..

భైజనా డు గాభర పడుతూలేచి - గురుదయాళ్, గురుదయాళ్ అని కేకవేశాడు. ఆస్త్రీ ఇదంతాచూచిత త్తర పడింది. కాని ధైర్యము తెచ్చుకుని బాబూజీ, ఈపిల్లవాడికి రెండు రొట్టెముక్కలు వేయించండి. వీడిప్రాణముపోతూంది. నాకక్కర లేదు. అని పలికింది.

గురుదయాళ్ వచ్చి, వాళ్ళను అవతలకునెట్టి తలుపులు గట్టిగా బిగించి వేశాడు.

హా! దురదృష్టమా! ఆకలితో గిలగిల తన్నుకుంటున్న ఆ స్త్రీ వెంటనున్న బిడ్డ భైజనాథుడి పుత్రుడే. వందలకొలది

బలసిన బ్రాహ్మణులు, సాధువులు, సన్యాసులు, పుత్రప్రాప్తి యాశ కల్పించి, హల్వా, లడ్డులు భుజించి పొట్టలు నింపు కుంటున్నారు. కాని ఆయన స్వంతబిడ్డకు ఒక రొట్టెముక్క కూడ లభించలేదు.

—o(::)o—

# శుభదృష్టి

ఇప్పటి భారతీయ స్త్రీలు తమభర్తల మంచిచెడ్డలు విచారించి వివాహం చేసుకునే స్థితిలో వున్నారు. కాని నా వివాహం అటువంటిదికాదు. చిన్నప్పటినుండి వుపవాసాలు చేయడం, దేవతల్ని పూజించడము నాకు అలవాటు. శివుని పూజిస్తూ వుండేదాన్ని ఆ దైవసహాయము వల్లనే నాకు మంచిభర్త లభించారు.

నా కు ఎనిమిది సంవత్సరాలు రాకపూర్వమే వివాహ మయింది. పూర్వజన్మపాపమువల్ల కాబోలు మంచి భర్తను పొందికూడ ఆ ఆనందాన్ని అందుకోలేకపోయాను. కాళీ మాత నా రెండుకళ్ళు పొగొట్టింది. చివరి క్షణమువరకు భర్తను చూచుకొనే సౌభాగ్యము నేను పొందలేకపోయాను.

చిన్నతనమునుండి నాకు అగ్నిపరీక్ష ప్రారంభ మయింది. పదునాలుగు సంవత్సరాలు నిండకుండానే ఒక మృతశిశువు నాకు జన్మించాడు. నేనుకూడా మృత్యుముఖము నుండి బయటపడ్డాను. జీవితమంతా దుఃఖాన్ననుభవింప వలసిన స్త్రీ వెంటనే ఎలా మరణిస్తుంది? వెలుగొందడానికి వెలిగించిన దీపము రాత్రంతా వెలిగిన పిమ్మటే ఆరిపోతుంది. అంతకుముందే దానిలో నూనె అయిపోదు.

మృత్యు ముఖమునుండి బయట పడినప్పటినుంచి

నా శరీరములో బాగా బలహీనత వ్యాపించింది. మనోవేదన వల్లనో, మరే కారణంవల్లనో నాకు తెలియదు కాని నా కళ్ళు పాడైపోయినవి.

ఆ రోజుల్లోనే నా భర్త డాక్టరుకోర్సు చదువుతుంటే వారు ఈ చికిత్స చేసే సదవకాశము లభించినందుకు సంతసించి తానే చికిత్స చేయడానికి పూనుకున్నారు.

నా అన్నగారు లాకాలేజిలో లాకోర్సు చదువుతుండేవారు ఒకరోజు ఆయన వచ్చి అన బావమునుద్దేశించి యిలా అన్నారు— "ఏమోయ్ నీవు దాన్ని గుడ్డిదాన్ని చేయదలచావేమిటి? ఎవరైనా మంచి డాక్టరుకు చూపించక పోయావా?"

నా భర్త—'మంచి డాక్టరు వచ్చి యింకా క్రొత్త వైద్యమేమి చేస్తాడు? మందులన్నీ నాకు తెలిసినవే."

అన్నగారికి ఆగ్రహం వచ్చింది. "అయితే నీకూ మీ కాలేజీ ప్రిన్సిపాలుగారికి యేమీ తేడా వుండదంటావా?" అన్నారు.

నా భర్త—"లా చదువుకునే నీకు వైద్యమేమి తెలుసుంది? నువ్వు వివాహం చేసుకున్న తర్వాత నిన్నీ ఈ ప్రశ్న అడుగుతాను. నీ భార్య ఆస్తిమీద ఎవరైనా దావా వేస్తే నువ్వు నా సలహా ననుసరిస్తావా?"

"రాజులు రాజులు పోట్లాడుకుంటుంటే సైనికుల మీదకు ముప్పు వచ్చిపడినట్లుగా వుంది" అని నేను మనసులో

అనుకున్నాను. బావ, బావమరదులమధ్య పోట్లాట జరిగింది. కాని ఈ బాధ రెండువైపుల నేనే భరించవలసివచ్చింది. 'పుట్టింటివారు నన్ను ఇతరులకు కన్యాదానము చేసినప్పుడు ఇంకా నా గురించి ఆలోచన వారి కెందుకు? నా సుఖ దుఃఖాలు, ఆరోగ్యము మొదలైన అన్ని విషయాలు భర్తే ఆలోచించాలి' అనుకున్నాను.

నా కంటి చికిత్సను గురించి వారిద్దరూ పోట్లాడు కున్నారు. అసలే నాకళ్ళవెంబడి నీరు కారుతోంది. ఇక ఈ సంఘటనతో నాకళ్ళ వెంబడి విరామం లేకుండా అశ్రు ధార స్రవిస్తూనేవుండేది. వారిద్దరిలో ఎవరూ దీని వాస్తవ కారణాన్ని వూహించలేకపోయారు.

నా భర్త కాలేజికి వెళ్ళారు. ఒకరోజు సాయంత్రము అకస్మాత్తుగా నా అన్నగారు ఒక డాక్టరును తీసుకవచ్చారు. డాక్టరు పరీక్షించి అన్నారు—'వైద్యము సరిగా లేదు. ఇలాగే అశ్రద్ధచేస్తే కళ్ళుపోయినా ఆశ్చర్యపడనవసరంలేదు.' డాక్టరు మందు రాసియిచ్చి వెళ్ళారు. అన్నయ్య వెంటనే మనిషిని పంపి మందు తెప్పించారు.

డాక్టరు వెళ్ళిపోయిన తర్వాత నేను అన్నయ్యను వేడుకున్నాను — 'అన్నయ్యా, నేను మీ కాళ్ళమీద పడ తాను. వారి చికిత్సకు ఆటంకము కలిగించకండి.'

చిన్నప్పటినుంచీ అన్నయ్యంటే నాకు అమితభయం. ఆరోజున ఎలా ధైర్యంగా ఈమాట చెప్పగలిగానో నా కిప్పటికీ ఆశ్చర్యంగానే వుంది. నాభర్తకు తెలియకుండా

మీరు చేయించే చికిత్స అశుభానికి దారితీయడంతప్ప ఇంకేమీ పరిణామముండదని నేను భావించాను. నా ఈ వ్యతిరేకత అన్నగారికి ఆశ్చర్యం కలిగించింది. చాలాసేపటివరకు స్తబ్ధులై వూరుకున్నారు. బాగా ఆలోచించి చివరికిలా అన్నారు-- 'సరే. ఇహ నెప్పుడూ డాక్టరును పిలుచుకురాను కాని ఈ మందు జాగ్రత్తగా వాడుతూవుండు.' మందు వాడే విధము కూడా తెలియజేసి వెళ్ళిపోయాడు.

నాభర్త కాలేజీనుంచి తిరిగిరాకపూర్వమే మందు సీసా, డబ్బా, పిల్లరూ, అన్నీ పట్టుకెళ్ళి వాకిట్లో నూతిలో పారవేశాను.

అన్నయ్యతో పోట్లాడిన తర్వాత నాభర్త ద్విగుణీకృతోత్సాహముతో నాకు చికిత్సచేస్తున్నారు. వుదయం, సాయంత్రము, రెండువేళలా మందులుమార్చి యిస్తున్నారు. కళ్ళపైన పట్టీలు వేస్తున్నారు. కళ్ళజోడు పెట్టుకుంటున్నాను. రోజూ కళ్ళల్లో బొట్లుబొట్లుగా మందు వేస్తున్నారు దుర్గంధముకొట్టే చేపనూనెకూడ త్రాగించారు. ఏమితిన్నా, త్రాగినా, లోపలనిలచిపోక డోకు వచ్చేస్తోంది. అయినా అన్నీ సహించాను. ఆయన నన్నడిగేవారు-"నీకిప్పుడెలావుంది.నాకు బాగానేవుంది ఆరోగ్యం కుదుటపడుతోంది. అని జవాబిచ్చే దాన్ని. శరీరంలోకూడా సుఖంగా ఉన్నట్లు అనుకోవడానికి ప్రయత్నించే దాన్ని. ఎప్పుడైన నీరు కారేప్పుడు 'ఈనీరు కారిపోవడమే మంచిది' కారడము ఆగిపోయి ఇప్పుడు "ఇహ నయమై పోయినట్లే" అని భావిస్తుండేదాన్ని.

కొన్నిరోజుల తర్వాత పోటు సహించలేకపోయాను. కళ్ళు మసకగా కనిపిస్తున్నాయి. తలనొప్పి బాధ భరించలేక పోయాను. నాభర్తకూడ లజ్జితులవుతున్నారు. ఇప్పుడు డాక్టరును ఎలా పిలుచుకురావాలి అనేది వారిముందు ఒక పెద్ద ప్రశ్నయి కూర్చుంది.

"అన్నయ్య సంతృప్తి కొరకైనా ఎవరైనా డాక్టరుకు చూపించండి. ఆరోజున ఆయనకు కోపం వచ్చింది. నా మనసు బాధ పడుతూంది. ఎలాగైనా మీరే చికిత్స చేస్తారు గదా! మీరు సలహాతీసుకోడానికి అభ్యంతర మేముంటుంది? అని నేను వారి నడిగాను, వారు దానికి అంగీకరించారు.

ఆరోజే ఒక ఇంగ్లీషు డాక్టరును ఇంటికి తీసుకు వచ్చారు. వీరిద్దరిమధ్య ఇంగ్లీషులో సంభాషణ జరిగింది. నాకు ఇంగ్లీషు అర్థం కాకపోయినా ఆయన నా భర్తను చీవాట్లు పెట్టారని అర్థంచేసుకున్నాను. ఆయన తలవంచుకుని మెదలకుండా నిలబడే వున్నారు.

డాక్టరు వెళ్ళిపోయిన తర్వాత నే నాయన చేయి పట్టుకుని అన్నాను, ఎక్కడినుంచో అనాగరిక తెల్లగాడిదను పట్టుకవచ్చారు. "ఎవరైన మన దేశీయుడిని తీసుక రాలేక పోయారా ? నాకంటి వైద్యము మీకంటే ఆ ఇంగ్లీషు డాక్టరు కెక్కువ తెలుసా?"

"ఆపరేషను చేయించాల్సి వుంటుంది" అన్నారాయన సందేహిస్తూ. నేను కొంచెం కోపం చూపిస్తూ అన్నాను--- "ఆపరేషను చేయాలని మీకు ముందే తెలుసు. కాని దాచి

వుంచారు. నేను భయపడతానని మీ రనుకున్నారా!"

ఆయన సందేహం తొలగిపోయినది. "ఆపరేషన్ పేరు వినగానే భయపడే వీరులు చాలామంది వుంటారు" అన్నారాయన.

నేను వేళాకోళంగా అన్నాను. "పురుషుల పౌరుషం స్త్రీల ముందే."

అప్పుడే ఆయన ముఖంపైన చిన్నపోయిన లక్షణాలు కనిపించినయ్. ఆయన అన్నారు—"నువ్వు చెప్పింది వాస్తవమే. పురుషులు వట్టి అహంకారపరులు."

ఆయన గంభీరతను వుఫ్ మని వూదివేస్తూ మళ్ళీ అన్నాను. "నా అహంకారము విషయంలో కూడ మీరు మా స్త్రీలను జయించలేరు. చివరకు ఈ విజయమూ మాదే."

ఇంతలో మా అన్నయ్య వచ్చారు. ఏకాంతముగా ఆయనతో చెప్పాను. "అన్నాయా ఇప్పుడివరకు మీరిప్పించిన మందే వాడుతున్నాను కళ్ళు కొంచెం బాగుపడినయ్. కాని పొరపాటున ఒకరోజున త్రాగేమందు కళ్ళకు వాడాను. కళ్ళమందు త్రాగివేశాను. ఇప్పుడు డాక్టరు ఆపరేషను చేయాలంటున్నారు."

"నీ భర్త చికిత్స చేస్తున్నాడనుకున్నాను. ఆరోజు కోపంతో మళ్ళీ ఇక్కడికి రాలేదు" అన్నారాయన.

నేను—"చాటుమాటుగానే నామందు వాడుతున్నాను. ఆయన కోపపడతారేమోనని ఈవిషయం తెలియనీయలేదు'

స్త్రీజన్మమెత్తిన తర్వాత అబద్ధమాడక తప్పదు. ఈ అబద్ధాలకు హద్దూ పద్దూ వుండదు. అన్నగారి హృదయమూ బాధపడకూడదు. భర్తకీర్తి అలాగే నిలచివుండాలి. రెండూ నాకు తప్పనిసరే. తల్లిగా బిడ్డల్ని లాలించాలి. పాలించాలి, భార్యగా భర్తను సంతోషపెట్టాలి. స్త్రీ ఇన్ని రకాలుగా కపటనాటక మాడాలి.

ఈ కపటనాటకము వల్లనే చివరికి నేను నా భర్త, అన్నయ్య కలయకకూడ అంధత్వము రాకముందు చూడగలిగాను "చాటుమాటుగా చికిత్స చేయించడము చేతనే నాకీ దుర్గతి గలిగిందని" అన్నయ వూహించారు. తాను ముందే మూ అన్నయ చెప్పినట్లు వింటే ఇలా జరిగి వుండేదికాద"ని ఆయన తలచారు. ఈ రెండు వ్యధిత హృదయాలు పశ్చాత్తాపముతో ఒకరినొకరు క్షమాపణ కోరుకుంటూ సన్నిహితమయినాయి. నా భర్త, అన్నయ్య సలహాలు తీసుకుంటున్నారు. అన్నయ్యకూడా, నా భర్త వుద్దేశ్యాలనే విశ్వసించి వూరుకుంటున్నారు.

ఇద్దరి సలహాల ననుసరించి ఒక రోజొక ఇంగ్లీషు డాక్టరు వచ్చి నా ఎడమకంటికి ఆపరేషను చేశారు. బలహీనతవల్ల నాకన్ను బాధకు ఓర్చుకోలేకపోయింది. అకస్మాత్తుగా వున్న కాస్తచూపుకూడ క్షీణించిపోయింది. ఆతర్వాత కుడికన్ను కూడ నెమ్మది నెమ్మదిగా అంధకారావృతమై కనిపించడంలేదు చిన్నతనంలో వివాహ సమయాన మొదటిసారిగా నా జీవితంలో కనుపించిన ఆ కారుణ్య సుందర

మూర్తి శాశ్వతంగా నా దృష్టికి కనిపించకుండా పోయింది.

ఒకనాడు నా ప్రాణనాథుడు నా మంచముమీద కూర్చుని అన్నారు—"ఇక నిప్పుడూ నేను నా బడాయి చెప్పుకోను-నీ కళ్ళు నేనే పోగొట్టాను."

ఆయన కంఠము రుద్ధమయింది. చేతులతో తడుము కుంటూ ఆయన కుడిచేయి పట్టుకున్నాను. "మీరు, మీ వస్తువు తిరిగి తీసుకున్నారు. నా కళ్లు డాక్టరు పోగొట్టినట్ల యితే నాకు చాలా బాధకలిగేది. పోవలసివున్న ఈ నా నేత్రాలు ఎటువంటి ప్రయత్నం చేసినా పోకనిలచివుంటాయా మీ చేతిలో పోయినందుకు నాకు చాలా సంతోషముగా వుంది. రామచంద్ర ప్రభువు దైవాన్నారాధించడానికి ఒక పూజా పుష్పము తక్కువయిందట. ఆయన తన నేత్రాన్ని తీసి కమలముగా కైంకర్యము చేయడానికి పూనుకున్నారు. నేను నా దైవానికి నా దృష్టిని అర్పించుకున్నాను. ఇంత కంటే నాకు మహద్భాగ్యమింకేమికావాలి! మీ కండ్లకు అమితానందము కలిగించే విషయాలు నాకు తెలియజేయండి. అవి మీ నేత్రాలతో చూచిన ప్రసాదముగా భావించి నా హృదయంలో చిరస్థాయిగా నిలిపి వుంచుకుంటాను.

నేను ఇన్నిమాటలు చెప్పేదాన్నికాదు. అసలు అలా చెప్పవసరంకూడ లేదు. మనస్సులో యీవిషయాలునన్ను కలవరపరచినయ్. అప్పుడప్పుడు అశాంతితో నా హృదయం వికలమవుతూంది. అన్ని విధాల సుఖ, భోగభాగ్యాల ననుభ వించే సౌభాగ్యము నాకిక లేదని నిర్భాగ్యజీవినని వూహించి

నామనసు పరితాపము చెందుతుండేది. అప్పుడు నా హృదయం పవిత్రభావాల వూహించుకొని పూరడిల్లుతుంది. శాంతి, భక్తి భావముల నుద్దీపింపజేసుకొని దుఃఖాలకతీతముగా వుండాలని నా హృదయం ప్రయత్నించింది. కొంచెం కొంచెం ఇట్లా పూరడిల్లినా, నా హృద్గదభావాలు ఆయనకు వినిపించే సదవకాశం లభించలేదు. ఆయన అన్నారు — "కుముద్" నా మూర్ఖత్వంవల్ల నీకు అపార కష్టం కలిగించాను. దీనికి ప్రతిఫలము నేనేమీ ఇవ్వలేను. నీకు నేత్రములేని కొరత దీర్చడానికి ఎప్పుడూ నీకు తోడు నీడగా వుంటాను" "అలా అనకండి మీ గృహాన్ని గుడ్డివాళ్ళ ఆసుపత్రిగా వుంచకండి. రెండవ వివాహం చేసుకోనిదే నేనూరుకోను" అన్నాను.

ఎందుకు మళ్ళీ పెళ్ళి చేసుకోవాలో చెప్పకముందే నా కంఠనరవరుద్ధమై పోయింది కొంచెం దగ్గి, దుఃఖము దిగమ్రింగి, నేను చెప్పకముందే ఆయన అన్నారు —"నా మూ నేను మూర్ఖుణ్ణి, దాంభికుణ్ణి కాదు. నిన్ను గుడ్డిదాన్ని చేసిందే కాకుండా నిన్ని అంధకారకూపంలో వదలి మళ్ళీ పెళ్ళి చేసుకోను, ఆ కృష్ణభగవానుని మీద ఒట్టువేసి చెబుతున్నాను. ఒట్టుమారితే నేను బ్రహ్మహత్యా, పితృహత్యా ఘోరనరకాల ననుభవిస్తును."

ఆయన వింతపెద్ద ఒట్టు పెట్టుకోనిచ్చేదాన్ని కాదు, మధ్యలోనే ఆపివుంచేదాన్ని. కాని నా నేత్రద్వయము హృదయంలో వుప్పొంగివచ్చే దుఃఖముతో అశ్రుధారల ప్రవహింపజేసేటట్లున్నవి. వాటిని ఆపుకొనడానికే ప్రయ

త్నిస్తున్నాను. నా నోటినుండి మాట పెగలలేదు. ఆయన మాటలువిన్న నాకు పరమానందము కలిగింది. ఆ ఆనంద వుద్వేగాన్ని ఆపుకోలేక తలగడలో ముఖం దాచుకుని యేడ్చాను. నేను గుడ్డిదాన్ని — అయినా ఆయన నన్ను వదలి పెట్టరు. దుఃఖాన్ని హృదయంలో దాచి వుంచుకున్నట్లే నన్ను తనహృదయంలోపదిలపరచుకుంటారు. నాకింత అదృష్టం అవుసరంలేదు. అయినా మనసు స్వార్థపరురాలు కదా !

జోరుగా వర్షము కురిసి వెలిసినట్లు అశ్రుప్రవాహము ప్రవహించి ఆగిపోగానే ఆయన హృదయాన్ని దగ్గరకు లాక్కుంటూ అన్నాను. "ఇంతపెద్దపట్టు ఎందుకుపెట్టారు ? అయ్యో ! నా సుఖంకోసం మిమ్మల్నెందుకు వివాహం చేసుకోమన్నాను ! సవతితో కండ్లులేని కొరత తీర్చుకుని సుఖించా లనుకున్నాను."

ఆయన అన్నారు— "పనికి దాసీదైనా సరిపోతుంది కుమూ ! పనికోసం ఒకదాసీని వివాహమాడి ఈ దేవితో సమానపీఠ మలంకరింపజేస్తానా ?" ఇలా అంటూనే నా ముఖం పైకెత్తి ముఖంపైన ముద్దిడుకున్నారు. ఆ ముద్దు నా మూడవ నేత్రాన్ని తెరిచింది. నేను దైవత్వాన్ని పొందినట్లుంది. మనసులోనే అనుకున్నాను — "ఇదే మంచిదయింది. బయట ప్రపంచానికి నేను గుడ్డిదానిగానే కనిపించినా, ఈ ఇంటికి గృహిణినై చక్కగా మెలగుతాను. అంతకంటే మిన్నయై దేవిగా పవిత్రభర్తకు మంగళప్రద

మైన కార్యాచరణతో సేవచేస్తాను. ఇహ అబద్ధాలు, కపట నాటకాలు గృహిణిగా వుంటూ అనుభవించే అనేక క్షుద్ర నైనాలు, వీటనన్నింటిని వదలి సర్వవిధాల పవిత్రత నొందాలి.

ఆ రోజంతా నన్ను నేనే నిందించుకున్నాను. దృఢ ప్రతిజ్ఞాబద్ధుడైన నా భర్త ఎప్పటికీ మళ్ళీ పెళ్ళి చేసుకోరని నాకు సంపూర్ణ విశ్వాసం కలిగింది. నేను ఆయన ముందు చేసిన ప్రస్తావన నన్ను మాటిమాటికి బాధిస్తోంది. నాలో ఒక నూతన దైవజ్యోతి వెలిగింది. అది పలికింది - "ప్రతిజ్ఞా బద్ధుడయి వుండటముకంటె వివాహము చేసుకుంటేనే నీ భర్తకు శ్రేయస్సు కలిగే రోజులుకూడ రావచ్చు" నాలోని పురాతన నారీరూపము జవాబిచ్చింది - "ఆయన ప్రతిజ్ఞ చేశారు. ప్రతిజ్ఞాభంగము కాకూడదు. దేవి పలికింది— "ఇందులో నీఆనందమే ముఖ్యమైనది కాదుగదా!" నాలోని మానవి - "నాకంతా తెలుసు ఆయన ప్రతిజ్ఞ చేశారు. మళ్ళీ తిరగడానికి..." మాటిమాటికి ఇదే మాట వుచ్ఛరించాను. దేవి క్రుద్ధయై మెదలకుండా వూరుకుంది. ఏదో భయంకర సందేహాంధకారం నాహృదయాన్నావరించింది.

పశ్చాత్తప్తుడైన నాభర్త దాసదాసీలను నా పరిచర్యలు చేయనీయడం లేదు. తానే నా పరిచర్యలు చేస్తున్నారు. చిన్నచిన్న విషయాలకుకూడ ఆయనమీద ఆధారపడి వుండడము మొదట్లో బాగానేవుండేది. ఆయన ఎప్పుడూ నాకు దగ్గర్లో వుండడమే దీనికి కారణం. కండ్లతో ఆయనను

చూడలేను. ఆయన నాదగ్గరే వుండాలనే తీవ్రకాంక్ష నాలో పెరిగిపోతోంది. ఇదివరకు నాకండ్లు మాత్రమే ఆయనను చూడగలిగేవి. ఇప్పుడు మిగతా అవయవాలుకూడ ఆయనను స్పృశించి ఆనందించే భాగ్యము లభించింది. ఎప్పుడైనా ఆయన ఎంత ప్రొద్దుపోయినా తిరిగి రాకపోతే ఏదో పోగొట్టు కొన్న దానివలె చేతులతో తడుముకొంటూ ఎంతసేపటికి పోగొట్టుకొన్న వస్తువు లభించనట్లు వెదుకతూనే వుండే దాన్ని. ఇదివరకు నాభర్త కాలేజికి వెళితే వచ్చేవేళకు కిటికీ తలుపు తెరచి ఆయన రాకకొరకు నిరీక్షిస్తూండేదాన్ని. ఆయన విహరించే ప్రపంచంలోనే నేనూ విహరించ నభిల షించేదాన్ని. ఆ ప్రపంచాన్నంతా నా కళ్ళకు కట్టి వుంచు కున్నాను. కాని ఇప్పుడు నాదృష్టిరహితమైన శరీరమంతా ఆయనకొరకు శోధిస్తోంది. ప్రపంచంతోపాటు నేను నిర్మించు కున్న ఆనకట్టలు తెగి కూలిపోయినవి. ఇప్పుడు ఆయనకూ నాకూ మధ్య గాఢాంధకార బంధురమైన కూపము తప్ప మరేమీ లేదు. ఆవలివడ్డు నుంచి ఈవలివొడ్డుకు ఆయన ఎప్పుడువచ్చి నన్ను కలుసుకుంటారు అనేదీ నా మనోవ్యధ. ఒకరెప్పపాటు ఆయనకు ఎడమైనా నేత్రజ్ఞానశూన్యమైన నా శరీరం ఆయనకొరకు తహతహపడుతోంది.

ఇన్ని కోర్కెలు, ఆకాంక్షలు, విశ్వాసభారము పంచివికావు. భర్తపైన స్త్రీభారము ఎప్పుడూ వుంటూనే వుంటుంది. ఈ అంధకారపు అంధత్వ భారముకూడ ఆయ నపై మోపడము సరికాదు. ఈ విశ్వవ్యాప్తమైన అంధకా రాన్ని నే నొంటరిగానే ఎదుర్కొంటాను.స్వయంగానే సహి

స్తాను. ప్రశాంతచిత్తముతో ప్రతిజ్ఞ చేశాను. "ఈ అనంత అంధకార పాశముతో నాభర్తను బంధించి వుంచను".

కొద్దిరోజులలోనే శబ్దగంధ స్పర్శలతో పనిచేయడం నేర్చుకున్నాను. ఇప్పుడు మొదటికంటె ఎక్కువ నేర్పుతో కొన్ని పనులు చేస్తున్నాను. ఈనేత్రదృష్టి మనకు సహాయం చేసేదానికంటే మన మనస్సులను వికలముచేసేదే ఎక్కువయని నాకు తర్వాత బోధపడింది. ఎంతవరకు మనకు మేలుకలుగు తుందో అంతకంటె మన నేత్రాలు ఎక్కువగా పరికిస్తుం టాయి. నేత్రాలు కాపలా కాస్తుండేప్పుడు మనకర్ణములు సోమరులై, వుండవలసినంత సూక్ష్మగ్రాహ్యములుగా వుండక తక్కువ వింటూ వుంటాయి. ఆ చంచల నేత్రాలు పోవడం వల్ల నాసర్వేంద్రియాలు అతిజాగరూకతతో శాంతిపూర్వ కంగా పనులన్నీ చేస్తున్నాయి.

ఇప్పుడు నాభర్త నేమీ పని చేయనీయడంలేదు. పూర్వం మాదిరిగానే ఆయన పరిచర్యలు చేయగలుగు తున్నాను నాభర్త అన్నారు-"నన్ను ప్రాయశ్చిత్తము చేసు కోనీయవూ!" "మీప్రాయశ్చిత్తమేమిటోనాకు తెలియదు. నా పాపభారము నేనుపెంచుకోకూడదు, అదే నాకు కావల సింది అన్నాను. "నోటిమాటగా ఆయనేమి అన్నప్పటికీ నేను ఆయనకు విశ్రాంతి కలిగించాను ఇందుకు ఆయనెంతో మనస్సులో సంతసించారు.

కొంతకాలానికి నాభర్త డాక్టరు పరీక్ష ప్యాసై కలకత్తానుండి నన్ను ఒకగ్రామానికి తీసుకువెళ్ళారు. మళ్ళీ

నేను నాతల్లి ఒడిలో కూర్చున్నట్లుందీ గ్రామంలో. ఎనిమిదేండ్ల ప్రాయంలో గ్రామంవదలి కలకత్తావెళ్లాను. ఈ పది సంవత్సరాలలో నా జన్మభూమి పల్లెప్రాంతం నామనసులో అస్పష్టంగా నిలచిపోయింది. కళ్ళున్నంతకాలము కలకత్తా పట్టణమున అనేకస్మృతులను తనచాటున నిక్షిప్త మొనర్చు కున్నది. కళ్ళుపోగానే కలకత్తా కేవలం నేత్రానంద మొనర్చె పట్టణమే. ఇంతకన్న వేరే విశిష్టత యేమీ లేదని పించింది. చిన్నప్పటి ఆగ్రామము గాఢాంధకార నిశీధాన మిలమిల మెరసే తేజోవంతమైన నక్షత్రమువలె నాముందర భాసించినది.

మార్గశిర మాసాంతాన మేము హాసిమపురము చేరాము. ఇది మాకు క్రొత్తచోటు. నలువైపులా ఎటువంటి ప్రకృతి వైచిత్రము వుందో నేను చూడలేకపోయాను చిన్న తనంలో చూచిన గ్రామీణసౌజన్యము, గ్రామ అనుభూతులు నా శరీరాన్నంతా అలుముకున్నవి. మంచుతో తడిసి దున్నిన చేలనుండి వీస్తున్న గాలిలో ప్రవహించే సౌరభము కంది ఆవాలచెట్ల పచ్చపచ్చని బంగారుకలశవర్ణపు పొల ములనుండి కమ్మని సువాసనవీస్తోంది. పశుకాపరుల గీతాలు, వంకర టింకర త్రోవలనుండి కిరుచుర్రు మంటూ వెళ్ళే బండ్లధ్వనులు నన్నుఆహ్లాద పరుస్తున్నవి. నా బాల్యజీవితపు స్మృతులు, భూతకాలపు అనుభూతులను నాలో మేళవింపజేసి నాకళ్లెదుట వాటిని సాక్షాత్కరింపచేస్తున్నట్లు నన్ను ముగ్ధ పరుస్తున్నై. నా గుడ్డితనము వాటికేమీ అడ్డము రాలేదు. మళ్ళీ నే నా బాల్యములో విహరిస్తున్నాను. ఒక తల్లిదమే

లభించలేదు. మిగతా అన్నీ లభించినట్లే. నా మనస్సులో ఈ దృశ్యాలన్నీ మెరసిన్నై. ముసలి అవ్వ తన కొద్దివెంట్రుకలన్నీ ఎండలో ఆరబెట్టుకుంటోంది. సాధుభజనదాసు కంపిత రాగ స్వరముతో పాడే వేదాంత కీర్తనలు ఎందువల్లనో ఈరోజు నాకు వినిపించలేదు. శీతాకాలపు మంచులో స్నానమాడి ఆకాశము మిలమిల మెరుస్తోంది. సంక్రాంతి పండుగ దగ్గిరపడింది. గ్రామీణ స్త్రీలు వడ్లు దంచుతూ రోకటి పాటలు పాడుతున్నారు. ఆనందంతో కనిపించే నా స్నేహితురాండ్రెక్కడ? సాయంత్రం కాగానే ఎక్కడినుండో శంఖ ధ్వని వినిపిస్తుంది. అమ్మ సంధ్యాదీపము తీసుకువెళ్ళి పూజ గృహములో పెడుతూందనిపిస్తూంది. తడిసినగడ్డి మండుతున్న వాసన, పొగలు నా హృదయంలో కమ్ముకున్నై. చెరువుకు ఆవలివొడ్డున వున్న విద్యాలంకారుని మందిరములో కంచు గంటలు ఖంగు ఖంగున మ్రోగుతూ వినిపించుతాయి. ఎనిమిది సంవత్సరాల బాల్యజీవనపు ఆనందసౌరభాన్ని ఎవరో నలువైపులా మరలా చిలికి చిందించినట్లుంది.

చిన్నతనములో చేసిన వుపవాసాలు, శివపూజలకై పుష్పములు సేకరించుట మొదలైనవన్నీ గుర్తుకొస్తున్నై. కలకత్తా వాతావరణము, రాకపోకల రణగొణధ్వనుల మధ్య బుద్ధినైజములోనే కొంత తేడావుండటము సహజమేకదా! గ్రామ జనుల భక్తిశ్రద్ధలు, సరళజీవితపు నైర్మల్యము ఇక్కడ పొసగవు.

ఒకనాటిసంగతి నాకు గుర్తు వస్తుంది. గుడ్డిదాన్ని అయిన తర్వాత ఒక గ్రామస్నేహితురాలు మా యింటికి

వచ్చింది. "క్షమూ-నీకేమీ నీభర్తపై కోపం రావడంలేదూ! నేనే నీస్థానంలో వుంటే భర్తముఖంకూడా చూచేదాన్ని కాదు అందామె. నేను అన్నాను - "అక్కా, ఆయన ముఖం చూచే అదృష్టం ఎప్పుడో పోయింది. ఈ పూడి పోయిన కళ్ళమీదే నాకు కోపం వస్తోంది. ఆయనమీద నాకెందుకు కోపం రావాలి!

ముందే జాగ్రత్తపడి నాకు చికిత్స చేయించలేదని నా స్నేహితురాలు లావణ్యకు నా భర్తమీద కోపము వచ్చింది. నాకుకూడ అలాగే కోపము కలగాలని ఆమె తలచింది.

"ప్రపంచంలో అనుకునో అనుకోకుండానో, తెలిసో తెలియకో, పొరపాటువల్లనో లేక భ్రాంతివల్లనో అనేకరకా లైన సుఖదుఃఖాలు వస్తూవుంటాయి. నీ మనస్సులో భర్తను బంధించి వుంచుకోగలిగితే దీనితోనే నీ మనసుకు వూరట కలుగుతుంది. క్రోధంలో అనవసరముగా ప్రేలినందువల్ల జీవితమంతా కోపతాపాలుతోనే ముగుస్తుంది. గ్రుడ్డిదాన్నై నందు కోపంక వస్తున్నాను. పైగా భర్తను నొప్పించి ఇంకా దుఃఖభారమెందుకు పెంచుకోవాలి! అని ఆమెకు చెప్పాను. కాని ఈపూర్వకాలపు మాటలు విని లావణ్య కోపగించుకుంది. తనను అవమానించినట్లు విసుగుజెంది విస విస వేగంగా వెళ్ళిపోయింది.

నేనలా ఆమెకు సమాధాన మీయకుండా వూరుకుంటాను. ఆమె మాటల్లో విషముంది. అయినా లావణ్య

నోట వెలువడిన క్రోధవాక్కులు నా హృదయంలో రెండు మూడు నిప్పురవ్వలు వెదజల్లకుండా వుండలేదు. నేను వాటిని కాలిక్రింద రాశి చేశాను. అందువల్ల నా అరికాళ్ళల్లో రెండుమూడు బొబ్బలు లేచినై.

గ్రామములోకి వచ్చిన తరువాత మందాగాలు, జాజిమల్లెలు, మొదలైన పూలతో శివుని అర్చించడం ప్రారంభించాను. నా బాల్యము మళ్ళీ నాలో జాగృతమైనట్లే భగవంతునియెడ సంపూర్ణమైన భక్తిశ్రద్ధలు సముజ్జ్వలమై ప్రభాసించినవి. నా దేవత నా హృదయాన్ని, మాగృహస్థ జీవితాన్ని పరిపూర్ణత నొందించారు. నేనాయన పాదయుగ్మ మున శిరమువంచి మోకరిల్లి అన్నాను - "ఓ దేవా! కళ్ళుపోవడం మంచిదే అయింది. నువ్వు నావాడవు."

ఈ మాటలో ఎంతగర్వముంది? నేను నీదానను అనే అంతవరకే నాకు అధికారముంది. ఏదో ఒకరోజున ఆయనే ఈ మాట నానోటినుండి చెప్పించుకొనక మానరు. నేనెల్ల ప్పటికి ఆయన దానిని గానే వుంటాను.

కొంతకాలము జీవితము బాగా ఆనందముగానే గడి చింది. అటు డాక్టరుగా వుంటూ నాభర్త మంచి పేరుప్రతి ష్టలు సంపాదించుకుంటున్నారు. కొంత డబ్బుకూడ సంపా దించారు. కాని డబ్బు మంచిదికాదు అది మనసును లొంగ తీస్తుంది. హృదయంపైన పొర కప్పివేస్తుంది. హృదయ రాజ్యములో అది తన సుఖాన్ని తానే సమకూర్చుకుం టుంది. కాని డబ్బే సుఖాన్ని సమకూర్చే బాధ్యత వహించి

నప్పుడు మనస్సు కింకేమీ పని మిగిలియుండదు. ఇదివరకటి మానసికానందానికి బదులు ఇప్పుడు అనేక రకాలైన వస్తు వాహనాదికములు ఇంటినిండా నిండి వుంటాయి. అప్పుడు సుఖానికి బదులు వస్తువాహనాలే లభిస్తాయి.

అంధులలో వూహాశక్తి ఎక్కువగా వుంటుంది. ఆర్థిక ఔన్నత్యముతోపాటు నాభర్తలో క్రమక్రమంగా మార్పు వస్తూంది. యౌవ్వనారంభములో, న్యాయము, అన్యాయము, ధర్మము, అధర్మముల గురించి ఆయనలోవున్న సహానుభూతి, ఆదర్శభావాలు, ఇప్పుడు రోజురోజూ నశించి పోతున్నాయి. నాకిప్పటికి బాగా జ్ఞాపకం. ఆరోజుల్లో ఆయన అంటూండేవారు—జీవనాధారానికా ? నేనీ డాక్టరు కోర్సు చదువుతున్నాను, దీనితో ఎంతోమంది బీదలకు సహాకరించవచ్చు. ఇదివరకు బీదల ఇండ్లలో ముందుగా డబ్బు యివ్వనిదే వైద్యముచేయని డాక్టర్లను ఆయన అస హ్యించుకునేవారు.

ఇప్పుడలాంటిభావాలు వారిలో లేవు. ఒక బీదస్త్రీ తన ఏకైక పుత్రికను రక్షించమని కాళ్ళమీదపడి బ్రతిమా లింది. అయినా ఆయన నిర్లక్ష్యముగా త్రోసిపుచ్చారు. చివరకు నేను స్వయముగా ఒట్టుపెట్టుకొని ఆయునను పంపిం చాను. వెళ్ళికూడ సరిగా వైద్యము చేయకుండానే తిరిగి వచ్చారు. బీదతనములో ఇలా అన్యాయముగా సంపాదించే వారిని ఎంత నీచముగా చూచేవారో నాకు బాగా గుర్తు వుంది. ఇప్పుడు బ్యాంకులో బాగా డబ్బు నిలవవుంది. ఒక

ధనికుని గుమాస్తా రెండుమూడు రోజులనుండి రహస్య
మంతనాలు జరుపుతున్నాడు; ఒకరోజు ఏమి ఆలోచించు
కున్నారో నాకు తెలియదు. నాభర్త నావద్దకువచ్చి
కూర్చున్నారు. ఎంతో ఆనందముతో-ఏవేవో విషయాలు
చెపుతూ పోతున్నారు. నా హృదయంలో ఈయనేదో
కలుషిత భావాలు వెల్లడించడానికే ఈ వల పన్నుతున్నా
రనిపించింది.

గుడ్డిదాన్ని కాకపూర్వము చివరిసారి చూచిన ఆ
నాహృదయ దేవత ఈ నాడెక్కడ! ఆయన నా దృష్టిరహిత
రెండు నేత్రాలమధ్య చుంబించి నన్ను ఆరాధ్యదేవి పీఠాన
అలంకరింపజేశారు.

ఒకేరోజున వీచే ప్రళయతుపానుగాలికి - పడిపోయిన,
మళ్ళీ నిలద్రొక్కుకునే సాహసముండేది. నా దేవత మళ్ళీ
నన్నారాధించే అవకాశముండేది. కాని ఈ హృదయం ప్రతి
దినము కఠోరమై, తన మానసికభావాలు అణచివేసి వాటి
పైన స్వైరవిహారము సలుపుతోంది. ఇక దీనికి ప్రతీకార
మేమిటి! నాకేత్రోవ తోచుటలేదు.

నేను గుడ్డిదాన్ని.. ప్రపంచ జ్ఞానరహితమైన నా
హృదయ కుహారములో యావత్ప్రేమ, పరిపూర్ణ భక్తి,
అఖండమైన శ్రద్ధలున్నాయి. నా దేవతను హృదయమంది
రములో మొట్టమొదటిసారిగా చక్కగా అలంకరించుకుని
పూలతో పూజించాను. ఆ పూలపైన ఇంకా మంచు బిందు
వుల తడి యారిపోలేదు నాభర్త ఆ తడియారని పూలనువా

సనలను వదలి డబ్బుకోసమై ఈ ప్రపంచపు మరుభూములలో అదృశ్యులైపోతున్నారు. నేను సర్వదావిశ్వసించి నాసర్వస్వ మనుకుని, అన్ని సంపదలకంటె శ్రేష్ఠమనుకున్న నా భర్త దూరాన్నుంచే నవ్వుతో తొలగిపోతున్నారు. చిన్నప్పటి నుండి ఇద్దరమూ ఒకేమార్గాన పయనించాము. కాని మా ఇద్దరి మార్గాలు ఎప్పుడు విడిపోయినవో మేము గుర్తించనే లేదు. ఇప్పుడు పిలచినా ఆయననుండి నాకు జవాబుకూడ లభించడములేదు.

బహుశా అంధత్వమువల్లనే ప్రతి విషయాన్ని నేను రెట్టించి ఆలోచిస్తున్నానేమో! కళ్ళుంటే ఇంత బాధనవడే దాన్ని కాదేమో!

ఒకరోజు నా భర్త నాకిదే సమాధానమిచ్చారు. ఆ రోజు వుదయం ఒక ముసలిరైతు తన మనుమరాలికి కలరా వచ్చిందని సాయము చేయవలసిందని బ్రతిమలాడుతున్నాడు. "బాబూ నేను బీదవాడ్ని. భగవంతుడు నీకు మేలుచేస్తాడు భగవంతుడి మేలుతో నాకేమీ నిండదు. నువ్వుమాత్ర మేమిచేయగల్గుతావు. వెళ్ళు" ఈమాటలు నాభర్తనోట విని నేను చాలా బాధపడ్డాను. "నా కళ్ళ దృష్టితోపాటు నా చెవులుకూడ ఎందుకువినబడకుండా చేయలేదుభగవంతుడా! అనుకున్నాను "అయ్యో భగవంతుడా" అంటూ దీర్ఘ నిట్టూర్పు విడిచి ఆరైతు బైటకు వెళ్ళిపోయాడు. దాసీతో కబురంపి ఆ ముసలిరైతును వెనుకద్వారాన పిలిపించాను "తాతా! ఈ డబ్బు తీసుకువెళ్ళి నా భర్త నాశీర్వదించి

హారీసు డాక్టరువద్ద నీ మనుమరాలికి చికిత్స చేయించుకో" అని కొంత డబ్బిచ్చి పంపివేశాను.

కాని ఆ రోజు ఏమిచేయాలో యేమిటో నాకేమీ పాలుపోలేదు. మధ్యాహ్నము నిద్రనుండి లేచి ఆయన వడిగారు. "ఇవాళ ఎందుకింతవిచారముగావున్నావు" ఇదివరకు అలవాటుగావచ్చే! ఏమీలేదే, ఏమీలేదు. అనే మోసపు జవాబు ఇవ్వడం నా నోటినుండి వెలువడలేదు. స్పష్టంగా నాభావం వెల్లడించాను—"సీతో ఎంతోకాలంనుండి చెప్పాలనుకుంటున్నాను. కాని చెప్పవచ్చేసరికి మరచిపోతున్నాను. సరిగా చెప్పగలనో లేదో యనే సందేహంవల్ల కూడ అలా చేయలేకపోయాను. నువ్వు నీ మనస్సులో అర్థం చేసుకునే వుంటావు మన వెనుకటి జీవితపు ఆదర్శాలు మనలో యిప్పుడు లేవు."

ఆయన నవ్వుతూ అన్నారు—"మార్పు ప్రకృతి సహజము" నేను—"ధనము, రూపము, యౌవనము అన్నీ ఇవన్నీ మార్పు చెందడము సహజమే. కాని మార్పుచెందని దేదీలేదా? కొంచెం గంభీరముగా ఆయన జవాబిచ్చారు. "మిగతా అందరు స్త్రీలులేమికి బాధపడుతూ వుంటారు. తమభర్త సంపాదించడం లేదని రోదిస్తారు, నువ్వు ప్రపంచంలో ఎక్కడాలేని దుఃఖాలు ఆకాశంనుండి పట్టుకొస్తావు"

నా అంధత్వము సత్యపు అంజనము నా కాళ్ళకు పూసి-నన్ను మార్పుచెందే ప్రపంచాన్నుండి చాలాదూరం తీసుకువెళ్ళిందని, అందరి స్త్రీలమాదిరికాదని, నాభర్తనన్నిప్పటికీ అర్థంచేసుకోజాలరని నాకప్పుడు బోధపడింది.

ఆరోజే మావూరినుండి మామేనత్తగారొకామె విచ్చేసింది. మేమిద్దరమూ ఆమెకు నమస్కరించాము. ఆమె మమ్మల్ని ఆశీర్వదించకపూర్వమే ఇలా ప్రారంభించింది-- "అమ్మాయ్ నువ్వెలాగూ గుడ్డిదానివైనావు. ఇప్పుడు మా అవినాశబాబు నీతో ఎలా కాపురం చేస్తాడు? రెండపపెళ్ళి చేయకూడదూ!" "నిజమే అత్తగారూ! మీరే ఏదైనా సంబంధం చూడండి" అని మావారంటే బాగానే వుండేది. కాని ఆయన మొహమాటపడుతూ అన్నారు---"అత్తయ్యా మీరెప్పుడూ ఇలాగే తలాతోకలేని మాటలు మాట్లాడుతూంటారు."

అతగారు అన్నారు---"నేనేమైనా తప్పు మాట్లాడానా?" నేను నవ్వి అన్నాను--"అత్తగారూ! మీరు బలేమనిషి సలహా తీసుకుంటున్నారులే. జేబు కత్తిరించబోతున్నవారినే ఎవరూ సలహా అడుగరు.

అత్తగారు పలికింది--"నిజమే, సరే అని అవినాశబాబూ మనమిద్దరమూ ఏకాంతముగా సంప్రదించుకుందాం. గౌరవ కుటుంబాల్లో ఎంతమంది సవతులుంటే అంత భక్తిగౌరవం పెరుగుతూంటుంది. మా అబ్బాయి ఈ వైద్యం చేయకపోతే మాత్ర మేమిపోతుంది అతనికి డబ్బుకేమీ కొదువవుండదు. డాక్టరు చేతిలో ఎవరైనా చచ్చిపోతే ఎవరూ ఫీజుకూడ ఇవ్వరు. కాని భగవంతుడు శాపము పెట్టినట్లు పెద్ద పెద్ద కుటుంబాల్లో భార్యలు చచ్చిపోరు. వాళ్ళు బ్రతికివున్నందువల్లకూడ భర్తలకే ఎక్కువ మేలు కలుగుతుంది.

రెండు రోజుల తర్వాత నాభర్త అత్తయ్యతో అన్నారు—"అత్తయ్యా తనవాళ్ళలాగే చూసుకుని ఈమెకు సహాయం చేసేందుకెవరైనా మంచియింటిఅమ్మాయివుంటే చూడు. ఈమెకు యేమీ కనపడక బాధపడుతోంది. ఎవరైనా తోడువుంటే నాకు నిశ్చింతగా వుంటుంది.

నేను గుడ్డిదాన్నయిన ప్రథమదినాలలో ఆయన ఇలా అని వుంటే బాగానే వుండేది. ఇప్పుడు ఇంటి పనులలోగాని, నా స్వవిషయంలోగాని నాకెట్టి బాధలేదు. అయినా వ్యతిరేకించకుండానే మెదలకుండా వూరుకున్నాను. అత్తయ్య అంది—"సరే. అలాగే, మా అక్కగారి అమ్మాయివుంది. చాలా అందంగా లక్ష్మిలా వుంటుంది, స్వభావానికికూడ చాలా మంచిది, పిల్ల బాగా పెరిగింది. సరియైన వరుడు దొరకక వాళ్ళు సతమత మవుతున్నారు. నీకిచ్చి చేయడానికేం! వాళ్లు కళ్ళ కద్దుకొని చేసుకుంటారు."

ఆయన కొంచెం ఆశ్చర్యం ప్రకటిస్తూ అన్నారు—"వివాహం సంగతికాదు అత్తయ్యా!" అత్తయ్య అంది—"వివాహం చేసుకోకుండా మంచి యింటి అమ్మాయి మీ యింటికి వచ్చివుంటుందా'"

"ఆమాట నిజమే; నా భర్త యేమీ జవాబీయలేకపోయారు. నాఅంధత్వ అంధకారములో నేను పైవంకచూచి భగవంతుడ్ని ప్రార్థించాను—"ఓ భగవంతుడా! నాభర్తను రక్షించు."

కొన్ని రోజులతర్వాత ఒకరోజు ఉదయం పూజాగృహంనుండి నేను బయటికి వస్తున్నాను. అత్తయ్య

ఎదురుపడి అంది-"మా అక్కగారి అమ్మాయి హేమాంగిని గురించి నీకు చెప్పానుచూడు అది ఇవాళవచ్చింది. హేమూ ఈమె నీ అక్కగారు. నమస్కరించు.

ఎక్కడినుంచో అప్పుడే ఆయన కూడ వచ్చారు. అపరిచిత స్త్రీని చూచి అవతలికి వెళ్ళిపోయారు.

అత్తయ్య—"అవినాశ్ ఎక్కడికి వెళ్తున్నావు!"
నాభర్త—"ఈమె ఎవరు?"

అత్తయ్య—"ఇదే మా అక్కయ్యగారి అమ్మాయి హేమాంగిని."

ఎప్పుడు వచ్చారు? ఎవరితో కలిసివచ్చారు? ఎందుకు వచ్చారు? అనేక ప్రశ్నలు కురిపించి తన ఆశ్చర్యం వ్యక్తపరిచారు. నేను మనసులోనే అనుకున్నాను---"మీకు ఆడే నాటకం నా కవగతమయింది. ఇంతమోసం దేనికి? ఇంత దొంగతనమా? ఎరగనట్లు అబద్ధాలు దేనికి? అధర్మముగా వ్యవహరించదలిస్తే అలాగే కానీయ్. నీలోని అశాంతిని రెచ్చగొట్టు, నాకోసం ఇంత మోసం కల్పించ నవసరములేదు"

హేమాంగిని చేయిపట్టుకొని నాపడకగదిలోనికి తీసుకు పోయాను. ముఖాన చేతులతో తడిమిచూచాను. అందముగా వుండవచ్చునని వూహించుకున్నాను. వయస్సు కూడా పదునాలుగు, పదునైదు సంవత్సరాలకు తక్కువ ఉండదు.

ఆ బాలిక హఠాత్తుగా బిగ్గరగా నవ్వింది. "ఇలా తడుము తున్నావేమిటి ? భూతాన్నేమీ వదలించడము లేదుకదా ? అంది.

ఆ సరళ స్వచ్ఛందమైన నవ్వుతో మా యిద్దరి మధ్య వ్యాపించిన కారుమేఘాలు పటాపంచలైపోయినై. భుజము పైన నాకుడిచేయి వేసి, నేను నిన్ను చూస్తున్నాను చెల్లీ." అన్నాను. ఆ కోమల ముఖంపైన మళ్ళీ నాచేయి వేసి సవ రించాను.

"చూస్తున్నావా" మళ్ళీ నవ్వుతూ అంది – "నేను తోటలో వంకాయనో, సొరకాయనో కాదుగదా ఎంత పెరి గిందో తడిమి చూడటానికి."

హేమాంగిని నేను గుడ్డిదాని ననే సంగతి బహుశా తెలిసివుండదని నా కప్పుడు గుర్తు వచ్చింది.

"నేను గుడ్డిదాన్ని చెల్లీ" అన్నాను.

విని ఆశ్చర్యపడి గంభీరముగా కొంచెముసేపు వూరు కుంది. తన విశాల కుతూహల స్వర్ణమైన తరుణ నేత్రాలలో నాగుడ్డితనాన్ని, నా ముఖాన్ని నిశ్చలంగా పరికిస్తోం దని పించింది. తర్వాత అంది–"అందుకేనా పిన్ని పిలిపించింది. "మీ పిన్నే స్వయంగా వచ్చింది" జవాబిచ్చాను.

ఆబాలిక మళ్లీ నవ్వుతూ అంది—"ఓహో దయ తలచి వచ్చి వుంటుంది అయితే ఈ దయామయి అంత త్వరలో ఇక్కడినుండి ఇంకెక్కడికీ పోదు. అయితే నాన్న గారు నన్నిక్కడికెందుకు పంపించారు?"

ఇంతలో అత్తయ్య వచ్చింది. ఇప్పటివరకు నాథ ర్తతో మాట్లాడుతూవుంది. అత్తయ్య గదిలో అడుగు పెట్టగానే హేమాంగిని అడిగింది-"పిన్నీ! మనవూరు ఎప్పుడు వెళ్దాం?"

అత్తయ్య అంది - "ఆహాహా! వచ్చి కాసేపైనా కాలేదు. అప్పుడే ఎప్పుడు వెళ్దాం అంటూంది, ఇంత చంచలు రాలినెక్కడా నే చూడలేదమ్మా" హేమాంగిని - "పిన్నీ, సరిగా విను. నువ్విక్కడినుండికదలేటట్టులేవు. ఇది సీయిల్లేగా ఎంతకాలం వుండాలనుకుంటే అంతకాలం వుండిరా, నేను త్వరగ పోవాలి" తర్వాత నాచేయి పట్టుకుని అంది- నేను చెప్పిందిరైటుగా వుందా అక్కా, మీరెవరోకూడ నేను సరిగా ఎరగను."

ఈ సరళ ప్రశ్నకు సమాధాన మీయకుండా, నేనా పిల్లను నాహృదయానికి దగ్గరగా లాగుకున్నాను. అత్తయ్య ఎంతజబర్దస్తీ మనిషియైనా ఈపిల్లను వంచుకోలేకపోయింది, కోపగించుకోకుండా ప్రేమతో బుజ్జగించి హేమాంగినిని వశ పరచుకోవాలనుకుంది. కాని హేమాంగిని దులిపి వూరుకుంది. అత్తయ్య ఇవి ప్రేమతో మాట్లాడేమాటలని త్రోసి పుచ్చింది. వెళ్ళిపోతూ మళ్ళీ యేమి గుర్తువచ్చిందో తిరిగి వస్తూ-హిమూ! పద స్నానముచేసివద్దూ, మళ్ళీరావచ్చుఅంది.

హేమా నా దగరకువచ్చి అంది- "మనమిద్దరమూ రేవుకు వెళ్ళి స్నానముచేసి వద్దామా అక్కా!"

అత్తయ్యకిది యిష్టంలేదు. అయినప్పటికీ ఏమీ అన్ను చెప్పకుండానే వూరుకుంది. గింజుకున్నా ప్రయోజనం లేదని

ఆమెకు తెలుసు. చివరకు విజయంకూడ హేమాంకే దక్కు-తుంది. ఇదే కాకుండా వారిద్దరిమధ్య పోట్లాట నాకుకూడ తెలిసిపోతుంది.

వెనకవైపునున్న ఊరువుకు వెళ్లా హేమాంగిని నన్నడిగింది. నీకెందుకు బిడ్డలు పుట్టలేదు అక్కా?

కొంచెం నవ్వి అన్నాను-"ఎందుకుపుట్టలేదో నాకేం తెలుసు? ఆ భగవంతుడింకా ప్రసాదించలేదు."

హేమాంగిని- "తప్పకుండా వెనకటి జన్మలో నీవేదో పాపము చేసివుంటావు."

నేను-"అదీ భగవంతుడికే తెలియాలి."

ఆబాలిక ఋజు పూర్వకంగా చెప్పింది. "పిన్నిచూడరాదా! ఆవిడ మనసంతా విషం. అందుకనే బిడ్డలుకూడా పుట్టలేదు.

పాపము - పుణ్యము, దుఃఖము - సుఖము, దండన-బహూకరణవంటి విషయాలు నాకు ఏమీ తెలియవు. ఇక ఆబాలిక కేమి సమాధాన మీయగలను! ఒక గాఢమైన నిట్టూర్పు విడచి మనసులోనే అనుకున్నాను. "ఇవన్నీ నీకే తెలియాలి" హేమాంగిని నన్ను కౌగలించుకొని నవ్వుతూ అంది - "ఓ నామాటలకే నిట్టూరుస్తున్నావా అక్కా? నామాటలెవరు పట్టించుకుంటారు."

నెమ్మది నెమ్మదిగా నాభర్త ప్రాక్టీసు కనేక ఆటంకాలు కలుగుతున్నై. దూరపు కేసులు చూడటానికి అస

లెవ్వరూ వెళ్ళరు. దగ్గర కేసులుకూడా చూడకుండానే ఇవ్వ డింటికివచ్చి కూర్చుంటున్నారు. మధ్యాహ్నము భోజనానికి రావడం, మళ్ళీ రాత్రి యింటికివచ్చినప్పుడుదక్క ఇంటివద్ద ఎక్కువ సేపు వుండేవారుకాదివరల్లో- ఇప్పుడు అవసరమున్నా లేకపోయినా అత్తయ్య కబురుచేస్తేచాలు పరుగెత్తుకుంటూ యింటికి వస్తున్నారు. అత్తయ్య కేకపెట్టి - "హేమూ! నా గదిలో తమలపాకుల పళ్ళెంలా పట్టుకురావమ్మా!" అన గానే నాభర్త గదిలో కూర్చున్నారని అర్థంచేసుకునేదాన్ని. మొదట్లో మూడు నాలుగురోజులు హేమాంగిని తమల పాకుల పళ్లెము, ఫలహారము, తలనూనె సీసా, దువ్వెన, అద్దము, మొదలైనవన్నీ అందిస్తూ వచ్చింది. తర్వాత హేమాంగిని తానుచేయడం మానివేసి దాసీచేతికిచ్చి పంపు తోంది. అత్తయ్య - "హేమాంగినీ, హేమూ, హేమీ, అనే పేర్లతో అరుస్తూ వుండిపోతుంది. ఈ బాలిక నా జీవిత దయనీయస్థితి గ్రహించినట్లుంది నామీద దయదలచి నన్నె పెనవేసుకుని వుంటూంది. ఏదో సందేహము, భయము, బాధ వ్యాపించినట్లుంది ఆమెలో. అదీగాక ఎప్పుడూ నా ఎదుట నాభర్త ప్రసక్తి తెచ్చేదికాదు.

ఒకనాడు అన్నగారు చూడటానికి వచ్చారు. ఆయన సూక్ష్మగ్రాహి. ఆయనముందు ఇటువంటి వేషాలేమీ మరుగుపడవనుకున్నాను. ఆయన ఖచ్చితమైన విమర్శకుడు. ఎటువంటి అన్యాయాన్ని క్షణంపాటుకూడా సహించలేరు. నాభర్త ఆయన ఎదుట అపరాధిగా నిలబడవలసి వస్తుం దేమో నని భయపడినాను. అత్యంత ప్రసన్న చిత్తముతో

నే నంతా కప్పిపుచ్చాను. డాబు అవసరము లేకపోయినా ఏవేవో కబుర్లు చెప్పి, కబుర్లడిగి, మధ్యమధ్య డాబు దర్ప ములతో కూడిన దర్జాలు ప్రదర్శించి, ఎలాగైనాసరే ఆయ నను మోసగింప ప్రయత్నించాను, ఇదంతా నా స్వభావ విరుద్ధమైనదే. అందువల్లనే నేను పట్టుబడిపోయాను నా అన్న గారు ఎక్కువరోజులు వుండకుండానే వెళ్ళిపోయారు. నా భర్త ఆయన వున్నంతవరకూ చంచలంగా అటూ యిటూ తిరుగుతూనే గడిపారు. ఎదుటపడినా కులాసాగా మాట్లాడ కుండా మౌనం వహించేవారు వెళ్ళడానికి పూర్వం అన్న గారు తన వాత్సల్య సౌజన్యహస్తాలను నాతలపై నిమురుతూ వున్నారు. మౌనంగా నిలచి నన్నేమని ఆశీర్వదించివుంటారో నే నర్థంచేసుకోగలిగాను. వారి కండ్ల వెంట స్రవించిన అశ్రు ధార నా బుగ్గలపై జలజల బొట్లుగా జారింది.

అవి చైత్రమాసపు రోజులని నాకు బాగాగుర్తు. ఒక రోజు సాయంత్రం గ్రామస్థులంతా సంతనుండి యింటికి తిరిగి వస్తున్నారు. దూరాన వర్షం జోరుగా కురుస్తున్నట్లుంది. చల్లగాలిలో మట్టితడిసిన వాసనకూడా కలిసి నలుదెసలా వ్యాపించింది. అంధకారం నృత్యం చేస్తున్నది. తమ మిత్రు లను బిగ్గరగా పేర్లుపెట్టి పిలుస్తున్నారు. నేను గుడ్డివాన్నవడం వల్ల, వంటరిగా గదిలో వున్నంతసేపూ చీకటి పడినప్పటికీ ఎవరూ దీపం వెలిగించరు. దానికి కారణం- నేనాదీపానికి నా గుడ్డలంటించుకుంటానేమో, ఏమైనా ప్రమాదం వాటిల్లు తుందేమోనని వారికిభయం నిశ్శబ్దంగా నలువైపులా అంధ కారవృతమై ఆగదిలో నేలమీద కూర్చుని భగవంతుడ్ని

ప్రార్థించాను- "ఓ భగవంతుడా! నీదయనర్థం చేసుకోలే నవ్వాడు, నీహృదయగతమైన అభిప్రాయాన్ని తెలుసుకోలే నప్పుడు వ్యథిత హృదయనై నాజీవిత చుక్కానినే అంటు కొనిపోయి వుంటున్నాను. హృదయం బ్రద్ధలై దానినుండి రక్తము ప్రవహించిపోతూంది. కాని నేనే విధంగానూ శాంతి పొందలేకపోతున్నాను. నన్నింక ఎంతకాలం పరీక్షిస్తావు కరుణామూర్తీ. ఇంకా ఎంతకాలమని నాలో ఈఓర్పు వుంటుంది." ఇలా అంటూ వుండగానే నాలో దుఃఖము పొర్లుకు వచ్చింది. మంచముపైన శిరమువాల్చి కుమిలి కుమిలి ఏడ్చాను. పగలంతా పనుల్లో మునిగి వుంటాను. హేమాంగిని నన్నే అంటిపెట్టుకుని వుండడంవల్ల నాహృద యంలోని ఆవేదన కన్నీరుగా ప్రవహింపజేసేందు కవకాశం దొరకదు. చాలారోజులతర్వాత ఇవాళ బాగా యేడ్వగలి గాను. మరుక్షణంలోనే మంచం కదిలినటయింది. ఎవరో కదులుతున్నట్టు అలికిడయింది. హేమాంగినివచ్చి తన పమిట కొంగుతో నాకళ్ళు తుడుస్తోంది. ఇవాళ సాయంత్రమే ఎప్పుడు ఏసమయానవచ్చి నామంచంమీద నిద్రించిందో నాకు తెలియదు. నన్నూ తనేమీ అడుగలేదు నేనూ పలకరించలేదు. మౌనంగా హేమాంగిని తన చల్లని చేతితో నాశిరముపై నవరించుతూంది.

ఇంతలో ఎప్పుడు మేఘాలురిమినవో, ఎప్పుడుతీవ్రంగా వర్షించినవో నాకేమీ తెలియదు. చాలా కాలం తర్వాత ఈ స్నిగ్ధ స్నేహశాంతి, నాలో దహించుకుపోతూ మలమల మాడిపోతున్న హృదయానికి వూరట కలిగించింది.

మరునాడు హేమాంగిని అత్తయ్యనడిగింది-"పిన్నీ నేనిప్పుడే నీకు చెపుతున్నాను. రేపు నువ్వు బయలుదేరక పోతే నేను డ్రైవర్ అన్నయ్యతో మనవూరు వెళ్ళిపోతా."

అత్తయ్య అంది - "అతనితో కేనికి - రేపు ఎలాగా వస్తాగా. ఇద్దరమూ కలసి వెళ్దాం. ఇదిగో చూడు. హేమా, అవినాశ్ నీకోసం ఎంతచక్కటి రవ్వలవుంగరం తెచ్చాడో.' ఎంతో గర్వపడుతూ అత్తయ్య హేమాంగినిచేతికి కా వుంగరం అందించింది.

హేమాంగిని అంది- "ఇదిగో చూడుపిన్నీ, నేనెంత బాగా గురిచూసి విసురుతానో" అంటూనే కిటికీలో నుంచి వుంగరం వెనుకనున్న చెరువులో పారవేసింది. క్రోధము, దుఃఖం, ఆవేశంతో అత్తయ్య శరీరము గగుర్పొడిచింది. అత్తయ్య నన్ను బ్రతిమాలుతున్నట్లు అంది--- "నాయడు అమ్మాయ్ ఈ విషయం అవినాశబాబుకు చెప్పకు. పాపం చాలా బాధపడుతాడు. నాతోడు. నువ్వేమీ చెప్పకు"

నేనన్నాను-"అత్తయ్యా, ఇంతగా చెప్పనవసరం లేదు. నేనేమీ చెప్పను."

మరునాడు తనవూరు వెళ్ళిపోయేముందు హేమాంగిని నన్ను కౌగలించుకొని అంది--"అక్కా, నన్ను మరచి పోకు. నన్ను గుర్తుంచుకో.

నేను ముఖం రెండు చేతులా తడుముతూ అన్నాను. అందుకేమీ మరచిపోను చెల్లీ! నాకింకా వేరు ప్రపంచాలేమీ లేవు. నా ప్రపంచమంతా ఈ నా మనస్సే' ఇలా

అంటూ హేమాంగిని శిరముదగ్గరకు తీసుకొని ముద్దిడు కున్నాను నాకళ్ళనుండి జరజరకన్నీళ్ళు ఆమె వెంట్రుకలపై రాలినై.

హేమాంగిని వెళ్ళిపోయిన తర్వాత నాకీ ప్రపంచ మంతా మోడువారిపోయి నట్లయింది. నాలో ఒక విధమైన స్నేహం, సౌందర్యం, సంగీతం, సుగంధం. తన జేదీప్యమానమైన కోమల, కారుణ్య కాంతితో ప్రసరింపజేసింది. ఒక్క సారిగా నన్ను వదలిపోయిన తర్వాత నా ఈ గుడ్డితనపు వెలుతురులేని ప్రపంచంలో చేతులు చాచి హేమాంగిని కొరకు గాలించుతున్నాను.

ఆయన ఆరోజు అమితోత్సాహంతో నా వద్దకువచ్చి అన్నారు---'వాళ్ళు వెళ్ళిపోయారు. కొంచెం ఇల్లంతా శాంతించింది. నీకు పనిపాటలు చేసుకోవాడానికికూడా సుఖువుగా వుంటుంది.'

నన్ను నేనే నిందించుకున్నాను. నాకోసం ఇంతనాటక మాడాలా. ఇంత సాసమా! ఇంత కపటముగా వ్యవహరించాలా? సత్యానికి ఎప్పుడైనా నేను భయపడితినా! ఏ అఘాతము కలిగినా సహించలేదా! ఆయన ఆనందాన్నే నాసర్వస్వముగా యెంచి నారెండు కళ్ళుకూడా పోగొట్టుకున్నానని వారెరుగరా! నా జీవితమంతా వీరికోసమే చిర అంధకార మయముగా చేసివేసుకున్నాను. అటువంటిదాన్ని మోసగించడానికి ఇన్ని పన్నాగాలు దేనికో?

ఇప్పటివరకు ఆయనకు నాకు మధ్య అంధత్వము తెర వలె అడ్డు వస్తూవుంది. ఇప్పుడింకొంత తెరకూడ నాపై పడి నన్ను మరుగువరుస్తోంది. నాభర్త ఆదమరచికూడా నాఎదుట హేమాంగిని ప్రస్తావన తేవడంలేదు. హేమాంగిని తాను పూర్తిగా మరచిపోయినట్లుంటున్నారు. ఆయన హృదయంలో ఏవిధమైనచిహ్నాలు లేశమాత్రంగాకూడ మిగిలివున్నట్లు లేదు. కాని వుత్తరప్రత్యుత్తరాలు జరుగుతూనే వున్నై. ఇది నేనర్థం చేసుకోగలిగాను. చెరువులో వర్షపునీరు అధికమౌతున్నకొద్దీ దానిలోవుండే పుష్పానికి వత్తిడి ఎక్కువవుతుంది దాని కాడ క్షణక్షణము పైకెదగడానికి ప్రయత్నిస్తుంది. అలాగే ఆయన హృదయంలో ఏవిధమైనవత్తిడి వ్యాపించినా" ఆ ఆనందమూ ఆవేశమూ వారు పట్టలేకపోయేవారు. అవి పొంగులువారి బయటకు బహిర్గతమౌతూనేవుండేవి. అవి నా హృదయాంతరాళములో నాటుకుపోయేవి. ఆకర్షణ అలాంటిదేగదా! హేమాంగిని సమాచారము ఎప్పుడు తెలుస్తుందో ఏమో నాకవగత మౌతూవుండేది. నేనాయనకీవృత్తాంతము తెలియ జేయడానికి వీలులేదు. అంధకారావృతమైన నా హృదయ ఫలకముపై ఒక ప్రచండమైన దివ్యజ్యోతిర్మయ సుందర నక్షత్రము ఒక్కక్షణము మెరసింది. ఈయనను అర్థం చేసుకోవాలని, ఈయనను గురించి నాలో నేనే వితర్కించుకోవాలని కుతూహాలం జనించింది. ఏది ఏమైనా నాకా హేమాంగిని గురించి నాభర్త ఎదుట మాట్లాడటానికి అధికారం లేదు. ఈవిధముగా మాయిద్దరిమధ్య దుఃఖపూరితమైన విషాద చ్ఛాయలు ఆవరించి, నిశ్శబ్దం తాండవిస్తోంది.

అది వైశాఖమాసము. ఒకరోజు హఠాత్తుగా దాసీ వచ్చి నన్నడిగింది——"అమ్మగారూ! మనపడవ ఎక్కడికి వెళ్తోంది. రేపులో ప్రయాణానికి అన్నీ సిద్ధము చేస్తున్నారు బాబుగారెక్కడికైనా వెళ్తున్నారా!"

ఏవో యత్నాలు జరుగుతున్నవనే సంగతి నేను కొంచెము ముందుగానే తెలుసుకున్నాను. నాజీవితాకాశంలో తుఫాను రాకపూర్వము నిస్తబ్దత, పెనుగాలి వీచక పూర్వం వ్యాపించే చిన్న పెద్దమేఘాలు వచ్చి చేరుతున్నట్లుంది. సంహారలీల గావించే ప్రళయరుద్రుడు తన భీభత్సనృత్యము నాపైనే జరుపబోవుతున్నట్లనిపించింది. దాసీతో నేనన్నాను "ఎక్కడకో? నాకేమీ తెలియదే."

దాసీ మళ్ళీ అడగడానికి సాహసించలేదు. ఒక తీవ్రమైన నిట్టూర్పు విడిచి వెళ్ళిపోయింది

బాగా ప్రొద్దుపోయిన తర్వాత నాభర్త నావద్దకు వచ్చి అన్నారు——"చాలా దూరాన్నుండి నాకాహ్వానము వచ్చింది. తప్పనిసరిగా వెళ్ళాలి. వేకువనే ప్రయాణమైపోతున్నాను. రెండుమూడు రోజులవరకు రాలేకపోవచ్చు."

మీరు నాతో ఎందుకబద్ధమాడతారు!" మంచము మీదనుండి లేచి నిలబడుతూ అన్నాను.

"నేనే మబద్ధంచెప్పాను?" ఆయన కంపితస్వరంతో పలికారు.

"నువ్వు వివాహం చేసుకోవడానికి వెళ్తున్నావు" అన్నాను.

ఆయనేమీ మాట్లాడలేదు. నేను స్థిరంగా నిలచి వున్నాను. చాలా సేపటివరకు మామధ్య ప్రశాంతి వ్యాపించింది. చివరకు నేనే అడిగాను---"నేనడిగినదానికి జవాబు చెప్పు. వివాహము చేసుకోవడానికే వెళ్తున్నాను. అని జవాబివ్వు."

ప్రతిధ్వనించునట్లుగా ఆయన సమాధానమిచ్చారు "అవును. వివాహం చేసుకోవడానికి నేను వెళ్తున్నాను."

"వీలులేదు. నువ్వు వెళ్ళకూడదు. ఈ విపత్తునుండి, మహాప్రళయాన్నుండి నేను రక్షిస్తాను. ఈ మాత్రం కూడ నిన్ను కాపాడుకొనకపోతే నేను నీకు భార్యగావుండి యేమిప్రయోజనం? నా ఈ శివార్చన ఎందుకు?"

చాలా సేపటివరకు నిశ్శబ్దముగా వూరుకున్నారు. నేను భూమిమీదపడి ఆయన కాళ్ళకు చుట్టుకుని అడిగాను- "నేను మీకేమపచారము చేశాను. ఏమైనా అపరాధము చేశానా! మీకు ఇంకో వివాహము చేసుకోవలసిన అవసరమెందుకు కలిగింది. నేను మీ మీద ఒట్టు వేసుకుని అడుగుతున్నాను. నిజము చెప్పండి.

అప్పుడు నా భర్త నెమ్మదిగా పలికారు - "నేను వాస్తవమే చెబుతున్నాను. నీ అంధత్వము నిన్నేదో లోకపు ఉగాగాలలో నిలిపి వుంటుంది. నేను నిన్నర్థము చేసుకోలేని స్థితిలో నిన్నందుకోలేక సతమత మవుతున్నాను నువ్వు నా దేవతవు. దేవతలవలెనే భయంకరురాలవు. నీతో నేను నిత్యజీవన వ్యాపారము సాగించలేను నాకొక సాధారణ

గృహిణి కావాలి. కేళలు. చివాట్లు, కోపము, తాపము అన్నీ కూడ ఆమెపైన చూపాలి, నేనాస్త్రీని ప్రేమించాలి. బుజ్జగించాలి. వివిధములైన నగలు, నాణ్యములు, వస్త్రాలు మొదలైనవన్నీ యిచ్చి ఆమెను సంతోషపరచి నేనూ సంతృప్తి జెందాలి.

"నా హృదయాన్ని చీల్చి చూడు. నేను సాధారణ స్త్రీనవునో కాదో వివాహమతర్వాత బాలికనేగాని యింకా తదితరచ్ఛాయలేమీ నాలో నీవు కన్పించవు. నిన్ను నేను గౌరవించాలి. విశ్వసించాలి. నిన్ను పూజిస్తూ వుండాలి. నిన్ను నీవవమానపరచుకుని నన్ను అపారదుఃఖములో పడ వేయకు. నన్ను నీకంటె పెద్దదాన్ని చేయకు. ప్రియా నన్ను అన్నివిధాల నీకాలిక్రింద అణచివుంచుకో నాథా!"

అప్పుడు నేనే యేమి చెప్పానో నాకు గుర్తుంటుందా? తుఫానుగాలుల మధ్య సముద్రం తన హోరు తాను విన గలుగుతుందా? నేను చెప్పినదానిలో ఇంతవరకే నాకు జ్ఞాప కం వుంది—"నీవు నీ ధార్మికప్రతిజ్ఞా భంగమొనర్చినట్లైతే నేను జోహారవుతాను. ఈ మహాపరాధము జరుగక పూర్వము నేనైనా వైధవ్యం పొందాలి. లేకపోతే హేమాంగినియైనా జీవించకుండా పోవాలి." ఈ మాటలంటూ నేను మూర్ఛ పోయాను.

తెలివివచ్చి చూచేప్పటికి తెల్లవారింది. పక్షులు కుహూ కుహూ నాధములు చేస్తున్నవి. నాథర్త ఎప్పుడో చెప్ప కుండానే వెళ్ళిపోయారు.

నా పూజాగృహం తలుపులు మూసి లోపల పూజ చేస్తున్నాను. రోజంతా బయటకు వెళ్ళలేదు. సాయంత్రం పెనుతుఫాను గాలివీచింది. ఆ తుపానుకు ఇల్లంతా వూగిపోతోంది. అయినప్పటికి "ఓ భగవంతుడా నాభర్త నవీగర్భములో ప్రయాణము చేస్తువుంటారు వారిని రక్షించు" అని కోరలేదీరోజు. తదేకధ్యానములో మునిగివుండి అంటున్నాను– "ఓ భగవంతుడా! నా అదృష్టమెలా వుంటే అలాగే జరిగి తీరుతుంది. నా భర్తను భయంకర పాపంనుండి రక్షించు"

రాత్రంతా గడిచిపోయింది. అయినా నేను ఆ భగవంతుని సాన్నిధ్యము వదలలేదు. భోజనపానాదులు లేకుండా నిద్రావిశ్రామములు లేకుండా అలా నేనక్కడే పాపాణ ప్రతిమ ముందు శిలావిగ్రహముపలె ఎలా కూర్చున్నానో ఇంత శక్తి ఎక్కడనుండి వచ్చిందో నాకు బోధపడలేదు.

సాయంత్రం బయట నెవరో తలుపు గుద్దుతున్న చప్పుడయింది. తలుపులు బ్రద్దలుకొట్టి లోనికి చొరబడినా నాకు స్పృహ రాలేదు.

స్పృహవచ్చిన తర్వాత నాకు వినిపించింది— "అక్కా" కళ్ళు తెరచి చూచాను. నేను హేమాంగిని ఒడిలో పడుకొని వున్నాను. హేమా పెండ్లిబట్టలలో వున్నట్లు నేను గమనించాను. నా శరీరంలోని ప్రతి అణువణువు అరచినట్లైయింది— "ఓభగవంతుడా! నా మొరాలకించలేదా? నాభర్త సర్వనాశనము జరిగిపోయింది."

హేమాంగిని తలవంచుకొని నెమ్మదిగా నాతో

అంది- "అక్కా నీఆశీర్వాదము పొందడానికి వచ్చాను."

మొదట్లో క్షణపాటు రాతివలె నిశ్చేష్టురాలినై పోయాను. మరుక్షణములో లేచికూర్చున్నాను. "నినాశీర్వదిస్తాను చెల్లీ! ఇందులో నీతప్పేముంది!"

హేమాంగిని సహజ స్వాభావిక మృదుమధురహాస కంఠముతో ఎలుగెత్తి పలికింది — తప్పా! నువ్వు వివాహం చేసుకుంటే తప్పులేదుగాని నేను చేసుకుంటే తప్పవుతుందా!"

హేమాంగినిని కౌగలించుకొని నేను కూడా నవ్వాను. మనసులో అనుకన్నాను— "ప్రపంచంలో నాప్రార్థన కంటె ఎక్కువ వారికోరిక కేమీ విలువలేదా! ఏ అఘాతము వచ్చినా నామీదేపడాలి నాధర్మము భక్తిశ్రద్ధలతో ఏమాత్రమూ లోపము రాకుండా నేను కాపాడుకోవాలి. వెనుకటి మాదిరిగా సదా వారి భార్యవలెనే చరించాలి."

హేమాంగిని నాపాదములపైబడి నాపాదధూళి శిరముపై నుంచుకుంది.

"నువ్వు చిరసౌభాగ్యవతివై చిరసుఖము బడయుము చెల్లీ." యని ఆశీర్వదించాను.

హేమాంగిని-"ఇప్పుడే ఆశీర్వదించినంత మాత్రానే తీరిపోలేదు. అక్కా నీచెల్లిని, మరదినికూడ ఎల్లప్పుడు ఆశీర్వదిస్తూ వుండాలి. మా ఇద్దరికి నీ ఆశీర్వాదమే మా జీవిత పరమార్థమవాలి అక్కా. ఆయనముందు సిగ్గుపడితే ప్రయో

జనం లేదు. నీవు సమ్మతించితే వారినిక్కడికి తీసుకువస్తాను!"

"సరే. వెళ్ళి తీసుకురా! అన్నాను.

కొంచెం సేపటికి గదిలో నూతన పదధ్వని వినిపించింది. ప్రేమతో కూడిన ఒక మృదుస్వరము నా కొవి పడింది- "బాగున్నావా కుమూ!"

నేను తొందరలో గబగబా మంచముమీదనుండ దిగి అన్నయ్య కాళ్ళకు ప్రణామ మాచరించి అన్నాను. "అన్నయ్యా".

హేమాంగిని అంది-"అన్నయ్యా అంటున్నావేమిటి! ఈయన నీకు అన్నయ్యకాదు. బావగారు."

అంతా నాకర్థమయింది. అన్నయ్య వివాహం చేసుకోనని ప్రజ్ఞతిచేశారు. అమ్మ లేనేలేదు. ఇక చెప్పి పట్టుదలతో వివాహం చేయించేవారు లేకపోయారు. ఇప్పుడు బహుశా నేనే ఆయన వివాహంచేయించానేమో. నా రెండు నేత్రాలనుండి అశ్రువులు జలజలా రాలుతున్నై. ఎంత ప్రయత్నంచేసినా ఆగేటట్లు లేవు. అన్నయ్య నాతల నిమురుతూ వుండిపోయాడు. హేమాంగిని కిలకిల నవ్వుతూ నన్ను కౌగలించుకొంది.

ఆరాత్రి నాకుబాగా నిద్రవస్తోంది. కుతూహలంతో భర్తరాకకై నిరీక్షిస్తున్నాను ఆయన తనసిగ్గు, నిరాశలను ఎలా తొలగించుకుంటారో నాకు బోధపడటంలేదు.

చాలాప్రొద్దుపోయింది. వీధివాకిలి తెరచుకుంది నేను

హఠాత్తుగా లేచి నిలచాను. ఆ వస్తున్న అడుగుల అలికిడి నా భర్తదేనని తెలుసుకున్నాను. నా హృదయం వేగంగా పరుగులు పెడుతోంది.

ఆయన వచ్చి నా మంచముమీద కూర్చుంటూ నా చేయి పట్టుకొని అన్నారు—"నీఅన్న నన్ను రక్షించాడు. క్షణిక మోహంలోపడి ప్రాణముకోల్పోవడానికి సిద్ధమయాను. ఆరోజు పడవపైన కాలిడినప్పుడు నా హృదయం భారముతో ఎలా క్రుంగిపోతూవుందో నాకూ ఆభగవంతుడికే తెలుసు. నదిలో వుండగానే పెనుతుఫాను లేచింది. ప్రాణాలుపోయే ప్రమాదం ఏర్పడింది. చనిపోవడమో నన్ను నేను రక్షించుకోవడమో యనే సమస్యను గురించి యోచిస్తున్నాను. మధుర్ గంజ్ చేరగానే ఒకరోజుముందే నీ అన్నతో హేమాంగినికి వివాహమైనదని తెలిసింది. ఒకవైపుసిగ్గు, ఇంకొకవైపు ఆనందముతో పడవమీదకు తిరిగివచ్చాను. అప్పుడెంత సంతోషించానో చెప్పలేను. ఈ రెండురోజులలోనే నేను చాలా అనుభవం గడించాను. నీవు లేనిదే నాకు సుఖమే లేదని, నీవు తప్ప నాకింకెక్కడ శాంతి లభించదని స్థిరము చేసుకున్నాను. నువ్వేనా దేవతవు."

నేను నవ్వుతూ అన్నాను—"నేను దేవత కానక్కరలేదు. నేనొక గృహిణిని. ఒకసాధారణ మహిళను ఇంతకంటె మరేమీకాదు."

ఆయన అన్నారు—"నామాటకూడ నువ్వు పాటించాలి. నన్నుకూడ ఎప్పుడూ దైవముగా ఎంచి లజ్జితుడ్ని

చేయకూడదు. నేను నిన్ను ప్రేమించే ఒకసాధారణ భర్తను అంతకుమించి మరేమీలేదు."

మరునాడు గుళ్ళో మోగించిన గణగణ గంటలు, శంఖ నాదములతో పల్లెయంతా ప్రతిధ్వనించింది.

హేమాంగిని తడవతడవకు ఆయన యేమి చేస్తున్నా, నిల్చున్నా కూర్చున్నా. భోజనము చేస్తున్నా, వుదయం, సాయంత్రము, అవకాశము దొరికిన ప్రతిసారి నా భర్తను హేళన చేస్తోంది, ఆయన దీనితో చాలాబాధ పడిపోయారు. ఆఖరుకు ఎక్కడకు వెళ్ళారో ఏమైనారో. ఆయనను గురించిన వృత్తాంతమెవరూ నాకు తెలియజేయలేదు.

—:(0):—

109

# నీరజ

## 1

మధురమైన కలలుగంటూ, గడచిన సుఖప్రద జీవితాన్ని స్మరించుకుంటూ, బడలిన దేహంతో. నీరజ శయ్యమీద స్పృహలేకుండా పడివున్నది. మెత్తని ముఖమల్ దిండ్లు రెండు మూడు తలక్రింద వున్నయ్. సిల్కు రగ్గు ఆమె కాళ్ళమీద వరకు కప్పబడినవి. నీలాకాశంలో ప్రకాశించే చంద్రబింబంలా ప్రకాశిస్తోంది. తెల్లని శంఖంలా ఆమె శరీరం పాలిపోయింది. మృదువయిన ఆమె చేతుల కండరాలన్నీ కరిగిపోయి పూచపుల్లల్లా వున్నాయ్. మాయదారిరోగం ఆమెను నిలువునా కృంగదీసింది.

ఆగది తెల్లని పాలరాతితో శోభాయమానంగా నిర్మించబడినది. గోడకు రామకృష్ణ పరమహంస చిత్రపటమున్నది. ఒకమూలన ఒక మంచము, మధ్యన రౌండు టేబిలూ, దానిమీద రెండు ఖాళీప్లేట్లు నాలుగు గాజుగ్లాసులు, దానికి రెండు వయిపుల రెండు ప్రేముకుర్చీలు. వున్నయ్. యింతకు మినహా ఆగదిలో యితర సామానేమీ లేదు ఒకచోట పూల కుండీ వున్నది. దానిలో రోజాపూల సుగదం ఆగదినంతా ఆక్రమించి మానవ హృదయాలకు మత్తెక్కిస్తోంది.

తూర్పువైపు కిటికీ తెరచి వుంది అందులో నుండి

క్రిందనున్న పూలతోట కనిపిస్తూవుంది. కాంపౌండు గోడ లకు అల్లిబిల్లిగా అల్లుకొని పోయిన మాలతీలతలు, వాటి పూవులూ చిరుగాలికి అల్లల్లాడుతున్నాయ్. దగ్గరలోనే వున్న కాలువ ఒడ్డున నీళ్ళ యింజను ఆడుతోంది. దానిలో నుండి ప్రవహిస్తున్న నీరు చిన్న చిన్న బోదెల ద్వారా తోట లోని ప్రతి మడి లోనికి పోతున్నవి. రేగి, మామిడి చిగురుల సౌందర్య, సుగంధాలకు మత్తెక్కి కోయిలలు గొంతెత్తి తియ్యగా పాడుతున్నాయ్. వాటి పాటకు అదేమో అన్నట్లుగా నెమళ్ళు తమ మనోహరమైన పురులను విప్పి నాట్యం చేస్తున్నాయ్.

'ఠన్...ఠన్ మంటూ తోటలోని గంట మ్రోగింది. అగ్నిజ్వాలలాంటి మధ్యాహ్నపు ఎండలో ఆ గంట మోత లీనమైంది. మూడు గంటలవరకు తోటమాలీలకు శెలవు. ఆ గంటారవముతో పాటు ఆమె మనస్సులో ఒక వ్యధ బయలు దేరింది. ఆమె మనస్సు వ్యాకులతతో కుదించుక పోయింది. తలుపు వేయటానికి ఆయా వచ్చింది. కాని నీరజ వద్దని చెప్పి తోటవైపు తన దృష్టిని మరల్చింది.

ఆమె భర్త ఆదిత్యుడు పూల వ్యాపారంలో కావలసినంత పేరు నార్జించాడు. వివాహానంతరం (నీరజ, ఆమె భర్త ఆదిత్యుని) వారి యిరువురి ప్రేమ వాహిని వివిధ విధాలా ప్రవహించి చివరకు యీ వనలక్ష్మి సేవలో లీనమై పోయింది. వారిరువురు అన్యోన్య ప్రేమ కలాపాలకు, అనుకూల దాంపత్యాన్నికి యీ వనలక్ష్మియే సాక్షి. తోటలోని

ప్రతి చిగురుటాకులోనూ, ప్రతి పుష్పంలోనూ వారి ప్రేమ వింత వింత రూపాల్లో గోచరిస్తుంది ఆదివారం మినహా, మిగతా రోజుల్లో, ప్రవాసి తన మిత్రుల వుత్తరాలకై పోష్టు ఆఫీసు ముందు కూర్చొని ఎలా ఎదురు చూస్తాడో, అలాగే యీ దంపతులు తోటపనిలో లీనమై ప్రతి ఋతువునందూ ఆయా ఋతువులో పుష్పించే పూలకోసం ఎదురు చూస్తూ వుండేవారు.

యివ్వాళ నీరజకు తన గత జీవిత ఛాయా చిత్రం ప్రతిక్షణమూ కండ్లకు కట్టినట్లు కనిపిస్తూంది ఎంత కాలమో కాలేదు, ఎన్నో రోజులు గడువలేదు. అయినప్పటికీ ఒక మహా భయంకరమైన మండు టెడారిని అధిగమించిపోయిన యుగాంతర చరిత్రలా కనుపిస్తుంది. తోటకు పడమరదిక్కున గట్టుమీద నిమ్మచెట్టు ఒకటివుంది. దాని జతచెట్టు ెప్పుడో ఎండిపోయింది. వడ్రంగి దాన్ని కోసి, చీల్చి, ఒక చిన్న బల్ల చేశాడు. ప్రాతఃకాలము తామిరువురు దానిమీదనే కూర్చొని కాఫీ త్రాగేవారు. కాఫీ త్రాగిన తరువాత యిరువురూ తోటపనిలో మునిగిపోయేవారు. నీరజ తలమీద పూలగొడుగు వుంటుంది. ఆదిత్యుని తలమీద హేటూ నడుముకు చెట్లు ఆకులు కత్తిరించే కత్తెర ఉండేది. యిరువురూ నవ్వుతూ ప్రేలుతూ, ఆనందాగా తోటపని చేసే వారు. తమ మిత్రులెవరయినా వచ్చినప్పటికీ తోటపనితో పాటే ప్రసంగం కూడా సాగిపోయేది.

దాదాపు అతని మిత్రులంతా వారిద్దర్నీ ఎంతగానో మెచ్చుకొనేవారు. ఎన్నో విధాలుగా పొగడేవారు.

"భాయీ! నిజంగా మీ పూతోటను చూచి నేను యీర్ష్య పడుతున్నా ననుకో-" అని అనేవా రొకరు. మరొకరు పల్లెటూరి అమాయకునిలా. యిది చంద్రవంక చెట్టా!' అనే వారు. యింకొకరు "అబ్బ! యింత వనాన్ని రత్నాలవంటి యీపూపొదరింద్లను ఎలా పెంచారు నీరజా! మీ చేతుల్లో మంత్రం - తంత్రగాని లేదుగదా?" అని ప్రశ్నించేవారు. రోజూ యిలాగే మిత్రులరాకడా-పోకడా జరుగుతూవుండేది. తమ కృషిని, తోటయొక్క అభివృద్ధినీ చూచి అబ్బురపడేవారు. ఎన్ని విధాలగానో ప్రశంసించేవారు. వారు వెళ్ళేప్పుడు నీరజ పూలూ పండ్లు బహూకరించేది. వారు ఎంతో ఆనందంతో పోలేక, పోలేక పోయేవారు. వారంతా తమ తోటలోని పూలయందు, పండ్లయందు ప్రత్యేకమైన అభిప్రాయాన్ని కలిగివుండేవారు.

గతించిన ఆరోజులు నీరజహృదయాన్ని కలచివేశాయి. ముఖ్యంగా ఉదయంపూట తా మిరువురూ చెట్టుక్రింద కూర్చొని కాఫీ త్రాగే స్మృతీ, కాఫీ సుగంధముతోపాటు వివిధ పుష్పములయొక్క సువాసన - తమ చిలిపి చేష్టలు - కితకితలు - కిలకిలలూ - యీ స్మృతులన్నీ ఆమెయొక్క సుదీర్ఘ - నిశ్వాసతో లీనమై ఆహాకారాలు చేసినయి. అంతుతెలియని ఆనందంతో గతించిన ఆ దినాలు - స్వర్ణదివసాలు - వాటిని దొంగిలించిన దొంగనుండి మళ్ళీ తను రాబట్టుకోవాలని చూస్తుంది తను. కాని యిది సాధ్యమా? ఎలా? అసలు దీనికి కారణభూతమేమిటి? మా యీ సంపూర్ణ సృష్టిని, ఆనందాన్ని యింత నిరర్థకంగా సర్వనాశనం

చేసిన ఆ ఉన్మాదుడెవరు?

ఆమె మనస్సులో సముద్రతరంగాల్లా ఆలోచనలు నిండిపోయాయ్. వివాహానంతరం పదిసంవత్సరాలు ఆనంద పారవశ్యంలోనే గడిచిపోయాయి. తన నేస్తాలు, చెలులు ఎంతో మురిసిపోయారు. తన భాగ్యాన్నిచూచి - 'అదృష్ట వంతురాలు' అన్నారు. పురుషస్నేహితులు - 'లక్కీగర్ల్' అన్నారు. ఆరోజులన్నీ యిట్లా గతించినయ్.

నీరజ సంసారం, లేదా దాంపత్యసుఖం యింత అకస్మాత్తుగా విచ్ఛిన్నమై పోవడానికి మూలకారణమేదయితేవుందో దానికి నాంది వారియింట్లో వున్న 'డాలీ' అనే కుక్కపిల్ల నీరజ అత్తవారింటికిరాక పూర్వ ఆదిత్యునికి డాలీయే తోడు నీడ. కాని నీరజ ఆగమనంవల్ల డాలీయొక్క స్వామిభక్తి రెండు విభాగాలయింది. ఒకటి నీరజమీద. రెండవది ఆదిత్యునిమీద. దీనిలో హెచ్చుభాగం నీరజదే. గేటు ముందుకు ఏదయినా బండి వచ్చిరాకముందే కేకలు పెడుతుంది. తోకను ఎగురవేసూ ఆ వచ్చిన శకటంమీద దండయాత్ర సాగిస్తుంది.

ఖాళీబండిమీద గర్జిస్తూ కలబడడానికి ప్రయత్నిస్తుంది. యింట్లోకి వచ్చే స్నేహితులను నీరజ ఆజ్ఞలేకుండా రానివ్వదు. నీరజ తర్జనీసైగతో తోకముడిచి కుంయ్ మంటూ ఒక దీర్ఘ నిశ్వాసవదలి తన స్థానంలో పడి వుంటుంది. తన యజమాని యజమానురాలు అయిన నీరజాదిత్యులు యింటికి రావడం ఆలస్యమయితే సరి పిచ్చెత్తిన

దానిలా యింట్లోకి బయటికి పచారు సాగిస్తుంది. ఆకాశం వైపు చూస్తూ కుంయ్ మంటుంది బహుశా యిది దాని భాషలో భగవంతుణ్ణి కరుణార్ధ్రి హృదయంతో "దేవా! వారు యింతవరకూ యింటికి ఎందువల్ల రాలేదు!" అని ప్రశ్నించడమేమో —

చివరకు దానికి పాపం ఏమి జబ్బుచేసిందో? కాని అది వీరిరువుర్ని భక్తిపూరితనయనాలతో చూస్తూ నీరజ ఒడిలో తలబెట్టి అసువులు బాసింది.

నీరజ స్వభావం అదోరకమైంది. ఆమెలో పట్టుదల జాస్తి. వాడు బ్రహ్మదేవుడయినాసరే తన ప్రేమకు విరుద్ధంగా ప్రవేలెత్తిచూపితే సహించదు. యింతవరకూ తమ దాంపత్యంమీద, సంసారంమీద పరిపూర్ణమయిన నమ్మకంతో వుంటూ వచ్చింది. కాని కుక్కయొక్క మరణం వలన తన జీవిత దుర్గంయొక్క ప్రహరీగోడలోని ఒకరాయి వూడి చిన్నరంధ్రం ఏర్పడినట్లయింది. యిది దుర్గవినాశనానికి ప్రవేశద్వారం కావచ్చు. విశ్వజగత్ కార్యకర్త యొక్క మనస్సుకూడా చంచలమైనదే. ఆయన చూపే తాత్కాలిక కృపారసంమీద కూడా విశ్వాసంగాని నమ్మకం కాని వుంచకూడదు.

యింతవరకూ నీరజకు సంతాన మేమీలేదు. యిక వుంటుందనే ఆశకూడా లేదు. వారిదగ్గర, వారిని ఆశ్రయించుకొని గణేశుడు అనే పిల్లా డొకడు వుంటున్నాడు. (డాలీ మరణంతో నిలిచిపోయిన ఆమె వాత్సల్య స్రవంతి

గణేశుమీదకు ప్రవహించింది. దాని వేగం హెచ్చింది. హద్దుల నతిక్రమించబోతుంది. కాని విధి ఎదురు తిరిగింది) ఆమె గర్భవతి అయింది ఆమె ఆనందం వర్ణనాతీతమైపోయింది. మాతృ హృదయం పెల్లుబికింది రోజంతా చింతచెట్టు క్రింద కూర్చొని మధుర స్వప్నాలుకంటూ భావిజీవితరంగంలో ప్రవేశించే తన బిడ్డకు చక్కని సిల్కు గుడ్డలు కుట్టసాగింది.

ప్రసవకాలం వచ్చింది. మంత్రసాని వచ్చింది. వెంటనే గొప్ప ఆపద వుంది అని గ్రహించింది. ఆదిత్యుడు బాగా బెదిరిపోయాడు. డాక్టర్ల అతన్ని పిలిపించాల్సివచ్చింది. డాక్టర్లు ఆపరేషన్ చేశారు. కాని ఏమిలాభం? నీరజ ఆశా సౌధాలు కూలిపోయాయి. పిల్ల పోయినా తల్లిని రక్షించే సరికి వారి తల ప్రాణం తోకకు వచ్చింది. ప్రసవానంతరం కూడా నీరజ మంచంమీద కాలు క్రింద మోపలేకపోయింది. యిసుకశయ్యమీద నిద్రించే వైశాఖ నదిలా రక్తహీనమై ఆమె దేహం మంచానికి అతుక్కుపోయింది. జీవనశక్తి ప్రసరణ ఆగిపోయింది. మంచంమీద పడివుండి ఎదురుగా తెరచివున్న కిటికీగుండా కనుపించే తన తోటను చూస్తూ వుంటుంది. చెట్లను పెనవేసుకొని పోయిన లతావల్లరులు ఆమెను నీ ఆరోగ్యం ఎలా వుంది!" అని ప్రశ్నిస్తున్నట్లుండేవి.

ఆదిత్యుడు తోటపని నిమిత్తం సరళనుతీసు కరావడం నీరజ హృదయానికి గాయమయింది. సరళ ఆదిత్యునికి చెల్లెలవుతుంది. నీరజ ఎప్పుడు చూచినా సరళ, పాశ్చాత్య నాగరికతానుసారం లతలు పువ్వులు చిత్రించబడిన తాటి

యాకుల గూడుగునుధరించి కూలీలతో పనిచేయిస్తూవుండేది. యీ దృశ్యం నీరజ హృదయానికి అరిపోయ్యే చితిమీాద ఆజ్యంపోసినట్లు వుండేది.

నీరజ స్వభావం మృదువైనదే కాని నేడు యిలా యింత కర్కశంగా ఎందుకు మారిపోయింది? యీనాటి యీ బొమికల గూడులాంటి శరీరం తన కెంత అపరిచిత మైనదో అలాగే నీరజ స్వభావం కూడా తనకు పరిచయ మైనదికాదు. యీ స్వభావంలో దయ-దాక్షిణ్యంలేవు. శాంతం లేదు. సహనం లేదు. ఒక్కొక్క పర్యాయం ఈ విషయం ఆమెకే తెలిసేది. అప్పుడామె మీాద ఆమెకే ఆశ్చర్యం కలిగేది. ఈ విషయం ఆదిత్యుడు కనిపెడతాడేమో ఏనాటికైనా గ్రహించి - నీరజ చచ్చి బ్రతికింది. ఆవిడ మనస్సు మారిపోయింది. యిక ఆమె మంచి పనులకు యోగ్యురాలుకాదు. అని తలుస్తాడేమోనని ఆలోచిస్తూ భయపడేది.

మధ్యాహ్నం గంట మ్రోగింది. కూలీలు వెళ్ళిపోయారు. తోటంతా నిర్జనమైపోయింది.

## 2

'రోశనీ' నీరజ పిలిచింది.

దాసి, గదిలోపలికి వచ్చింది. నడికారు మనిషి, వెంట్రుకలు యిప్పుడిప్పుడే నెరుస్తున్నాయ్. చేతిలో ఇత్తడి పాత్ర ఒకటి వున్నది. మనిషి హస్తిపంజరంలావుంది మనిషి

యొక్క నడక, ముఖంలోని భావాలు ఒక విధమయిన కఠోర తను చాటుతున్నాయ్. ఆమె నీరజను కనకపోయినా పెంచి పెద్దదాన్ని చేసింది. ఆమె మమత అంతా నీరజ మీదనే వుంది. నీరజ దగ్గరకు వచ్చేపోయేవారు - చివరకు ఆమె భర్త ఆదిత్యమీద కూడా ఒక విధమయిన విరుద్ధభావం వున్నది ఆమెకు.

గదిలోకి వచ్చి దాసి అన్నది "మంచినీరు యిచ్చేరా తల్లీ."

"అక్కర్లేదు కూర్చో"

ఆయా క్రింద కూర్చుంది

నీరజ కాస్త బాతాఖానీకోసం ఆయాను పిలచింది. ఆయా మనిషియొక్క ముఖ్యంగా నీరజయొక్క స్వభావానికి తగినట్లు మాట్లాడటంలో అందెవేసిన చెయ్యి.

"యివ్వాళ ఉదయం చాలా పెందరాళే తలుపు తీసిన చప్పుడు విన్నాను..." అన్నది నీరజ.

ఆయా మాట్లాడలేదు. కాని ఆమె ముఖాకృతి మాత్రం 'నీవు ఎప్పుడు వినకుండా వున్నావమ్మా' అని అన్నట్లుగా వుంది.

"వారు సంఘను తీసుకొని తోటలోనికి వెళ్ళివుండవచ్చా" అని అర్థంలేకుండా ప్రశ్నించింది నీరజ.

అసలు విషయమేమిటో తనకూ తెలుసు అయినా

రోజూ యిదే ప్రశ్న — యిదే. ఆయా మూతిమూను వంకలు త్రిప్పింది. ఫెళ్ళున ముఖమంతా విరచి గమ్మున ఊరుకున్నది

నీరజ బయటకు చూస్తూ తన సాదను వెళ్ళబోసు కొంటూంది. "నన్ను కూడా వారు రోజూ ఉదయమే లేపుతారు. తోటపనిచేయడానికి నేను కూడా వారితోపాటు వెళతాను, కాని కొద్దిరోజులు మాత్రం ఆగాలి."

చర్చల్లోగాని బాతాఖానీలోగాని యిలాంటి మాట లను ఎవరూ ఆశించరు. కాబట్టి యిలాంటి చర్చలో పాల్గొ నాలని ఎవరూ ఆశించరు. ఆయా యిహ వ్రండబట్టలేక అరచింది. "వారురాకుండా వున్నట్లయితే తోట ఎండిపోయి వుండేది."

"నేను న్యూ మార్కెట్టుకు పూలు పంపనిరోజంటూ ఏదీ లేదు..." నీరజ తన ధోరణిలో చెప్పుకపోతూనేవుంది "అలాగే యివ్వాళకూడా పూలు పంపారా ? బండివెంట ఎవరు వెళుతున్నారు ? అసలు పూలు పంపేది ఎవరు ?"

తెలిసివున్న యీ విషయానికి కూడా ఆయా జవాబు చెప్పలేదు. పెదాలు కొరుక్కుంటూ కూర్చుంది. నీరజ యింకా అలాగే గొణుగుతూవుంది — "ఎవరయినా కానీ నేను ఉన్నంతవరకు కూలీలు దొంగతనం చేయలేరు.

ఆయా మనస్సు ఎలాగో దాచుకొని అలాగే వుంది యింతవరకు. కాని యిక ఆగలేక అన్నది "యివి ఆరోజులు

కావు పిచ్చితల్లి యిప్పుడు కూలీలంతా రెండు చేతులతో దోచుకుంటున్నారు."

"మంచిది" నీరజ అన్నది.

"ఏమిటి ? నేను అబద్ధమాడుతున్నా నంటావా " ముఖమంతా కందగడ్డలాచేసుకొని ఆయా అన్నది. "క్రొత్త బజారువరకూ ఎన్ని పూలు చేరవేస్తున్నారనుకున్నావ్ ? గణేశుబాబు అలా బయటికి వెళతాడో లేదో వెనుక వైపు దర్వాజాగుండా మూటలుమూటలు వాటంతటవే వెళ్తాయ్."

"అయితే చూసే వాళ్లూ కాచేవాళ్ళూ ఎవరూ లేరా ?"

"ఎవరికాక్కావాలి ! ఎవరికేం పట్టింది ?"

"పోనీ గణేశుబాబుకు నీవైనా ఎందుకు చెప్ప కూడదు ?"

"చెప్పడానికి నేనెవర్ని మధ్య నాదేదో నాకేవుంది. అయినా అంతా మీరే నయితిరి యిక నేను ఎవరిమీద చెప్పను ?"

"జరగనివ్వు." నీరజ అన్నది "పోనీ మంచిదే. యిలాగే నడవనివ్వు. తడిసిన తర్వాత కాని గుడిశ కప్పరు యిప్పాళో రేపో ఆ గతే వడుతుంది. ఆనాడుగాని తల్లి ప్రేమ గొప్పదో సవతి ప్రేమ గొప్పదో తెలుస్తుంది. అప్పుడే దారిలోకి వస్తారు. నువ్వు వూరుకో — మధ్యనీకెందుకూ"

"కాని ఒక్క విషయం అమ్మాయ్. నీతో చెబు

తున్నాను. ఆ హరియా వున్నాడు చూశావూ వాడు ఒక్కి పనికిమాలినవాడు శుద్ధ దండుగ ఒళ్లు ఏమయినా వంచు తాడనుకున్నావా ? అబ్బెబ్బే" అంటూ తన ఉద్రేకమంతా వెళ్ళబోసింది ఆయా.

హరియా పనిదొంగ అనే కోపమే ఆయాకు వుండి అలా అంటే బాధలేదు, కాని అసలు విషయం వేరు. అసలు కిటుకు ఆయాకి తెలుసు. హరియాకు నీరజకూ దోస్తి. అది కాలక్రమేణా పెరుగుతూ వుంది యిది ఆయాకు గిట్టదు.

"కూలీలకు నేను దోషాన్ని అంటగట్టను" నీరజ అన్నది "క్రొత్త యజమానురాలిని వాళ్ళు ఎలా వ్యతి రేకించగలరు ? తరతరాల నుండి వారు యిదే చేస్తూవచ్చారు యిక మీ బాబుగారికి - పుస్తకాలూ - పఠనం - యిదే లోకమాయె. తను యింట్లో కూర్చుని పనులు జరగాలంటే ఎలా జరుగుతాయ్ ? హరియా చెప్పే కల్లిబొల్లి మాట లను నేను నమ్మను, నా దగ్గర ఫిర్యాదు చేస్తాడు. నేను అత నిని గట్టిగా చీవాట్లు పెట్టి "నీకెందుకు నీవు వినకుండా వెళ్ళిపో..." అని చెబుతాను సరేనా."

"మొన్న అల్లుడు పనిలోనుండి తీసి వేసేవారే"

"ఏం ఎందువల్ల ?"

"వాడు దిట్టంగా కూర్చుని బీడీ కాలుస్తున్నాడు. యింతలో ఆవు ఒకటి తోటలో జొరబడి మొక్కల్ని తింటుంది. అల్లుడుగారు వాణ్ణి కేకేపెట్టి ఆవుఅలా మేస్తుంటే

చూస్తూ కూర్చున్నావేంరా పోయి వెళ్ళగొట్టు అని గద మాయించారమ్మా. యింతే దానికి వాడేం సమాధాన మిచ్చాడనుకున్నావ్ - ఏమిటండీ! నేను ఆవును వెళ్ళ గొట్టినా! భలేభలే అదే నన్ను బయటకు వెళ్ళగొడు తుంది. బాబుగారూ ప్రాణంమీద ప్రతి మానవుడికీ తీపి వుంటుందండీ అని సమాధానం యిచ్చాడు. దాంతో చిన బాబుకు మండిపోయింది".

యిది విని నీరజ నవ్వింది.

"వాడి మాటే అంత." నీరజ అన్నది. "సరే! ఏమయినా కానీ వాడు మన చేతిలోని మనిషి గదా!"

"చిన్నబాబుగారు, మీరూ ఎలా సహిస్తున్నారో గాని అబ్బబ్బ ఆవులు త్రొక్కనీ, మేకలు తిని పోనీయండి. తోట నాశనమైపోతున్నా వాడు చూస్తూ అలాగేవుంటాడు. అసలు వాడికి మీరు యింత అలుసు నివ్వడం నాకేమీ బాగాలేదమ్మా!"

"నువ్వు వూరుకో ఆయా!" భ్రుకుటి చిట్లించి చిరు కోపాన్ని నటిస్తూ నీరజ అన్నది. "ఆవులూ మేకలూ మేస్తుంటే వాడు ఎందుకు వెళ్ళగొట్టటం లేదో-అది వాడికే తెలుసు. నాకూ తెలుసు అనుకో. వాడి మనస్సులో అగ్ని జ్వాలలు లేస్తున్నాయ్. అడుగో — వాడు వెళ్తున్నాడు హరియా! — ఆయా! పిలువు వాణ్ణి యిటు పిలువు."

ఆయా కేక విని హరియా అక్కడకు వచ్చాడు.

అతను లోపలకు రాగానే నీరజ అడిగింది.

"ఏం రా ! యివ్వాళకూడా ఏదయినా క్రొత్త ఉత్తర్వు లొచ్చాయా లేదా ?"

"ఎందుకు రాలేదండీ" హరియా అన్నాడు "వింటుంటే పైకి నవ్వు వస్తుంది. కాని లోపల హృదయం ఏడుస్తుంది"

"ఏమిటా ఉత్తర్వు ? చెప్పు కొంచం"

"అవిగో ఎదురుగుండా కూలీల పాతయిండ్లు కనుపించడంలేదూ !" అన్నాడు హరియా "వాటి యిటుకలు తెచ్చి తోటలో చెట్లక్రింద పెట్టమన్నారు, దానికి నేను చెట్లకు ఎండ దెబ్బ తగులుతుందని చెప్పాను. కాని అక్కడ నా మాట వినేదెవరు ?"

నీవే స్వయంగా బాబుగారితో చెప్పకూడదూ ?"

"చెప్పాను. కాని వారు నన్ను చీవాట్లుపెట్టి పంపించారు అమ్మగారూ ! యికనాకు శలవు యిప్పించండి. నేను యీ అన్యాయాన్ని చూస్తూ సహించలేను." అన్నాడు హరియా.

"నేను చూస్తూనే వున్నాను. నీవు యింతవరకూ ఆ యిటికనంతా మోస్తూనే ఉన్నావు గదూ !"

"అమ్మగారూ ! మీరు మాకు మొదటినుండీ యాజమాన్యం వహిస్తున్నారు. కాని మీ ముందే మా తలలు వంచేశారు. మాకు అవమానాన్ని కలుగజేశారు. యిప్పుడు మేము నాటివారికి మా ముఖాన్ని ఎలా చూపగలం."

"సరే! నీవు వెళ్ళు." నీరజ అన్నది. "యికనుండి నిన్ను ఎవరయినా యిటుకలు మోయమన్నట్లయిన నేను మోయవద్దన్నానని నా పేరు చెప్పు తెలిసిందా? యిక వెళ్లు. యింకా నిలబడే వున్నావేం?"

"ఆ చిన్న ఎద్దు చచ్చిపోయిందట వుత్తరంవచ్చింది" అంటూ తల కాయ వంచుకున్నాడు హరియా.

"చావలేదులే" నీరజ అన్నది. "అదికూడా నాలాగే సజీవ మృతకళేబరంలా తిరుగుతూంది. ఎక్కువగా వాగమాక యివిగో యీ రెండురూపాయలు తీసుకెళ్ళు" అంటూ తల దిండు క్రిందవున్న మనీపర్సులోనుండి రెండురూపాయలు తీసి యిచ్చింది నీరజ.

కాని హరియా కదల్లేదు.

"యింకా ఏం కావాలి?" అని అడిగింది నీరజ.

"మా ఆడదానికి ఒక పాతచీర యివ్వండమ్మా. మా వూళ్లో మీ పేరు చెప్పుకుంటాం." అంటూ హరియా పళ్ళు అన్నీ వెళ్ళబెట్టి యికిలించాడు.

"ఆయా!" నీరజ ఆయాను పిలిచి చెప్పింది. "ఆదండెం మీదవున్న చీర తీసుక వచ్చి యితని కివ్వు."

ఆయా ఒక్కసారి విసుకుగా తలకాయను విదిలించి తన అయిష్టతను కనబరుస్తూ అన్నది - "అది మీరు కట్టుకునే చీర అమ్మా."

"నేను కట్టుకు నేదయితేయేం ? నాకు అన్నీ ఒకటే యిప్పు డెవరు కట్టుకుంటున్నారు ? యిచ్చేశెయ్."

ఆయా చీరె ఇవ్వలేదు. ఆమె ముఖం చాలా కఠోరంగా మారిపోయింది. ముఖమంతా చిట్లించి నిర్మొహమాటంగా అన్నది. ఆ యిస్త్రాలే. చూడు హరియా! నువ్వు ఈ విధంగా అమ్మాయిగారిని కష్టపెట్టే మాట అయితే, బాబుగారితో చెప్పి నిన్ను బయటకు గెంటిస్తాను. తెలుసా! ఊరికె వాగక వెళ్ళిపో. చీరేలేదు. గీరేలేదు."

హరియా ఏడుపు మొఖం బెట్టి నీరజ కాళ్ళు పట్టుకొని తన దురదృష్టానికి విలపించాడు.

నీరజ హృదయం ద్రవించింది. ఏమిటని ప్రశ్నించింది.

"ఆయాను నేను పిన్నమ్మా అంటాను." హరియా ఏడుపు మొఖంతో చెప్పసాగాడు. "నాకు తల్లి లేదు. తల్లి లేని యీ అభాగ్యుని ఆయా యింతవరకూ తల్లిలా ప్రేమిస్తుందని భావించాను. కాని యిప్పుడు అదంతా ఉత్తదని తేలిపోయింది. మీరు కరుణించినా ఆమె కరుణించలేకపోయింది. దీనికి ఒకర్ని అనాల్సిన పనేముంది. అదంతా నా దురదృష్టం ఎవరేం చేస్తారు ?"

"ఎందుకురా అలా భయపడిపోతావు. మీ పిన్నమ్మ నిన్ను ప్రేమిస్తూనేవుంది. పైకి ఊరికే అలా నటిస్తుంది. ఆయా యిచ్చెసెయ్. యిప్పు పాపం." అంటూ నవ్వింది నీరజ. నవ్వుతూనే "తీసుకవెళ్ళకుండా కదలడు. యిక్కడే

పడివుంటాను మొండిఘటం." అన్నది.

బలవంతం బ్రాహ్మణార్థం అన్నట్లు యిష్టంలేక పోయినా, పగవాడి మొఖాన కొట్టినట్లు చీరను తెచ్చి హరియా ముందు పారేసింది ఆయా. హరియా చీరె తీసుకొని నీరజకు నమస్కారం చేసి నిలువబడి అన్నాడు. "నా చేతులు చెడ్డమురికిగా వున్నాయి అమ్మగారూ! చీరె మాసిపోతుంది. ఈ తుండుగుడ్డలో చుట్టుకెళతాను. క్షమించండమ్మా!" అంటూ జవాబు కోసమయినా చూడకుండా దండెం మీదవున్న టవల్ తీసుకొని వెళ్ళిపోయాడు.

"సరే! ఊ!" అంటూ ఓ నిట్టూర్పు వదిలి "ఆయా బాబుగారు బయటకు వెళ్ళిపోయారా?"

"వెళ్ళారు" అంది ఆయా మూతిముడుచుకొని.

"నిజంగా?"

"నాయీ కండ్లతో చూశాను. చాలా హడావుడిగా వెళ్ళిపోయారు. ఆ తొందరలో టోపీనికూడా మర్చిపోయారు."

యిదే మొట్టమొదటిరోజు. నాకు ఉదయం పూట పూలు యివ్వకుండానే వెళ్ళిపోయారు. రోజురోజుకీ వారికి అశ్రద్ధ పెరుగుతుంది. నా గతి చివరకు పెంటకుప్పలు చిమ్ముకొనే కాడికి వస్తోంది.

ఆయా ఎందుకో నోరు తెరచి ఆగిపోయింది. తీక్షణంగా వున్న ఆమె ముఖం అకస్మాత్తుగా మారిపోయింది

క్షణంలో. ఎదురుగా వస్తున్నసరళనుజూచి రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది.

సరళ గదిలోనికి వచ్చింది. ఒడ్డూ - పొడుగూ సమానంగా వుంది. చామనచాయగా వుంటుంది. కోల మొహం. అన్నిటికంటేముందు చూపరులను ఆకర్షించేఆమె యొక్క విశాలమయిన నయనద్వయం. సరళగొప్ప అందగత్తె కాకపోయినా కురూపిమాత్రంకాదు. ఆమె ఎంత అలంకరించుకోనకపోయినప్పటికీ సహజంగానే వున్నది.

నీరజ సరళ ముఖంకూడా చూడలేదు. సరళ నెమ్మదిగావచ్చి పూలను ప్రక్కమీద వుంచేసింది.

నీరజ కస్సుమంటూ లేచి ముఖాన్ని చిట్లించి కోపంగా సరళను కసరికొట్టింది. అయినా సరళ కదల్లేదు.

అయిదు నిమిషాలమౌనం. తరువాత నీరజ అన్నది. "యీ పూలను తెమ్మని నీకెవరు చెప్పారు."

"ఆదిత్య అన్నయ్య !"

"వారిక్కడ కెందుకు రాలేదు."

"న్యూ మార్కెట్‌కు వెళ్ళాలని చాలా త్వరత్వరగా కాఫీ త్రాగి అర్జంటుగా వెళ్ళిపోయారు."

"అంత తొందర దేనికి ?"

రాత్రి ఆఫీసు తాళం పగిలిపోయిందట. దొంగతనం (నోపెనీ) జరిగిందట అందుకని.

ఏమిటీ! వారికి రెండు నిమిషాలన్నా వ్యవధిలేకుండా పోయిందా?

రాత్రి మీ ఆరోగ్యం ఏమీ బాగులేదు. అప్పుడే కొంచం కళ్ళు మూశారేమో - వారు తలుపుదగ్గరకు వచ్చి చూసి తిరిగి వచ్చారు. వారు వెళ్లుతూ నేను మధ్యాహ్నం నికి వస్తాను. అలా రాకపోతే నీవు వెళ్ళి నీరజకు పూలు యిచ్చిరా అని చెప్పి వెళ్ళిపోయారు.

రోజూ ఉదయమే ఆదిత్యుడు తోట కంతకూ పెద్ద దయిన ఓ పుష్పాన్ని తెచ్చి భార్య శయ్యమీద పెట్టి వెళ్ళే వాడు. ఆమెదాన్ని చూస్తూ రోజంతా గడిపేది. యీ రోజున ఆ ప్రియపుష్పం సరళ చేతిమీదుగా వచ్చింది. కాని దీనిని తన మనస్సు సహించడంలేదు. ఏ వస్తువు అయినా అది ఎంత విలువలేనిదయినా దాన్ని బహూకరించేవారి యొక్క విలువబట్టి దాని విలువకూడా మారుతుంది. కాలు వల్లో ప్రవహించే నీరు గంగానదిదే అయినప్పటికీ ప్రయో జనమేమిటి! దానికి అంత విలువ ఎక్కడిది!

నీరజ ఆ పుష్పాలను తీసి అవతలపెట్టి అన్నది— వెళ్ళు బజారులో యీ పుష్పాలకు ఎంత విలువ, గిరాకి వున్నదో తెలుసునా? అనవసరంగా వీటిని యిక్కడపాడు చెయ్యడం దేనికి? తీసుకవెళ్ళిపో.

సరళ విషయాన్ని గ్రహించింది. ఏమో చెప్పాలను కుంది. కాని మళ్ళీ ఆలోచించింది. యీ పరిస్థితిలో తన జవాబువల్ల ప్రయోజనముండదు. పైగా బాధ యినుమడి

స్తుంది కాని తగ్గదు ! కనుక మౌనంగా వుండడమే మంచిదని అనుకొన్నది.

కొన్ని క్షణాల తరువాత నీరజ సూటిగా సరళను ప్రశ్నించింది. యీ పూల పేరేమిటో నీకు తెలుసునా ? అని.

మంచికాలం, పరిస్థితులు సక్రమంగా వున్నట్లయితే తను యధార్థాన్ని ఒప్పుకుంటూ 'తెలియదు' అని అనేది. కాని యిప్పుడు తన స్వాభిమానానికి దెబ్బ. అందుకని ఆలోచించి చెప్పింది.

'ఎమారిలిస్ పూలు'

ఆహా! మహాగొప్పగా చెప్పావ్. నీరజ అనవసరంగా మండిపడుతూ అన్నది. వీటిపేరు ఎమారిలిస్సా! భలేబాగా తెలుసుకున్నావ్. వీటిపేరు గ్రైండ్ ఫ్లవర్సు

సరళ నవ్వేసింది.

"అవొచ్చు."

"అవొచ్చేమిటి ? అవును. వీటిపేరే అది. నాకు తెలియదనుకొంటున్నావా ?"

యితరులను అవమాన పరచి తను సంతోషించాలని తెలిసివుండి కూడా, తప్పుడు పేరు చెప్పి తన మాటను నీరజ త్రోసి పుచ్చిందని సరళకు తెలుసు.

సరళ తనకు జరిగిన అవమానాన్ని సహించి మౌనంగా

వెళ్ళిపోతూవుంటే నీరజ వెనక్కు పిలిచి అడిగింది — యిదిగో ! సరళా ! ఏం చేస్తున్నావ్ ? ఉదయంనుండి ఎక్కడ వున్నావ్ ?

తోటలో వున్నాను.

మాట మాటకూ తోట తోట అంటావు. తోటలో ఏం జేస్తున్నావ్ ? అన్నది నీరజ అధికార గర్వంతో-

పురుగుపడ్డ ఆకుల్ని కత్తిరిస్తున్నాను.

అయితే తోటనంతా పాడుచేస్తున్నావన్నమాట. హారియాకు నేను అన్నీ నేర్పాను. ఎక్కడ ఏయాకు కత్తిరించాలో యే ఆకు కత్తిరించ కూడదో అతనికి బాగా తెలుసు. యీ చిన్ని పని అతనికి ఇబితే చేయడూ ?

యీ ప్రశ్నకు ఏం జవాబు చెప్పాలో సరళకు తోచ లేదు. నీరజ తోటపని చేసినపుడు హారియా బాగా పని చేశాడు. ఆమె చెప్పినట్లల్లా విన్నాడు. కాని సరళ పనిలో ప్రవేసించిన తరువాత వాడు పూర్తిగా పనిదొంగ అయి పోయాడు. నిశ్చింతగా, సోమరిగా తిరుగుతూ మాట మాటకూ సరళను అవమాన పరుస్తూవున్నాడు.

కాలేజీలో కష్టపడి చదివి సంపాదించుకున్న డిగ్రీ విలువకంటే (దొంగతనంగా) రహస్యంగా సంపాదించుకున్న డిగ్రీకి విలువ హెచ్చినట్లు కష్టపడి పనిచేయకుండా, మాటలు చెప్పి నీరజ మెప్పును దయను సంపాదించడం నేర్చుకున్నాడు హారియా.

ప్రతి మానవునికి కోపతాపాలుంటాయ్. సరళకు కూడా కోపతాపాలున్నాయ్. కాని ఆమె నీరజలా కోప గించలేదు. ఆమె నీరజ ప్రవర్తనను గురించి ఆలోచిస్తూ వుంది. ఆమె నీరజహృదయాన్ని వెయ్యికండ్లతో పరిశీలిస్తూ వుంది. నీరజ హృదయానికి ఒకపుండు వున్నది. అది ఆమెను క్షణక్షణమూ బాధిస్తుంది. నీరజకు సంతానంలేదు. ఆమె హృదయం చుట్టూ - అత్యంత సమీపంలోనే ఫల పుష్పాలతో నిండివున్న వనం ఆవరించివుంది. కాని ఏమి లాభం ! ఆ వనంలో ఆమెకు నీడలేదు...."

అకస్మాత్తుగా నీరజ అరచింది.

"ఆ కిటికీ తలుపు మూసివేయ్."

సరళ కిటికీ తలుపు మూసి అడిగింది.

"నారింజరసం తీసుకరానా ?"

"అక్కర్లేదు. నాకు నారింజరసమూ వద్దు. నీవూవద్దు యిక నీవు వెళ్ళిపో."

సరళ భయపడుతూనే అన్నది "మకరధ్వజం తీసు కునే వేళయిందే ననుకుంటాను. తీసుకరానా !"

"వద్దు. నాకు మకరధ్వజం తీసుకోవాల్సిన అవసరం లేదు. ఆఁ ! నీకు యింకా ఏమయినా పనులు అప్పగిం చారా ?"

"ఆ ... గులాబీ మళ్ళలో కలుపు తీయాలి. కుళ్ళి

పోయిన మొక్కలను పీకి క్రొత్త మొక్కలను నాటాలి."

"సరే ! హరియాను నా దగ్గరకు పంపించు. యిక వెళ్ళు."

సరళ వెళ్ళిపోయింది. హరియా వచ్చాడు.

హరియాను చూస్తూనే నీరజ అన్నది. "నీవు యిప్పు డొక దొరబాబువైపోయావేంరా ! గులాబి మొక్కలను నాటితే నీ చేతులు విరుగుతాయనుకున్నావా ! చిన్నమ్మ (సరళ) నీ అసిస్టెంటు అనుకున్నావా! పొగరుబోతు వెధవా అని ఇదిగో ! పెదబాబుగారు (ఆదిత్యుడు) వచ్చేసరికి చెడిపోయిన మొక్కలన్నీ పీకి క్రొత్త మొక్కలు నాటాలి. కలుపు తీయాలి. నీరు పెట్టాలి. పని అంతా అయి పోవాలి. తెలిసిందా ! లేకపోతే నీ వూపిరి తోడేస్తాను. యివ్వాళ కలవూ గిలవూ లేదు జాగ్రత్త."

నీరజ యొక్క యీ అకస్మాత్ పరివర్తనకు హరియా నిశ్చేష్టుడయ్యాడు. నోటమాట లేకుండా నిలబడిపోయాడు. నీరజ కూడా ఒక నిర్ణయానికి వచ్చింది. ఏ విధంగానయినా పిళ్ళను హడలగొట్టి తను యిక్కడే పడివుంటూ తోటపని పూర్తిచేయాలని నిశ్చయించుకొంది.

హరియా ముఖం పాలిపోయింది. తన ఆటలు కట్టే దినం ఆసన్నమైందని ఊహించాడు. మాటను మార్చే ఉద్దేశ్యంతో నసుగుతూ అన్నాడు. "అమ్మగారూ ! ఆ కుండీలో పూలు వున్నాయి. చూశారూ, అవి సాయంత్రా నికే వడబడి పోతాయ్.

హారియా ఆకస్మాత్తుగా ముఖంమీదకునవ్వును తెచ్చు కుంటూ అన్నాడు. నా దగ్గర ఒక పూలకుండీ వుందమ్మా చాలామంచిది క్రొత్తది. హరసుందరమోతీ దగ్గరది. నీ గదిలో వుండదగినదమ్మా.

వాటివెల యెంత !

అలా అడగకండమ్మా ! మనస్సులో తనపాచిక పారి నందుకు ఆనందిస్తూ అన్నాడు హారియా నేను వాటిని మీకు అమ్మనా ? ఏం మాటలండీ ! బీదవాణ్ణి అయినంత మాత్రం చేతనే విశ్వాసహీనుణ్ణికాను. మీ ఉప్పుకారం తిని బ్రతికే వాణ్ని తల్లీ."

"సరే !" అన్నది నీరజ.

హారియా !

వెళ్తూ వెళ్తూ "అమ్మాజీ ! మీ మీద కొండంత ఆశ పెట్టుకొని ఉన్నాను. నా మేనగోడలి పెండ్లి జరుగు బోతూంది. చుట్టపక్కాలు వస్తారు మర్చిపోవద్దు. నకిలీనగలు యిసే మీకే అపకీర్తి. నేను యింత పెద్ద గొప్పోరియింట్లో తోటమాలిని నా యింట్లో నే పెండ్లి. వూళ్లోవాళ్ళకండ్లన్నీ నా యింటిమీదనే వుంటాయ్. ఏం జేస్తారో –" అన్నాడు హారియా ముసిముసినవ్వులు నవ్వుతూ.

"మరేం పర్వాలేదు." నీరజ అన్నది "దాన్నిగురించి నీవు ఇప్పుడప్పుడే చింతపడమాక. వెళ్ళు."

హారియా వెళ్ళిపోయాడు. నీరజ ప్రక్క మార్చుడా

నికి అటుపోర్లింది. శక్తిహీనమైన ఆమె శరీరమునకు నొప్పి కలిగించేమో "ఆయా! ఆయా! ఓ ఆయా!" అంటూ కేకపెట్టింది. "నేను చచ్చిపోతున్నానే ఆయా!"

"ఏమంటున్నావ్ ఆయా వచ్చి అన్నది. "ఛీ! సిగ్గు లేదూ."

"దురదృష్ట దేవత నన్ను అధఃపతనం చేసింది. హరియా నన్ను యే వుద్దేశంతో చూస్తున్నాడో నాకు తెలియదూ! ఎందుకు తెలియదు! తెలుసు. నా మనస్సుకు యిష్టమయిన మాటలు చెప్పి నవ్విస్తూ ప్రేలుతూ బహుమానాన్ని పట్టుకపోయాడు పిలువాణ్ని. నా దగ్గరకు పిలుచుకురా. కసిన్ని వాడి ప్రాణాలు తీయాలి వెధవ." అంటూ అరచింది నీరజ.

నీరజ మాటలు విన్న ఆయా ముఖం చేటంత అయింది. హరియాను పిలుచుకరావడానికి అలా బయలు దేరిందో లేదో నీరజ మళ్ళీ అన్నది. వద్దులే. యివ్వాలిటి వదిలేసెయ్.

# 3

నీరజ అలాగే పడివుంది. ఒకపావుగంట గడిచి పోయింది. బూట్లను టకటకలాడిస్తూ ఆమె మరది రమేంద్రుడు అక్కడికి వచ్చాడు. వస్తూనే—'వదినా! ఇవ్వాళ ఆఫీసు పని బాగావుంది. అన్నయ్యగారు హోటల్లోనే

భోం చేస్తారు, యింటికి రావడానికి చాలా ఆలస్యంకావచ్చు. యీ విషయం చెప్పమని నన్ను పంపించారు." అని చెప్పాడు.

'భలే' నీరజ నవ్వుతూ అన్నది. "భలే మంచివాడివి యీ వార్త నెపముతో మీ అన్నయ్యగారికి మస్కాకొట్టి వేంచేశారా అండీ. మీరురాకపోతే ఆఫీసు నౌకరు ఏమయి పోయారు ?"

"మీ దగ్గరకు రావడానికి నాకు తప్పా – యింకా ఎవరిమీదనో ఎందుకు నెపంపెట్టాలి వదినా ! యీ విష యాలు నౌకర్లువింటే ఏమనుకుంటారు."

"అబ్బో ! అసత్యాన్ని సత్యంగా చూపించడానికి ఎందుకలా వ్యర్థప్రయత్నం చేస్తావూ ? దారి తప్పి యిటు వచ్చావని నాకు మాత్రం తెలియదూ. వెళ్ళుబాబూ. మీ మాలిని పాపం ఒంటరిగా వుంది యివ్వాళ. వెళ్ళు. పూ తోటలో వుంది."

"పూ తోటయొక్క వనలక్ష్మి సందర్శించిన తరువా తనే మాలిన్ని — అంటూ రమేంద్రుడు జేబులోనుండి ఒక కథలపుస్తకాన్ని తీసి నీరజ చేతికి యిచ్చాడు.

"అశ్రుధార" నీరజ నవ్వుతూ అన్నది. "ఇది నాకు చాలా అవసరం. మంచిది యిక నిన్ను ఆశీర్వదిస్తున్నాను విను – "పూల తోటలో గొబ్బి తీస్తున్న మాలిని (సరళ) నీకు భార్య అగుగాక, అనంతప్రేమ వాహినిలో అత్యంత

మధుర సీమల్లో మీ దాంపత్యం వాహిక ఆటపాటలతో హాయిగా సాగుగాక, వెళ్ళు లగ్నం చూసుకరా.

"సరే వదినా !" అకస్మాత్తుగా రమేంద్రుడు అన్నాడు.

"నేను ఒక విషయం అడుగుతాను నిజంగా చెబుతావా ?"

"ఏమిటా విషయం ?"

"యివ్వాళ సరళా నీవూ తగూ పెట్టుకున్నారా ?"

"ఎందుకు ? ఏం జరిగింది."

ఆమె కాలువ ఒడ్డున వ్యాకులతతో కూర్చొని ఆలోచిస్తూవుంటే చూశాను. మగవాండ్లలా ఆడవాండ్లుఎప్పుడూ పనిదొంగలు కారు. అందులోనూ, సరళ ఆవిధంగా నిరర్ధకంగా కూర్చొని ఉండడం చూడలేను. దగ్గరకెళ్ళిపలకరించి-మనస్సు ఏ సీమల్లో సంచరిస్తుందీ అని అడిగాను.

"వెచ్చని గాలీ ఎండుటాకులూ ఎటు తీసుకవెళ్ళితే అటు" అన్నది.

"అంతపెద్దమాట నాకర్థంకాదు. కొంచం వివరంగా చెప్పు" అన్నాను నేను.

"చెప్పదలచిన అన్ని విషయాలకూ భాష కావద్దూ" అన్నదామె. యథాలాపంగా వెంటనే నా కా గేయం జ్ఞప్తికొచ్చింది.

మృధు మధురం స్త్రీ హృదయం
ప్రణయ సీమకు ప్రవేశద్వారం
భేదించిన ఆ అధమాధముడు
ఎవడో — వాడెవడో —

అని చదివాడు రమేంద్రుడు.

మీ అన్నగారు తప్ప మరెవరు ! అన్నది నీరజ రమేంద్రుని ముఖభావాలను గ్రహిస్తూ.

ఎవ్వరూ కాదు. రమేంద్రుడు గర్జిస్తూ అన్నాడు అన్నయ్యగారు పురుషసింహం. వారు మీ తోటమాలిను లను జూచి గర్విస్తూ వుంటారు. కాని పుష్పరాశావివాగ్ని అన్నట్లయితే మంచిదే.

యిక ఆపు. అనవసర ప్రసంగం పనికిమాలినతనాన్ని చూపిస్తుందట. ఇదిగో రమేశ్ నే నొక విషయాన్ని చెబు తున్నా బాగా ఆలకించు. నా మాటను నీవు పాటించాలి. నీవు సరళను వివాహం చేసుకో. ఒక స్త్రీని ఉద్ధరించిన పుణ్యం లభిస్తుంది.

నాకీ పుణ్యపాపాలతో నిమిత్తంలేదు వదినా ! కాని ఒక్క మాటమాత్రం ప్రమాణం చేసి చెబుతున్నాను. కుమారి అనీ యువతిఅనీ మోజుపడి మరియెవ్వరినీ వివాహం చేసుకోను.

ఓ — అయితే అభ్యంతరమేమిటి ! ఉత్సాహంగా

ప్రశ్నించింది నీరజ. సరళకు యిష్టంలేదా !

ఆ విషయం భగవంతుడికి తెలుసు కాని నేను మాత్రం యీ విషయమెప్పుడూ అడగలేదు. నా ఉద్దేశ మేదో చెప్పేశాను.

ఛేఛ్ ! అపారమైనసంతోషంతో నీరజ ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. రమేంద్రుని చేయిని గట్టిగా నొక్కుతూ ఆమె నీకు తప్పకుండా భార్య అవుతుంది. అవాలి. నేను చావకముందే మీ పెండ్లి జరుగాలి. మీ పెండ్లిని నేను చూడాలి రమేశ్ ! అలా జరక్కపోయిందో నేను చచ్చినా సైతాన్‌ను అయ్యి మీవెంట బడతాను జాగ్రత్త.

నీరజయొక్క అసభ్యప్రవర్తనకు రమేంద్రుడు ఆశ్చర్య విభ్రాంతుడయ్యాడు. కొన్ని క్షణాలవరకూ ఆమె ముఖం వైపు చూస్తూవున్నాడు, చివరకు తల ఆడిస్తూ అన్నాడు వదినా ! నేను యీ కోటలోకల్లా బీదవాడిని కాని వయస్సులో పెద్దవాణ్ణి. ఎగిరేగాలితోపాటు భూమిమీద ధాన్యం కూడా ఎగురుతుందా ?

నీవు నాకేమీ ఉపదేశం చేయనక్కర్లేదు. నేను నీకంటె పెద్దదాన్ని నీకు పూజనీయురాలిని నేను ఆదేశిస్తున్నాను. నీవుపెండ్లి చేసుకో. ఆలస్యం చేయకు. ఈ ఫాల్గుణ మాసంలోనే లగ్నాలు ఉన్నాయి. మంచి ముహూర్తం చూసుకరా అన్నది నీరజ.

నా జీవితంలో సంవత్సరంలోని మూడువందల అరువైఅయిదు రోజులూ శుభలగ్నాలే. మంచిరోజుచూచి

నందున లాభమేమిటి ! దారి ఏమిటి ! నేను ఒకపర్యాయం జైలుకు వెళ్ళివచ్చాను. యిప్పటికికూడా సంకెళ్ళు నావయుపు కొరకొరా చూస్తూనే వున్నాయి. ప్రస్తుతం నేను నడిచే దారి ఎంత దుర్గమమైనది! ఆ దారిలో వివాహదేవత సంగతి అలా వుంచి ఆ దేవతయొక్క ఛాయ కూడా అడుగుపెట్ట లేదు.

ఈనాటి ఆడపిల్లలు మాత్రం జైలంటే భయపడు తున్నారు.

భయపడక పోవచ్చు. కాని అదిసుగమమైన మార్గం కాదు. నేను చెప్పేదేమంటే వధువును మంగళ సూత్రంతో బంధించి బాధించేకంటే మనస్సులో బంధించి వుంచడం మేలు.

హార్లిక్సు, పాలగ్లాసు టేబిల్‌మీద వుంచి సరళ వెళ్ళి పోతూ వుంది. నీరజ ఆమెను చూచి "సరళా! పోకు యిలారా. యిదిగో యీఫోటో ఎవరిదో గుర్తించగలవా?

"ఇవా!" సరళ అన్నది. "ఇదినాదే."

యిది పెద్దమ్మగారి తోటలో మీరిద్దరూ పనిచేసిన రోజుల్లో తీయించిన ఫోటో. అప్పుడు నీ వయస్సు పదాలుగు సంవత్సరాలుండి మరాఠీ పిల్లలావున్నావు.

"యిప్పుడిది నీకు ఎక్కడ దొరికింది."

"వారి డ్రాయరు సొరుగులో చూశాను. అప్పుడు దీనిమీద అంతధ్యాస వుంచలేదు. యివాళ్ళే దీన్ని బయ

టపు తీయించాను. రామూ! సరళ అప్పటికంటే యిప్పుడే చాలా బాగుంది. ఏమంటావ్ మరి?"

"యింకేమిటి?" రమేంద్రుడన్నాడు, "ఆ సరళను నేను చూడలేదు. యిప్పటి సరళమాత్రం నాకు బాగానే వుంది. ఆమెకూ - యీమెకు పోలిక నేనెలా చెప్పగలను."

"యిప్పటి యీమె ముఖం హృదయంలోని ఏదో ఒక ముఖ్యమైన రహస్యంతో నిండివుంది. ఆకాశంమీద తెల్లని మబ్బులను జూచి, యీమె శ్రావణంలో కురిసే వర్షం కురవాలని ప్రార్థిస్తుంది. మీరు దీన్నే రొమాంటిక్ అంటారు. అవునా-కాదా రామూ."

సరళ మళ్ళీ బయలు దేరింది. కాని నీరజ ఆమెను ఆపు జేసింది. "కూర్చో సరళా!" నీరజ అన్నది "రామూ! సరళను నేనొక పర్యాయం పురుష నయనాలతో చూసేనా! వద్దు. నీవే చెప్పు అన్నిటికంటె ఈమెకు ఎక్కడ ఎక్కువ ఆకర్షణ వున్నది"

"నాకు అన్నిచోట్లా కనిపిస్తుంది."

"కాదు. కండ్లలో వున్నది. ఆమె కండ్లలో ఏదో ఒక విధమైన ఆకర్షణ వుంది. అది కలుసుకున్న కండ్లను అలాగే నిలిపివేస్తుంది. యిదిగో సరళా వెళ్ళిపోకు యిలా రా! కొంచం సేపు కూర్చో. ఈమె శరీరం చూడు ఎంత బిగువయిన శరీరమో. వంపుసొంపులతో ఎంత వయ్యారంగా వుందో చూడు."

"ఏమిటొదినా! సరళను నిలువునా వర్ణించటానికే

కూర్చున్నావా ఏమిటి ?"

"ఆమె చేతులు చూడు రామూ!" ద్విగుణీకృతో త్సాహంతో నీరజ చెప్పుకపోతుంది. ఎంత కోమలంగా వున్నాయ్, ఎంత అందమయిన వ్రేళ్ళు. కావ్యాల్లోని వర్ణన లలో వింటమేగాని ప్రత్యక్షంగా ఎక్కడయినా చూశావా!

రమేంద్రుడు నవ్వాడు. 'ఎక్కడయినా చూచానో లేదో అనే ప్రశ్నకు జవాబు నీముందు చెప్పను. చెబితే కొంచం అతిశయోక్తి అవుతుంది."

"ఈ చేతులమీద నీవు చర్యతీసుకోవా!"

"భౌతికంగా తీసుకోను. కాని ప్రతిక్షణమూ తీసు కుంటూనే వున్నాను. నేను యిక్కడ కాఫీ త్రాగటానికి వచ్చినప్పుడు నా మనస్సు అంతా కాఫీమీదకంటే కాఫీ కప్పును అందించే ఆ చేతివ్రేళ్ళయొక్క స్పర్శాసౌఖ్యం మీదనే లగ్నమై వుంటుంది. నాయీ స్పర్శామృత రస స్వాదనంలో - మామూలుగా జరిగే పాణిగ్రహణం ద్వారా ఎంత సంబంధ ముంటుందో అంతకంటే ఎక్కువగానే వుంటుంది.

సరళ కుర్చీలోనుండి లేచింది. గిరుక్కన తిరిగి బయటకు పోతూవుంది. వెంటనే ఆమెను ఆపి తలుపుకు అడ్డంగా నిలుచుని అన్నాడు. "సరళా ! ఒక్కమాట-ఒక్కవాగ్దానం చేసివెళ్ళు నీకు దారియిస్తాను."

"ఏమిటి?"

"యివ్వాళ శుక్లచతుర్దశి. ఎన్నాళ్ళనుండో నీకు ఏమో చెప్పాలనుకుంటున్నాను. కాని చెప్పలేక పోతున్నాను. రోజూ మీతోటవద్దకు ఒక బాటసారిలా వచ్చి పోతున్నాను. కాని మీదర్శనం కూడా కరవైపోయింది. యిక ఎవరితో చెప్పను. మనస్సువిప్పి నీతో కొంతసేపు మాట్లాడాలి. నేను యిదే నిన్ను యాచిస్తూవున్నాను. నా యీ కోర్కె దీర్చు. సాయంత్రం చల్లగాలిలో చెట్లక్రింద కూర్చొని మాట్లాడుకుందాం. ఏమంటావ్!"

"అలాగే రండి."

"థ్యాంక్స్".

"వదినా!" రమేంద్రుడు నీరజ మంచందగ్గరకు వెళ్ళి అన్నాడు. "రమ్మన్నది వదినా!"

"రైటో." నీరజ అన్నది యింకా ఆలస్యమెందుకు? వదినతో నీకున్న పని అయిపోయినట్లే.

రమేంద్రుడు వెళ్ళిపోయాడు.

## 4

రమేంద్రుడు వెళ్ళిపోయిన తరువాత నీరజ రెండు చేతులతోనూ ముఖాన్ని కప్పుకొని మంచంమీద పడిపోయింది. ఆమె మనస్సులో ఆలోచనలు జోరీగల్లా గోలపెడుతున్నాయి. మనస్సును ఉన్మత్తావస్థలో పెట్టే యిలాంటి మధురరాత్రులు తన జీవితంలో ఎన్నిలేవు! తనుఎన్నివసంత రుతువులను జూచింది. ప్రపంచలోని పదహారు అణాల స్త్రీ లాగా తనూ తనభర్త కెలాంటి విషయంలోను ఏలోటూ

కలుగనీయలేదు...యిలా ఆమె మనస్సు ఊగిపోతూవుంది. ఆమెకు ఆ రోజులు జ్ఞప్తికి రాసాగినయ్. ఆదిత్యుడు ఆమెను తన హృదయానికి హత్తుకొని, ఆమె కండ్లలో కండ్లు, ముఖములో ముఖంపెట్టి అధరామృతపానంజేస్తూ మత్తెక్కి అర్ధనిమీలితనేత్రుడై, నీవు నాజీవిత చిత్రనాయకీ, అన్న ఆ రోజు ఎంత మధురంగావుంది ఎంత ఆనందంగావుంది. ఆ మాట నిన్న - మొన్నటిదాకా చెక్కుచెదరలేదు దాని రంగు వెలవలేదు. అప్పుడు యిప్పుడు...ఆమెభర్త ఎక్కువగా అంటూవుండేవాడు. "సీరూ! ప్రాచీనకాలంలో స్త్రీల పాదధూళి శోకగానే అశోకవృక్షాలలోని పువ్వులు పుష్పించేవట. నాపూలతోటలో కాళిదాసునాటికాలం ప్రవేశించింది. ఏ త్రోవలో నీపాదపద్మము ప్రసరిస్తాయో ఆ రెండువైపులా చెట్లు రంగురంగుల ఫలపూవులతో కళకళలాడుతయ్. వసంత ఋతువులోని ప్రశాంత వాతావరణం దానికితోడు కోమల హాసద్వయమునుండి చిలకరింపబడే నీసు-సారాయిలా పనిచేసి మత్తెక్కించి హుషారుపించి వూగిస్తుంది. కల్లు త్రాగినవాడిలా "ఝుం" ని ఊగే ఆ గులాబీలుచూడు. నీవులేనియెడల యీ సౌందర్యనిధి ఎండుటాకుల మోతతో నిండివుండేది. నీవు నా జీవిత నందనవనంలో శకుంతలవుసుమా!" అనేవారు.

యవ్వనపు పొంగులు తీరనైనాలేదు. కాని దాని మహిమ పోతూవుంది. మిట్టమధ్యాహ్నపు పట్టపగలే రాత్రి అయిపోతూంది. ఆరోజున ఆ హృదయంలో ఎక్కడయినా లేశమాత్రమయినా భయమున్నదా! లేదు. అది వున్న చోట ఏమీలేదు. "యింద్రాణి, శకుంతల" యివి ఆదిత్యుని

ముద్దుపేర్లు. అవును. ఆరోజులు అలాంటివి. అప్పుడామె అతనికలా కనుపించేది. ఆమె, ప్రభాత కాలంలోని సూర్యుని అరుణారుణ పరిపూర్ణ అరుణోదం నలుదిక్కులా వ్యాపించునట్లు ఆమె అతని హృదయంనిండా వ్యాపించింది. అలాంటిది యిప్పుడతనికి ఆమెమీద బరోసాలేదు అవును లేదు. (అయితే, యీ సరళ ఎవరు ఎందుకూ యింత గర్వం-) తనకు యీ విషయంలో కూడా అభిమానం కలుగుతోంది.

"ఆయా!" నీరజ అకస్మాత్తుగా కేకపెట్టింది. కొంచం యిలారా!" ఆయావచ్చి "ఏమిటమ్మా!" అన్నది.

"మీ పెదబాబుగారు నన్ను ఒకప్పుడు నా జీవిత చిత్రానాయకి అంటూవుండేవారు. దానిరంగు పదిసంవత్సరాలవరకూ మారలేదు. కాయితం పూవులా.

"చిత్రంలేదు వత్రంలేదు." కసరిచెప్పింది ఆయా. "రాత్రంతా నిద్రేపోలేదు. కాసేపు నిద్రపో నేను దిండ్లుసర్దుతాను కండ్లుమూసుకో."

"కాదు ఆయా! యిలాంటి వెన్నెలరాత్రుళ్ళు నా జీవితంలో ఎన్నిలేవు; ఎన్నిరాత్రుళ్ళు యిరువురం తోటలో తిరగలేదు. అవన్నీ యిప్పుడెలా దృష్టిపదంనుండి తప్పుతాయి. నిద్ర ఎలావస్తుంది?

"కాసేపు కండ్లుగట్టిగా మూసుకో! నిద్ర దానంతట అదేవస్తుంది."

"సరే! ఆఁ! యిదిగో వాండ్లిద్దరూ యీ వెన్నెల రాత్రిలో అలాగే తిరుగుతున్నారా!"

"యిందాక పూలకోసం పోయిచూశాను. వాండ్లు సంపంగి చెట్టుక్రింద కూర్చొని ఏమిటో వాగుతున్నారులే నీకెందుకు వాండ్ల గొడవ."

"తోటమాలి దిట్టంగా గుర్రుపెడుతున్నాడు. తోట మాలీలను వారు పొరపాటుగానైనా లేపడంలేదనుకుంటాను.

"మీకు తెలియనిదేమిటి? వారికి చెప్పటానికి మాలి గుండెలా బాడలా."

"ఏమిటిది! శారు చప్పుడేనా! "చూడు."

"అవును. బాబుగారు వస్తున్నారు. కాస్త గుడ్డకప్పు కోండి." అంటూ కొంచం గాబరా పడింది ఆయా.

"సరే! అదిగో! ఆ కుండీలోని పెద్దగులాబీ పువ్వును యిలాయివ్వు. సెప్టిపిన్ డబ్బా ఎక్కడవుందో యిలా తీసుకరా యివ్వాళ్ళ నా ముఖం బాగా పాలిపోయినట్లుగావుంది నువ్వుయిక వెళ్ళిపో."

"పోతున్నాను." పోతూపోతూ అన్నది ఆయా. "పాలూ - క్రీమ్ అక్కడనే పడివేడుస్తున్నాయ్. వాటిని కొంచెం త్రాగు"

"తగలడనీ నేను మాత్రం త్రాగను."

"రెండుచుక్కలుమందు త్రాగగానే సరిపోయిందా!

"ఏయ్! ఊరికే వాగకు. పెద్ద మనగత్తెవయావు. వెళ్ళు. ఆ కిటికీ తీసివెళ్ళిపో_"

నీరజ వయిపు చురచురా చూస్తూ ఆయా వెళ్ళి పోయింది.

... ... ...

మూడుగంటలయింది. ఎండతీవ్రతతగ్గింది రంగుమారి ఎర్రబడింది. నీడలుశేచాయి. తూర్పుదిక్కునుండి గాలి వీస్తోంది, దక్షిణదిశనుండి కాలవనీరు గలగల శబ్దాలతో పరుగులు పెడుతూ ప్రవహిస్తూవుంది. మాలీలు అందరూ తను తమ పనుల్లో మునిగివున్నారు. నీరజ దూరంగా తను చూడ గలిగినంతవరకు చూస్తూవుంది.

అడుగులు వేగంగా వేస్తూ ఆదిత్యుడు వచ్చాడు. వారి రెండు చేతులనిండా, కాషాయరంగుతో వికసించిన స్వదేశీపూలు వున్నాయి. ఆయన వాటిని నీరజ పాదము లున్నచోటులో పోశాడు. ప్రక్కమీద కూర్చుంటూనే ఆమెమీద వాలిపోయి, ఆమె కండ్లలో చూస్తూ—"ఇవ్వాళ నేను చాలా ఆలస్యం చేశాను నీరూ!" అన్నాడు. యిది వింటూనే నీరజ చిన్నపిల్లలా వెక్కి వెక్కి ఏడ్వసాగింది, ఆది త్యుడు మంచంమీద నుండిలేచి, మోకాళ్ళమీద కూర్చొని నీరజను చుట్టుకుపోయాడు అశ్రుధారలతో తడిసిపోయిన ఆమె బుగ్గలను ముద్దిడుకొంటూ అన్నాడు—"యిందులో నా తప్పు ఏమీలేదని నీ అంతరాత్మకు కూడా తెలుసు. నీరజా! ఎందుకలా ఏడుస్తావ్!"

"ఇంత నిశ్చయంగా నాకెలా తెలుస్తుంది. నాకుఇవ్వ డారోజులు ఉన్నాయా?"

"రోజులను లెక్కిస్తూఉంటే లాభమేమిటి నీరూ! నాకు మాత్రం నీవు అప్పటిదానివే సుమా!"

"నాకు మానసిక బలహీనత కలుగుతోంది. ఇవాళ నాకెందువల్లనో ప్రతివిషయమూ భయానకంగా కనిపిస్తుంది"

"కొంచం భయపడుతూవుంటేనే బాగుంటుంది. అవునా- కాదా! లేని-పోని మాటలతో నన్ను బెదరగొట్టాలని చూస్తున్నావుగదూ! స్త్రీలకు యీ బుద్ధి సహజ సిద్ధమేగా!"

"ఊఁ! ఆపారేం! మరచిపోవడం పురుషులకు స్వభావ సిద్ధంకాదు కాబోలు!"

"మరచిపోయే అవకాశం నాకెక్కడయిస్తున్నావు!"

"మరి మాట్లడకండి. భగవంతుడనుగ్రహిస్తే పరిపూరావకాశం కలుగుతుంది."

"ఛీ - అలాంటి మాటలనక. మంచిరోజుల్లో మరచిపోగలం. కాని బాధాయుతర దినాల్లో మరువలేము."

"అయితే యథార్థం చెప్పండి. యివ్వాళ ఉదయం వి ాచు నన్ను మరచి వెళ్ళ లేదూ!"

"ఏమిటా మాటలు. అవసరంగా పోవలసివచ్చి పోయాను గాని లేకుంటే పోతానా ? పోయిమాత్రం ఏమిలాభం. మనస్సంతా నీమీదనేనాయె."

"అలా కూర్చున్నారేం ? లెగండి. మంచిగామంచం మీాధ కూర్చోండి."

"ఎందుకూ? ఎక్కడకూ పోకుండా కాళ్ళకు సంకెళ్ళు వేద్దామనుకుంటున్నావా ?"

"అవును. మీా కాళ్ళకు సంకెళ్ళు వేసి, జన్మజన్మాంతరాల వరకూ నావద్ద అట్టేపెట్టుకుందామనుకుంటున్నాను."

"మధ్య - మధ్యలో కాస్త అనుమానిస్తూ వుండు. ప్రేమలోని, మమత, తీపి అర్థమవుతాయ్."

"కాదు కాదు. సందేహమేమీ లేదు. రవంతయినా లేదు. మీ వంటిభర్త ఎన్ని పూజలు చేసుకుంటే దొరుకుతాడు. ఎంత అదృష్టముండాలి! మిమ్మల్ని అనుమానించటా? నాకు చాతకాదు బాబూ"

"అయితే నేనే నిన్ను అనుమానిస్తాను లేకుంటే, ఎల్లకాలమూ వెన్నెల ఆనందాన్ని అందివ్వలేదు."

"అదేదో నీవేశానియ్. నాకేలాంటి భయమూ వుండదు."

"నువ్వు నాకేమయినా చెప్పు. యివ్వాళ నామీద నీకు సందేహం కలిగిందా లేదా!"

"నీవు ఆ మాటను వదలిపెట్టవా ఏమిటి? జరిమానా ఏమీ యిచ్చుకోనక్కర లేదులే, దానికి శిక్ష నేనే అనుభవించాను."

"శిక్ష దేనికి! జీవితంలో మధ్య మధ్యన యిలాంటి కోపతాపాలు లేకుంటే, జీవితమే నిస్సారంగా వుంటుంది. ప్రేమనాళమే తెగిపోయినట్లవుతుంది. అనుకూల దాంపత్యానికి భార్యాభర్తల చిలిపికయ్యాలే, చిహ్నం. వాటిలో ఎంత ఆనందముంటుం దనుకున్నావ్?"

"గతంలో ఎప్పుడయినా పొరపాటున మీ మీద నాకు కోపమొచ్చినప్పటికి అది నా తప్పుకాదు. ఏదో అదృశ్య శక్తి నన్నావహించి వుండాలి."

"ఓ అలాగా! పాపం! ఆ అదృశ్య శక్తి నీవూ నేనూఅనే భేదభావంలేకుండా నేడో-రేపో లేదామరోనాడో

అందరి నెత్తిమీదకూ వస్తుంది. మంచి బుద్ధివచ్చే మాట యితే రామనామాన్ని జపిస్తాడు. అప్పుడది వరారవుతుంది"

యింతలో ఆయా లోపలికి వచ్చింది. వస్తూనే —

"బాబూజి ! అమ్మగారు యివ్వాళ ఉదయంనుండి పాలు త్రాగలేదు. మందు తీసుకోలేదు. మాలిష్ చేయించుకోన లేదు. యిలా అయితే ఎలా ! రోగం ఎలాపోతుంది." అంటూ మూతీ - ముక్కూ మొహం చేతులు అన్నిటినీ అష్టవంకరలు త్రిప్పుతూ రుసరుసమంటూ వెళ్ళిపోయింది.

యిది విని ఆదిత్యుడు మంచంమీదనుండి దిగ్గున లేచాడు. లేని కోపాన్ని అభినయిస్తూ — యిక నాకు కోపం వస్తుంది." అన్నాడు.

"రానియ్. బాగా రానియ్. ఎంత వస్తుందో అంతా రానియ్ నాది తప్పు జరిగింది ఒప్పుకుంటాను. నన్ను క్షమించాలి"

ఆదిత్యుడు తలుపు దగ్గరకువెళ్ళి సరళను కేకపెట్టాడు యిది వింటూనే నీరజ రక్తనాళాలలోని రక్తప్రసరణ నిలచి పోయినట్లనిపించింది. గుండు కే పుల్ల గుచ్చుకుంది.

సరళ వచ్చింది ఆదిత్యుడు కోపంగా అడిగాడు—

"యివ్వాళ నీరజకు మందు ఎందుకు యివ్వలేదు ? రోజంతా తినడానికి ఏమీ యివ్వలేదా ! అంత పొగరెక్కిపోయిందా!

"దాన్ని ఎందుకండీ అలా దబాయిస్తారు" అంటూ అరచింది నీరజ. దాని తప్పేమి వుందని ? నేను గర్వంతో మందు తీసుకోలేదు. పాలు త్రాగలేదు. దాని తప్పేమీ లేదు. మీరు ఏదయినా అనదలిస్తే నన్ను అనండి - సరళా

నీవు వెళ్ళిపో. అనవసరంగా యిక్కడనిలుచబడి తిట్లుఎందుకు తింటావ్ ?"

"ఎందుకూ వెళ్ళడం." ముఖమంతా చిట్లించుకొని కోపంతో చిరబురలాడుతున్నట్లునటిస్తూ అన్నాడు ఆదిత్యా. "మందు తీసుకరాపో - ఆర్లిక్సు పాలుకూడా తీసుకరా! వెళ్ళు"

"పాపం పగలంతా దాన్ని మాలీలతోపాటు పని చేయించి కష్టపెట్టాను. యిప్పుడు మళ్ళీ నర్సింగా? మీరేమి మనుషులండీ. మీ హృదయంలో ఏమాత్రం దయలేదా ! ఆయాను పిలుచకూడదూ ?

"ఆయాకు యీ పనులన్నీ ఏం తెలుసు ?"

"చాలా పెద్దపని అయె దానికెలా తెలుస్తుంది. భలే బాగా చేస్తుందిలే పిలవండి."

"కాని......"

"కాని ఏమిటి అర్ధణా" అంటూ తనే పిలచింది. "ఆయా ! ఓ ఆయా !"

"ఎందుకలా తొందరపడతావ్ ? అంత ఉద్రేకం పడినందు వల్ల మళ్ళీ కొత్త ఉపద్రవమేదయినా ముంచుక రావచ్చు."

"నేను ఆయాను పంపిస్తాను." అంటూ సరళ వెళ్ళి పోయింది. నీరజమాటకు ఏదయినా జవాబిద్దామని కూడా అతను అనుకొనలేదు ఆదిత్యునికి కూడా చాలా ఆశ్చర్య మేసింది, సరళను తను నిజంగా కష్టపెడుతున్నాడా ! అని ఆలోచించాడు.

"మందు పద్యము యిచ్చిన తరువాత ఆయాతో ఆదిత్యుడు చెప్పాడు. "సరళను పిలుచుకరా !"

ఆయా వెళ్ళిపోయింది

"మాట మాటకూ సరళా అంటూ దాన్ని ఎందుకలా కష్టపెడతారు ?" అన్నది నీరజ "మీకు పనేమీ లేదా !"

"పని విషయాన్ని గురించే మాట్లాడాలి."

"యిప్పుడేమి మాటలండీ పోనిద్దురూ"

"ఒకటి రెండు మాటలే"

సరళ చిన్నపిల్ల దానికేమీ తెలియదు దానితో మీరు మీ వ్యవహారాలను గురించి మాట్లాడేకంటే హారియాను పిలిపించి చెప్పండి."

"నిన్ను పెండ్లి చేసుకున్న తరువాత నేనో క్రొత్త విషయాన్ని కనుక్కొన్నాను, ఏదయినా ఒకపని కావాలంటే ఆడవాండ్లే చేయాలి కాని అది పురుషులవల్ల అంత త్వరలో కాదు. మేము బలవంతంగా చేస్తాము కానిమీరు ఉత్సాహంగా చేస్తారు. యీ విషయంలో నేను ఒక 'థీసిస్' వ్రాయాలని నిర్ణయించుకున్నాను. నా నిర్ణయానికి నా డైరీలో చాలా ఉదాహరణలు దొరుకుతాయ్.

"ఒక స్త్రీ మానసికంగా ఒక పనిని నిర్ణయించుకొని ప్రారంభించినప్పుడు విధి ఎదురుతిరిగి తారుమారవుతుంది. ఆ పరిస్థితిలో ఆమెను ఏమనాలి యిప్పుడు నేను ఎంతో కష్టపడి నిర్మించిన మేడలు భూకంపానికి 'ఎర' అయిపోయాయి.

ఆ శిధిలగృహం యీనాడు దెయ్యాలకుకూడా పనికిరాకుండా పోయింది..."

యింతలో సరళ వచ్చింది

"పూదోటలో పని అయిపోయిందా ?" అని ప్రశ్నించాడు ఆదిత్యుడు.

"ఆఁ ! అయిపోయింది."

"అంతా ?"

"అవును."

"గులాబీ ఆకుల కట్టింగు కూడా."

"మాలి నేలను తయారు చేస్తున్నాను,"

"నేల! నేలను నేను మొదటనే తయారుచేసివుంచాను దాన్ని హానియా మాలీ హేంటోవర్‌లో వుంచితే ఏం?..."

వాండ్ల సంభాషణను చెడగొట్టాలనే దుఃసంకల్పంతో మధ్యలోనే నీరజ అరిచింది. "సరళా! నీవు వెళ్ళిపో నారింజరసం తయారు చేసుకరా. కొంచం, దాంట్లో కొద్దిగా అల్లపు రసంకూడా వెయ్యి. యిదిగో తేనె కూడా కాస్త వేసుకరా !"

సరళ తలకాయ వంచుకొని వెళ్ళిపోయింది.

"రోజటిలాగానే యివ్వాళ్ళకూడా మీరు తెల్లవారు ఝామునే లేచారా!?" అని అడిగింది నీరజ.

"ఆఁ !"

"గడియారానికి అలారం చెవివున్నదా ?"

"అవును. వున్నది."

"ఆ నిమ్మచెక్క బల్లక్రింద కాఫీ కప్పులు సాసర్లు మొదలైన కాఫీ సామానంతా భాసు సర్దివుంచాడా ?"

"ఆ, సర్దేశాడు. లేకపోతే మీ కోర్టులో షికాయత్ దావా దాఖలు చెయ్యకపోయావా ?"

"రెండు కుర్చీలు రెండూ వేసివున్నాయా ?"

"ఆ వున్నాయ్. దానిమీద, నీవు కాఫీత్రాగే, కాషాయరంగుమీద నీలవుగీతలు గీయబడివున్న కప్పూ, వెండిగ్లాసులో పాలూ, చిన్నప్లేటులో చెక్కెరా డ్రైగాడ్ బొమ్మవున్న ఆ జపానీ ట్రే మొ॥ నవన్నీ వున్నాయ్.

"రెండవకుర్చీ ఖాళీగా ఎందుకున్నది ?"

"మందమతివల్ల ఆకాశంలోని నక్షత్రాలన్నీ వాటి స్థానంలో సరిగానే వున్నాయి. కాని దిగాంతరాల వెనుక శుక్లపంచమి చంద్రుడే వుండిపోయాడు. సమయం జూచి అతన్నికూడా తీసుకవస్తాను,"

"సరళని మీ టేబిల్ దగ్గరకు ఎందుకు పంపించలేదు.

"దీనికి జవాబుగా "నీ స్థానంలో మరొకరు కూర్చుండడం నా కిష్టంలేదు" అని అన్నట్లయితే చాలా బాగుండేది. కాని యదార్థవాది అయిన ఆదిత్యుడు అలా చెప్ప లేదు. "ప్రాతఃకాలము ఆమె జప-తపాలు చేస్తుంటుందిగా ! నా మాదిరి పూజా - పునస్కారాలులేని మ్లేఛ్ఛ కాదుగా అందుకని."

"కాఫీ తాగిన తరువాత "ఆర్కిడ్"కు తీసుకవెళ్ళారను కుంటాను."

"అవును అవసరమైన పనివుండి తీసుక వెళ్ళాను. ఆమెకు నచ్చజెప్పి ఆఫీసుకు వరుగెత్తాల్సి వచ్చింది."

"సరే ఒకమాట అడుగుతాను. సరళకు రమేంద్రునికి వివాహం చేద్దామంటే మీరెందు కంగీకరించరు ?"

"పరిహాసాలాడడం నా వ్యాపారం కాదు."

"కాదు పరిహాసాలుకాదు. తప్పకుండా పెండ్లిచేయాల్సి వుంటుంది. రమేంద్రునిలాంటి పిల్లడు మనకెక్కడదొరుకు తాడు !"

ఒకవయపు వరుడున్నాడు. రెండవవైపు కన్యవున్నది. వీళ్ళిద్దరిమధ్యా "యిష్టత" వున్నదా లేదా అనే విషయాన్ని తెలుసుకోవటానికని. కూడా నాకు వ్యవధిలేదు. దూరంగాచూస్తే యిదే ఆటంకంగావుంది."

"మీరు ఏమిటో ఆలోచిస్తున్నారు " అన్నది నీరజ. పెంకితనాన్ని ప్రదర్శిస్తూ-; లేకపోతే ఏఆటంకమూవుండదు "

"పండ్లి చేసుకొనేది ఒకరు, నిజంగా నాకేదయినా ఆలోచన వుండవచ్చు. ప్రయోజనమేమిటి ! ఏమవుతుంది. అయినా నీవు ప్రయత్నం చేసి చూడరాదూ ! "

"నాలుగురోజులుపాటు దానికి శలవు యివ్వండి. దృష్టికి విరామం దొరికితే దానిస్థానంలో అదే నిలబడి పోతుంది."

"శుభదృష్టియొక్క కాంతిలో చెట్లు-చేమలూ గుట్టలు - మిట్టలూ అన్నీ స్వఛ్ఛంగానేవుంటాయి. దానిని ఒక విధ మయిన "ఎక్సరేజ్" అని నీవు గ్రహిస్తేచాలు."

"మీరు అబద్ధం ఆడుతున్నారు. అసలు విషయం -
"సరళకు పెండ్లిచేయడం నాకిష్టంలేదని స్వచ్ఛంగా చెప్ప రాదండీ !"

"అవును. యిప్పుడు నువ్వు అసలు రహస్యాన్ని కని పెట్టావు. సరళ వెళ్ళిపోతే మన తోటగతి ఏమౌతుందో కాస్త ఆలోచించు. లాభ - నష్టాల విషయంకూడా అలాగే ఆలో చించాలి.—అరెరె ! యిదేమిటి ఏమయింది. బాధ ఎక్కు వయిందా !" అంటూ ఆదిత్యుడు ఉద్విగ్నుడయాడు.

"ఏంలేదు నాకే రోగమూలేదు." నీరజ క్రోధపూరిత మైన కంఠంతో అన్నది. "నన్నుగురించి మీరేమి భయపడ నక్కర్లేదు."

ఆదిత్యుడు లేచి వెళ్ళిపోయేముందు నీరజ అన్నది మన పెండ్లిఅయిన తరువాతనే తోటలోని నిమ్మచెట్టు పడి పోయింది మీరు ఆ విషయాన్ని మరచిపోలేదుగదా! ఆ తర్వాత మన మిరువురం గలసి ఆర్కిడ్ యింటిని అలంక రించాము యీ రోజున దాన్ని నాశనంచేయడానికి మీమన స్సెలా అంగీకరించింది?"

"నీవు అనేదేమిటి ?" ఆశ్చర్యంతో ఆదిత్యుడు అన్నాడు. "నాశనం చేయాలనే ఉద్దేశ్యాన్ని నా దగ్గర నీ వెప్పుడైనా చూశావా !"

"సరళకు తోటపని ఏంతెలుసు? నీరజ ఉత్తేజితురాలై అన్నది.

"ఏమంటున్నావ్. సరళకు తెలియదూ? నేను ఏ మేనత్తగారియింట్లో పెరిగి పెద్దవాణ్ణి అయానో ఆమె సర

శకు పెదతల్లే తోటకు సంబంధించిన అన్ని విషయాలూ నేను అక్కడనే నేర్చుకున్నాననే విషయం మీకూ తెలుసు. పూలతోట పెంపకం ఆవులపోషణ యావత్తూ ఆడవాళ్ళకే వప్పచెప్పాలి. వృద్ధిజెందాలిగాని మగవాండ్లకేం తెలుస్తుంది అని అంటూవుండేది మా అత్త. ఆమెకు ప్రతిపనిలోనూ సరళకు సహాయకురాలుగా వుండేది.

"మీరో! సహాయకులు. అవునా ?

"అదిరరేసరి. నాకు యింకా కాలేజీ విద్య నభ్యసించాల్సివ్రుండేది. యింత అవకాశం ఎక్కడ దొరికేవీ! సరళకు అత్తగారే స్వయంగా చదువు చెప్పారు."

"ఆ తోటవల్లనే మీ అత్తగారు సర్వనాశనమై పోయారు. ఆ పిల్లపాదమే అంత. ఆకాలు ఎక్కడ పెడుతుందో అంతవరకూ ఊడ్చిముగ్గు పెట్టినట్లే. నాకుకూడా ఇదే భయం కలుగుతోంది. ఆ సోపానసట్టులాంటి తలకట్టు చూడరాదూ గుర్రంలా ఎగిరెగిరి నడుస్తుంది. ఆడవాండ్లకు పురుషులబుద్ధిలాంటి బుద్ధి వుండడం మంచిదికాదు. అలా ఉంటే ఎంతదూరం పోయినా ప్రొద్దుకెమరే.

"ఇవాళ నీకేమొచ్చింది. ఏమిటీ ఇలా వాగుతున్నావ్. పైత్యం ప్రకోపించలేదుగదా! అత్తగారుతోటను నాటటం పెంచడం ఎరుగుదును. కాని వ్యాపారం చేయడం చూడలేదు. పూదోటను పెంచడం తప్పుపని ఏమీకాదు. అందులో ఆమె అద్వితీయురాలు. అధవా దండగవచ్చినా భరించగలదు. పేరుమాత్రం బాగా సంపాదించింది. కాని పైసానాస్తి. నేను తోటవేయడానికి ప్రేరణకర్త ఆమే. అప్ప

టికే ఆమె సర్వనాశనమై పోయిందన్న సంగతి నాకేమీ తెలియదు. నాకీరోజువరకు ఆనందంగా వున్న విషయ మేమంటే ఆమెడబ్బును అణాపైసలతోసహా ఆమెకుఆమె చావక ముందే ఇచ్చాను" ఇందుకు నేను గర్విస్తున్నాను."

సరళ నారింజరసం తెచ్చింది.

నీరజ అన్నది "అక్కడపెట్టు"

టీపాయ మీద రసాన్నుంచి సరళ వెళ్ళిపోయింది. ఆ రసం అలాగేవుంది. నీరజ దాన్ని ముట్టుకోనైనా లేదు.

"నీవు సరళను ఎందుకు పెండ్లి చేసుకోలేదు"

"ఏమంటున్నావ్ ! నాకర్థం కావడంలేదు. వివాహ విషయం ఎప్పుడూ మేము అనుకోనేలేదు. నాకా ఉద్దేశ్యమే కలుగలేదు."

"ఆ వుద్దేశ్యమే కలుగలేదూ ! యిది మీ కవిత్వమే ననుకుంటాను."

"జీవితంలో యీ కవిత్వపు పిచ్చి పుట్టిన మొట్ట మొదటిరోజు నిన్ను చూచినరోజే. నిన్ను జూచిన తరువాతనే నాకీ కవిత్వపు పిచ్చి పట్టింది. అంతకు పూర్వం మనం అడవులలో-వాటి నీడల్లో కలుసుకొని గడిపాం. కాని యీ క్రొత్త కాలపు సభ్యతలో పెరిగి వున్నట్లయితే ఏమి జరిగేదో-

"ఏందుకు! సభ్యత ఏమి తప్పుచేసింది!"

"సరళ కూడా మంచిదే."

"సరళను నేను సరళగానే భావిస్తున్నాను. యింత వరకూ అలాగే భావిస్తూ వచ్చాను. కాని, ఆమె రూపవతా కురూపియా అని ఎప్పుడూ ఆలోచించలేదు."

"సరే! ఇప్పుడు నిజం చెప్పండి. మీరు ఆమెను కోరడం లేదా?"

"తప్పకుండా కోరుతున్నాను. నేను ఆమెను కోరకుండా వుండటానికి జడపదార్థాన్ని కాదు. పిన్నమ్మకొడుకు రంగూన్‌లో బారిష్టరీ చేస్తున్నాడు. అతన్ని గురించి కొంత లేదు. సరళ తనతోటను కాపాడుతూ వుంటే చాలు. యిక వాడికేమీ అక్కర్లేదు. ఆమె తోటపనిలో ఆమె లీనమై పోయింది. యీ ధ్యాసలో పెండ్లిమాట తలువదు. అని వాడికి గట్టినమ్మకం వున్నది. ఆ నమ్మకంతోనే వాడు వెళ్ళిపోయాడు. సరళ అనాధ అయిపోయింది. అప్పాలవాళ్లు తోటను కాజేశారు. ఆరోజున వచ్చి నన్నాశ్రయించింది. నీకు తెలుసుగా ఆమె ప్రేమించదగినదే కాని ప్రేమించను. ఆమెముఖం నవ్వుతూ కళకళలాడుతూ వుంటే వుండవచ్చు. ఆమె నడక పక్షులు గెంతినట్లుగా వుంటుంది..."

ఆదిత్యుని మాటను ఖండిస్తూ నీరజ అన్నది. "చాలు మీవర్ణన ఇక ఆపండి. ఆమెను గురించి చాలా విషయాలు తెలుసుకున్నాను. ఎక్కువగా చెప్పవలసిన పనిలేదు. అది అసాధారణమయిన పిల్ల కాబట్టి బరాసత్ బాలికా పాఠశాలలో హెడ్‌మిస్ట్రెస్ స్కూలులో పప్ప జెప్పిరమ్మని చెబుతూవున్నాను. ఆవిద్యాలయమువాళ్ళు ఎన్నో పర్యాయములు చెప్పిపోయారు కూడా"

బరాసత్ బాలికా పాఠశాలకెందుకు అండమాను దీవులు లేవు"

"కాదు నేను పరిహాసమాడుతున్నాననుకున్నారా! పరిహాసము కాదు సరళకు మీకు తోటపని యెంతైనా వప్ప జెప్పగలరు. కాని ఆ ఆర్కిడ్ ఇంటివని మాత్రము దానికి వప్పజెప్ప లేను."

"ఎందుకని ఏమి జరిగినది?"

"సరళకు ఆర్కిడ్‌ను గురించి యే మాత్రము తెలియ దని నేను మీకు యెప్పుడో చెప్పినాను"

"సరళకు నాకంటే యెక్కువగా తెలుసునని నేను చెప్పగలను. పిన్నమ్మకు ముఖ్యంగా ఆర్కిడ్ అంటే ఎక్కువ యిష్టము. ఆమె నమ్మకస్తులయిన తన మనుష్యులతో సెలిబస్ నుండి జావానుండి యింక చైనానుండి కూడా ఆర్కిడిక్ తెప్పిస్తూవుండేది ఆమె.

ఈ విషయము నీరజకు కూడ తెలుసు. అందువల్లనే ఆమె అంటె నీరజకు యసహ్యము వేస్తుంది.

"అవును ఆమెకు నీకంటే నాకంటే ఎక్కువగా తెలుసు. అయినా సరే నేను మిమ్మలను యాచిస్తున్నాను. ఆర్కిడ్ యిల్లు కేవలము మీది నాది మన యిరువురిది. కాని మన యిరువురి మధ్య సరళకు దానిమీద యేమాత్రము హక్కులేదు. ఆమె క్షేమము కావాలనుకుంటే ఆమెకు నీతోటసంతా కట్టపెట్టు నాకేమియు చింతలేదు కాని నాబిడ్డ -ఆర్కిడ్ యిల్లు నాకిచ్చివేయండి. నాకు కావలసినది అంత వరకే - ఇన్నిరోజులనుండి నేను ఈ చిన్నకోరికను మిమ్మలను కోరగలను. కాని దురదృష్ట వశాత్తు ఈరోజున శయ్య

మీద నున్నాను. - అంటూ ఆమె వాక్యము పూర్తిచేయకుండానే దిండులో ముఖము దాచుకొని యేడ్వసాగింది.

ఆదిత్యుడు నిశ్చేష్టుడయ్యాడు. యిన్ని రోజులనుండీ తను ఏదో స్వప్నంలో సంచరిస్తున్నట్లుగా భావించాడు. కాని యీ రోజున షాక్ తగిలింది. తృళ్ళిపడ్డాడు. కళ్ళు తెరచి చూచాడు. అసలు విషయమేమిటి? అని. యీ అయోమయపు పరిస్థితిని గ్రహించాడు. నీరజ యింకా ఏడుస్తూనే వుంది. ఆమె ఏడుపు యీనాటిది కాదు. అది బాగా పాతబడి అతనికి అలవాటై పోయింది. నీరజ హృదయంలో అసహ్యబాధాయుతమైన తుఫాను రోజు - రోజు కొక నూతన రూపాన్ని ధరిస్తూ మహాభయంకరంగా మారుతోంది. ఆదిత్యుడు యీ విషయాన్ని గ్రహించలేడు. ఘోరంగా రగిలే అగ్నిజ్వాల ఆర్పటానికి అతను కించిత్ మాత్రం కూడా ప్రయత్నించలేదు. సరళ తోటకుని సరిదిద్దుకొంటోంది. నీరజను చాలా సంతోషంగా వుందని భావిస్తూ వచ్చాడు. కాని తన భావన తారు - మారు అయింది. యీరోజున అతనికో పూర్వస్మృతి జ్ఞప్తి పథానికి వచ్చింది. ఒకరోజున అతను ఏదో మాటమీద మాటవచ్చి సరళను ప్రశంసిస్తూ ఈ కామినీ లతలను నేను యింత అందంగా అలంకరించలేను" అని అన్నాడు. దీనికి నీరజ తీవ్రస్వరూపం ధరించి వికటాట్టహాసం జేస్తూ - "బాబూజీ! అనుకున్నదానికంటే అధికంగా ఎవరికయినా ఏమయినా యిస్తూవుంటే చిట్టచివరకు మిగిలేది సున్న" అన్నది.

యిప్పుడిప్పుడే అతనిబుర్ర పనిచేస్తూంది. చెట్లు-చెటుక్కలు మొదలైన తోటపనిలో సరళది ఏమాత్రమయినా తప్పు కనుపించిందో నీరజ దానిని గోరంతలు కొండంతలుగా జేసి పాపం! దానిని నానా అల్లరిపాలు జేసిగాని వదలదు. నీరజకు సరళను ఉడికించడమో ఏడిపించాడమో పనిగా వుంటుంది చూసేవాండ్లకు. ఆమె అవునన్నది - అది తప్పు అయినా ఒప్పుఅయినా కాదంటుంది. ఆమె కాదన్నది ఔనంటుంది. వీండ్లయిద్దరి వాదన సవుతుల పోట్లాటలా వుంది. అతనేం చేయగలడు.

ఆదిత్యుడు చాలాసేపు ఆలోచించాడు. చివరకు నీరజ చేతిని తన చేతిలోనికి తీసుకొని -"ఏడవకు నీరూ. నీవు ఏమి చెప్పాలను కుంటున్నావో చెప్పు నీవు ఎలాచెపితే అలా చేస్తాను. సరళను పనిలోనుండి తీసివేయాలని అనుకొంటు న్నావు. అంతేనా?

నీరజ తనచేతిని విడలించుకొని అన్నది - "నాకేమీ అక్కర్లేదు తోటనీది. నీసొత్తు. కావాలనుకుంటే ఎవరినైనా పెటుకొనగలవు నాకేం!"

నీరూ! యీమాటలు నీవేనాఅంట. తోటఅంతా నా ఒక్కడిదేనా నీకు లేదా? మనయిద్దరం పంచుకొన్న దెప్పుడు ఆమె నావాటాలోకి వచ్చిందెప్పుడు. ఏం మాట లివి!"

"నేను ఎప్పుడయితే మంచమెక్కానో అప్పుడే యిది అంతా మీసర్వస్వం అయిపోయింది. నేను యీ శిథిల వ్యాధయాన్ని తీసుకొని ఆవిచిత్ర వ్యక్తిత్వంగల సరళవముందు ఎలావుండను మీకు సేవచేయడానికినాదగ్గరఅంతశక్తి యేదీ?

"సీరూ! యింతకుపూర్వం నీవు స్వయంగా ఎన్నో పర్యాయాలు సరళను పిలిచావు. తోటకు సంబంధించిన విషయాలు మాట్లాడినావు. ఎన్నో సంవత్సరాలక్రితం- మీకు జ్ఞాపకం లేదేమో-మీరు యిరువురూ కలిసి నన్ను ఆడించేవారు..."

"ఆనాడు ఆమెకు యింత అహంకారములేదు. భగవంతుడు నన్ను చిన్నచూపు చూశాడు. అందుకనే యివ్వాళ్ల మీ కాళ్లమీద పడి మీదయా భిక్షకోసం యాచిస్తూఉన్నాను. తెలియ జెపుతున్నాను. సరళ అలాంటిది. ఇలాంటిది. ఆమెకు అది తెలుసు యిది తెలియదు. ఆర్కిటెక్ పని అసలే తెలియదు అనికాని, ఆరోజుల్లో నన్ను ఎవరయినాయిన్ని మాటలనడం విన్నారా మీరు? నా యీ పెద్ద రోజుల్లో మాయిద్దర్నీ తూయడానికి ఎందుకొచ్చావ్! యీ రోజున నేను ఆమెను గెలువలేను. ఎలాగెలుస్తాను చెప్పు?"

సీరూ యీరోజున నీనోటిగుండా వచ్చేమాటలను నేను కలలో కూడా వూహించలేను. నాకు యీమాటలను వింటు వుంటే నీస్థానంలో మరెవరయినా మాట్లాడుతున్నారేమో నని పిస్తుంది.

"కాదు నేనే మాట్లాడుతున్నాను. నీభార్యని సీరూనే, ఆమె మనస్సును నీవు యింతవరకూ తెలుసుకోలేక పోయావంటే నాకు ఏడుపొస్తుంది పెండ్లి అయిన తర్వాత మీరు తోట అంటే మీ ప్రాణాలకన్నా మిన్నగా ప్రేమిస్తారని తెలుసుకున్నాను. అప్పటినుండి నేను పూర్తిగా మారిపోయాను. మీకంటే అధికంగా నేనుకూడ తోటను ప్రేమించి

సేవించ సాగాను. లేకపోయినట్లయితే తోటను గురించి మీకూ -నాకూ మధ్య పెద్ద యుద్ధం జరిగేది. రాత్రింబవళ్లు నేను అవిరళంగా సాగించిన కృషి దేన్ని గురించి? యీ విషయం మీకు కూడా తెలును. నేను ఏవిధంగా దాన్ని నాలో లీనం చేసుకున్నానో కూడా మీకు తెలును. తోట యొక్క ప్రత్యణువులోనూ లీనమై నీరజ అన్నా. తోట అన్నా ఒకటే కాని, రెండు కావు అన్నట్లు నిండిపోయాను.

"అవును. ఎవరు కాదన్నారు!"

"అలా వుండండి. యివ్వాళ నేనో వింతదృశ్యం చూస్తున్నాను. ఆ తోటలో ఈనాడొక మనిషి. పరాయి మనిషి చాలా సునాయాశంగా ప్రవేశించింది. అయినప్పటికి నీకు ఏమయినా బాధ కలిగిందా? నా ప్రాణంతో సరిసమాన మైనతోట-అది తోటకాదు. నాహృదయం-నా శరీరం _నా సర్వం. అదేనేను - నేనే తోట. అలాంటి నా శరీరాన్ని చీల్చి అందులో మరొక ప్రాణియొక్క జీవాన్ని నింపబూనడం నీకు న్యాయమేనా? యీ తోట నా శరీరంతో సరిసమాన మైనదికాదా? నేనే నీస్థానంలోవుంటే దీన్ని సహించగలనా."

"ఏం చేస్తావు!"

"ఏమిచేసేది చెప్పనా!" నీరజ అన్నది తోటను తారు మారు చేసేదాన్ని. ఒకరి స్థానంలో పదిమంది మాలీలను పెట్టి పనిచేయించేదాన్ని. కాని ఎలాంటి ఆడదాన్నీ ఆ తోటలోనికి ప్రవేశించ నిచ్చేదాన్నికాదు. నా కంటే కూడా తోటపని అధికంగా తెలుసునని గర్వించే ఒకఆడదాన్ని ముఖ్యంగా సరళలాంటివాళ్ళను తోటలోకి అడుగుకూడా

పెట్టనియ్యను. ఆమె యొక్క యీ అహంకారం ద్వారా నీవు రాత్రింబవళ్ళు నన్ను అవమాన పరుస్తూనే వున్నావు. నా శక్తిని నిరూపించడానికైనా నా చేతిలో ఏమార్గమూ లేదు. నేను చావసిద్ధంగా వున్నాను. అలా ఎందుకు జరిగిందో నేను తెలుసుకొన్నాను.

"ఊఁ! చెప్పు".

"నీవు నాకంటె ఆమెను అధికంగా ప్రేమిస్తున్నావు. నీవు యింతవరకూ యీ విషయాన్ని నాదగ్గర దాచిపెట్టావు".

ఆదిత్యుడు కొన్ని క్షణాలు తన వెంట్రుకల్లో వ్రేళ్ళు దూర్చి తలపట్టుకొని కూర్చున్నాడు. తరువాత విహ్వల హృదయంతో రుద్ధకంఠంతో అన్నాడు—"నీరూ! పదిసంవత్సరాలనుండి సుఖంలో-దుఃఖంలో ప్రతి అవస్థలోనూ ప్రతి పనిలోనూ నీవు నన్ను బాగా ఎరుగుదువు నా మనస్సు నీకు తెలుసు. తెలిసికూడా నీవిలా మాటాడుతున్నావంటే నేను ఏమి జవాబు చెప్పగలను? చెప్పు! నేను వెళ్లుతున్నాను. నేను నీదగ్గర వుంటే నీ ఆరోగ్యం ఇంకా చెడుతుంది. పరష్నర్ దగ్గర వున్న జపానీయుల యింట్లో వుంటాను. అవసరమైతే పిలిపించు."

# 5

కాలవ అవతలగట్టుమీద నేరేడుచెట్టు చాటుగుండా ఆకాశంలో చంద్రుడు తొంగిచూస్తున్నాడు. అక్కడేవున్న వాసంతిక చిగురుటాకులు, నిద్రనుండి మేల్కొంచిన పసిబిడ్డల కండ్లలా ఎర్రగా వున్నాయి. దానిపూలు పచ్చిబంగా

రంలా మెరుస్తున్నాయ్. వాటిసుగంధం, పొగమంచులా నలుదిశలూ ఆక్రమించుకొంటుంది. కాలవగట్టుమీద నేపచ్చని పచ్చికలో విషాదమూర్తిలా సరళ కూర్చొనివుంది. గాలి ఏ మాత్రంలేదు. చెట్లఆకులు కదలడంలేదు. ఎక్కడా చలనం లేదు చుట్టూ నిశ్శబ్దంగావుంది. కాలవలోని నీరు చలనరహితంగా నిలిచిపోయి, తోడుపెట్టిన పాలు క్రింద ఒలికి భూమి మీదనే గడ్డకట్టిఉన్నట్లు, తెల్లనిచంద్రకిరణాలలోతళతళలాడుతున్నాయ్.

సరళకు వెనుకనుండి ఒకప్రశ్న వినిపించింది.

"నేను రావచ్చా?"

రమేంద్రుడు వచ్చి రేవులోని మెట్లమీద, ఆమె కాళ్ల దగ్గరలో కూర్చున్నాడు. సరళ ఆతృతగా అన్నది. "అదేమిటి? మీరు యిక్కడ కూర్చున్నారేం? లేచి పైన కూర్చోండి."

"ప్రాచీన చరిత్రల్లో స్త్రీలవర్ణన పాదపల్లవులనుండే ప్రారంభింపబడుతుంది. నీ ప్రక్కన ఖాళీ ఉంటే కూర్చుంటాను. నీ చేతిని యిలా యివ్వు"

సరళ చేతిని తీసుకొని ముద్దుపెట్టుకున్నాడు రమేంద్రుడు. "రాణిగారికి అభివందన మాచరిస్తున్నాను. స్వీకరించండి" అన్నాడు.

అతను లేచినిలుపబడి సరళ నెత్తిమీద రంగువేశాడు. సరళ తృళ్ళిపడి అడిగింది." "ఏమిటిది?"

"నీకు తెలియదా? యివ్వాళ ఉగాది. మీరంతా చెట్టు-చెట్టుకూ, కొమ్మ-కొమ్మకూ పూజలుచేసే సుదినం.

వసంతం మనుష్యుల శరీరానికి కాదు హృదయాలకు హత్తుకుంటుంది. దానిని బయటపెట్టాలి. లేకుంటే నీ వా అశోక వనంలో నిర్వాసితురాలివై పోతావు."

"మీరు చెప్పేదేమిటో నాకు అర్థం కావడంలేదు. మీ భావను అర్థం చేసుకొనే శక్తి, నేర్పూ నాకులేదు."

"శక్తియుక్తుల ప్రమేయమేముంది. మగ పక్షి పాట పాడుతూవుంటుంది. ఆడపక్షి మౌనంగా దాన్ని వింటూ కూర్చోవడమే మగపక్షికి జవాబు తెలిసిందా! యిక కూర్చోరా?"

సరళ చిరునవ్వుతో అతనివయిపు చూసింది, అతడామె దగ్గర కూర్చున్నాడు.

చాలాసేపటివరకు యిద్దరూ మౌనంగా వున్నారు.

"జైలుకు ఎలా వెళ్ళాలో చెప్పుకొంటాం." అన్నది సరళ మౌనశ్చేదాన్ని కలిగిస్తూ –

"నీకు జైలుకు వెళ్ళడానికి దార్లు కరువయాయా!" నవ్వుతూ రమేంద్రుడన్నాడు." యీరోజుల్లో జైలంటేవిలువ లేదు. జైళ్ళకెళ్ళడం చాలా తేలిక అయినపని. ఏ విధంగా జైలుకు వెళ్ళకుండా వుండగలం అనే ప్రశ్నకు జవాబీయిడం కష్టం. జైలుకు వెళ్ళకుండా వుండాలంటే దారిలేదు. కాని, జైలుకెళ్ళాలంటే అన్నీదారులే."

"నేను పరిహాసా లాడడంలేదు. నేను బాగా ఆలోచించుకొనే అడుగుతున్నాను. నాకు ముక్తి అక్కడేవుంది."

"నామాట కూడా ఒకటివిను. హృదయాన్ని విప్పి నీ మనస్సులోని విషయం చెప్పు."

"అన్ని విషయాలూ చెపుతాను. నీవుఅంతా తెలుసు కున్నట్లయితే ఆదిత్యుని ముఖంకూడా చూడవు."

"అని నేనూ అనుకుంటున్నాను."

"ఇవ్వాళ సాయంత్రం నేనువరండాలో కూర్చొని ఉన్నాను. అమెరికానుండివచ్చిన క్లావర్సు క్యాటలాగులోని బొమ్మలను చూస్తూ పేజీలు తిరగవేస్తున్నాను. రోజూ సాయంత్రం దాదాపు నాలుగన్నర గంటలకు కాఫీత్రాగిన తరువాత, తోటపనుల విషయం మాట్లాడడానికి నన్ను ఆది త్యుడు పిలుస్తూ ఉండేవాడు. కాని ఇవ్వాళ నన్ను పిలువ లేదు. అటునుండి ఇటు, ఇటునుండి అటు లోపలనే పచారు చేస్తున్నారు. మాలీలు పనిచేస్తున్నారు కాని వారివైపుకూడా తిరిగికూడా చూడడంలేదు. ఒకొక్కప్పుడు వారు నాదగ్గర కొస్తున్నట్లు భావించేదాన్ని కాని అలా జరుగలేదు. బల మైన మనిషి - వేగంగా నడవడం, దృఢంగా పనిచేయడం అప్రమత్తుడై ఉండడం, ముఖంమీద చిరునవ్వు - ఇవన్నీ ఈరోజునఆయనలో లేవు. బయట ఏమిజరుగుతున్నదో అన్న ఆలోచనకూడా లేదు. బాగా ఆలోచనలో మునిగినవాడులా ఉన్నాడు. చాలాసేపటి తరువాత తిన్నగా నా దగ్గరి కొచ్చాడు. మరొకరోజున అయినట్లయితే చేతిగడియారాన్ని చూసుకొని "టైంఅయిపోయింది" అనేవాడు. నేనుకూడా లేచి వెళ్ళేదాన్ని. కాని ఈ రోజున అలా అనలేదు. కుర్చీ దగ్గరకు లాక్కొని దగరకూర్చున్నాడు నా చేతిలోని క్యాట లాగును తీసుకొని "బొమ్మలు చూస్తున్నావా!" అంటూ పేజీలు త్రిప్పసాగాడు. కాని దాంట్లో దేన్నీ చూసినట్లులేదు.

అకస్మాత్తుగా నా ముఖంవయిపు చూశారు. ఆయనముఖం లోని అంతరార్థాన్ని నేను గ్రహించాను ఆయన హృదయం ఆయన్ను- "ఏమిటీ విలంబనము. చెప్పదలచుకున్న దేదో శుభ్రంగా చెప్పేశెయ్. ఆలస్యమెందుకు!" అని శాసిస్తున్నట్లుగావుంది. వెంటనే ఆయన క్యాటలాగును క్రిందసారేసి తలవంచుకొనిఅన్నారు. "చూస్తున్నావాసరూ!" ఆయనకంఠంలో అలసటవుంది. మళ్ళీ మాట్లాడలేదు. మళ్ళీ క్యాటలాగును తీసుకొని దాన్నిచూస్తూ కూర్చున్నారు. కొద్దిసేపటి తర్వాత అకస్మాత్తుగా మళ్ళీనావయిపుచూశారు మనస్సులో ఏమనుకొన్నారో క్యాటలాగును నామీాద విసిరి కొట్టారు. విసురగా లేచివెళ్ళి పోతూవుంటే నేనుఅడిగాను. తోటలోకి వెళ్ళుచున్నారా?" అని. దానికివారు "లేదు బయట అర్జంటయినపని ఒకటివుంది." అంటూ పరుగెత్తి కెళ్ళారు.

"పరుగెత్తు కెళ్లారా?"

"అవును. జైల్లో బంధింపబడ్డ దొంగ ఎవరూ చూడకుండా జైల్లోనుండి పారిపోతున్నట్లుగావుంది. వారిపోకడ."

అన్నయ్యగారు నీతో ఏమయినా చెప్పాలని వచ్చినట్లు నీకు అనుమానంగా వున్నదా?"

"అవును. వారు నీతోట ఒకటియిదివరకే నాశనమై పోయింది. యిదిగో, దీన్నికూడా బూడిదచెయ్యి." అని అంటారను కున్నాను."

"ఎందువల్ల?"

"ఏమో నాకలా తోచింది."

77 30 24 10 77

"నేను జైలుకు వెళ్ళకుండా తప్పేట్లులేదు." అన్నాడు రమేంద్రుడు దీనంగా సరళవైపు చూస్తూ -

సరళ మలినంగా నవ్వి - "అయితే నన్నాదోవను మూయమంటూరా? నాకేమిచేతనవుతుంది. దాన్ని సర్కారు-ప్రభుత్వమే తెరచివుంచుతుంది.

"అయితే నీవు కొమ్మల్లో చుట్టుకొని దానిలో పడి వుండు నేనేమో చేతులకు సంకెళ్ళు ధరించి పోలీసువాండ్ల మధ్యన గర్వంగా తల ఎత్తుకొని జైలుకు వెళ్తాను. యిలా జరుగుతుందా? జరగటానికి వీల్లేదు నేను ప్రతిఘటిస్తాను."

"ఏం చేస్తావు?"

"నీ శనిగ్రహంతో యుద్ధం చేస్తాను. నీ జాతకంలో నుండి వాడిపేరును చెరిపేస్తాను; - తరువాత చాలా పెద్ద ఖాళీ దొరుకుతుంది. చాలాపెద్దది."

"నీదగ్గర నేను ఏమీ దాయలేను. కొద్దిరోజులనుండి నాముందొక విషయం జరుగుతూ వుంది. యివాళ చెబుతున్నాను. ఏమీ అనుకోకు. అనుకుంటావా?"

"చెప్పకపోతే తప్పకుండా అనుకుంటాను."

"చిన్నతనంనుండి ఆదిత్యుడు నేనూ ఒకేచోట కలిసి మెలసి తిరుగుతూ పెద్దవారమయ్యాము. అన్నా చెల్లెల్లా కాదు. అన్న-తమ్ముళ్ళలాగు. మే మిద్దరం అరమరికలేకుండా కలిసిమెలిసి యీభూమినిత్రవ్వాం. మొక్కలు నాటినాము. అమ్మా - పిన్నమ్మా; యిద్దరూ టైఫాయిడ్ వల్ల రెండు మూడు రోజులతేడాలో చచ్చిపోయారు. అప్పుడు నావయస్సు ఆరు సంవత్సరాలు, తరువాత రెండు సంవత్సరాలకు నాన్న

గారు మరణించారు. వారి జీవితంలో అన్నిటికంటే ప్రియ మయినది మా పూదోట. నేను దానికినాపరిపూర్ణమైన శక్తిని యిచ్చయినా సరే ఆ తోటను రక్షిస్తానని వారికి గట్టి నమ్మకంవుంది. అదేవిధంగా నేనూ నా శాయశక్తులా రక్షించాను. వారికి అపనమ్మకం అంటూలేదు. అందర్నీ నమ్మే వారు. వారి దగ్గర అప్పుగా పుచ్చుకొన్న డబ్బును యిచ్చి తన మిత్రులు తోటను రక్షిస్తారని తలిచాడు. అప్పులన్నీ ప్రోగుచేసింది. కేవలం ఆదిత్యుడే—ఇంక ఎవ్వరూ మాట్లాడనైనాలేదు. యీ చరిత్రనంతా నీకు కాస్తోకూస్తో తెలుసు. కాని చరిత్రనంతా చెప్పాలని మనస్సు కలుగుతోంది."

"నా కిప్పుడిది అంతా క్రొత్తగావుంది"

"తరువాత ఏం జరిగిందో నీకు తెలుసుగా! తోట అప్పుల పాలయింది. నా జీవితశకటంవచ్చి ఆదిత్యుని ఇంటి ముందు ఆగింది. మొదటిలాగానే నేను వారితోపాటు-అన్న తమ్ముళ్ళలాగ ఇద్దరు బంధువుల్లా కలిసిపోయాము అప్పటి నుంచి ఆదిత్యుని ఆశ్రయంలోనే వుంటున్నాను. ఇది ఎంత నిజమో అలాగే వారినికూడా నా ఆశ్రయంలో ఉంచుకున్నాను అనేది నిజం. ఇందులో ఏమాత్రం అబద్ధంలేదు. పోలిక పెట్టినట్లయితే- అదీ-ఇదీ రెండూ ఉపకారాలే. రెండూ ఒకటే. నేను గట్టిగా చెప్పగలను. ఇందులో సిగ్గు పడాల్సిన విషయమేమీ లేదు. దీనికి పూర్వం మేమిద్దరం ఒక్కచోట వుంటున్నప్పుడు మాపరస్పరమైత్రిని ఆధారంగా తీసుకొని మావయస్సు మళ్ళీ ఇప్పుడు కలుసుకొంది. ఈ విధంగానే జీవితమంతా జరుగుతుందా? ఇప్పుడు చెబితే

ఏమవుతుంది! —

"విషయాన్ని పూర్తికానియ్యి." —

"తలవని తలంపుగా నేనొకరోజున పెద్దదాన్నయాను. ఆ రోజుల్లో మేము పరస్పరము అన్నదమ్ముల్లా కలసిమెలసి పనిచేసేవారము. కాని యిప్పుడది వరోత్తమంగా మరోరూపం ధరించింది యీనాడు. నీవు అన్ని విషయాలను చాలా త్వరగా గ్రహించగలవు. నాదగ్గర నీకు దాపరికం లేదు. నామీద వదినగారు కోప్పడుతుంటే మొదట ఆశ్చర్యపడే దాన్ని నాకేమీ అర్థమయేది కాదు. యింతవరకూ నన్ను నేను పరిశీలించుకోలేదు. వదిన ఎందుకు కోప్పడుతుందో తెలియలేదు. కాని యిప్పుడు నాకు అసలు రహస్యం తెలిసింది. నేను ఆత్మపరిశీలన చేసుకున్నాను. నాకు నేనే పట్టుపడ్డాను. నామాటలు అర్థమవుతున్నాయా!

బాల్యదశలో అంతరించిన మీ ప్రేమ మళ్ళీ యీనాడు అవతరించి ఆర్భాటం చేస్తుంది."

"నేనేమి చేయను చెప్పు. నన్ను ఏమిచేయమంటావ్!" అంటూ అంటూనే సరళ రమేంద్రుని చేయిపట్టుకుంది.

రమేంద్రుడు మౌనంగా వున్నాడు.

"యిక్కడ వున్నంతవరకూ నా అపరాధం పెరుగుతూనే వుంటుంది." అన్నది సరళ.

"అపరాధ మెవరికి?"

"వదినకు"

"చూడు సరళా! నేను యీ విషయాలను విశ్వసించను. మన ధర్మాన్ని మనం నిర్వహించడంలో అపరాధ

మేమీ లేదు. మీ యిరువురి కలయిక ఏనాటిది; ఎన్ని సంవత్సరాలు గడిచాయ్. ఆనాడు ఎక్కడున్నదీ వదిన."

"ఏమంటున్నావు రామూ! నా కోర్కెకు ఆధారాన్నిస్తూ నన్ను అధః పతనం చేయాలను కుంటున్నావా! కొంచెం ఆదిత్యునికూడా దృష్టిలో వుంచుకొని మాట్లాడు."

"అవును. నువ్వు ఏమనుకుంటున్నావ్ అసలు నీవుద్దేమిటి? నీకు తలిగిన దెబ్బ ఆయనకు మాత్రం తగల లేదనా నీ వుద్దేశ్యం."

"రామూ! అక్కడున్నావా?" అనే ధ్వని వచ్చింది. వెనుక నుండి.

"అవునన్నయా!" అంటూ లేచి నిలబడ్డాడు.

"మీ వదిన నిన్ను పిలిచింది. ఇప్పుడే ఆయాకూడ నిన్ను పిలవడానికి వచ్చింది." అన్నాడు ఆదిత్యుడు.

రమేంద్రుడు వెళ్ళిపోయాడు. సరళకూడా లేచి వెళ్ళి పోబోయింది. —

"వెళ్ళకు సరళా! ఆగు. కాస్త యిలా కూర్చో!"

ఆదిత్యుని ముఖం చూచి సరళ హృదయం ద్రవించింది. ఎంతో బాధ పడింది. ఎల్లప్పుడూ ఎంతో హుషారుగా వుంటూ వుండేవాడు. ఎడతెగని పరిశ్రమ చేసేవాడు. ఉదారహృదయుడు. సత్యవాదీ అయిన ఆదిత్యుని ముఖం మలినమై పోయింది. అనంతసాగరంలో తుపానులో చిక్కుకొని చుక్కాని తెగి దారీ తెన్నూ లేకుండాపోయే నావలా బాధపడుతున్నాడని ఆయన ముఖమే చెబుతోంది.

"సరళా!" ఆదిత్యుడన్నాడు — "మన మిరువురం

ఒక్క శరీరంగా యీ యింట్లో జీవనం మొదలు పెట్టాము. ఎన్నడూ; ఏ నాడూ కూడా ఏ కారణంగానైనా మన యిరువుర అభిప్రాయాలు తారు మారు అవుతాయని మనం కలలో కూడా ఊహించలేదు. అవునా ? కాదా !

"అంకురంలో ఉన్నది. వృక్షమైన తర్వాత పోతుందా మీ విషయాన్ని తప్పకుండా ఒప్పుకుంటే నాకు గోదారే"

"ఆ భేదం బాహ్యంగా కండ్లకు కనుపించడానికే కాని అంతః కరణంలో దానికి చోటులేదు సరళా ! ఇవ్వాళ నిన్ను నా దగ్గరినుండి తొలిగించమని హుకుం వచ్చింది. నన్ను యీ విషయం ఎంత కలవరపరచిందో, హృదయానికి ఎంత గాయం ఏర్పడిందో ఆ యీశ్వరుడికే తెలుసు. సరళా ! యింత అగస్మాత్తుగా మన ఇరువురకు ఎంత షాకు తగిలిందో వింటున్నావా !

"వింటున్నాను. నీ కంటేముందే నాకు తెలిసింది."

"నీవు సహించావా ?"

"అవును. ఏంచేయను."

"కాని, పురుషోత్తములలో కంటే స్త్రీలలో సహనశీలత అంత ఎక్కువగా వుంటుందా ?"

"మీరు పురుషులు దుఃఖంతో పాటే ఊగిపోతారు. చరిత్రలోని పురుషులంతా యిలాగే వున్నారు. కాని మా స్త్రీ జాతి మాత్రం యుగయుగాలనుండి దుఃఖాన్ని సహిస్తూనేవచ్చింది, బహుశా సహిస్తూనే పోతుంది. అశ్రువులు-ధైర్యం-యీ రెండూ తప్ప ఆమె కెలాంటి సానుభూతీ అవ

సరంలేదు."

"నిన్ను నా నుంచి ఎవరో వేరుచేస్తారట." పళ్ళు నూరుతూ అన్నాడు ఆదిత్యుడు. "నేను అలా జరగనీయను. ముమ్మాటికీ జరగనీయను. యిది అన్యాయం—అక్రమం." అంటూ అతను పైకిచూస్తూ ఏదో అదృశ్యశక్తితో పోట్లాడే వాడిలా తయారయాడు.

"సరళ అతని చేతిని తన చేతిలోనికి తీసుకొని నెమ్మదిగా దువ్వుతూ, తనలో తానే గొణుక్కుంటున్నట్లుగా మాట్లాడింది— "న్యాయాన్యాయాలు, కాదు. సంబంధ బాంధవ్యంగా ధర్మపత్ని అనిపించుకో లేనప్పుడు ఎవరికయినా బాధ కలుగుతుంది."

"నీవు ఆ బాధను సహించలేవు సరళా! నాకు బాగా తెలుసు. ఒక రోజుటి సంఘటన నాకు బాగా జ్ఞాపకమున్నది. నీ వెంట్రుకలు ఎంత నిడుపైనవి ఎంత మంచివి-ఎన్నికలల్సు వున్నాయి! నీకు నీ వెంట్రుకలమీద మంచి శ్రద్ధవుండేది. అందరూ తలో విధంగా అని ఆ శ్రద్ధ పెంపు చేసేవారు. ఒక రోజున మన ఇద్దరికీ యుద్ధంజరిగింది. మధ్యాహ్నం నీవు నిద్రపోతున్నావు. నేను నెమ్మదిగా కత్తెర తీసుకవచ్చి కాసిని వెంట్రుకలు కత్తిరించాను యింతలో నీవు మేలుకున్నావు. అప్పుడు నీనల్లని కండ్లు ఇంకా నలుపెక్కాయి నీవు అన్నావు "నీవు ఇలాచేసినందువల్ల నీ పక్షమైపోతాననుకున్నావా?" అని నా చేతిలోని కత్తెర లాక్కొని మెడవరకు వెంట్రుకలన్నీ కత్తిరించుకున్నావు. అత్తమ్మ నిన్ను జూచి నిశ్చేష్టురాలయింది. ఇదేమిటని అడిగింది. నీవు శాంతియుతంగా నవ్వుతూ

—"బాగా వేడిచేస్తుందమ్మా" అన్నావు. పాపం ఆమె నమ్మివెళ్ళిపోయింది."—

సరళ కిల కిల నవ్వింది.

"అయితే మీరు దాన్ని నాలోని కుమతగా భావించారను కుంటాను" సరళ నవ్వుతూ అన్నది. "ఏమాత్రం కాదు ఆ రోజున నీవు నన్ను ఎంతకష్టపెట్టావో నేను నిన్ను అంతకంటె ఎక్కువగానే బాధపెట్టాను. అవునా కాదా! చెప్పు."

"అవును." ఆదిత్యుడు అన్నాడు. "క్షతిరించిన నీ వెంట్రుకలను జూచి నా మనస్సు ఎంత బాధపడ్డదను కున్నావ్? ఏడుపే తక్కువ. రెండవరోజున నీకు నాముఖాన్ని కూడా చూపించలేక పోయాను. రీడింగురూంలో నిశ్శబ్దంగా కూర్చున్నాను. నీవు గదిలోనికి వచ్చి తోటలో పనిచేయ డానికి చెయ్యి పట్టుకొని లాక్కుపోయేంత వరకూ నీ ముఖం చూడడానికికూడా సిగ్గు వేసింది. నువ్వు మాత్రం ఏమీ తెలియని దానిలాగేవున్నావ్ ఇంకోరోజు—పాల్గుణమాసంలో, ఆరోజు పెద్దతుఫాను పట్టి ఆతోటలోని గుడిసె కప్పంతా లేచి పోయినప్పుడు నీవు వచ్చి—..."

"ఇక వూరుకోండి. తెలుసుకొన్నాను." — వేడి నిట్టూర్పొకటి వదలి సరళ అన్నది. అవి గడచిపోయిన రోజులు మనం కావాలనుకున్నా మళ్ళారావు."

అంటూ లేచి నిలువబడింది సరళ.

ఆదిత్యుడు వ్యాకులతతో ఆమె చేతిని పట్టుకొని అన్నాడు. "సరళా! వుండు పోమాక. ఇప్పుడే వెళ్ళొద్దు.

ఏదో ఒక రోజున పోవాల్సి వస్తుంది. అప్పుడు..." అంటూ అతడు త్రేజితుడయాడు. "కాని—ఏదో ఒకరోజున ఎందుకు పోవాలి! నీవు చేసిన తప్పేముందని! ఈర్ష్య—గర్వం! యీరోజున, పది సంవత్సరాల గృహస్థ- జీవన -యాత్రకు పరీక్ష జరుగుతూవుంది. దానికి ప్రతి ఫలమాయిది అసలు ఏవిషయముమీద యీ ఈర్ష్య? అయితే నిన్నుచూసిన నాటి నుండి యీనాటి వరకు యిరువై మూడు సంవత్సరాల చరిత్రను మర్చిపోవాలా!"

"ఇరువైమూడు సంవత్సరాల నాటి విషయం నేను చెప్పడం లేదు. ఇరువైమూడు సంవత్సరాల తరువాత-యీనాడు-యీ అంత్యఘడియలకు కూడా ఏ కారణంలేదా? ఆత్మవంచన చేసుకోవద్దు. నిజం చెప్పక తప్పదు. నీకూ నాకూ మధ్య ఏ విషయం అయినా సరే అస్పష్టంగా ఉండకూడదు.

ఆదిత్యుడు కొంతసేపు స్తబ్ధుడై ఉండిపోయాడు. తరువాత అన్నాడు — "ఇప్పుడు దాపరికమేమీలేదు. నీవు లేని నా జీవితమే నిరర్థకమని నా అంతరాత్మ చెబుతోంది. నా జీవన ప్రథమ ఘడియల్లో నిన్ను ఎవరినుండి అయితే పొందానో వారు తప్పక నిన్ను ఇక యెవ్వరూ నానుండి వేరు చేయలేరు"

"మాట్లాడుతూ దుఃఖాన్ని ఇంకా పెంపు చెయ్యకు నన్ను కాస్త స్థిరంగా కూర్చుని ఆలోచించుకో నివ్వు"

"ఆలోచనలతో గతాన్ని త్రవ్వకు. భావినిచూడు. మొట్టమొదట చిన్నిగాంట్లో మన యిరువురంజీవనం ప్రారం

భించినపుడు ఏమాలోచించి చేశాం. యిప్పుడా రోజులను ఎలా మరచిపోగలం ! నీ విషయం నేను చెప్పలేనుగాని నాకు మాత్రం అసాధ్యం."

"నీ కాళ్ళు పట్టుకుంటాను నన్ను యింకా బలహీన పరచకు. నా దారికి అడ్డురాకు."

"నీ దారికాదు" ఆదిత్యుడు ఆమె రెండు చేతులను పట్టుకొని అన్నాడు "ఆ దారిలో నిన్ను వెళ్ళనివ్వను. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. యిరువైమూడు సంవత్సరాలు తరువాత యీ మాటలు, యీనాడు యింత నిర్భయంగా అనగలిగాను యీ యిరువైమూడు సంవత్సరాలనుండి నా హృదయంలో అణిగిపడివున్న యీమాట యీనాడు ఏదో దైవకృపవల్ల బయటకు వచ్చింది, నీవు మళ్ళీ దాన్ని అణచటానికి ప్రయత్నించవద్దు. దాన్ని అణచటం పిరికితనం అవుతుంది. యింకా అధర్మంకూడాను."

"ఆగు. ఎక్కువగా మాట్లాడనద్దు. యీ ఒక్క రాత్రి నన్ను క్షమించు."

"సరళా ! నేను ఒక స్త్రీ కృపాకాంక్షిని. జీవితంలో అంతిమ రోజువరకూ నీ కృపారసాధారంమీద జీవిస్తూ నీ క్షమాభిక్ష వర్షించే ఉపాసకుణ్ని. నేను అంధుణ్ణి అయాను. నిన్ను గుర్తించలేక పోయాను పొరపాటున పెండ్లిచేసుకున్నాను నీకు అన్యాయం చేశాను సరళా ! నన్ను క్షమించవూ."

"పెద్దమ్మ నాకిచ్చినవస్తువు తనతోటకోసమే కావచ్చు. లేకుంటే—"

"కాదు. కాదు. నీ లోతైన హృదయంలో ఆవిషయం యిప్పటికీ ఉంది. అవును నీవు చెప్పింది నిజం. నీ పది తెలుసుకోనకుండా మాట్లాడుతున్నావ్. నీవు నా కెందుకు చైతన్యాన్ని యివ్వలేదు. మన ఇరువుర దారి ఎందుకు ఇలా రెండుగా అయింది?"

"అయితే అయింది. అంగీకరించవలసిన తప్పును అంగీకరించకుండా ఎందుకలా పోట్లాడుతావ్? ఎందుకిలా నటించడం? ఏమి జరుగనున్నదో రేపు పగలు నిర్ణయిద్దాం.

"సరే! కాని, యీ చల్లని వెన్నెలరాత్రిలో ఇంత వరకూ నాతో మాట్లాడినందుకు మీకో బహుమానమిస్తాను." అంటూ అతను తోట - కుటీరంలోకి వెళ్ళాడు, ఆ యింట్లో ఒక ఊయలవుంది. దాంట్లో తోట పనిముట్లు వున్నాయి. ఆదిత్యుడు నాగకేశపు పూలగుత్తిని తీసుకవచ్చి- "నాగకేశరాలంటే నీకు మంచియిష్టం. నీ భుజంమీద పడి ఆరాడుతున్న ఆ పైటకొంగునలో పెట్టనా!" అన్నాడు.

సరళ మాట్లాడలేదు. ఆదిత్య సంతోషంగా ఆ పూలను ఆమెతలలో తురిమాడు. సరళ లేచినిలువబడింది.- ఆదిత్యుడు ఆమెముందు నిలువబడేఉన్నాడు. అతను ఆమె రెండు చేతులూ పట్టుకొని ఆమె ముఖంలోకి, ఆకాశంలోని చంద్రుడు చూస్తున్నట్లుగా చూస్తున్నాడు.

సరళచేతిని విడిపించుకొని పారిపోయింది. ఆదిత్యుడు ఆమెను వెంబడించలేదు - కనిపించినంతవరకు చూస్తూ ఉండిపోయాడు. తరువాత అక్కడనే చతికల పడ్డాడు.

నౌకరువచ్చి - "వంట తయారయింది బాబూ !"
"నాకు అక్కర్లేదు" ఆదిత్యుడు అనా

# 6

రమేంద్రుడు తలుపు దగ్గరనుంచే అడిగాడు "నన్ను పిలిచారా వదినా !" అని.

నీరజ దుఃఖ భరితమైన కంఠాన్ని సరిచేసుకొని "అవును యిలారా !" అన్నది.

గదిలోని బల్బులన్నీ ఆర్పివేయబడిఉన్నాయి. కిటికీలు తెరిచిఉన్నాయి వెన్నెల పడుతోంది గదిలోని పక్కమీద నీరజ ముఖంమీద ఆ ప్రక్కమీద, తలవైపు ఉన్న పూల మీద వెన్నెల పడుతోంది. దిండ్లమీద దాదాపు పండు కొని నీరజ ఉన్నది - ఆమె కిటికీగుండా దూరంగా - బాహ్య ప్రపంచాన్ని కాదు. ప్రకృతిని చూస్తూఉంది. అటు -తోట అవుతల, పావు చెక్క చెట్లయొక్క వరుసలుకనుపిస్తున్నాయి. గాలి యిప్పుడే సముద్రమునుండి మేల్కొన్నట్లుంది; చెట్ల ఆకులు కదలుతున్నాయి మామిడి పూతనుండి సువాసన వస్తోంది. చాలాదూరంనుండి పాటక ప్రజలు డోలక్ మీద పాడు తున్న గ్రామ్య గీతం శ్రావ్యంగా వినిపిస్తూఉంది. గదిలో క్రింద భూమిమీద ఒక పళ్ళెం పడిఉన్నది. దాంట్లో కొన్ని మంచుముక్కలు సందేశొస్తున్నయ్. రోగిమనస్సుకు, విశ్రాం తికి భంగం కలుగకుండా ఇల్లంతా ప్రశాంతంగా, నిశ్శబ్దంగా ఉన్నది. చెట్లమీద పక్షుల కిలకిలారవము. ప్రశ్నోత్తరాలు

వినిపిస్తున్నాయి. రమేంద్రుడు సరళ మంచంవద్దకు కుర్చీని లాక్కొని కూర్చున్నాడు. ఏడుపు వస్తుందేమోనన్న భయముతో నీరజ చాలాసేపు మాటాడకుండా ఉంది. ఆమె పెదవులు కంపించాయి. గొంతుదగ్గర యేదో అడ్డుపడుతుందేమో అన్నట్లుగా వుంది. కొద్దిసేపట్లోనే ఆమె తనను తాను సంభాళించుకుంది. తన నోటిగుండా ఆమె ఏమీ చెప్పలేదు. ఒక ఉత్తరాన్ని తీసి రమేంద్రుని చేతికి ఇచ్చింది. అది ఆదిత్యుడు వ్రాసిన ఉత్తరం. రమేంద్రుడిలా చదివాడు:

"ఇంతకాలం, ఇన్ని రోజులు తరువాతకూడా, నా ప్రవర్తనమీద నీకు ఇంకా అనుమానం కలుగుతూనే వుంది. యీ విషయాన్ని గురించి ఇంకా చర్చించడం సిగ్గుచేటు. అనుమానించబడే ప్రతి వ్యక్తియొక్క ప్రతి చర్య అనుమానాస్పదంగానే వుంటుంది. నీకు యీ ఆలోచనలన్నీ ఉండడంవల్ల నీ ఆరోగ్యానికి చాలా నష్టంవుంది. నీ మనస్సు ప్రశాంతంగా, ఆరోగ్యంగా కోలుకునేవరకు నేను నీకు దూరంగా వుండవలసివుంది. యీ ఇంటిలోనుండి సరళను వెళ్ళగొట్టమని యిన్నాళ్ళ నీవు ఆదేశిస్తున్నావు. బహుశా అలాగే అవచ్చు. నేనుకూడా ఇదిగాక ఇంకోదారి ఏమీ లేదా అని ఆలోచించాను. నేనో విషయం చెబుతున్నాను– "నా విద్య, విజ్ఞానం, సంస్కృతి పేరు. ప్రతిష్ఠ యీడబ్బు – అంతా సరళయొక్క పెదతల్లి – నా మేనత్త మూలంగా వచ్చినవే. నా జీవన సార్థకత్వానికి మార్గదర్శకురాలు ఆమె. ఆమెయొక్క ప్రేమకు ప్రతిరూపం సరళ — నిస్సహాయురాలు అనాథ. అలాంటిదాన్ని యీనాడు నిర్వాసితురాలిని

చేయడం అధర్మం. నీ ప్రేమతో దణ్ణం కాని నావల్ల యీ అధర్మం జరుగదు.

నేను బాగా ఆలోచించి ఓ విషయాన్ని నిశ్చయం చేశాను. అది ఏమిటంటే మన వ్యాపారాన్ని రెండు విభాగాలుగా చేద్దాం - ఒకటి - పూలు, కాయలు, మొక్కలు, మొదలయిన విత్తనాలు అమ్మేది. రెండు - యింటి సమేతంగా తోట దొరుకుతుంది. అక్కడే సరళను కూర్చోబెడతాను. యీ పని నిర్విఘ్నంగా జరుపటానికి కావలసినంత డబ్బు నా దగ్గరలేదు. తోటను తనఖాపెట్టి డబ్బు తీసుకోవాల్సివుంటుంది. యీ విషయానికి కోపించవద్దని ప్రార్థన. నేను యీ తోటను కొనటానికి కావలసిన మూలధనాన్ని సరళయొక్క పెద్దమ్మె వడ్డీ తేకుండా సహాయం చేసింది. యీ విషయాన్ని మరువమాక. అంతేగాదు నా గురించి, ఆమె ఎక్కడో అప్పు తెచ్చి యిచ్చింది. తోట పని ప్రారంభించడానికి అనుకూలంగా — రంగు రంగుల - రకరకాలపూల విత్తనాలు, వృక్షవిత్తనాలు. అంట్లు; మొక్కలు, తోటపరికరములు, యింజను అన్నీ ఆమె వుచితంగా యిచ్చినవే. ఆమెకు మనం ఎంతో ఋణపడివున్నాం. యింతగొప్ప సహాయం ఆమె చెయ్యకపోయినట్లయితే నేను యీనాడు- ఆనాడూ ముప్పిముప్పది రూపాయల క్లర్కుగిరి చేస్తూ వుండాల్సి వచ్చేది. నీకూ నాకూ పెండ్లికూడా జరిగేదికాదు. నీతో సంభాషించిన తరువాత నా మనస్సులో ఒకేఒక ప్రశ్న ఉద్భవించింది. — "సరళకు నేను ఆశ్రయమిచ్చానా? లేక ఆమె ఆశ్రయంలోవుంటూ యింతవరకు వచ్చానా!"

యీ సహజ స్వభావసిద్ధమైన ప్రశ్నను యింతకాలంగా నేను మరచిపోయాను. యివ్వాళ నువ్వే జ్ఞాపకం చేశావు. యిప్పుడిక నీవుకూడా జ్ఞాపకం వుంచుకోవాలి. సరళ మనకొక పనికి మాలిన బరువు అని అనుకోవద్దు. నేనువారి ఋణాన్ని జన్మజన్మాలకీ తీర్చుకోలేను. ఆమెకు నామీద పరిపూర్ణమైన అధికారం వున్నది. నీవూ ఆమె ఎవ్వరూ కలుసుకోనకుండా వుండాలని నాఅభిప్రాయం. కాని నాకు, ఆమెకు గల ఘనిష్ట సంబంధాన్ని ఎవ్వరూ విచ్ఛిన్నం చేయలేరు. యీ విషయం యీనాడు నాకు తెలిసినంత విశదంగా ఎనాడూ తెలియలేదు. నే నా విషయాలన్నీ చెప్పలేను. నా దుఃఖం ఈవిషయాలన్నిటికీ అతీతమైపోయింది. ఊహించి తెలుసుకొనగలిగితే తెలుసుకో, లేకుంటే నా జీవితంలో దాచి పెట్టింది యిది ఒక్కటేనని గుర్తుంచుకో—

రమేంద్రుడు ఉత్తరాన్ని రెండుపర్యాయాలు చదివాడు. చదివి అతనేమీ మాట్లాడలేదు.

నీరజ వ్యాకుల హృదయంతో అన్నది. "ఏమిటో చెప్పరామూ!"

అయినా రమేంద్రుడు మాట్లాడలేదు.

నీరజ ఉద్విగ్న దుఃఖిత స్వరంతో పరితపిస్తూఅన్నది- "నేను పెద్దపొరపాటు చేశాను. చాలా అన్యాయం చేశాను. అసలు నా హృదయాన్ని యిలా పాడుచేసింది ఎవరో మీకు తెలియదూ!"

"ఏమంటున్నావు వదినా ?" రమేంద్రుడు అన్నాడు. "శాంతించు. మీ ఆరోగ్యం చెడిపోతుంది."

"యీ చెడిపోయిన ఆరోగ్యమే నా అదృష్టాన్ని మార్చింది, అలాగే ఏడుస్తూ అన్నది. "యీ ఆరోగ్యం యింకా ఎవరికి కావాలి వారిమీద నాకు అనుమానం !— యిది ఎక్కడనుండి వచ్చింది ? ఛీ. నా జీవితంమీద నాకే అసహ్యం... యీ రోజున వారికి; వారుముద్దుగా, వనలక్ష్మి' 'మాలినీ' అనిపేర్లు పెట్టి పిలిచే నీరు ఎక్కడవుంది. ఆమె యొక్క ఆ ఉపవనాన్ని ఎవరు లాక్కున్నారు. వారు నన్ను ఎన్నిపేర్లు పెట్టి పిలిచేవారు ... నీరు, వనలక్ష్మి, మాలిని, అన్నపూర్ణ, తాంబూల, కరంక, ష హిని, గృహ మంత్రి హోంసెక్రటరీ...... ఒహో ఎన్నిపేర్లు ... అబ్బ ! ! ! శ్రావణభాద్రపద మాసాల్లో నిండి ప్రవహించే నదులు సముద్రంలో కలిసిపోయాయి నాలుగు వయిపుల నా శాఖలు నిండివున్నాయి. యివ్వాళ ఆ కొమ్మలన్నీ క్షణంలో ఎండి పోయాయి.

"వదినా ! నీకు నయమైపోతుంది. నీ చోటు మళ్ళీ నీకు వస్తుంది. ఊరుకో ! ప్రశాంతంగా వుండు"

"నను రేకెత్తించకు రాము ! డాక్టరు ఏమం టున్నదీ నాకు తెలుసు, యిందువల్ల యింక నాకా ఆశలేదు. కానీ......"

"కానీ ఏమిటి వదినా ? రమేంద్రుడన్నాడు. "ఆది నుండి నీవు యీనాటివరకూ, యీ గృహస్థిని నిర్వహిస్తూ వచ్చావు యింతకంటే యింక కావలిసిందేమిటి ? మనం యిచ్చినంతే పుచ్చుకుంటాం. చేసుకున్నవాడికి చేసుకున్నంత. ఎంతమంది అనుభవించడంలేదు. ఒకవేళ డాక్టరు మాటలు

నిజం కావచ్చు. పోయేరోజు వచ్చేవుండవచ్చు అయితేఏం! నీవు ఎంత గొప్పతనాన్ని అనుభవించావో, ఆ గొప్ప తనాన్ని యిక్కడే వదలివెళ్ళు. యింతకాలంగా ఎంత గౌరవాన్ని సంపాదించుకున్నావో దానిప్పుడెందుకు పాడు చేసుకుంటావ్ ! యీ యింట్లో నీ అంతిమ స్మృతికి ఓ మహిమను ప్రసాదించి వెళ్ళు వదినా !"

"గుండె పగులుతోంది రామూ ! నా బాధ నీకు తెలియదు. యింతకాలంగా నేననుభవించిన అపూర్వ ఆనం దాన్ని యథాతథంగా వుంచి నవ్వుతూ వెళ్ళిపోగలను. కాని నిర్జనమైన అనంత ఆకాశంలో. నా జీవికితోడు నీడ లేకుండా యవ్వనపువిరహంతో రెక్కలు తెగిన పక్షిలాగా అలమటించాల్సిందేనా! యీవిషయాన్ని గురించి ఆలోచిస్తే గుండెలదరిపోతున్నాయి. చావటానికి కూడా మనసొప్పటం లేదు. ఆ సరళ — నేను పోయిన తరువాత సరళ నిర్భయంగా నా సర్వస్వానికి అధికారిణి అయిపోతుంది, ... ఇదేనా విధాతయొక్క న్యాయం !"

"యదార్థం మాట్లాడుతాను. కోపించవద్దు వదినా! నీ విషయాలన్నీ నాకు సరీగ్గా అర్థం కావడంలేదు. కాని ఒక్కమాట — నీవు దేనినయితే ఆనందంగా అనుభవించ లేకపోయావో దాన్ని నీవు ఆనందంగా దానమివ్వలేవూ ? నీవనుభవించలేని వస్తువు నీకెందుకు !" నీ అపూర్వమైన దాన ఫలితంగా నీకెంత ప్రతిష్టగలుగుతుందో చెప్పలేను. నీమంకు పట్టుదలతో, అన్నగారి హృదయంలోని ప్రేమను, దయను, మమతను పట్టిపీడించి, పీల్చిపిప్పిచేయకు. అది నీకే మోసం.

ఆనాడు నిన్నెవరూ జాలితలువరు. నిన్నొక కసాయిదానిగా పరిగణిస్తారు. నీ కెందుకంత బాధ! చేతులు జోడించి వేడు కుంటున్నాను వదినా! జీవితపు యీ అంత్యఘడియల్లోనైనా ఔదార్యాన్ని చూపి యీకసు నాశించు. కాని, ఔదార్యాన్ని నాశనం చేసుకొని అలమటించకు."

నీరజ ఏడుస్తూ కూర్చుంది. రమేంద్రుడు మౌనంగా కూర్చున్నాడు.

దుఃఖముయొక్క ఆవేశము అణగిన తరువాత నీరజ అన్నది – "నేనొక చిన్నకోరిక కోరుతున్నా రామూ!"

"కోరు వదినా!"

"నేను చెప్పేదానిని వినురామూ!" నీరజ కండ్ల నీరు నింపుకొని అన్నది. "అశ్రుధారలతో హృదయంనిండి పోయినపుడు నేను ఆ రామకృష్ణ పరమహంసయొక్క పటం వైపు చూస్తూవుంటాను. కాని వారి వాణి నాహృదయాంతరాళాలను చేరు కోడంలేదు. నామనస్సు చాలా చిన్నది. నేను గురుస్వరూపుల్ని ఎలా వెతకగలను? ఆశలతో చుట్టుకొని వున్నాను. రామూ, నేను ఏ ఇంటిలో సుఖభోగాలను ననుభవించానో ఆ యింట్లోనే, చచ్చినతరువాత దుఃఖితమైన హృదయాన్ని తీసుకొని పిశాచాన్నయిపరితపించాల్సిందేనా! అబ్బ! నన్ను యీ భయంకర స్థితినుండి కాపాడ లేవా రామూ!

"శాస్త్రిలలో పాకండి" అని ఓపాత్రవస్తూ వుంటుంది తెలుసుగా వదినా, ఆ పాత్రనాదే. నేనే పాకండిని. ఏ విషయాన్ని నేను ఒప్పుకోను. ప్రభాసుడు నా వెంటపడి ఒక

ఖర్మ్యాయం తన గురువర్యుని దగ్గరకు లాక్కెళ్లాడు. కాని ఏంలాభం చెప్పు. వాళ్ళు నన్ను బంధించకముందే పారిపోయాను. నేను చెప్పేది ఏమంటే - ఎవరికర్మను వారు అనుభవించాల్సిందే, ఒకరు మరొకర్ని ఎప్పుడూ రక్షించలేరు.

"నీ మనస్సు చాలా కఠినమైనది రాము. నీవు నా బాధను ఏ మాత్రంకూడా గ్రహించలేకపోతున్నావు. యీ భయంకర సాగరంలోనుండి తప్పించుకుందామని నేనెంత ప్రయత్నం చేస్తున్నానో అంతగా దిగజారిపోతున్నాను. ఎంత జాగరూకతతో వుందామనుకున్నా నావల్ల కావడం లేదు."

"వదినా ! నీ అపూర్వసంపదను మరొకరు లాక్కుపోతున్నారనే భావన నీ హృదయంలో వున్నంతకాలం నీకీ వ్యధతప్పదు. నీ మనస్సుకు శాంతిని పొందలేవు ముఖ్యంగా నీవు మాయా-మోహాలనుండి విముక్తి రాలివవాలి. ఇదిగో! నీవు నిర్మలచిత్తంతో కూర్చుని "నాసర్వస్వం దానంచేశాను. నాకు అన్నిటికంటె ఉన్నగొప్పది; అన్నిటికంటె గొప్ప ప్రియమయిన, - నాది అనేదాన్ని మొత్తం దానంచేశాను. నాకిప్పుడు కావలసింది మోక్షమార్గం. దాన్ని చూపించు భగవాన్." అని అనుకో - నీ మనస్సు ఎంత శాంతాన్ని పొందుతుందో గ్రహించు. మనస్సు ఆనందంతో నిండిపోతుంది" వదీ నాముందు ఒకసారి అను. "ఇచ్చేశాను. నా సర్వస్వం యిచ్చేశాను. నాకు ముక్తిని ప్రసాదించు ప్రభూ ! నా మనస్సులో కల్మషంలేదు. మాయామోహం

లేదు. నీచరణసేవకు సిద్ధంగాఉన్నాను అనుగ్రహించుప్రభూ! అని అను"

"ఆహా !- రామూ ముక్తి మార్గదర్శకోప యుక్త మయిన యీమంత్రాని వినిపిస్తూవుండు అలాగే. నేను ఇంత వరకూ వారికిచ్చినదాన్నిబట్టి ఆనందమే అనుభవించాను. ఇప్పుడు నేను ఇవ్వలేకపోబట్టే యీ యాతన లనుభవిస్తూ యున్నాను. ఇస్తాను, ఇస్తాను, ఇచ్చేస్తాను. నాదంతా ఇచ్చే స్తాను. ఆలస్యమెందుకూ ఇప్పుడే ఇస్తాను. అంతాఇస్తాను. నీవు త్వరగా వారిని పిలుచుకురా పో !"

"యివ్వాళకాదు. కొన్నిరోజులు నీమనస్సును నిగ్ర హించుకో - నీ సంకల్పానికి సహజరూపం ఏర్పడనియ్."

"కాదు కాదు. ఇప్పుడు నేనిక సహించలేను. వారు "నేను యీ యింట్లో ఉండను. జపానీయులు యింట్లోవుం టాను. అని చెప్పిపోయినప్పటినుండీ నాకీ శయ్య - చితి శయ్యలాఉంది. నీతోపాటు సరళనుకూడా వెంటబెట్టుకురా! హృదయంలో గుచ్చుకొనియున్న ముల్లును మొదలుతో సహా పీకిపారేస్తాను, ఏ మాత్రం భయపడను. నేను యధార్థంచెబు తున్నాను రాము."

"ఇవ్వాళ సమయం రాలేదు వదినా! యివ్వాళ్ళ ఆగు."

"ఆ పుణ్యకాలం కాస్తా దాటిపోతుందేమోనని భయంగా వుంది రామూ! ఇప్పుడే వెంటనే పిలుచుకురా !" అంటూ పరమహంస పటంవయిపుచూస్తూ రెండుచేతులెత్తి నమస్కరిస్తూ - "స్వామి యీ మతిలేని ఆడదానికి శక్తిని

ముక్తిని ప్రసాదించు, యీ మాయదారిదుఃఖము నాస్వామికి పూజాపునస్కారాలు లేకుండా చేసింది. రామూ! నేనో విషయం అడుగుతాను వద్దనవుగదూ!"

"ఏమిటో చెప్పు!"

"పదినిముషాలు నన్ను మందిరానికి తీసుకువెళ్లు. ఇందువల్ల నాకు బలం దొరుకుతుంది. ఆత్మశాంతి కలుగుతుంది. ఏ భయమూ ఉండదు."

"మంచిది పద, మందిరానికి"

"అయ్యో!"

"ఏమిటమ్మా!"

"నన్ను మందిరానికి తీసుకవెళ్ళు."

"లేస్తావా! డాక్టర్‌గారు..."

డాక్టరుగారికి గుమాస్తాలే ఆగిపోతారు. కాని నాభగవంతుణ్ణి ఆయనేం ఆపగలడు"

"అయ్యో! నీవు యీమెను తీసుకెళ్ళు. ఏంభయంలేదు.

అయ్యా బుజంమీద చేయివేసినడుస్తూ మందిరానికి వెళ్ళింది నీరజ.

యింతలో ఆదిత్యుడు వచ్చాడు. వస్తూనే అడిగాడు "యిదేమిటి? నీరూ ఎక్కడికి పోయింది!"

"యిప్పుడే వస్తుంది. మందిరంలోకి వెళ్ళింది."

"మందిరంలోకా? డాక్టరుగారు లేవటం - తిరగటం వద్దని నిషేధించారే-"

"ఎవరువద్దన్నా ఆగేదిలేందే - అయినా డాక్టరు మందుకంటే యీపూజ మంచివనే చేస్తుంది."

ఆదిత్యుడు మౌనంగా వున్నాడు.

ఆదిత్యుడు నీరజకు ఉత్తరం వ్రాసిపంపి వెళ్ళినప్పుడు భగవంతుడు తన జీవితచరిత్రలో వ్రాసిన అదృశ్య - సిరా పంక్తులు బాహ్యా వేడిమిని తీసుకొని ఉజ్వలంగా వెలుగుతాయని తెలుసుకోలేక పోయాడు. మొదట అతను సరళతో వెళ్ళిపోమ్మని చెప్పటానికి వచ్చాడు. కాని అంటున్నప్పుడు అతని నోటిగుండా తన ఉద్దేశ్యానికి పూర్తిగా వ్యతిరేకమయిన పదమే వచ్చింది. తరువాత, ఆ వెన్నెల రాత్రిలో కాలవగట్టుమీద కూర్చొని జీవన సత్యం నెమ్మదిగా దానంతట అదే తెలుస్తుందని గ్రహించాడు. ఇందులో అతని తప్పు ఏమీలేదు. సిగ్గుపడాల్సిన అవుసరంలేదు. కాని ఆ సత్యాన్ని మరుగు పరచ దలచలేదు. అతడు తన జీవిత కేంద్రంనుండి కార్యక్షేత్రంనుండి సరళను తొలిగించ నట్లయితే కలిగే పరిణామాలను బాగా వూహించాడు.

"రామూ!" అతడు అన్నాడు. "నీకు మా విషయాలన్నీ తెలుసుననుకుంటాను."

"అవును"

"యివాళ నేనీ రహస్యాన్నంతా బయట పెడతాను"

"నీవు ఒంటరిగాడివి కాదు అన్నయ్యా! వదిన అక్కడ వున్నది. ఆమెకు యిప్పుడే విషయమూ చెప్పవద్దు."

మీవదినకూ - నాకూ మధ్యన వున్న అసత్యాన్ని నేనే మాత్రం వుంచదలచుకోలేదు. బాల్యం నుండి సరళకూ నాకూ వున్న సంబంధంలో ఏమీ తప్పులేదు. ఒప్పుకుంటావా?

"ఎందుకొవ్వాకోను."

"ఆ సహజ స్వాభావికమయిన సంబంధంలో చాలా లోతున ప్రేమ వున్నది. అప్పుడు నాకది తెలియదు. ఏమిటి ఇది నాదోషమా?"

"నీ దోషమని ఎవరంటారు!"

"యీరోజున ఆ విషయాన్ని దాచిపెట్టినట్లయితే అది మిధ్యాచరణాపరాధమవుతుంది. యీ విషయాన్ని నే సగర్వంగా చెప్పగలను."

"దాచిపెట్టడం ఎందుకు? లేక యింత ఆర్భాటంగా చెప్పడం మాత్రం ఎందుకు! వదిన ఎంతవరకు తెలుసుకోవాలో అంతవరకూ తెలుసుకుంది. కొద్దిరోజుల తర్వాత తన దుఃఖాన్నంతా మూటగట్టుకొని వెళ్ళిపోనున్నది. నీవు దాన్ని తీసికొని వ్యర్థంగా లాగవద్దు. వదిన ఏమిచెబుతుందో కేవలం విను. దానికి తగినట్లు జవాబు చెప్పు!"

యింతలో నీరజ వస్తూవుండడం గమనించి రమేంద్రుడు వెళ్ళిపోయాడు.

* * *

గదిలో ఆదిత్యుడుండటం గ్రహించి నీరజఅతని కాళ్ళపైనపడిపోయింది.—అశ్రుధారలతో ఆయన పాదాలను అభిషేకిస్తూ రుద్ధకంఠంతో అన్నది – "అపరాధం చేశాను, అపరాధినిని.క్షమించండి. నన్ను క్షమించండి.ఇంతకాలం తరువాత మీరు నన్ను త్యజించకండి. మీ నుండి వేరుచేయకండి."

ఆదిత్యుడు రెండు చేతులతో ఆమెను లేవదీసి హృదయానికి హత్తుకొని మంచం మీద పరుండబెట్టాడు. తర్వాత

అన్నాడు- "నీరూ! నీకీ వ్యధ ఎందుకు ? కారణమేమిటి ! నేను తెలుసుకోలేను."

నీరజ ఏడుపు ఆగేట్లుగా లేదు. ఆదిత్యుడు నెమ్మదిగా ఆమె తలను చేతితో దువ్వుతూ వున్నాడు. నీరజ అతని చేతిని తీసుకొని హృదయానికి హత్తుకుంది. అన్నది--"నిజం చెప్పండి క్షమించరా నన్ను? మీరు సంతోషంగా లేకుంటే చచ్చిన తర్వాత కూడా నాకు సుఖంవుండదు."

"నీకు తెలుసు నీరూ ! మన ఇరువురి మధ్య ఏదో అదృశ్య శక్తివుండి ఆటాడిస్తుంది. అంతకు పూర్వం మన ప్రేమ ఎప్పుడయినా విఛ్ఛిన్నమైందా ?"

"ఇంతకు పూర్వం మీరెప్పుడయినా ఇంటి నొదలి పారిపోయారా ? ఇప్పుడెందుకు వెళ్లారు ? మిమ్మల్ని ఇంత నిష్టురంగా ఎవరు మార్చారు ?"

"అన్యాయం జరిగింది నీరు. క్షమించు."

"ఏమంటున్నారూ ! మీనుండే నాకు అభిమానపైనా, దండన అయినా దొరుకుతుంది. నేను అభిమానిని అయి మీ మీద అలిగి ఆలోచించిన దానికి ఫలితంగా నాకీ దశ లభించింది. సరళను తీసుకరమ్మని రాముతో చెప్పాను. ఇంకారాలేదేం ?

సరళ మాట వింటూనే ఆదిత్యుని గుండె వేగం హెచ్చింది. యీ సమస్యను కనీసం యీ రోజు వరకయినా శాస్త్ర ఆపితే అతనికి శాంతివుంటుంది. అతను అన్నాడు.

"చాలా రాత్రి అయింది. పడుకో."

అకస్మాత్తుగా అన్నది-"అదిగో! వినండి! వాండ్లిద్దరూ

బయట వున్నట్లుంది. రామూ! లోపలికిరా !"

రమేంద్రుడు సరళతో లోపలికి వచ్చాడు.

నీరజ ప్రక్కమీద నుండి లేచింది. సరళ, నీరజ కాళ్ళను కళ్ళకు అద్దుకొని నమస్కరించింది.

"రా చెల్లీ ! నా దగ్గరకు రా !"

చెయ్యి పట్టుకొని నీరజ సరళను తన ప్రక్కమీద కూర్చొన బెట్టుకొంది. దిండు క్రింద నున్న వస్తువుల పెట్టె తీసి, అందులో నుండి ముత్యాలహారాన్ని తీసి సరళ మెడలో వేసింది తర్వాత అన్నది-నేను ఇంతవరకూ, నా జీవితాంతం వరకూ, ఆఖరుకు నా చితిమీద కూడా యీ హారం నా మెళ్లోనే వుండాలను కున్నాను. దానికంటె ఇదే నయం నీ జీవితాంతం వరకూ నా తరపున యీ హారాన్ని నీవు ధరించు. ముఖ్యమయిన సమయాల్లో నేను యీ హారాన్ని ఎన్ని పర్యాయాలు ధరించానో వారికి తెలుసు. యిది నీకాడలో వుండడంవల్ల వారి కారోజు జ్ఞప్తి కొస్తాయి,

"నేను యీ హారాన్ని ధరించేంత యోగ్యురాలిని కాదు అక్కా నీవు నన్నెందుకు అవమాన పరుస్తావు !"

యీ బహుమానం సరళ హృదయానికి ఎంత గాయాన్ని కలిగించిందో చెప్పలేం.

"కాదు కాదు" నీరజ అన్నది. "సరళా! నీవు యీ తోట వదలి వెళ్ళిపోతున్నావని విన్నాను. కాని అలా జరుగటానికి వీలులేదు. నేను నిన్ను వెళ్ళ నివ్వను. యీ తోటకు, యీ ఇంటికీ నిన్ను సర్వాధికారిని చేస్తున్నాను. దానికి చిహ్నమే ఈ హారం. అందుకనే నేను దీనిని నీకు

ధరింప జేశాను. ఇక నేను నిశ్చింతగా చచ్చిపోగలను."

"పొరపాటు చేశావు అక్కయ్యా! నాకీ అధికారాన్ని అప్పజెప్పకు. దానివల్ల మేలులేదు.

"ఇదేమి మాట ?"

"అవును నేను యదార్థం చెబుతున్నాను. యింత వరకూ నన్ను విశ్వసించారు ఇక విశ్వసించవద్దు. అందరి ముందు చెబుతున్నాను నాఅదృష్టదేవత నాకు ఇచ్చే దానం నుండి నన్ను ఎలా వంచిందిందో అలాగే నేనుకూడా ఇతరు లని వంచించి వారిచ్చే దానాన్ని పరిగ్రహించలేను. మీ పాదాలకు నమస్కారం నేను యీ రోజున్నే--ఇప్పుడే వెళ్ళుతున్నాను అపరాధం నేను చెయ్యలేదు. యీ అప రాధం భగవంతుడి ...."

అంటూనే సరళ ఒక్క అంగలో గది బయటకు ఉరికింది. ఆదిత్యుడు కూడా వుండలేక పోయాడు. అతను కూడా ఆమెతో పాటు ఆమె వెనుకనే వెళ్ళిపోయాడు.

"రాము రాముా !" నీరజ అన్నది ఏం జరిగింది. చెప్పు. చెప్పు—

"అందుకనే సరళ యీ రాత్రికి పిలువ వద్దన్నాను."

"మనస్సు విప్పి నిర్మల హృదయంతో నా దంతా అర్పించానే! ఈ మాత్రం కూడా గ్రహించలేదా ?"

"ఎందుకు గ్రహించలేదూ! నీ మనస్సు ఇంకా నిష్కల్మషం కాలేదు."

"ఇంత దెబ్బ తిన్నా కూడా నా మనస్సు యింకా నిర్మలం కాలేదా ! ఇప్పుడెవరు నిర్మలం చేస్తారు ! హే భగ

వా॥ నన్ను రక్షించవా! రామూ! నా కెవరున్నారు. నే నేవరి దగ్గరకు వెళ్ళను.

"నేనున్నాను పద్మినా! ఈ కష్టాన్ని బరువును నా స్వ్తతిమీద వేసుకుంటాను. నీవు నిశ్చింతగా నిద్రించు."

"ఎలా నిద్రించను. యింటినివదలి వారు మళ్లావెళ్ళి పోతే...నిద్ర ఎలావస్తుంది."

"వారలా ఎప్పుడూ వెళ్ళరు. వెళ్లాలనికూడా వారికి లేదుకూడా. యిది నీ భ్రమమాత్రమే. యిదిగో! మందు తీసికో. నేవెళ్తాను."

"వెళ్ళు నాన్నా! యిద్దరూ ఎక్కడికి వెళ్లారో చూడు. లేకుంటే స్వయంగా నేనే లేచివెళ్తాను. కాకుంటే రేపు పోయేప్రాణాలు యివ్వాళే పోతాయి."

# 7

తన వెనుకనే ఆదిత్యుడు రావడం చూచి సరళ అన్నది. "నీవెందుకు వస్తున్నావ్? వెళ్ళిపో! నిన్ను నా వెంట రానివ్వను."

"నీవు రానిస్తావు రానివ్వవు యిది తర్వాత మాట. కాని నేను నీవు యిదివరకే ఒకళ్ళకు మరి ఒకళ్ళం అంకితమై పోయాము..."

"యీ విషయాలన్నీ తరువాత! ముందు మీరు వెళ్ళండి. అక్కయ్యకు సానుభూతినిస్తూ శాంతపరచండి."

"ఆ విషయంలో - తోటలో యింకొక శాఖ (Branch) ను పెంపుచేస్తున్నాను."

"యివ్వాళ కాదు. నాకు నాలుగయిదు రోజులు ఆలోచించడానికి వ్యవధి కావాలి. కాని యివ్వాడు నాదగ్గర ఆలోచించే శక్తి లేదు.

యింతలో రమేంద్రుడు వచ్చాడు.

అతను అన్నాడు -

"రా అన్నయ్యా! వదినకు మందిచ్చి నిద్రబుచ్చు. ఆలస్యం చేయవద్దు. ఆమెను అసలు మాట్లాడనీయవద్దు. రాత్రి చాలా ప్రొద్దు పోయింది. వద."

ఆదిత్యుడు వెళ్ళిపోయిన తరువాత సరళ రమేంద్రుని అడిగింది.

"రేపు శ్రద్ధానంద పార్కులో మీసభ జరుగుతుంది గదూ!"

"అవును"

"నీవు వెళ్ళవా!"

"వెళ్ళాలి. కాని వెళ్ళకపోవచ్చు."

"ఎందువల్ల!"

"నీకు చెబితే ఏమవుతుంది!"

"నీవు పిరికిదానివని తిడుతాను."

"నేనంటే యిష్టంలేనివాండ్లు ఎలాగూ తిడతారు."

"అయితే నామాటవిను మీకు ముక్తిని యిస్తాను. సభకు నీవు తప్పకుండా వెళ్ళాలి."

"కొంచెం విశదంగా చెప్పు."

"మీసభయొక్క జండాను తీసికొని నేనుకూడా వస్తాను"

"తెలుసుకున్నాను"

"పోలీసులు బాధించినా యిష్టమే. కాని నీవు బాధి స్తానంటే వూరుకోను."

"మంచిది నేను ఆపను."

"ఖాయమేనా!"

"ఆఁ! ఖాయమే"

"మన యిరువురం కలిసి సాయంత్రం అయిదు గంట లకు వెళదాం"

"అవును వెడదాం, కాని ఆదుర్మార్గులు మన నిద్దరను ఒకచోట ఉండనివ్వరు."

యింతలో ఆదిత్యుడు వచ్చాడు.

"యిదేమిటి!" సరళ అన్నది. "యింతలోనే వచ్చే శారేం?"

"ఒకటి రెండు మాటలను చెబుతూనే నీరజ అల సటతో నిద్రపోయింది." నేనే నెమ్మదిగా వచ్చాను"

"నాకు పనివుంది." రమేంద్రుడు అన్నాడు. "నేను వెళ్తాను." సరళ నవ్వుతూ అన్నది.

"యింటిని శుభ్రంచేసి వుంచాలి, మరిచిపోకు."

"మరేమీ భయంలేదు. తెలిసివున్నచోటు."

అంటూ రమేంద్రుడు వెళ్ళిపోయాడు.

# 8

"మీ కాళ్లు పట్టుకుంటాను," సరళ అన్నది. "నాకీ రోజున చెప్పకూడని రహస్యాలుంటే చెప్పవద్దు."

"భయపడవద్దు." ఆదిత్యుడు అన్నాడు. "ఏమీ చెప్పను."

"మంచిది. అయితే నేనే నీతో ఒక విషయం చెప్పాలను కుంటున్నాను. మీరు నన్ను మర్చిపోరా ?"

"మర్చిపోవాల్సినంత అవసరం వచ్చినప్పటికీ మర్చిపోలేను."

"అయితే మీకు నాదగ్గర వుండడంతప్ప వేరే పనేమీ లేదా వెళ్ళటానికి. ఇప్పుడు నేను అక్కయ్యకు సేవచేస్తే ఆమె సంతోషిస్తుంది. కాని నా కా అదృష్టమెక్కడిది ? నేను గైర్ హాజరవాల్సి వచ్చింది. కొంచమాగు. మాటపూర్తి కానియ్ వెళ్ళుగాని-నీవు కూడా వినేవుంటావ్. డాక్టర్లు అక్కయ్య ఇక ఎంతో కాలం జీవించదని చెబుతున్నారు. యీ మధ్యలో నీవు ఆమె మనస్సులోని కంటకాన్ని తొలగించడం నీధర్మం ఆమె చరిత్రలో నా నీడనైనా నీవు కనుపించనీయవద్దు"

"నా మనస్సులో నుండి ఒక వేళ దానంతట అదే వడిపోతే నేనేం చేయగలను చెప్పు."

"వద్దు వద్దు నీ గురించి, ఇంత అశ్రద్ధాయుతమైన మాటలను చెప్పవద్దు. సాధారణ భారతీయ పురుషుల మనస్సులా మీ మనస్సుకూడా చంచలమైనదా ? కాదు నాకు తెలుసు" అంటూ ఆమె ఆతని రెండు చేతులనూ పట్టుకొని అన్నది. "మీరు నా మీద ఒట్టుపెట్టుకొని ప్రతిజ్ఞ చేయండి. అక్కయ్య మృత్యుశయ్య మీదవుంది. ఆమె యీ అంత్య ఘడియల్లోనయినా దయా--దాక్షిణ్య

లతో శ్రద్ధాశక్తులతో చూడండి. నేనువచ్చి ఆమె సౌఖ్యాన్ని -సౌభాగ్యాన్ని నాశనంచేసేట్లు ఆమె భావిస్తుంది. మీ సేవతో, కరుణతో ఆమె యొక్క యీ భావనను రూపు మాపండి."

ఆదిత్యుడు మాట్లాడలేదు.

"యివ్వండి. వాగ్దానం చేయండి."

"యిస్తాను. కాని నీవుకూడా నాకో వాగ్దానం చేయాలి. చేస్తావా! చెప్పు."

"మీకూ నాకూ భేదంవుంది. మీరు వాగ్ధానం చేసినా, నేను చేయించినా సార్ధకమవుతుంది. కాని మీరు నన్ను వాగ్దానం చేయించినప్పటికి అది అసంభానం కావచ్చు"

"కాదు. అసంభవం కాదు."

"అయితే చెప్పండి."

"నామనస్సులో వున్న విషయాన్ని నీకు చెప్పడంలో తప్పులేదు నీవు చెప్పేదాన్ని వింటాను. ఎలాంటి కల్మషం లేకుండాచేస్తాను. కాని ఒకానొక నాటికి నాయీ శూన్యతను నీవు పూర్తిచేస్తావు అని గట్టినమ్మకం కలిగించాలి. ఏమిటి ? మాట్లాడవేం!"

"ప్రతిజ్ఞా పాలనంలో ఎప్పుడు, ఎక్కడ ఏవిఘ్నం జరుగుతుందో నేనెలా చెప్పగలను"

"విఘ్నాలనేవి నీలో వున్నాయా ఏమిటి?"

"నన్నెందుకు ఏడిపిస్తావు. కొన్ని కొన్ని విషయా లుంటాయ్ భాషలో ఆవిషయాలును పెట్టితే వాటి అందమే నాశనమవుతుంది. ఆ విషయం నీకు తెలియదా!"

"సరే! నీవిషయం కూడా తేల్చుకున్నాను. వెళ్తున్నాను."

"అయితే యిక తిరిగి చూడవా యిటు."

"ఉహుఁ! కానీ నీమీద ఏదో అవ్యక్తమయిన ప్రతిజ్ఞ చేయాలని వున్నది."

"కాని ఒకటి జ్ఞాపకముంచుకో. సహజమైన దాని మీద స్వభావసిద్ధమైన దానిమీద కోపగించుకోకు. వెళ్ళు.

"మంచిది. ఒకచిన్నమాట అడుగుతాను. యిప్పుడు నీవేం చేస్తావు? ఎక్కడ వుంటావు? ఏలావుంటావు? చెప్పు?"

"యీభారాన్ని రమేంద్రుడు తీసుకున్నాడు."

"రమేంద్రుడు నీకాశ్రయమిస్తాడు, బాగానేవుంది. కాని వాడికే తిండిలేంది నీకెలా పెడతాడు?"

"దాన్ని గురించి మీరేమీ విచారించకండి. పరుల ఆశ్రయం మనసొమ్ముకాదు. అయినా సందేహంలేదు."

"కాస్త చెపుతావా?"

"తప్పకుండా. యీ మధ్యన నన్ను చూశాలనే చంచలత్వంలో రావుగదా! అలా అని మాటయివ్వు",

"అయితే నీ మనస్సుకు మాత్రం ఆ చంచల స్వభావం కలుగదా."

"అధవ కలిగినా ఆ అంతర్యామికి తప్ప మరెవరికీ తెలియదు!"

"సరే! వెళ్తూ వెళ్తూ నా బిచ్చాపాత్రను పరిపూర్తిగా ఖాళీగావుంచి వెళ్తావా?

అతని కండ్లు చెమ్మగిల్లాయి. కండ్లనిండా నీరునిండింది.
సరళ అతని దగ్గరకొచ్చి ఊరికనే ముఖంపైకెత్తింది.

# 9

"ఆయా!"

"ఏమిటమ్మా!"

"నిన్న ఉదయం నుండి సరళ కనుపించడం లేదా?"

"మీకు తెలియదా? ప్రభుత్వపు పోలీసులు వారిని బంధించి పులీ పులావ్‌కు పంపించారు."

"ఏం? ఎందుకు? ఏం చేసింది?"

"కాపాలావాణ్ణి మోసంచేసి పెద్ద జమీందరుగారి జొరబడ్డదట"

"ఎందుకు?"

"మహారాణిగారి ముద్రవున్న పెట్టను దొంగిలించటానికి. తెడంత పోరి ధైర్యం చూడమ్మా!"

"దానివల్ల లాభమేమిటి?"

"దానిలాభం కూడా చెప్పాల్సివచ్చిందే ఖర్మం. అది ప్రభుత్వ యంత్రాంగాన్ని నడిపేమీట. అది లేకుంటే ప్రభుత్వం ఒక్క అడుగుకూడా ముందుకు వేయలేదు."

"రాము ఎక్కడున్నాడు?"

"ఆయనకూడా జైలుకు వెళ్ళాడు. దాదాపు ఇరవై అయిదు సంవత్సరాలవరకు జైలులో రాళ్లుకొట్టుకుంటూ వుండాలి. సరే! నాకో చిన్న ధర్మసందేహం ఉన్నదమ్మా! సరళమ్మగారు వెళ్తూ వెళ్తూ నాకో గులాబీరంగు సిల్కుచీర

మంచి వెలగలది యిచ్చి పోయారు. నాకండ్లలో నీరు తిరిగింది. నేనామెకు తక్కువేమీ కట్టపెట్టలేదు. ఆ చీర నాదగ్గర వుంచుకుంటే నన్నుకూడా పోలీసులు పట్టుకెళతారా!"

"మరేం భయంలేదు. కాని, త్వరగాపోయి బయట గదిలో పేపరు వుంటుంది. పట్టుకురా!"

పేపరు చదివింది. ఆశ్చర్యం! ఆదిత్యుడు యింత విషయాన్ని కూడా చెప్పలేదు. ఏమిటి, అశ్రద్ధవలనా? నా ఆరోగ్యం సరిగా వుంటే నేనుమాత్రం జైలుకు వెళ్ళలేనూ? నవ్వుతూ నవ్వుతూ వురికొయ్యకు వ్రేలాడగలను. నేను కూడా జైలుకు వెళ్ళగలను.

"అయ్యో! నీ చెల్లెలియొక్క సాహసం చూశావా? గౌరవ కుటుంబంలో పుట్టి- నడిబజారులో, పలువురు పురుషులమధ్య - ఓహో!!! - "

"నా కాళ్ళు వణుకుతున్నాయమ్మా!" ఆయా అన్నది. "దొంగలు-దోపిడిగాండ్లనుకూడా మించిపోయింది. పాపిష్టిపోరి. ఛి ఛి ఛి!

"మాట్లాడితే రంకెలు పెడుతుంది. నేనొక వీరాంగననంటుంది. తోటనుండి. జైలువరకు... చచ్చిపోయినా గర్వం చావలేదు."

ఆయాకు గులాబీరంగు చీరె జ్ఞాపకమొచ్చి అన్నది. "అమ్మాయీ! ఏమయినా, దాని మనస్సు మంచిది. ఎవరికయినా ఏదయినా ఇచ్చిందంటే చాలా గొప్పగా, నిష్కల్మషంగా యిస్తుంది."

ఈ మాట నీరజ హృదయానికి దెబ్బ కొట్టింది. ఆమె అకస్మాత్తుగా నిద్రనుండి మేల్కొన్న దానిలా అన్నది. "సరిగ్గా అన్నావు. ఆయా రైటుగా అన్నావ్, నేను మార్చి పోయాను. ఆరోగ్యం చెడిపోయినప్పుడు మనస్సు కూడా చెడి పోతుంది. మొదటి నుంచీ నేనంత, చెడ్డదాన్నయాను. ఛీ!ఛీ! నామీద నాకే అసహ్యం వేస్తుంది. సరళ మంచియువతి. ఆమెకు అబద్దం తెలియదు. అలాంటి యువతులు అరుదుగా కనిపిస్తారు. ఆమె నాకంటె చాలా మంచిది. నీవు వెంటనే వెళ్ళి గణేశ్‌ను పిలుచుకురా!"

ఆయా వెళ్ళిపోయింది.

నీరజ కలమూ కాగితము పట్టుకొని ఉత్తరం వ్రాయ టానికి కూర్చుంది. ఇంతలో గణేశ్ వచ్చాడు. నీరజ అతన్ని అడిగింది. "ఈ ఉత్తరాన్ని జైల్లో సరళ అక్కయ్యకు ఇచ్చి రాగలవా!"

"తప్పకుండా. కొంచెం ఖర్చుపెట్టుకోవాల్సి వుంటుంది. కాని వుత్తరంలో ఏముంది దానిని కొంచం చద వండి. ఎందుకంటే మధ్యన పోలీసు లభ్యోరించారుగా..."

"ధన్యజీవివి సరళా." నీరజ చదివింది "నీవు జైలు నుండి విడుదలై వచ్చిన తరువాత నీదోవ నాదోవ రెండు కలిసి పోయాయని గ్రహించగలవు."

"యిదేమిటి?" గణేశు అన్నాడు "యిదేదో దారుల గోడవలా వున్నదే, ఏమీ బాగాలేదు. సరే యిటుతే మన వకీలుగారికి చూపించి సరిచేయిస్తాను."

గణేశుడు వెళ్ళిపోయాడు.

నీరజ మనస్సులోనే రమేంద్రునకు నమస్కారం చేసి అన్నది-"రామూ! నిజంగా నాకు గురువ్వి."

# 10

ఆదిత్యుడు ఒక గ్లాసులో మందు తీసుకొని గదిలోకి వచ్చాడు.

"ఏమిటి తెచ్చారు?" నీరజ అడిగింది.

"డాక్టరుగారు గంటకొక పర్యాయం మందు యివ్వమన్నారు!"

"మందును త్రాగించడానికి వీధిలో ఎవ్వరూ దొరకలేదా! అంత యిదిగావుంటే ఓ నర్సును చూడక పోయారా!"

"యీ జ్వరనెపంతో నీదగ్గర వుండడానికి అవకాశం దొరికినప్పుడు ఎందుకు వదలిపెట్టాలి?"

"దీనికంటె మీరు మీ అవకాశాన్ని తోటపనికి ఉపయోగిస్తే నాకు ఎక్కువ సంతోషంగా వుంటుంది. నేను మంచమెక్కిన తరువాత తోట రోజురోజుకూ నాశనమై పోతూవుంది."

"కానియ్. మొదట నీ ఆరోగ్యం బాగుపడనీయ్. తరువాత యిద్దరం కలసి - పెనుకటిలా పనిచేద్దాం."

"సరళ వెళ్ళిపోయింది. నీవు ఒక్కడివే వున్నావు. మనస్సు పనిలో చొరవడం లేదనుకుంటాను. కాని వుపాయమేమిటి యివ్వడు? నష్టమొస్తే రానియ్మనేనా దీని అర్థం?

"నష్టమనే విషయాన్ని గురించి నేను ఆలోచించడం లేదు నీరూ! తోటపని చేయడం నావ్యాపారం. యీ విషయాన్ని నీవు మరపించావు. యింతకుపూర్వం నాకాతోట పని చాలా సుఖంగా వుండేది. కాని యిప్పుడు మనస్సొప్పడం లేదు."

"ఎందుకలా చింతిస్తారు. ఆరోజుల్లో ఎంతో మంచిగా పని చేసేవారు. ప్రతివాళ్ళకూ ఏవో కొన్ని బాధలు తప్పనిసరిగా వస్తుంటాయి. మీరీవిధంగా వ్యాకులత పడకండి."

"ఫ్యాన్ వేయనా?"

"నన్ను ఎక్కువ కష్టపెట్టకండి. యివి మీకు చెయ్యవలసిన పనులుకావు. దీనివల్ల నాకు యింకా ఎక్కువగా దుఃఖం కలుగుతుంది. ఏదోవిధంగా సమయాన్ని నడపడమే మీపని అయితే "ఆర్టికల్ చర్సుక్లబ్" వుండనేవుంది. అక్కడికి వెళ్తూవుండండి.

"నీకు యిష్టమైన 'దిల్ బహార్' పూలకోసం తోటనంతా గాలించాను. కాని ఒక్కటికూడా కనుపించలేదు. యీదఫా మంచి వర్షం లేనందువల్ల మొక్కలకు జలంచిక్క లేదు"

"మీ రెందుకండీ అబద్ధాలు ఆడతారు. హరియానుపిలపించండి నేను యిక్కడవుండే తోటపని అంతా చేయిస్తాను. నేను జ్వరంతో బాధపడుతూవుంటే నా తోటకూడ అలాగే బాధపడుతూవుంది నామాట విను...

"చెప్పటాని కతనికిష్టం కలుగకపోవచ్చు. మీరు

అతన్ని మాత్రం శాంతంగా వుండనిచ్చారా ? వాడిని లెఖ్ఖ కూడా చెయ్యకపోతివి."

"హరియానను గురించి నేను నిజం చెప్పగలను కాని నీ కది అసత్యంగానే వుంటుంది."

"సరే! నేను యిలా మంచంమీదపడివుండే తోటపని అంతా వాడితో చేయిస్తాను. తోటపటము, నా డైరీ యిలా ఇవ్వండి. పటముపెన్సిలుపెట్టి కొన్నిహంశాలనుసరిదిద్దుతాను."

"నాకు ఇందులో భాగంలేదా ?

"లేదు. నేను పోకపూర్వమే నా తోటలో నా ప్రతి రూపాన్ని చిత్రించి పోతాను. దాని ప్రక్కగావున్న 'వాటర్ పామ్' మొక్కలను పీకి సన్నజాజి మొక్కలను నాటిస్తాను. అలా తల ఆడించకండి. అంతా పూర్తి అయిన తర్వాత చూద్దురుగాని, మీ 'లాన్' ను అక్కడ వుండనివ్వను అక్కడ మంచి చలువరాతి వేదికను నిర్మిస్తాను."

"వేదిక బాగానే వుంటుంది. కాని......"

"మీరు వూరుకోండియిక. చాలా బాగుంటుంది. నీవు ఏమీ అనలేదు. తరువాత నేను నిర్మించిన యీ పూల తోటను మీకు అప్పగించి పోతాను. నాబలమంతాక్షీణించి పోయిందని మీరు అనుకుంటున్నారా ? నేను ఏమి చేయ గలిగిందీచేసి చూపిస్తాను. నాకు నలుగు రైదుగురు కూలీలు అయిదారు రూపాయల కూలీ కావాలి. మీరు నన్నొ కప్పుడు 'నీకు తోటను అలంకరించడం ఏమీ తెలియు' దన్నారు. నేర్చుకున్నదీ---(తెలిసిందీ) నేర్చుకోనిదీ---నిరూ

పిస్తాను. యీ తోటనాది. దీనిమీద నా కధికారం వున్న దని మీరు జ్ఞాపకముంచుకోవాలి.

"మంచిది. చాలమంచిది. అయితే నేనేం చేయాలి."

"దుకాణానికి వెళ్ళు. అక్కడ నీకు ఆఫీసు వసుక కూడా చాలా వున్నది."

"అయితే నీవు చేసేపనికూడా చూడకూడదా!"

"అవును. యిప్పుడు నేను, మీరు ఎప్పుడూ వెంబడి తిరిగే నీరూను కాదు. యిప్పుడు నేను కేవలం ఏకైకాన్ని కాంక్షించేదాన్ని. అధవా ఎవరి జ్ఞాపకాలను అందివ్వను. దానివల్ల లాభం."

"సరే! నీవు నన్ను సహించ గలిగినప్పుడే వస్తాను. పిలిపించాలి. యివ్వాళ నీకోసం సంపంగి పూలు తెచ్చాను. నీప్రక్కమీద పెట్టి వెళ్తున్నాను. ఏమీ అనుకోవద్దు."

అంటూ ఆదిత్యుడు లేచి నిలుచున్నాడు.

నీరజ అతని చెయ్యిపట్టుకొని అన్నది. "వద్దు. పోవద్దు" అంటూ కుండీలోని ఒక పూవును చూపుతూ "ఆపువ్వు పేరేమిటో తెలుసునా?"

"ఏ జవాబునిస్తే ఆమె సంతోషిస్తుందో ఆదిత్యునికి తెలుసు. అందుకని అతను అబద్ధం ఆడాడు. "నాకు తెలియదు" అన్నాడు.

"నాకు తెలుసు చెప్పనా? "ఫెట్యూనియా" నాకు ఏమీ తెలియదనూ మూర్ఖురాలు అనుకొంటున్నావ్.

"ఆదిత్యుడు నవ్వి యిలా అన్నాడు. "నీవు నా సహధర్మచారిణివి. నీవు మూర్ఖురాలివైతే యింతమించు

నేనుకూడా మూర్ఖుణ్ణవుతాను. మూర్ఖత - యీ వ్యాపారం మన యిరువుర జీవితాల మధ్యా మనకు తెలియకుండానే వస్తూవుంది."

"ఆ వ్యాపారం భాగం - ఆ అదృష్టం యిప్పుడు నా కెక్కడిది. అంతా అయిపోయె. అదుగో! అక్కడ కూర్చొని పొగాకు నములుతున్నాడే—దరవాన్ (కావలా వాడు) ఇకనుంచి వాడే వుంటాడు. నేను వుండను. "నీరజ అకస్మాత్తుగా భర్త చేతులను పట్టుకొని అన్నది. "వుండను నేను ఇక్కడ వుండను. వుండలేను. చావు. నాకు చావు. నీవు చాలా పుస్తకాలు చదివావు గదూ!

"నేను చదివిన పుస్తకాలలోని విద్య ఎంతవరకు వరి చితమైవున్నదో నాకూ అంతవరకే తెలుసు. అది యమధర్మ రాజు కోటగుమ్మం వరకూ వెళ్ళి అలసిసొలసి ఆగిపోయింది.

"చెప్పవా! నీవే మనుకుంటున్నావ్? నా అస్తిత్వ మేమాత్రం వుండదా! పేరు-ఊరూ అన్నీ మట్టిలో కలిసి పోతాయా! ఏ మాత్రం కూడా వుండదా!"

"వుంటే వుండనూవచ్చు, వుండకపోవచ్చు."

"తప్పకుండా వుంటుంది. నాకు యీ తోటవుంది. యీ నా తోట నా పేరు నిలుపుతుంది. తప్పకుండా నిలుపు తుంది. సంధ్యాసమయంలో. బాల్కనీలో కూర్చొని తోటను చూస్తూవుంటూ, కోయిలలు మామిడి చెట్లమీద మసలుతూ "కుహూ కుహూ" అని అంటుంటాయి. ఆ శంబ్దంలో నేను... నేను నీరుని. అని అంటూవున్నట్లు భావించు. సుగంధ భరితమైన చల్లని గాలి నీ శరీరానికి సోకినప్పుడు

ఆ స్పర్శలో నా వ్రేళ్లు వుంటాయ్.—చెప్పు— జ్ఞాపకముంచు కుంటావా!

ఆదిత్యుడు అవునన్నాల్సి వచ్చింది. కాని అతని స్వరంలో మాత్రం ఆతనామాటను నిలుపు కుంటాడనే నమ్మకం వలుకలేదు.

నీరజ అసిగుధ్రాలై అన్నది. "యీ ఉద్గ్రంథాలు రాసేవారంతా పెద్ద వండితులు గదూ! హుం! ఏం తెలుసు వారికి. ఏమీ తెలియదు. నాకు నిశ్చయంగా తెలుసు – నా మాటను విశ్వసించు నేను యిక్కడే వుంటాను. నీదగ్గరే వుంటాను. నాకు స్పష్టంగా కనుపిస్తుంది. నేను నీతో చెప్పి, వాగ్దానంచేసి పోతున్నాను — "నీతోటను కండ్లలో పెట్టు కొని కాపాడుతాను. యిదివరకు కాపాడినట్లు కాపాడుతాను అంతకంటె యింకా బాగా! నాకు ఎవరి సహాయమూ అక్కర్లేదు."

— పక్కమీద పడివున్న నీరజ దిండ్ల సహాయంతో లేచికూర్చుంది. ఉద్వేగ కంఠంలో అన్నది. "నన్ను దయ చూడండి! నామీద దయవుంచండి. నేను మిమ్మెంతగా ప్రేమిస్తున్నానో మీరు నన్నంత ఆదరించండి. యిన్నిరోజుల నుండి: మీరు నన్నెంత ప్రేమించారో. ఎంత కృపాదృష్టితో చూశారో, మీహృదయంలో నాకు ఎంతచోటును ప్రసాదించారో అలాగే ఆరోజున కూడా, (చచ్చిపోయిన తరువాత) నన్ను ప్రేమించండి. విశాల హృదయంతో నన్ను మీలో అయిక్యం చేసుకోండి. యథాప్రకారంగా, ప్రతి ఋతువు నందు చక్కగా వికసించిన మనతోటలోని గులాబీలను;

మీ మనస్సులో వున్న నాకు మీ చేతితో కుండా అందివ్వండి. అథవా మీరు కోపగించారా - నేనిక యిక్కడ వుండలేను. నాతోటను వదలి నేను నిరాశా శూన్యతతో ఎలా వుండ గలను!

నీరజ కండ్లనుండి ఆమె నునుపైన చెక్కిళ్ళమీదుగా సెలయేరుల్లా, అశ్రుధారలు స్రవిస్తున్నయ్.

ఆదిత్యుడు కుర్చీమీదనుంచి లేచి మంచంమీద కూర్చున్నాడు. నీరజను దగ్గరకు లాగుకొని ఆమె శిరస్సును తన హృదయానికి గట్టిగా హత్తుకున్నాడు. తర్వాత - "నీరూ! ఆవేశంలో ఆరోగ్యాన్ని పాడుచేసుకోకు." అన్నాడు.

"పోనీయండి. నాకు కావలసిందిమీరు. మీఆరోగ్యం. నేనేమయినా ఫరవాలేదు. నామాట వినండి. నన్ను కోపించకండి." అంటూండగానే ఆమెకంఠం రుద్ధమైపోయింది. సరళకు నేను చాలా అన్యాయం చేశాను. యిక చేయను. మీకాళ్ళు పట్టుకుంటాను. జరిగిపోయిన వాటిని గురించి నన్ను క్షమించండి. కాని, నన్ను ప్రేమించండి. మీరు నన్ను ప్రేమించండి. మీరు ఏమి కోరినా, ఏది చెప్పినా చేస్తాను."

"నీరూ" ఆదిత్యుడు అన్నాడు, "శరీరంతో పాటే నీ మనస్సుకూడా జబ్బుగా వున్నది. దాన్ని ఎందుకు అలా కష్టపెడతావ్?"

"నా మాట విను. రాత్రి నుండి నే నొక ప్రతిజ్ఞ చేసుకున్నాను, ఇంతవరకూ సరళను కష్టపెట్టాను. ఇక కష్టపెట్టను.

యీ దఫా సరళను కలుసుకోవడమే తడవుగా ఆమెను నిర్మల మైన మనస్సుతో ప్రేమతో నా హృదయానికి హత్తు కుంటాను. నా ఒక చెల్లెలను కుంటాను. నా యీ అంతిమ దినాల్లో. నా యీ అంతిమ ప్రతిజ్ఞాపాలనకు సహాయం చెయ్యి. అను---ఏదీ నీ నోటిగుండా ఒక్కసారి "నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ప్రేమిస్తాను నీరూ అని అను. నా జీవితం ధన్యమైపోతుంది. యిక నే నప్పుడు అందరికీ సహాయపడ గలను."

యీ మాట కేమీ జవాబు చెప్పకుండా ఆదిత్యుడు మాట మాటకూ ఆమె ముఖాన్ని ముద్దుపెట్టుకో సాగాడు.

నీరజ కండ్లు మూసుకుంది. కొద్ది క్షణాలు తర్వాత అడిగింది. "సరళ జైలునుండి ఎప్పుడు విడుదలఅయివస్తుంది. నేను రోజుల్ని లెక్కిస్తున్నాను. ఆమె రాకకు పూర్వమే మరణిస్తానే మోనని భయమేస్తుంది. నా మనస్సు ఇప్పుడు పరి పూర్ణంగా నిష్కల్మషంగావుంది ఇప్పుడు నాకు మీరు అక్షయ-వ్రాసిన 'ఏషా' చదివి వినిపించండి. అంటూ దిండ్ల క్రిందనున్న పుస్తకాన్ని తీసియిచ్చింది నీరజ.

ఆదిత్యుడు చదువుతూ వినిపించసాగాడు.

వింటూ వింటూనే నీరజ కన్ను మూసింది. ఇంతలో ఆయా వచ్చి అన్నది. "ఉత్తరాలున్నయ్."

నీరజ నిద్రపారిపోయింది. తృళ్ళిపడి లేచింది. ఆమె హృదయం స్పందించింది. గుండెవేగం హెచ్చింది. ఎవరో ఒక స్నేహితుడు ఆదిత్యునికి వ్రాసిన ఉత్తరంఅది. అందులో -'జైలులో ఖాళీ లేనలదువల్ల శిక్ష దాదాపు పూర్తిఅయిన

వాండ్లను వదిలి వేస్తున్నారు. అందులో సరళకూడా వున్నది' అని వున్నది. ఆదిత్యుని సంతోషం హద్దులను అతిక్రమించింది. కాని పైకి దాన్ని కనబడకుండా వుంచటానికి చాలా ప్రయత్నం చేశాడు.

నీరజ అడిగింది. "ఎవరిదా వుత్తరం—ఏమిట్రా శాస్త్రి?"

చదివి వినిపించడానికి, గొంతుక కంపించి శబ్దం పైకి రాదేమోనన్న భయంతో ఆదిత్యుడు ఉత్తరాన్ని ఆమె చేతికి యిచ్చాడు. నీరజ అతని ముఖంవైపు చూచింది. అతను ఏమీ మాట్లాడలేదు. ఆ అవసరంకూడా లేదతనికి. నీరజకూడా ఏమీ మాట్లాడలేదు. దీని తరువాత ఆమె కొంచెం పెద్దగానే అన్నది. "యిక ఏ విషయమూ వద్దు. యివ్వాళే విడుదల అవుతుంది. మీరు వెంటనే ఆమెను యిక్కడికి తీసుకరండి.—" అంటూ ఆమె కళ్లు మూసుకుంది.

"అరెరె! ఏమైంది!—నర్స్! డాక్టరుగారున్నారా?"

"బయట గదిలో వున్నారు."

"వెంటనే పిలుచుకరా! వెళ్లు—"

నర్సువెళ్ళి డాక్టరును పిలుచుక వచ్చింది.

"ఆఁ! డాక్టర్జీ! వచ్చారా! నీరును చూడండి. యిప్పుడిప్పుడే మాట్లాడుతూనే స్పృహ తప్పింది. యింత వరకూ బాగానేవుంది సార్!"

డాక్టర్ చెయ్యి చూశాడు. మౌనంగా వున్నాడు.

ఆదిత్యుడు డాక్టర్ పెదవులవయిపు ఆత్రుతగా చూస్తున్నాడు.

కొన్ని క్షణాలతరువాత నీరజ కండ్లు తెరచి చూచి

అన్నది. "డాక్టర్జీ! మీరు నన్ను తప్పకుండా బ్రతికించాలి. సరళను చూడకుండా నేను వెళ్ళలేను. పోను. ఆమెను ఆశీర్వదించాలి. అవుసరం. అశేషమయిన ఆశీర్వాదం..."

యిప్పుడు ఆమెకండ్లు వాటంతటవే మూసుకుపోయాయి. చేతులు వ్రేళ్లు మూసుకపోయి పిడికలి బిగించి నట్లుగా వుంది. అకస్మాత్తుగా ఆమె అరిచింది. – "రామూ! నా వాగ్దానాన్ని నిభాయించుకుంటాను. తప్పకుండా పాలిస్తాను. పిరికిపందలా చావను."

మధ్యమధ్యలో ఆమెయొక్క చైతన్యం తప్పుతూ వుంది. ప్రపంచమంతా రంకులరాట్నం తిరుగుతున్నట్లుగా వుంది ఆమెకు. ఆమె జీవనశిఖ, రెక్కలు తెగిన పక్షిలా టపటప లాడుతూ ఆరిపోయే దీపంలా మినుకు మినుకు మంటోంది.

వుండి వుండి తన భర్తను అడిగింది--"సరళ ఎప్పుడు వస్తుంది." అని---

"ఏమమ్మా!" అంటూ గొల్లుమన్నది ఆయా ఏడుపును దిగమింగుతూ---

"ఆయా!" నీరజక్షీణస్వరంతో అన్నది." రాముని పిలుచుకరా! వెంటనే వెళ్ళు--మళ్ళీ తనలో తానే గొణుక్కుంది. "నేను ఏమయి పోతాను రామూ! యిస్తాను... యిస్తాను...నా సర్వస్వం ఇచ్చేస్తాను......"

# 11

రాత్రి తొమ్మిది గంట లౌతుంది. రోగి గదిలో ఒక మూలన మైనపువత్తి టప-టప కొట్టుకుంటూ వెలుగుతూ వుంది. గాలిలో మాధవ-మాలతీలతల సుగంధం కలిసివుంది. తెరువబడివున్న కిటికీలోనుంచి బయట తోటలోని చెట్ల యొక్క ముసుగునీడలు – ఆకాశంమీద అకాలపురుషుని కండ్లలా చుక్కలు మినుకు మినుకు మంటున్నాయ్.

నీరజకు నిద్రాభంగం కలుగుతుందనే భయంతో సరళను బయట తలుపుదగ్గర వుంచి నెమ్మదిగా ఆదిత్యుడు లోపలికి వెళ్ళిపోయాడు. ఆమె పెదవులు కదులుతున్నాయి. ఆమె మనస్సులోనే ఏదో జపిస్తూవున్నట్లుగా వుంది. ముఖం మీద ప్రాణం వుండిలేనట్లుగా వుంది. ముఖం వ్యాకులత విహ్వలతతో వుంది.

ఆమె చెవిలో ముఖంపెట్టి ఆదిత్యుడు అన్నాడు —

"సరళ వచ్చింది."

కండ్లు కొద్దిగా తెరచి నీరజ సరళతో అన్నది, "నీవు వెళ్ళు" వెంటనే "రామూ" పెద్దగా అరిచింది.

ఎక్కడనుండీ – జవాబు రాలేదు.

సరళ లోపలికి వచ్చి నీరజకాళ్ళు అంటుకుందో లేదో ఆమె (నీరజ) సమస్త శరీరమూ విద్యుత్ షాక్ తిన్నదానిలా కుతకుతలాడిపోయింది. భయంకరమైన కోపంతో కంపించే కంఠంలా వుంది ఆమె ఘర్జన. ఆమె అరిచింది – "యివ్వ

లేకపోయాను. యివ్వ లేకపోయాను. యివ్వ లేకపోయాను. యివ్వ లేకపోయాను."

అంటూండగానే ఆమె శరీరంలోకి వెయ్యి ఏనుగుల బలమొచ్చినట్లయింది. కండ్లరెప్పలు బాగా విప్పి గుడ్లురిమి చూసింది. సరళ చేయి గట్టిగా అదిమివట్టుకొని అరిచింది. ఆమె కంఠస్వరం భయంకరంగా తీక్షణంగా వుంది —

"డాయ్! యిక్కడ నీకు చోటు లేదు. నేను వుంటాను. నేను వుంటాను. యిక్కడ నీకు చోటు లేదు వెళ్ళిపో!

అకస్మాత్తుగా ఆమెయొక్క శరీరం—తెల్లగా పాలిపోయి పాండురోగంతో పీడింపబడ్డ పాండురోగి యొక్క హాస్థిపంజరంలా వున్న ఆమె శరీరం లేచి నిలువబడింది. కంఠోరంగా ఘర్జించింది—"పో!...పో! పారిపో! లేకుంటే నీ హృదయాన్ని ఉక్కు శూలాలతో పొడిచిపీడిస్తాను. నీ గుండెను చీల్చి రక్తాన్ని త్రాగుతాను...పో! పారిపో!"

మరుక్షణమే ధబీమని కుప్పగా కూలిపోయింది.

యీ శబ్దాన్ని విని ఆదిత్యుడు పరుగెత్తుకొచ్చాడు. లోపలికి.

ప్రాణాలయొక్క పరిపూర్ణ మయిన శక్తినంతా ఉపయోగించి నీరజ అన్న మాటలను విని స్తబ్ధుడై పోయాడు.

—::—

# పెళ్లికూతురు

ఇది చాలాకాలమునాటి విషయం. చిన్నతనములో నేను చదువుకొనే రోజుల్లో పండిత శివనాథ్‌గారివద్ద ఎక్కాలు చేర్చుకునేవారము. ఆయనకు గడ్డము, మీసాలు వుండేవి కావు. బుర్రకూడా నున్నగా గొరిగించుకునేవారు. ఒకచిన్న పిలక మాత్రము శోభిల్లుతుండేది. ఆయన్ని చూడగానే పిల్లల పైప్రాణాలు పైనే ఎగిరిపోయేవి.

మొరిగేకుక్క కరవదన్న సామెత ప్రకారము హడా విడిచేసే ప్రతివాడు కార్యశూరుడు కాలేదు. కాని మన పండిత్‌జీలో ఈ రెండు గుణాలు వున్నాయి. ఒకవైపు ఆయన దెంపదెబ్బలు, గుద్దులు మావంటి చిన్న చిన్న మొక్కలపైన వడగళ్ళ వానవలె పడుతుండేవి. రెండవ వైపు ఆయన క[illegible]రమైన చీవాట్లు విన్నప్పుడు తాతలు గుర్తుకు వస్తుండేవ[illegible].

“ఇప్పుడు గురుశిష్య సంబంధము పూర్వకాలము మాదిరి భక్తిశ్రద్ధలతో కూడినది కాదని, విద్యార్థులు గురువును దైవముతో సమానముగా పూజించడము లేదని” ఆయన బాధపడుతూ వుండేవారు. ఈ విధముగా తన విచారము వెల్లడించి తనచే వుపేక్షింపబడిన దైవమహిమను పిల్లలమీద వేసి కొట్టేవారు. ఒకప్పుడు హుంకరించేవారు.

ఆగద్దింపులో ఎన్నోరకాల తిట్లు మిళితమై వుండేవి. దేవతల వ్యజనినదపు భ్రమ మాత్రము ఎవరికీ కలిగేదికాదు.

ఏమైనప్పటికీ, ఈ మూడవతరగతికి పాఠాలుచెప్పే సెకండుక్లాస్ దేవతను ఏ విద్యార్థీ ఇంద్రుడు, చంద్రుడు, వరుణుడు అని భావించేవారుకాదు. ఆయన పోలిక ఒకే ఒక దేవతతో సరిపోయేది ఆయనపేరు యమధర్మరాజు. ఇంత కాలము తర్వాత ఆయననుగురించి చెప్పకోనడానికి యేమీ భయపడనవసరంలేదు. మేమెల్లప్పుడూ ఆయన ఎంతత్వరగా తన దేవాలయానికి దయచేస్తే అంత మంచిదని కూడా భావిస్తూవుండేవారము.

నర దేవతలాంటి ముప్పు ఇంకొకటేదీ వుండదని మేము బాగా అర్థంచేసుకున్నాము. స్వర్గలోక దేవతలు పువ్రదవాలు లేకే త్రించరు. చెట్టుకొమ్మలనుంచి ఒకటిరెండు పువ్వులుకోసి చరణయుగళముమీద సమర్పించగానే భగవంతుడు ప్రసన్న మవుతాడు. అలా అర్పించకపోయినా యేమీ తగువుపెట్టు కోడు. కాని పండితదేవుడు చాలా ఎక్కువ మానుండి ఆశించేవాడు. ఏకొద్దితప్పిదముజరిగినా కళ్ళెర్ర జేసి మామీద కురికేవాడు. అప్పుడు మాకు దైవముగా మాత్రము కనిపించే వాడు కాడు.

పిల్లల్ని బాధించడానికి మాపండిత శివనాథ్‌వద్ద ఒకే ఒక బ్రహ్మాస్త్రముండేది. అది విపరీతంగా విద్యార్థుల్ని బాధించేది పిల్లలకు మారుపేర్లు పెట్టేవారు. పేరు శబ్దముల కూర్పే అయినప్పటికీ ప్రతిమనిషి తన పేరును ఎంతో గౌరవించుకుంటాడు. తన పేరుప్రతిష్ఠలకొరకె మనుష్యుడెన్నెన్ని

కష్టములనుభవించుటలేదు? తన పేరును నిలబెట్టుకొనడానికి మానవుడు ప్రాణమును సైతము సరకుగొనక పోరాడు తుంటాడు.

పేరు ప్రతిష్ఠలకోసం అలమటించే మానవుని పేరును వికృతపరచడము అతని ప్రాణముకంటె ఒక్కిలి ప్రియమైన చోట గాయపరచడమే యవుతుంది. "భూతనాధం" అనే పేరు గలవానిని "నళినీకాంత్" అని పిలచినా యిది అతనికి అప్రియనామమే యవుతుంది.

మనుష్యుడు వస్తువుకంటే రూపరహితమైన పేరును ఎక్కువ ప్రేమిస్తుంటాడనే ముఖ్యసిద్ధాంతము మనకు దీనివల్ల సుబోధకమవుతూంది. అంటే బంగారము, వెండివంటి ద్రవ్యాలకంటెకూడ మాట అతనికి ప్రధానమని, ప్రాణాల కంటె యశస్సే అతను కాంక్షిస్తాడని, తనకంటే తనపేరుకే ఎక్కువ విలువ యిస్తాడని మనము దీనివల్ల గ్రహించ వచ్చును.

మానవ స్వభావములోని నిగూఢ రహస్యము తెలిసి ఉండటమువల్లనే పండిట్‌జీ శశిశేఖర్ పేరు చఛుందర్ (చుంచు)అని పేరుపెట్టారు. అతను విపరీతంగా బాధపడవలసి వచ్చింది. ఆపేరు వచ్చిన తర్వాత అందరూ అతని ముఖం వంకే చూస్తూండేవారు, ఇది అతని హృదయానికెంతో అఘాతంకలిగించి బాధించింది. అయినా సహనము, శాంతితో మెదలకుండా వూరుకొనక తప్పలేదు.

పండిత్‌జీ ఆశ్‌తోష్ పేరు, పెళ్ళికూతురు పెట్టారు. ఈ పేరుకు కొంచెము చరిత్రకూడా వుంది.

ఆశుతోష్ క్లాసులో అందరికంటె సాధుస్వభావి. సరళంగా మెలగుతాడు. ఎవ్వరూ మెదలకుండా తనపని తాను చేసుకుంటుంటాడు. పోట్లాడటం, కజ్జాలు పెట్టుకోవడం అతని జన్మకుండలిలో నేఎక్కడా లేదు వయస్సులో కూడా బహుశా అందరికంటె చిన్నవాడు అందరిమాటలూ వింటూ చిరునవ్వు వెదజల్లుతూ పోయేవాడు. అందరికన్నా బాగా చదివేవాడు.

స్కూలులో చాలామంది పిల్లలు అతని స్నేహము వాంఛిస్తుండేవారు. అతనెవరితోనూ ఆడేవాడు కాదు. స్కూలు విడిచిపెట్టగానే పరుగెత్తుతూ యింటికిపోయేవాడు.

మధ్యాహ్నం ఒంటిగంటకు దాసి మిఠాయి, ఒక గ్లాసులో మంచినీరు తెస్తుండేది. ఆశుతోష్ సిగ్గుపడుతుండేవాడు. త్వరగా ఈదాసి ఇంటికి వెళ్ళిపోతే బాగుండునను కునేవాడు. తాను స్కూలువిద్యార్థిగానే అందరికి చిరపరిచితుడుగా వుండాలని తన రహస్యాలు ఎవరికీ తెలియకూడదని భావిస్తూండేవాడు.

చదువుసంధ్యలలో అతనేమీ అశ్రద్ధగా వుండేవాడు కాదు. ఎప్పుడైనా ఆలస్యంగావస్తే పండిట్ శివనాథ్ కేమీ జవాబీయలేకపోయాడు. గోడకుర్చీ వేయవలసిందని గట్టిగా శాసించేవాడు పండిట్ జీ నాలుగు క్లాసుల విద్యార్థులు సిగ్గుపడుతున్న ఆ విద్యార్థి ముఖంవంక మాటిమాటికి చూస్తూండేవాడు.

అది గ్రహణంరోజు. ఆరోజు స్కూలుకు సెలవిచ్చారు. మరునాడు ఒక పలక, సిరాపడిన సంచిలో పుస్తకాలు వేసుకుని ఆశుతోష్ రావడం బల్లమీద కూర్చున్న

పండిట్‌జీ చూశారు. అతను నెమ్మదిగా బహుజాగ్రత్తగా క్లాసులో ప్రవేశించి కూర్చున్నాడు.

పండిట్‌జీ వెకిలిగానవ్వుతూ, "ఓహో పెళ్ళికూతురు వచ్చినట్టుందే" అన్నాడు.

చదువు పూర్తయినతర్వాత పిల్లలందర్నీ సంబోధించి ఇలా చెప్పారు: "ఏయ్ పిల్లలూ! మీరంతా వినండి."

భూమి తన ఆకర్షణశక్తివల్ల బాలకులను తనవైపు కాకర్షిస్తోంది. అయినా ఒక చిన్న బాలుడు ఆశుతోషు పంచి క్రిందిక వ్రేలాడుతూ బెంచిమీదనిలచి అందరిదృష్టిని తనవైపుకు కేంద్రీకరిస్తున్నాడు. ఇప్పటికే వయస్సుతోపాటు ఆశుతోషు అనేక అనుభవాలుకూడ గడించాడు. ఎన్నో సుఖదుఃఖాలు, సిగ్గు మొదలయినవి కూడా అనుభవించివుండాలి. కాని ఆనాటి చరిత్ర అతని జీవితములో తదితరమైనవాటితో పోలికలేనిది. విషయం చిన్నదే. కొద్దిమాటలలో ముగుస్తుంది. అయినా దానిలో విశేషరహస్యం వుంది.

ఆశుతోషుకొక చెల్లెలుఉంది. ఆ చెల్లెలుకు తనతోటి స్నేహితురాండ్రుగాని, అక్కలు చెల్లెళ్ళుగాని ఎవరూలేరు. ఇతనితోనే ఆడుకుండేది.

ఆశుతోషు ఇంటిముందర ప్రహరీకి ఇనప కటకటాల గేటుఉంది. ఇంటిముందు కారు ఆగడానికి వరండాకూడా ఉంది. బాగా వర్షంకురుస్తుంది. చేతిలో చెప్పులు పట్టుకొని గొడుగులు వేసుకొని మనుష్యులు బజారులో వస్తూ పోతూ వున్నారు. మేఘాలు దట్టంగా వ్యాపించినయ్. చీకటి క్రమ్ముకుంది. వర్షం టపటపమని కూరుస్తూంది. ఆశుతోషు వరండా

మెట్లమీద కూర్చుని చెల్లెలితో ఆడుతున్నాడు.

ఆరోజు వాళ్ళ బొమ్మలపెళ్ళి. ఆ ఏర్పాటు గురించే ఆశుతోషు తన చెల్లికి ఆదేశాలిస్తూ పోతున్నాడు.

"పురోహితుడెవరుంటారు ?" అనే సమస్యవచ్చింది. బాలిక వరుగెత్తి ఎదురుగా నిలబడివున్న వ్యక్తికి అడుగు తోంది. "ఏమండీ! మీరుమాకు పురోహితులుగా ఉంటారా!"

ఆశుతోష్ తలఎత్తి అటువైపు చూశాడు. పండిట్ శివనాధ్ తడచిన గొడుగు మడిచి; తడిగుడ్డలతో వరండాలో నిలబడి కనిపించారు. దారిన పోతూంటే వర్షం జోరుగా కురిసింది. త్రోవలో ఈ యింటిముందే ఆగిపోయారు. ఆ బాలిక ఆయన్నే పురోహితుడుగా ఉండమని బ్రతిమాలుతోంది.

పండిట్‌జీని చూడగానే ఆశుతోష్ ఒక్క గెంతుతో యింట్లోకి దూరాడు. ఆ సెలవుదినమున వృధాగానే గడిచి పోయింది.

మర్నాడు పండిత్‌జీ అతన్ని చూడగానే పకిలినవ్వు నవ్వి ఆ సంఘటనను అభివర్ణిస్తూ అతనికి "దులహిన్" (పెళ్ళి కూతురు) అని నామకరణంచేశారు. మామూలుగానే నవ్వుతూనే అతను అందరిలోనూ కలవబోయాడు. ఇంతలోనే బెల్ మ్రోగింది. అన్ని క్లాసుల పిల్లలూ బయటికి వెళ్ళి పోయారు. మిఠాయి, ఒక మెరిసే పువ్వులగ్లాసులో మంచి నీళ్ళు తీసుకుని దాసి వచ్చి నిలబడింది.

అప్పుడు నవ్వుతూ నవ్వుతూ అతనిముఖం ఎర్ర బారింది. బాధతో అతని నుదురునాళా లుబికినై. వేగంగా

వస్తున్న అశ్రువులు ఆపశక్యం గాకుండా కనుకొలకులనుండి ప్రవహించినవి.

పండిట్‌జీ టిఫిన్ తీసుకుని ఈజీచైర్‌లో కూర్చుని హుక్కా త్రాగుతున్నారు. పిల్లలు ఉత్సాహంగా అశుతోష్ చుట్టూచేరి "పెళ్ళికూతురు" "పెళ్ళికూతురు" అని అరుస్తున్నారు. ఆ సెలవురోజు అతని జీవితంలో అన్నిటికంటె లజ్జాకరమైనది. ప్రపంచంలో ఏ వ్యక్తీ ఆరోజు సంగతి మరచిపోతాడనే నమ్మకం అతనికి కలుగలేదు.

# కిరణ్మయి

సాయంత్రం అవుతున్నకొద్దీ తుఫాను తీవ్రరూపం దాలుస్తోంది. కుండపోతగా కురుస్తున్న వర్షపు హోరును, ఉరుములతో మెరుపులతో దద్దరిల్లుతున్న ఆకాశాన్ని పరికిస్తే దేవతలకు రాక్షసులకు ఘోరసంగ్రామం జరుగుతున్నట్లుగా ఉంది. నల్లటి మేఘాలు ఆకాశాన్ని కప్పేశాయి గంగానది గంభీరంగా ఘర్జిస్తూ ప్రవహిస్తోంది. నది కిరువైపులా ఉన్న చెట్లు ఇటూ అటూ ఊగుతూ భయంకరంగా మూలుగుతున్నాయి.

చందరనాగోర్‌లోని నదిఒడ్డు ఇళ్ళలోని ఒకగదిలో భార్యాభర్తలిద్దరు కూర్చుని ఒక అతిముఖ్యమైన విషయం మీద చర్చ సాగిస్తున్నారు. ఆ గదిలో దీపం తేజోవంతంగా వెలుగుతోంది.

భర్త శరత్ "నువ్వు మరికొన్ని రోజులు ఇక్కడే ఉండు పూర్తిగా ఆరోగ్యం చిక్కినాక వద్దువుగాని" అన్నాడు.

"నేను పూర్తిగా కోలుకున్నాను. ఇప్పుడు ఇంటికి వెడితే నా కొచ్చేముప్పేమీలేదు" అన్నది భార్య కిరణ్.

"నువ్విక్కడ మరికొన్ని రోజులు ఉంటేనే మంచిదని డాక్టరు చెప్పాడు" అన్నాడు శరత్.

"మీ డాక్టరుకు అన్ని విషయాలు తెలుసునా?" కిరణ్ అడిగింది.

అం...అంచేతే నువ్విక్కడ ఒకటి రెండు మాసా లుంటే మంచిది. పైగా మనఊళ్ళో రకరకాల వ్యాధు లున్నాయి" అన్నాడు.

"అయితే ఈ ఊళ్ళో జబ్బుగల మనుషులే లేరను కుంటాను" అన్నది కిరణ్.

అసలు విషయం ఇది.

కిరణ్ ఇంట్లోను, ఊళ్ళోను అందరిచేత మంచిదని పించుకుంది. అంచేత ఆమెకు ప్రమాదకరమైన జబ్బు చెయ్య గానే అందరూ ఆందోళన పడసాగారు. గాలి మార్పిడికోసం ఆమెను చందరనాగోర్ తీసుకొచ్చారు. క్రమంగా ఆమె కోలుకుంది. ఆమె గ్రామానికి ఎప్పుడు తిరిగి వస్తుందా అని గ్రామస్తులంతా ఎదురు చూస్తున్నారు. కాని శరత్ అతని తల్లి-ఆమెను మరికొన్ని రోజులు పూర్తిగాఆరోగ్యంపొందే వరకు అక్కడే ఉంచాలని పట్టుదలగా ఉన్నారు. కాని కిర ణ్‌కు మాత్రం అక్కడ ఉండటం ఎంత మాత్రం ఇష్టంలేదు. అందుచేత శరత్ ఆమెను నచ్చజెప్పటానికి అక్కడకు వచ్చాడు. కిరణ్ కొంతవరకు కోలుకున్నా పూర్తి బలాన్ని మాత్రం పొందలేదు. ఆమె బలహీనమైన ముఖాన్ని చూస్తుంటే ఎంతటి భయంకర మృత్యువును ఆమె కొద్దిలో తప్పించుకో గలిగిందో అర్థం అవుతుంది.

కిరణ్ అందరితోను కలుపుగోలుగా మాట్లాడే మనిషి నదిఒడ్డు బంగళాలోని ఒంటరి జీవితం ఆమెకేమీ నచ్చలేదు. ఆమె చెయ్యడానికేమీ పని ఉండేదికాదు, మాట్లాడటానికి ఇరుగు పొరుగు ఎవరూలేదు. రోజంతా మందులు మాకులు

వేసుకుంటూ కూర్చోవటం ఆమెకు అసహ్యమనిపించింది. ఆ తుఫానునాటి సాయంత్రం గదిలో కూర్చుని వాళ్ళిద్దరూ చర్చించింది ఈ విషయాలనే.

కిరణ్ వాదించినకొద్దీ వాదం ఇంకా పెరుగుతూనే ఉంది. ఆమెసమాధానం చెప్పకుండా ఊరుకున్నప్పుడు అతడు విసిగి ఇక తన ఓటమిని ఒప్పుకోవడానికి సిద్ధపడేవాడు.

అతడు తన ఓటమిని ఒప్పుకోవడానికి సిద్ధంగా ఉన్న సమయంలో బయటి నుంచి సేవకుడు తలుపుతట్టి పిలిచాడు.

శరత్ తలుపు తెరిచాడు. తుఫానుకు నదిలో పడవ మునగగా అందులో ఉన్నవారిలో ఒకబ్రాహ్మణ బాలుడు ఈదుకుంటూ బంగళావద్ద ఒడ్డుకు చేరాడని సేవకుడు చెప్పాడు.

కిరణ్ వెంటనే అక్కడినుండిలేచి కుర్రవాడికి పొడి బట్టలు వేవడానికి లోనికి వెళ్ళింది. కుర్రవాణ్ణి తనగదిలోకి తీసుకువెళ్ళి ఒక కప్పుతో పాలు యిచ్చింది.

ఆ బాలుడు అందంగా ఉన్నాడు. పొడుగాటి ఉంగరాలజుత్తు సొగసుళ్ళు చూడముచ్చటగా ఉన్నాయి కిరణ్ అతన్ని గురించి సమాచారం యావత్తు అడిగి తెలుసుకుంది.

అతనిపేరు నీలకాంత్. అతడో డ్రామాకంపెనీకి చెందినవాడు. ఆ పక్కవూళ్ళో నాటకం ఆడడానికి కంపెనీ అంతా తరలివస్తుండగా నదీమధ్యలో పడవ మునిగిపోయింది. అతని సహచరు లేమయిందీ అతనికి తెలియదు. అతడు మాంచి గజ ఈతగాడు. అంచేత క్షేమంగా ఒడ్డుకు చేరుకో గలిగాడు.

అతడు వాళ్ళతోనే కలసి ఉంటున్నాడు. తృటి పాటిలో చావును తప్పించుకో గలిగినందుకు కిరణ్ అతనిపై ప్రత్యేక ఆదరాభిమానాలను ప్రదర్శించసాగింది. బాలునిరాక శరత్ కుకూడా ఒకవిధంగా సంతోషాన్ని కలుగజేసింది. అతని భార్యకు బాలునితో కాలక్షేపం అవుతోంది. అంతేగ ఆమె అక్కడ మరికొంతకాలం ఉండగలుగుతుందని అతనిఆశ. ఆమె అత్తగారుకూడా బ్రాహ్మణ బాలునిరాకకు సంతోషించింది. ఇక నీలకాంత్ విషయం చెప్పనే అవసరంలేదు. డ్రామా కంపెనీ యజమాని బారినుండి తప్పించుకో గలిగినందుకు సంబరపడ్డాడు. ధనవంతుల ఇంట్లో ఆశ్రయం దొరికినందుకు అతని సంతోషానికి అవధిలేకుండా ఉంది. ఒక్కసారి తన్నితే వెళ్ళి బూరెల బుట్టలో పడినట్టుగా ఉంది అతని పని.

కాని శరత్. అతని తల్లి బాలునిమీద తనుకున్న అభిప్రాయాల్ని మార్చుకోవడానికి ఎన్నోరోజులు పట్టలేదు. అతడు దొంగచాటుగా శరత్ పాలు తాక్కపట్టుకు తీర్చేవాడు. వర్షం కుండపోతగా పడుతున్నా సరే లెక్క చెయ్యకుండా శరత్ సిల్కుగొడుగు వేసుకొని వూరంతా తిరిగేవాడు. అక్కడ అలగ జనం అందరితోటి స్నేహాలు చేసేవాడు. వీధికుక్క నొకదాన్ని మచ్చికచేసి దాన్ని శరత్ పట్టుపరుపు పై దొర్లనిచ్చేవాడు. అది పరుపుమీద బురదకాళ్ళతో ఇష్టం వచ్చినట్టు తొక్కేది. అతడు తనతో పిల్లలదళాన్ని వెంటేసుకెళ్ళి మామిడి తోపులమీద పడేవాడు. అప్పుళ్ళో ఒక్క మామిడికాయ ఉండనిస్తే ఒట్టు.

నీలకాంత్‌ను పాడుచెయ్యటంలో కిరణ్‌కు ప్రధాన

పాత్ర ఉందనడంలో సందేహంలేదు. శరత్ ఆమె కావిమ యాన్ని గురించి చాలసార్లు చెప్పిచూశాడు. కాని ఆమె శరత్ మాటను ఖాతరు చెయ్యలేదు.

నీలకాంత్‌కు కొత్త బట్టలు కొనిపెట్టింది కిరణ్. అతని మీద ప్రేమకొద్దీ అతన్ని తన గదిలోకి పిలుపించుకొని అతని విషయాలన్నీ క్షుణ్ణంగా తెలుసుకొనేది. ఆమె స్నానంచేసి భోజనం చేశాక ఎత్తుపీటమీద కూర్చునేది. దాది ఆమెతల ఆరబెట్టి దువ్వేది. నీలకాంత్ ఆమె కెదురుగా నిలబడి తనకు గుర్తున్న డ్రామా సంభాషణలు, పాటలు గొంతెత్తి వినిపించే వాడు. అలా మధ్యాహ్నమంతా కాలక్షేపం జరిగిపోతుండేది. శరత్‌ను కూడా అక్కడ కూర్చోమని కిరణ్ బలవంత పెడు తుండేది. కాని నీలకాంత్‌మీద ఉన్న అయిష్టత కొద్దీ అత డందుకు అంగీకరించే వాడుకాదు. ఒకవేళ ఎప్పుడైనా వచ్చి కూర్చున్నా అతన్ని చూడగానే నీలకాంత్ గొంతు పెగిలేది కాదు.

నీలకాంత్ వయస్సు ఎంత ఉంటుందో సరిగ్గా చెప్ప లేము. బహుశా పదహారు సంవత్సరా లుండొచ్చు. అతడు చిన్నప్పుడే డ్రామాకంపెనీలో చేరాడు. రాధిక, దమయంతి, సీత పాత్రలన్నీ ధరించాడు. అక్కడితో అతని ఎదుగుదల ఆగిపోయింది.

నీలకాంత్ వయస్సుకు తగిన గౌరవాన్ని ఎప్పుడూ పొందలేదు. అతడు చూపులకు చిన్న పిల్లవాడిలా అగుపించే వాడు, పొగత్రాగటంవల్ల అతని పెదాలు నల్లబడి మొర టుగా కనిపించేవి. కాని అతని హృదయం బాల్యావస్థను

ఇంకా దాటిపోలేదు [illegible] అతన్నింకా బాలునిగానే పరిగ ణించటం అతనికి సిగ్గుగా ఉండేది. ఆమె అతన్నొక్కసారి స్త్రీ వేషం ధరించమని అడిగినప్పుడు అతని ఒళ్ళు గగుర్పొడ చింది. ఎందుకనోగాని స్త్రీలాగా వేషం వేసుకోవడమంటే అతనికి అసహ్యం మేర్పడింది. తన పాతవేషాలు ధరించమని అడిగినప్పుడు అతడక్కడనుండి పారిపోయేవాడు.

నీలకాంత్‌కు చదువు చెప్పటానికి ఓ మాస్టరును ఏర్పాటుచేశారు. మాస్టరు ఎంత మొత్తుకున్నా నీలకాంత్ బుర్రలోకి ఒక్క అక్షరమైనా ఎక్కేదికాదు అతనికి స్థిరంగా ఒకచోట కూర్చోవటం అలవాటులేదు. అతని కళ్ళకు అక్ష రాలు నృత్యం చేస్తున్నట్లుగా ఉండేయి. గంగానది ఒడ్డున ఒళ్ళో పుస్తకం పెట్టుకొని కూర్చునేవాడు.

నీటిలో పడవల ప్రయాణం, ఆకాశంలో పక్షుల కిల కిలలు అతనికి గిలిగింతలు పెట్టేవి. ఒక అక్షరాన్ని దాటి ఎప్పుడూ ముందుకు వెళ్ళేవాడుకాదు. కాని ఎప్పుడూచదువు తున్నట్లుగానే కనిపించేవాడు. పడవదగ్గరకు రాగానే పుస్తకం పైకెత్తి బిగ్గరగా చదివేవాడు. పడవ మటుమాయం మవగానే అతని చదువుకూడా అఖరయ్యేది.

శరత్‌కు ఓ తమ్ముడున్నాడు. అతని పేరు సతీషు. సతీషు కాలేజీ శెలవలకు చందన నాగోరు వచ్చాడు. అతని రాక కిరణ్‌కు మరింత సంతోషాన్ని కలుగజేసింది. వారిద్ద రికీ ఒకే ఈడు ఉంటుంది. ఆటపాటలతో కాలం వేగంగా గడచి పోతోంది.

సతీష్ వచ్చిందగ్గర్నుంచి నీలకాంత్ గొంతులో

వచ్చి వెలక్కాయ పడినట్లుగా ఉంది. అతని హృదయంలో ఎవరిమీదనో కసి తీర్చుకోవాలనే భావం నానాటికీ బలపడుతోంది. తన దళంలోని కుర్రాళ్ళని ఉత్తిపుణ్యానికి పట్టుకొని చితక్కొట్టేవాడు. పెంపుడు కుక్కను కుయ్యోమొర్రో అనేదాకా చావమోదేవాడు.

నీలకాంత్ తిండి విషయంలో మాత్రం మొహమాటపడేవాడు కాదు! రోజూ కిరణ్ అతను భోజనం చేసేదాకా అతని ముందు కూర్చునేది. అతనికి మంచి ఆహారాన్ని ఇవ్వడంలో ఎంతో శ్రద్ధ తీసుకునేది. కాని సతీష్ వచ్చిందగ్గర్నుంచి ఆమెకు నీలకాంత్ దగ్గరకు వచ్చి కూర్చోవడానికి వ్యవధి చిక్కడంలేదు.

కిరణ్ దగ్గరలేకపోవడంచేత నీలకాంత్ సరిగా అన్నం తినలేకపోతున్నాడు. అర్ధాకలితో లేచి "నాకేం ఆకలిగా లేదు" అని కళ్ళనిండా నీళ్ళునింపుకొని వంటమనిషితో చెప్పేవాడు. ఈ మాటలు కిరణ్ చెవినిపడగానే ఆమె తనను బ్రతిమాలుతుందని కలలు కన్నాడు. కాని అటువంటిదేమీ జరగలేదు. ఈ విషయం కిరణ్‌కు అసలు తెలియనే తెలియదు. అతడు వదిలిపెట్టిన పదార్థాలన్నీ వంటమనిషి సుష్టుగా భోంచేసేది. ఇక దీపం ఆర్పేసి పక్కమీద కూలబడేవాడు. ఆ చీకట్లో తలగడలో ముఖందాచుకుని వెక్కి వెక్కి ఏడ్చేవాడు. అసలతని దుఃఖం ఏమిటి? ఎవరిమీద? ఎవరినుంచి తను ఉపశాంతి కోరుతున్నాడు? ఏమో ఎవరికీ తెలియదు. ఆఖరికి తల్లిలేని కుర్రాడి గాయపడిన హృదయం నిద్రామాత మృదుస్పర్శకు విశ్రమించేది.

సతీష్ తనమీద అవాకులు చెవాకులు కల్పించి కిరణ్ మనస్సును విరిచేస్తున్నాడనే నిర్ణయానికివచ్చాడు నీలకాంత్. కిరణ్ మునుపటిలాగా తనతో ఆప్టే మాట్లాడకపోవడం అతని అనుమానానికి మరింత బలాన్ని చేకూర్చింది వచ్చే జన్మలో తనను సతీషుగాను, సతీషును తనునుగాను చెయ్యమని వెయ్యిదేవుళ్ళకు మొక్కుకున్నాడు. బ్రాహ్మణశాపం వృథాపోదని అతని నమ్మకం.

సతీషుమీదఉన్న క్రోధాన్ని అతడెప్పుడూ బయటకు వెళ్ళగక్కలేదు. అనేక ఇతర మార్గాలద్వారా దానిని వెలిబుచ్చేవాడు. సతీషు నదికి స్నానానికి వెళ్ళినప్పుడు అతని సబ్బుతీసి కనపడకుండా దాచేవాడు. అన్నీ ఇలాంటి పనులే చేసేవాడు.

ఇలా కొన్నిరోజులు గడచిపోయాయి ఆఖరికి వాళ్లు అక్కడినుండి వెళ్ళిపోయేరోజు దగ్గరపడింది ఇంట్లో అంతా సామాన్లు సర్దడంలో మునిగిఉన్నారు. సతీషుకూడా వాళ్ళతో వెళ్ళిపోతున్నాడు. కాని నీలకాంత్ తో ఎవరూ మాట్లాడలేదు. అతడు వారితో వెళ్ళేదీ లేనిదీ ఎవరికీ పట్టినట్టులేదు.

కిరణ్ ఆ ప్రస్తావనను ముందుగా తీసుకొచ్చింది. నీలకాంతునుకూడా తీసుకెడదామని ఆమె భర్తతో అన్నది. కాని భర్త, అత్త, మరిది - అందరూ ఒకేమాటమీద నిలబడి అలా జరగటానికి వీలులేదన్నారు. అంచేత కిరణ్ ఆ ప్రస్తావనను ఇక విరమించుకోవలసివచ్చింది. వాళ్ళు అక్కడనుండి మరి రెండు రోజులకు వెళ్ళిపోతారనగా ఆమె కుర్ర

వాణ్ని పిలిపించింది. తిరిగి అతన్ని ఇంటికి వెళ్ళిపొమ్మని బుజ్జగిస్తూ చెప్పింది.

ఈ జాలికరమైన మాటలను నీలకాంతు భరించలేక పోయాడు. కన్నీరు మున్నీరుగా ఏడ్చాడు. కిరణ్ కళ్లు చమ్మగిల్లాయి. తను సృష్టించిన ప్రేమబంధాన్ని తలచుకొంది. ఇప్పుడా బంధాన్ని తెగతెంపులు చేసుకోవలసి వచ్చినందుకు విచారించింది.

సతీషుకు ఈవ్యవహారమేనచ్చలేదు. "దుక్కపోతులా ఉన్నావు. విషయమేమిటో చెప్పలేవూ! అలా ఏడుస్తావెందుకు!" అన్నాడు.

కిరణ్ అతన్ని వారించింది.

కాని సతీషు అక్కడితో ఊరుకోలేదు. "పదినా పికేం తెలియదు. నల్లనివన్ని నీళ్ళని, తెల్లనివన్నీ పాలని అనుకుంటావు. వీడెక్కడపుట్టాడో ఎవరికీ తెలియదు కాని ఇక్కడ మహారాజభోగం అనుభవిస్తున్నాడు. "సింహం తిరిగి చిట్టెలక కావడానికి ఒప్పుకోదు". అన్నాడు.

నీలకాంతు వెంటనే అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. తనదగ్గర కత్తిఉన్నట్లయితే సతీషుని ముక్కలకింద తరిగే వాణ్ణనుకున్నాడు.

సతీష్ కలకత్తానుంచివచ్చేటప్పుడు ఒక చక్కటి ఇంక్ స్టాండు తీసుకొచ్చాడు దానిమీద అందమైన జర్మన్‌సిల్వర్ హంసకూడా ఉంది. అదంటే అతనికి పంచప్రాణాలు. రోజూ సిల్కు రుమాలుతో దాన్ని జాగ్రత్తగా తుడిచేవాడు.

వాళ్ళు అక్కడనుంచి వెళ్ళబోయేముందు రోజున

ఇంకుస్టాండు కనిపించలేదు. కిరణ్ నవ్వి అన్నది: మరిడీ, నీ హాంస దమయంతిని చూట్టానికెళ్ళింది.

సతీషుకు ఒళ్ళు మండుకొచ్చింది. దాన్ని నీలకాంతు దొంగిలించాడని అతనికి గట్టి నమ్మకం ఏర్పడింది.

నీలకాంతును అక్కడకు పిలిపించారు. "నా ఇంకు స్టాండు దొంగిలించావు నువ్వు. దాన్నెక్కడపెట్టావో తీసుకురా" కోపంతో అరిచాడు సతీషు. కిరణ్ ముందు పట్టుకుని తనని దొంగఅని పిలవడం నీలకాంత్ కు తల కొట్టేసినట్లయింది. అతనికళ్ళు చింతనిప్పుల్లా మెరిశాయి. సతీషు మరొక్కమాట అన్నట్లయితే అతనిమీద పులిలాదూకి గోళ్ళతో గుచ్చి వదిలేవాడే.

ఈ దుస్సంఘటనకు కిరణ్ చాల మదనపడింది. అతన్ని మరొక గదిలోకి తీసుకెళ్ళి మార్దవంగా అడిగింది. "నీలూ, నిజంగా నువ్వు ఇంక్ స్టాడు తీసినట్లయితే నాకిచ్చెయ్యి. ఆవిషయం మరెవర్నీ ప్రస్తావించకుండా చేస్తాను అన్నది.

నీలకాంత్ కళ్ళనుండి కన్నీరు ప్రవహించింది. అతడు చేతుల్తో ముఖాన్ని కప్పుకొని బిగ్గరగావడవడం మొదలెట్టాడు. కిరణ్ గదిలోంచి బయటకువచ్చి అన్నది, "నీలకాంత్ ఇంక్ స్టాండు తియ్యలేదు. దాన్ని నీలకాంత్ దొంగిలించాడని శరత్, సతీషు ఇద్దరూ గట్టిగా వాదించారు.

కాని వారి మాటలను కిరణ్ ఏమాత్రం నమ్మలేదు.

కుర్రాణ్ణి ప్రశ్నించడానికి శరత్ ప్రయత్నించాడు. కాని కిరణ్ అందుకు ఒప్పుకోలేదు.

కుర్రాడి గది వెతకాలని సతీషు సూచించాడు.

"అటువంటి పనిగనక నువ్వు చేశావంటే నిన్ను నా జీవితంలో క్షమించను. ఒక నిరుపేద అమాయక బాలుని పట్ల అంత అమర్యాదకరంగా ప్రవర్తించకూడదు" అన్నదామె. ఇలా అంటుండగానే ఆమె కళ్ళు నీటితో నిండాయి. ఇక అక్కడితో ఆ విషయం ఆఖరయింది.

నిరాశ్రయుడైన బాలుని మీద మమకారంతో కిరణ్ హృదయం తొణికిసలాడింది. రెండు కొత్తసూట్లు, ఒకజత జోళ్ళు, ఒక వందరూపాయలనోటు చేతపుచ్చుకొని ఆమె నెమ్మదిగా నీలకాంత్ గదిలోకి ప్రవేశించింది. ఈ కానుకల్ని అతనికి తెలియకుండా అతని పెట్టెలోపెట్టాలని ఆమెఉద్దేశం. అతని పెట్టె కూడా ఆమె ఇచ్చిన కానుకే.

ఆమె తన తాళాలగుత్తిలోంచి ఒక తాళంచెవి తీసి పెట్టె తెరచింది. పెట్టెనిండా రకరకాల వస్తువులున్నాయి. ఆమె తెచ్చిన కానుకలు అందులో పట్టలేదు. అందుచేత ఆమె అందులోని సామాన్లన్నీ తీసి సరిగా సర్దటానికి ఉపక్రమించింది. చాకులు, గాలిపటం, దారపువుండలు - ఇంకా రకరకాల వస్తువులు బయటపడ్డాయి. అన్నిటికంటే అడుగున కాగితపు చుట్టలో ఇంకుస్టాండు, హంస కనిపించాయి.

కిరణ్ ఇంకుస్టాండును చేత్తోపట్టుకొంది. నిర్ఘాంతురాలై అలాగే చాలాసేపు దీనంగాచూస్తూ కూర్చుండిపోయింది. ఈలోగా కిరణ్‌కు తెలియకుండా నీలకాంతు ఆ గదిలోకి ఆమె వెనకాలే వచ్చాడు. అతడు జరిగిందంతా కళ్ళారా చూశాడు. ఆమె తననొక దొంగగా భావించి పట్టుకోవ

డానికి వచ్చిందనుకున్నాడు. అతని దొంగతనం పట్టుపడింది. తను దొంగనుకాదని, కేవలం కక్షతీర్చుకోవడంకోసమే ఇంకుస్టాండును తీశానని, అవకాశం దొరగ్గానే దాన్ని నదిలో పారేద్దామనుకున్నానని అతడు చెబితే ఎవరైనా నమ్మతారా! కాని నిజంగా అతడు దాన్నితీసింది ఎందుకోసమో. అతనిలో ఏదో బలహీనత ప్రకోపింపగా దాన్ని నదిలో విసరివెయ్యడానికి మారు తాత్కాలికంగా పెట్టెలో పెట్టాడు. "నేను దొంగనుకాదు. ముమ్మాటికీ కాదు." అతని హృదయం నొక్కిచెప్పింది. అయితే తనేమిటి! ఏం చెప్పగలడు! తను దొంగిలించి దొంగను కాదని చెప్పగలడా? కిరణ్ తనను సరిగా అర్థం చేసుకోలేదని ఎట్లాచెప్పగలడు! ఆమె తన నేరాన్ని పట్టుకోవడానికి వచ్చిందనే భావాన్ని అతడెలా మర్చిపోగలడు!

ఒక దీర్ఘమైన నిట్టూర్పువిడిచి కిరణ్ ఆ ఇంక్‌స్టాండును తిరిగి పెట్టెలో పెట్టేసింది. ఇప్పుడు తనే దొంగలాగా యథాతథంగా దానికి కాగితం చుట్టింది, పెట్టెసర్దింది. తన కానుకలుకూడా అందులో ఉంచింది వందరూపాయలనోటు కూడా అందులోనే పెట్టింది.

ఆ మర్నాడు నీలకాంత్ ఎక్కడా కనిపించలేదు. గ్రామస్థులెవరూ అతన్ని చూడలేదు. పోలీసులు, అతని పత్తాను కనుక్కోలేకపోయారు.

చివరికి శరత్ అన్నాడు: "అతని పెట్టెలో ఏమున్నాయో తెర్చి చూద్దాం."

కాని కిరణ్ అందుకు సుతరామూ ఒప్పుకోలేదు.

ఆ పెట్టెను ఆమె తన గదిలోకి తీసుకొచ్చింది. అందులోంచి ఇంక్ స్టాండు తీసి నదిలోకి విసరివేసింది.

వారంతా స్వగ్రామానికి వెళ్ళిపోయారు ఆ బంగళాలోని తోట నిర్మానుష్యంగా వుంది. ఇక మిగిలిందల్లా నీలకాంత పెంపుడుకుక్క మాత్రమే. అది నీలకాంత కోసం దుఃఖంతో పిచ్చిదానిలా నదివొడ్డున తారట్లాడుతోంది.

—::—

# చారిత్రక సత్యం

నేను, మా బంధువు తీర్థయాత్ర ముగించుకొని రైల్లో కలకత్తా వస్తున్నాం. మా ప్రక్కన ఓ ప్రయాణీకుడు కూర్చు న్నాడు అతని వాలకం, జేబురుగడ్డం చూస్తుంటే అచ్చం మహమ్మదీయుడులా ఉన్నాడు. కాని అతడు మాట్లాడు తోంటే మేం చూసి విస్తుపోయాం ప్రపంచంలో అన్ని విషయాలగురించి క్షుణ్ణంగా తెలిసినవాడిలా మాట్లాడాడు. మేం చాలావిషయాలు అతనిదగ్గర క్రొత్తగా నేర్చుకున్నాం. రష్యావాళ్లు మన సరిహద్దులదాకా వచ్చి మనమీద విరుచుకు పడటానికి సిద్ధంగా వున్నారని, స్వదేశీ సంస్థానధీశులు బ్రిటీషువాళ్ళకు వ్యతిరేకంగా రహస్యంగా కుట్రలు జరుపు తున్నారని మొట్టమొదటిసారిగా అతని నోటివెంట మేం విన్నాం.

మా రైలు మిత్రుడు ఇంకా ఇలా అన్నాడు. "ఈ ప్రపంచంలోను, స్వర్గంలోను అనుదినం అనేక సంఘటనలు జరుగుతూ వుంటాయి. అందులో కొన్ని మీరు వారా పత్రి కలద్వారా వినే వుంటారు."

మేం ఎప్పుడూ ఇల్లు కదిలి బయటకొచ్చిన బాపతు కాదు. అంచేత అతని విషయజ్ఞానానికి అబ్బుర పడిపోయాం ముక్కుమీద వేలేసుకున్నాం. అతడు సైన్సును గురించి, వేదాల్ని గురించి, ఉపనిషత్తుల గురించి, పర్షియన్ సాహి

త్యాన్ని గురించి ఒక్కటేమిటి అన్ని విషయాలమీద అనర్గళంగా తన అభిప్రాయాన్ని వ్యక్తపర్చాడు. అతనిమీద మా ప్రేమ ఇనుమడించింది. నా బంధువు దివ్యజ్ఞాన మండలి సభ్యుడు కావడంచేత బహుశా మాతోటే ప్రయాణిస్తుడు ఏదో దివ్యశక్తిని పొందినవాడైవుండాలని అంచనా కట్టాను. నా బంధువు అతని నోటివెంట వచ్చే ప్రతిమాటను ఎంతో జాగ్రత్తగా విని రహస్యంగా అతను చెప్పేదంతా నోట్సు రాసుకున్నాడు ఆ దివ్యజ్ఞానవ్యక్తి ఇదంతా చూసి లోలోన నవ్వుకున్నాడని నే వసికట్టాను.

రైలు జంక్షన్‌లో ఆగగానే మేం మరోబండి కనక్షన్ కోసం ఎదురు తెన్నులు చూస్తూ వెయిటింగ్ రూమ్‌లో కూర్చున్నాం. రాత్రి పది గంటలయింది. లైను చెడిపోవడం వల్ల మా బండి చాలా ఆలస్యంగా వస్తుందని తెలిసింది. టేబుల్‌మీద పక్క పరచుకొని పడుకోడానికి సిద్ధపడుతున్న సమయంలో ఆ దివ్యజ్ఞానవ్యక్తి నావక్కన కూచుని తకిలీతో దారం వడక నారంభించాడు. ఆ మోతకు నాకా రాత్రి నిద్రవడితే ఒట్టు.

పరిపాలనా విధానంలోని కొన్ని సమస్యలమీద అభిప్రాయ భేదాలొచ్చి జునాగడ్‌లోని నా పదవికి రాజీనామా యిచ్చాను. ఆ తరువాత హైదరాబాదు నిజాం సంస్థానంలో చేరాను. వాళ్ళు నన్ను బారిచ్ అనే ఓడూళ్ళో వర్తిపన్ను కలెక్టరుగా వేశారు.

బారిచ్ చాల అందమైన ప్రదేశం దాని చుట్టూ కొండలూ, చిట్టడవులు వున్నాయి. అక్కడికి వెళ్ళడానికి

సరైన మార్గంకూడా లేదు. అక్కడ నదిపడ్డుకు నూటయాభై అడుగుల దూరంలో కొండల నడుమ ఓ బ్రహ్మాండమైన భవంతి కొట్టొచ్చినట్లుగా కనబడుతుంది. అక్కడేమి జన సంచారం లేదు. బారిచ్ గ్రామం, ప్రత్తి అంగళ్ళు అక్కడకు చాలా దూరంలో వున్నాయి.

250 సంవత్సరాలక్రితం రెండవ మహమ్మద్‌షా చక్రవర్తి కట్టించిన భవనమది. తన విలాసార్థం అతడీ ఏకాంత సౌధాన్ని నిర్మించాడు. అతని కాలంలో అక్కడ నీటి పౌంటెన్లు అందంగా నీళ్ళు చిమ్మేవి. అక్కడ సుందర మైన కొలనుల్లో పర్షియన్ యువతులు స్నానాలు చేసేవారు.

ఇప్పుడు పౌంటెన్ లేమీలేవు, కొలనుల్లో ఎవరూ స్నానం చెయ్యడంలేదు. మాలాంటి పన్ను కలక్టర్లకదిప్పుడు నివాస స్థానంగా వుంది. మా ఆఫీసులోని తల నెరిసిన గుమాస్తా కరింఖాన్ నన్నక్కడ మకాం వుండొద్దని పదేపదే చెప్పాడు. మీ కంతగా వుండాలని వుంటే పగలక్కడ గడ పండి. కాని రాత్రిమాత్రం అక్కడుండొద్దు." అన్నాడు. నే నొకసారి నవ్వేసి ఊరుకున్నాను. నౌకర్లు కూడా అలాగే చెప్పారు. చీకటిపడితే ఆఇంటి చుట్టుపక్కల దొంగలుకూడా తిరగరు. ఆ ఇంటి కటువంటి పేరుంది. కాని నేనక్కడే వుండటానికి నిశ్చయించుకొన్నాను.

మొదట్లో నాకా ఒంటరిభవనంలో ఏమీ తోచేది కాదు. పగలంతా బయటకెళ్ళి కష్టపడి పని చేసేవాణ్ణి. అలసి సొలసి రాత్రికి ఇంటికి చేరుకోగానే వెంటనే నిద్రపట్టేసేది.

ఓ వారం రోజులు పోయిన తరువాత ఆ ప్రదేశమంతా నన్ను లోబరచుకొంటున్నట్టుంది. ఆ ఇంట్లో ఏదో సజీవశక్తి నన్ను మంత్రప్రభావ ముగ్ధుణ్ణిగా చేసేసి క్రమంగా లోబరచుకొంది. ఇలా అని చెబితే నిజంగా లోకులు నన్ను నమ్మరు.

అప్పుడే వేసవి ప్రారంభమయింది. మార్కెట్టు మందంగా వుండడంచేత నాకంత పెద్దగా పనేమీలేదు. సూర్యాస్తమయానికి ముందు నీటి కొలను మెట్ల ప్రక్కన కుర్చీలో కూర్చున్నాను. నీటిమీద సంజకెంపుల సోయగాన్ని తిలకిస్తున్నాను. కొండలమీద చెట్ల సువాసల్ని గాలి తెరలు మోసుకొస్తున్నాయి.

పశ్చిమకొండల శిఖరాగ్రాల్లో సూర్యుడస్తమించాడు వెలుగనే వేదికమీద ఓ విశాలమైన చీకటితెర పడింది. గుఱ్ఱంమీద స్వారీచేద్దామని అక్కడనుంచి లేవబోతున్నాను. అంతలో మెట్లవెనక ఎవరివో పాదాల చప్పుడు వినిపించి వెనుదిరిగి చూశాను. కాని అక్కడెవరూ కనిపించలేదు.

ఒకవేళ నేనేమైనా భ్రాంతిచెందానేమోనని అక్కడే తిరిగి కూచున్నాను. ఇంతలో ఆ మెట్లమీంచి చాలామంది పరుగెత్తుకుపోతున్న శబ్దం వినిపించింది. ఓ వింతైన ఆనందం నన్నావరించింది. నా కళ్ళముందెవరూ కనిపించకపోయినా, అనేకమంది యువతులు ఆ వేసవి సాయంత్రం కొలనులో స్నానం చెయ్యడానికి ఆనంద కోలాహలంతో మెట్లు దిగుతున్నట్లు చూశాను. అక్కడంతా నిశ్శబ్దంగావుంది. నదిలో కాని, భవంతిలోగాని ఆ చుట్టుపక్కలకాని ఎక్కడా అలికిడైనశబ్దం రావడంలేదు కాని నవ్వుతూ, ప్రేలుతూ నాముందు

నించి యువతులు నన్ను చూడకుండా ఒకళ్ళవెనకాల ఒకళ్లు తరుముకుంటూ నీటిలోకి దూకడంమాత్రం స్పష్టంగా వినిపిస్తోంది. నాకు వాళ్ళు కనిపించడంలేదు. వాళ్ళు నన్ను చూడ్డంలేదు. కొలను ప్రశాంతంగావుంది. కాని ఒక్కసారే ఆ ప్రశాంతత అంతరించి ఆ ప్రదేశమంతా యువతుల నవ్వులతో నిండింది. దబ్బుమని నీటిలోదుముకుతూ, ఒకళ్ళమీద ఒకళ్ళు నీళ్ళు చిమ్ముకుంటూ ఆటలాడుకుంటున్నారు.

నాగుండెఝల్లుమన్నది. అందుక్కారణం భయమో సంతోషమో, ఆదుర్దాయో నాకు తెలీదు. వాళ్ళను మరింత స్పష్టంగా చూడగలిగితే బాగుండు ననుకున్నాను. కాని నాముందేమీ కనుపించలేదు. నా చెవులు రిక్కించివింటే స్పష్టంగా వినబడుతుందేమో అనుకున్నాను. కాని ఆప్రయత్నమూ విఫలమయింది. రెండువందల యాభై సంవత్సరాల నాటి చీకటితెర నాముందు వ్రేలాడుతున్నట్టుంది. సంతోషంతో ఒణుకుతూ ఓ మూల దాన్ని పైకెత్తి తొంగి చూశాను.

ఆ నిశ్శబ్ద ఒంటరి సాయంత్రాన్ని చీల్చుకొని పెనుగాలి విజృంభించింది. రెండువందల యాభై సంవత్సరాల నాటి స్వప్నదృశ్యాలు మెరుపులా మెరిసిపోయాయి.

నా ఒంటరితనాన్ని గమనించి ఏదైనా పిశాచం నన్ను పట్టుకుందేమోనని భయపడ్డాను. సరైన ఆహారం లేకపోతే ఇలాంటి అనర్థాలన్నీ ముంచుకొస్తాయేమోనని వంటమనిషిని పిలిచి, మంచి మొగలాయీ భోజనం తయారు చెయ్యమని ఆజ్ఞాపించాను.

ఆ మర్నాడు నా హృదయం కొంత తేలికపడింది. సాయిబుల టోపీ పెట్టుకొని, గుర్రపుబగ్గీ ఎక్కి వనిలో కెళ్లాను. ఆ వేళ నా మూడుమాసాల రిపోర్టురాసి పంపించాల్సివుంది. అంచేత ఆ వేళ ఇంటికొచ్చేసరికి చీకటి పడుతుందనుకున్నాను. కాని విచిత్రం. చీకటి పడకుండానే ఇంటికి వచ్చేశాను. అలా ఎందుకొచ్చానో నాకే తెలియదు. వాళ్ళంతా నాకోసం నిరీక్షిస్తుంటారని, అంచేత ఆలస్యం చెయ్యకూడదని వచ్చేశాను. నా రిపోర్టు పూర్తికాకుండానే వదిలిపెట్టేసి ఇంటికి చక్కావచ్చాను.

మొదటి అంతస్థులోని మెట్లు ఓ విశాలమైన హాలు లోకి తీసుకెళ్ళాయి. అక్కడ స్థంభాలు మూడు వరుసలుగా నిలబడి వున్నాయి, అప్పుడే చీకటి పడింది. ఇంకా దీపాలు వెలిగించలేదు. నే తలుపు బార్లా తియ్యగానే అక్కడిజనం నన్నుచూసి కంగారుగా ద్వారాలగుండా, కిటికీలగుండా, వరండాల్లోంచి, గదుల్లోంచి పారిపోతున్నట్లనిపించింది.

నే పరికించి చూశాను, కాని ఎవరూ నా కంటికి కనిపించలేదు. ఆవిశాలమైన హాల్లో స్థంభాల మధ్యన చీకట్లో నింపుని చలవరాళ్ళమీద పడుతున్న పౌంటెన్ల నీళ్ళ తుఫర్లను. వీణమీద అలాపిస్తున్న రాగాలను. గాజుల గల గలలను, అందెల ఘులంఘులలను. గంటల గణగణారావాల్ని దూరాన్నుంచి వినిపిస్తున్న కోయిల పాటని, వసారాలోని పంజరంలో వున్న బుల్ బుల్ పాటల్ని వింటున్నాను. ఇవన్నీ నాకో అలౌకికానందాన్ని చేకూర్చాయి.

మంత్రముగ్ధంగా ఏదో మాయలోపడి ఈ ప్రపంచ

మంతా అబద్ధమని ఆమాయే నిజమని అప్పట్లో అనిపించింది. ఆ విశాల నిశ్శబ్ద హాలులో నించొని నాలో నేను విరగబడి నవ్వుకున్నాను.

ఆ సమయంలో నౌకరు లైటు చేత్తో పుచ్చుకొని లోనికి ప్రవేశించాడు. అతడు నన్ను చూసి పిచ్చివాడని భావించాడేమో? లైటుముందర కూర్చొని పేపరు చదువుకుంటూ మళ్ళీ ఒకసారి ఆలోచనల్ని వెనక్కి మలిపాను. నెలకు నాలుగువందల యాభైరూపాయలు నిక్షేపంగా సంపాదించుకునే నేను అనవసర ఆలోచనలతో మనసుని పాడుచేసుకోవడం ఏమంత మంచిది కాదనిపించింది.

భోజనం అయ్యాక ఓ చిన్నగదిలో పక్క పరచుకొని పడుకున్నాను. దీపం ఆర్పేశాను. తెరచిన కిటికీలోంచి ఓ ప్రకాశవంతమైన నక్షత్రం ఆవల్ని కొండలపైన వేలాదిమైళ్ళ దూరంనుంచి చీకట్లో నాకేసి తదేకంగా చూస్తోంది, ఎంతసేపు అలా పడుకున్నానో తెలియదు కాని అకస్మాత్తుగా లేచి కూర్చున్నాను. చుట్టూ పరికించి చూశాను. ఎవరూ కనిపించలేదు. ఎక్కడా అలికిడైన శబ్దంకూడా లేదు. ఆకాశంలోని ఆ నక్షత్రంమాత్రం ప్రకాశవంతంగా నాకేసిచూసి నవ్వుతోంది. అప్పుడే ఉదయించిన చంద్రుని మసక వెలుతురు కిటికీగుండా గదిలోకి ప్రవేశిస్తోంది.

నాకెవరూ కనిపించలేదు కాని నన్నెవరో చెయ్యి పట్టుకొని లాగుతున్నట్టుంది. నేను లేచి చూసేసరికి అయిదు వేళ్ళకు ఉంగరాలు పెట్టుకున్న ఓ స్త్రీ నన్ను చేత్తో పిలుస్తున్నట్టనిపించింది. నే లేచి నిశ్శబ్దంగా ఆమె వెంట నడిచినాను.

నా అడుగుల చప్పుడు విని ఎవరైనా లేస్తారేమోనని అడుగులో అడుగు వేసుకుంటూ నెమ్మదిగా పిల్లిలా ఆమె ననుసరించాను. ఆ భవనంలోని చాలా గదులు తాళంవేసి ఉండడంచేత నేనెప్పుడూ వాటిని చూళ్ళేదు.

పైకి ఊపిరికూడా పీల్చకుండా నా అగుపించని అగంతుకురాలు వెంట మెల్లగా నడుస్తున్నాను. నేనిప్పు డెక్కడుందీ చెప్పలేను. అనంతమైన చీకటి ఇరుకు మార్గాలనుంచి దీర్ఘమైన నడవలగుండా, నిర్మానుష్యమైన నిశ్శబ్ద గదులనుంచి దాటిపోయాను.

ఆమె నా కంటికి కనిపించకపోయినా నా మనఃఫలకం మీద ఆమె సుందరాకారం అగుపిస్తోంది. ఆమె ఓ అరబ్బు కన్య. నెత్తిమీద ముసుగు వేసుకుంది. బొడ్లో కైజారు వేలాడుతోంది. నాకు వెంటనే అరేబియన్ ప్రేమగాథలు గుర్తుకొచ్చాయి. ఆ అర్ధరాత్రి కటిక చీకట్లో నిద్రిస్తున్న బాగ్దాదు సందుగొందులగుండా పయనిస్తున్నాను.

చివరి కామె ఓ నీలం తెరదగ్గరకొచ్చి ఆగిపోయింది. ఆ తెరవైపు చెయ్యిపెట్టి చూపించింది. అక్కడేమీ కనిపించడంలేదు. కాని అకస్మాత్తుగా నా రక్తం గడ్డకట్టుకుపోయింది. ఆ తెరకింద నేలమీద ఓ భయంకరమైన నీగ్రో కాళ్ళు చాపుకొని కూర్చున్నాడు. అతని ఒళ్ళో కత్తివుంది. నా దర్శకురాలు అతని కాళ్ళమీద నెమ్మదిగా చరిచి, కొద్దిగా తెర పైకెత్తింది. గదిలో కొంతభాగం పర్షియన్ తివాసీ పరిచి వుండడం కనిపించింది. లోపల మంచంమీద ఎవరో కూర్చున్నారు. నా కామె కనుపించలేదు. కాని బంగారు

నగిషీలు చెక్కిన పాదరక్షలు, రెండుపాదాలు కనిపించాయి. ఓపక్క ట్రేలో ఆపిల్సు, నారింజలు, ద్రాక్షగుత్తులు నిండుగా వున్నాయి. అతిథికోసం సిద్ధంగా రెండుకప్పుల్లో ద్రాక్షరసం వుంది.

బితుకు బితుకుమంటూ ఆ పరిచిన కాళ్ళను దాటి లోపలకు వెళ్ళడానికి ప్రయత్నించాను. అతడు విభ్రాంతుడై లేచి నిలబడ్డాడు. అతని ఒళ్ళోని కత్తి చలవరాతి నేలమీద పడి ఖంగ్‌మని పెద్దమోత వినిపించింది.

పిచ్చిగా ఓ పెద్ద కేక వేసి నిద్రలోంచి లేచి కూచున్నాను. ఒళ్ళంతా ముచ్చెమటలు పోశాయి. వేకువ కాంతిలో చంద్రకాంతి మిళితమై గదిలో గుడ్డి వెలుతురు కనిపిస్తోంది. రోజూటిమాదిరిగానే పిచ్చి మొహరాలీ రోడ్డువెంట ఒంటిగా నడుస్తూ "వెనక్కి తిరుగు. వెనక్కి తిరుగు" అని అరుస్తున్నాడు.

నా ఒక అరేబియన్ రాత్రి అలా గడిచిపోయింది. ఇంకా వెయ్యిరాత్రుల్లు మిగిలివున్నాయి.

ఇకనాకు పగటికి రాత్రికి మధ్య సంఘర్షణ బయలు దేరింది. పగలంతా నా పనిలో నిమగ్నమై అలిసిపోయి రాత్రిని కలల్ని కొట్టుకుంటూ సాయంత్రానికి ఇంటికి చేరుకునే వాణ్ని ఇక రాత్రి కాగానే స్వప్నలోకంలో వుండి పగలు బండచాకిరీని ఈసడించుకునే వాణ్ని.

చీకటి పడటం ఆలస్యం. వెంటనే యేదో మాయలో చిక్కుకునేవాణ్ణి. అప్పుడు నేను చరిత్రలో పేర్కొనబడిన ఓ అపూర్వ వ్యక్తిగా మారేవాణ్ణి. నెత్తిమీద ఎర్రటి వెల్వెట్ టోపీతో, వదులు పైజమాలు వేసుకొని, అత్తరు పూసిన

రంగురంగుల జేబురుమాళ్ళు చేత్తో పట్టుకొని, ఘుమఘుమా యించే తలవాసనలతో ఎత్తైన కుషన్ కుర్చీలో కూర్చుని మజాగా సిగరెట్లు పీలుస్తుండేవాణ్ని.

ఆ అపూర్వ సన్నివేశాల్ని గురించి నే వివరించలేను. ఆ స్వప్న దృశ్యాలమధ్య, పిలా నాదాలమధ్య, సువాసల్ని మోసుకొచ్చే గాలితెరలమధ్య మెరుపులా ఓ సుందరాంగి నా కగుపించేది. బంగరు నగిషీలలో వున్న పాదరక్షల్ని ధరించిన సుందరే ఈమె.

ఆమె నన్ను పిచ్చివాణ్ని చేసింది. ఆమెను పట్టుకోవడానికి గదులన్నీ, తోటలన్నీ, పేటలన్నీ, గాలించాను. స్వప్నలోకంలో మంత్రముగ్ధంగా ఆమెకోసం తిరిగి తిరిగి వేసారిపోయాను.

ఒక్కొక్కసారి సాయంత్రం నిలువుటద్దం ముందు నించొని చూస్తూండగా నా ప్రక్కన ఓ పర్షియన్ యువతి వున్నట్లుగా ప్రతిబింబం కనిపించేది. ఆమె నల్లటి విశాలమైన నయనాలు, ఎర్రటి నాజూకైన అధరవులు, యవ్వనంతో ఉప్పొంగుతున్న అందమైన అవయవాలు కనుపించి మటుమాయమై పోయేవి. దీపం ఆర్పేసి పరుపుమీద కళ్ళు మూసుకొని పడుకునేవాణ్ని. అక్కడ చుట్టూవున్న చిట్టడవులు నుంచి కొండల నుంచి గాలితెరలు సువాసల్ని మోసుకొచ్చి గుసగుసలాడేవి. నా చెక్కిళ్ళని, అధరవుల్ని తనవితీరా ముద్దాడేవి. ఓ పెద్ద నిట్టూర్పు విడిచి ఇకవప్పుడు గాఢంగా నిద్రపోయే వాణ్ని.

ఒకనాటి సాయంత్రం గుర్రంమీద అలా షికారుగా

వెడదామనుకున్నాను. కాని నన్నెవరో మంత్ర ముగ్ధంగా ఆపుచేశారు. విధిలేక నిలిచిపోయాను. ఒక్కసారే గాలి పెద్ద పెట్టున ఆవళ్లి కొండలమధ్య సుళ్ళు తిరిగింది. గాలిదుమ్ము కొండలపైకి సుళ్లు తిరిగి తిరిగి సూర్యాస్తమయానికి మటు మాయమైపోయింది.

ఆ అర్ధరాత్రి నాగుండె పగిలిపోయే రోదన ధ్వని విని పించింది. ఆధ్వని నా మంచంకింద, భవనంలోని ప్రతి పునాదుల అడుగున, ఓ చీకటి సమాధి నుంచి వస్తున్నట్టుంది. ఆ గొంతుకజాలికరంగా అడుస్తోంది. "నన్ను రక్షించు. ఈపెను చీకటి సమాధినుంచి వ్యర్థమైన స్వప్నాలనుంచి నన్ను వెలికి తీసి నీ హృదయానికి హత్తుకో, నాకు వెలుగుచూపి పుణ్యం కట్టుకో"

నేనెవర్ని! నిన్నెలా సంరక్షిస్తాను! ఓసుందరాంగీ! నువ్వెవ్వరు, ఎక్కడ జీవించావు! ఏ వసంతకాలంలో ఏ ఒయాసిస్సులో పచ్చటి చెట్ల నీడను నిరాశ్రయురాలై ఎడారిలో తిరుగాడుతున్న ఏతల్లి ఒడిలో జన్మించావు! అప్పుడే విడుతున్న మొగ్గను తుంచినట్టుగా ఏదుష్టుడు నిన్ను నీతల్లి హస్తాలనుంచివిడదీసి, గుర్రంమీద ఎడారిమార్గంగుండాఏవట్టణపు బానిసల బజార్లోకి తీసుకొచ్చాడు! అక్కడఏబాదూషా అధికారి నీయువ్వన సౌందర్యాన్ని చూచి ముగ్ధుడై నిన్ను బంగారంగా కొని, అందమైన మీనాలో కూచోపెట్టి, అతని యజమాని యిచ్చిన కానుకల్ని నీకు సమర్పించాడు? ఆహా: ఎటువంటి చరిత్ర ప్రసిద్ధమైన ప్రదేశమది. సారెంగి సంగీతం, అందెల ఘులంఘులలు కత్తుల తళతళ మెరుపులు,

షిరాజ్ మత్తుపానీయం-ఆహా, ఎటువంటి ఇంద్రవైభోగమది! బానిస కన్యలు నీకు రెండువైపులా నిలబడి చామరాలతో విసురుతోంటే రాజాధిరాజైన ఏబాదూషా చేత కత్తిపట్టుకొని సర్వాలంకారాలతో యముని భటుడిలావచ్చి నీ పాదాల ముందు మోకరిల్లాడు! ఆఖరికి ఏకరకు కరవాలం ఎడారి పుష్పమైన నీతనువుని ఖండించి శాశ్వతంగా నీకు విశ్రాంతి నిచ్చింది!

సరిగా ఇక్కడికొచ్చేసరికి పిచ్చి మెహరాలి పెద్దగా అరుస్తున్నాడు. "వెనుదిరుగు! వెనుదిరుగు! అంతా అబద్ధం అంతా అబద్ధం!" నే కళ్లు తెరచి చూశాను. అప్పటికే వేకువలు విరివిగా వెల్లివిరిసి వెలుగు కాంతులు అగుపిస్తున్నాయి. చప్రాసీ వచ్చి నా ఉత్తరాలందిచ్చాడు- వంట మనిషివచ్చి నాకు సలాంపెట్టి నా ఆజ్ఞకోసం నిలబడ్డాడు.

అప్పుడు నేచెప్పాను. "ఇక్కడ నే మరోక్షణమైనా ఉండను. ఆవేళే నా సామాన్లన్నీ తీసుకొని ఆఫీసుకు తరలి వెళ్ళాను. కరీంఖాన్ నాకేసిచూసి విజయగర్వంతో నవ్వాడు నే మారుమాటాడకుండా నాపనిలో నిమగ్నుడయ్యాను.

సాయంత్రం అయ్యేసరికి నాకు మతిమరుపు జాస్తీ అవుతోంది. వత్తి లెక్కలు సరిచూస్తూ కూర్చోవడమంటే నాకు విసుగు పుట్టుకొచ్చింది. నిజాం నిజామత్ కూడా నాముందు వ్యర్థుడుగా కనిపించాడు. పొట్టకూటికోసం ఇంత దూరం వచ్చి పనిచెయ్యడంలో అర్థం లేదనిపించింది.

నాపెన్ను విసిరేశాను. లెడ్జర్లు మూసేశాను. బగ్గీలో ఎక్కిపోయాను. దానంతటదే ఓ విశాలమైన సౌధంముందు

నిలబడిపోయింది. వడివడిగా మెట్లెక్కి గదిలోకి ప్రవేశించాను.

లోపల అంతటా గాఢ ప్రశాంతత ఆవరించి వుంది. చీకటి గదులు నాకేసిచూసి నవ్వుకుంటున్నాయి. నామనసు సంతృప్తితో మెరిసింది, నా ఆనందాన్ని వెలిబుచ్చుకోవడానికి అక్కడెవరూలేదు. ఆ చీకటి గదులన్నీ వెర్రిగా కలయతిరిగాను. నా దగ్గరే వీణవుంటే ఎంత మధురంగా వాయించేవాణ్ణి అనుకున్నాను.

తలమీంచి రెండు స్వేదబిందువులు నుదిటి మీదికి జారాయి. ఆవేళ ఆవళ్ళికొండల్ని నల్లటి మేఘాలు కమ్మికప్పేశాయి. చుట్టూ వున్న చెట్టడవులు ప్రశాంతంగా వున్నాయి.

నౌకర్లంతా ఆఫీసులో వుండిపోయారు. అంచేత అక్కడ లైటు వెలిగించడానికి ఎవరూలేరు. ఆకాశంలో మేఘాలు దట్టంగావుండి చంద్రకాంతి కానరావడంలేదు. ఆ నిశ్శబ్ద నిశీధ వాతావరణంలో మంచంకింద తివాసీమీద ఓ స్త్రీ విచార వదనంతో పడుకొని వున్నట్టు కనిపించింది. వర్షం ధారాపతంగా కురుస్తూ కిటికీలోంచి జల్లులు బ్రహ్మాండంగా వచ్చి తడిపేస్తోంటే ఆమె పేలవంగా నవ్వుతూ, వెక్కివెక్కి ఏడుస్తూ రొమ్మును బాదుకుంటోంది.

ఆ రాత్రి తుఫానుగాని, ఆమె రోదనగాని ఒక్క నిమిషంకూడా ఆగలేదు. దుఃఖంతో బరువెక్కిన హృదయంతో ఆ చీకట్లో గదులన్నీ కలియతిరిగాను. నాకెవరూ కనిపించందే! నేనెవర్ని ఊరడించను? మరి ఆనిరంతర రోదన ఎవరిది? ఎక్కణ్ణుంచి ఆరోదన వినవస్తోంది.

పిచ్చివాడు అరిచాడు. "వెనుదిరుగు! అంతా అబద్ధం! అంతా అబద్ధం!!"

నాకు మెలకువ వచ్చింది. తూర్పు దిక్కున తెల్లి రేకలు పొడగట్టాయి మెహరాలీ ఆ భయంకరమైన తుఫానులో కూడా భవనం చుట్టూ అరుచుకుంటూ తిరుగుతున్నాడు బహుశా ఒకప్పుడతడీ ఇంట్లో వుండి వుండొచ్చని. అంచేత పిచ్చివాడై ఇక్కడకు రోజూ వచ్చి తిరుగుతున్నాడని నా మనసునకు తటాలున తట్టింది.

ఆ తుఫాన్ని లెక్కచెయ్యకుండా అతని దగ్గరకెళ్ళి అడిగాను. "ఓ, మెహరాలీ! ఏమిటబద్ధం."

అతడేం జవాబు చెప్పకుండా నన్ను ప్రక్కకి తోసి నడుస్తూ అరుస్తున్నాడు. "వెనుదిరుగు! వెనుదిరుగు! అంతా అబద్ధం! అంతా అబద్ధం."

హోరుమని కురుస్తున్న ఆ వర్షంలో పిచ్చివాడిలా ఆఫీసుకు పరుగెత్తుకెళ్ళి కరీంఖాన్‌ని అడిగాను దీనంతటికి అర్థమేమిటో చెప్పు!"

ఆ తలనెరిసిన వ్యక్తి దగ్గర సేకరించిన విషయం యిది. ఒకప్పుడా సౌధంలో అగ్నిజ్వాలలు బయలుదేరాయి. ఆజ్వాలలు భయంకరమైన తమ నాలుకల్ని చాపి చాలా భాగాన్ని భస్మీభూతం చేశాయి. ఇక అక్కడి రాళ్ళు సలసల కాగిపోయి ఆకలితో దప్పికతో అలమటించి పోయాయి. వాటి దగ్గరకొచ్చిన మనుషుల్ని కబళించడానికి అవి సిద్ధపడ్డాయి. అక్కడ వరుసగా మూడు రాత్రిళ్లు గడిపిన వాళ్లెవరూ

బ్రతకలేరు. కాని ఒక్క మెహరాలీ మాత్రం తప్పించుకొని బయట పడ గలిగాడు.

నా విముక్తికి మార్గంలేదా! అడిగాను.

"ఒకే ఒక మార్గం వుంది కాని అది చాలా దుర్లభం అదేమిటో చెబుతా, కాని ఒకప్పుడా సౌధంలో నివశించిన ఓ పర్షియన్ కన్యగాధను ముందుగా వినాలి. అటువంటి హృదాయ. విదారక విషాదాంత గాథని నువ్వెప్పుడూ వినివుండవు "

సరిగా ఈ సమయానికి రైలొస్తున్నదని కూలీలు కేకలు పెట్టారు. త్వరత్వరగా మాసామాన్లన్నీ సర్దేసుకునే లోగా రైలు రానేవచ్చింది. ఓ ఆంగ్లేయుడు అప్పుడే నిద్ర లేచి మొదటి తరగతి పెట్టిలోంచి స్టేషన్వైపు చూస్తు న్నాడు అతడు మాతోటి ప్రయాణీకుణ్ణి చూడగానే ఎలు గెత్తి "హల్లో!" అని పిలిచి అతన్ని తన పక్కన కూచో బెట్టుకున్నాడు.

మేం మూడో తరగతిపెట్టిలో ఎక్కడంచేత అతని కథాం మేమిటో, అసలతనెవరో తెలుసుకో లేకపోయాం.

నే అన్నాను. "అతడు మసల్ని దద్దమ్మలుగా చేసి వదిలాడు ఆ కథ మొదట్నుంచీ చివరిదాకా ఉత్తి అభూత కల్పన."

ఆ తరువాత జరిగిన సంభాషణ నన్నూ, నా దివ్య జ్ఞాన బంధువుని జీవితాంత కలహంతో ముగించింది.

—::—

# నది మెట్లు

గతించిన రోజుల్ని స్మరించుకో దల్చుకుంటే ఈనా మెట్లుమీద కూర్చుని నదినీటి గలగల శబ్దాన్ని వినండి.

ఆశ్వీజ మాసం ప్రవేశించింది. నది వరదల్లో ఉంది. నా మెట్లు నాలుగు మాత్రం పైకి తొంగి చూస్తున్నాయి. నది ఒడ్డుల్ని ఒరసుకుంటూ పారుతోంది. ఒడ్డు ప్రక్కన ఎదిగిన పొదలన్నీ నీట్లో మునిగిపోయాయి. చేపల పడవలు ఒడ్డునున్న చెట్లకు కట్టేసున్నాయి. ఒడ్డుమీద రకరకాల పచ్చిగడ్డి పువ్వులు అప్పుడే ఉదయిస్తున్న సూర్యుణ్ణి తలపై కెత్తి చూస్తూ పలకరిస్తున్నాయి.

పూజారి తన రాగిచెంబు తీసుకొని స్నానానికొచ్చాడు స్త్రీలు ఇద్దరేసి, ముగ్గురేసి జట్లుజట్లుగా వచ్చి నదిలో నీళ్ళు తీసుకెడుతున్నారు. స్నానవాటిక దగ్గరకు కుసుంవచ్చే వేళ యింది.

కాని ఆ ఉదయం నాకామె కనిపించలేదు. స్వర్ణ భువన్ రేవు దగ్గర విచారంగా ఉన్నారు. తమ స్నేహితురాలు ఎక్కడో దూరంగావున్న అత్తవారింటికి వెళ్ళిందని చెప్పారు వాళ్ళు,

రోజులు గడుస్తున్నకొద్దీ ఆమెను గురించిన ఆలోచనే నాకు కలుగలేదు. క్రమంగా ఆమె నామనః ఫలకం నుంచి అదృశ్యమైంది. రేవులోని స్త్రీలు కుసుంని గురించి అరుదుగా

కూడా తలపోయడం లేదు. కాని ఒకనాటి సాయంత్రం నాకు బాగా పరిచితమైన అవే పాదాలు కనిపించినప్పుడు ఆశ్చర్యపోయాను. ఆమె పాదాలకు అందెలు లేవు, ఘలం ఘలా రావాలు వినిపించడం లేదు.

కుసుం వితంతువైంది ఆమె భర్త ఎక్కడో దూర ప్రదేశంలో పనిచేసేవాడని తెలిసింది. ఆమె అతన్ని ఒకటి రెండుసార్లు మాత్రం చూసింది. అతని మరణవార్తను ఆమెకో ఉత్తరం అందించింది. ఎనిమిది సంవత్సరాల వితంతువు నుదుట తిలకం చెరిపేసుకుంది. చేతిగాజులు తీసేసుకుంది, తిరిగి గంగానది ఒడ్డునవున్న స్వగ్రామం చేరుకుంది. అక్కడామె స్నేహితురాండ్రెవరూ కనిపించలేదు. వారిలో స్వర్ణ, భువన, అమల మొదలైనవారికి వివాహాలై వెళ్ళిపోయారు, ఇక శరత్ మాత్రం మిగిలింది, ఆమెకూడా వచ్చే డిసెంబరు మాసంలో వివాహమవుతుంది. వర్షాకాలంలో వరదనీటితో గంగానది నీటిమట్టం పెరిగినట్టుగా కుసుం దినదిన ప్రవర్ధమానమై, యవ్వన ప్రాంగణంలోకి అడుగు పెట్టింది. కాని ఆమె ఆకర్షణలేని దుస్తులు, విచారవదనం, మౌనస్థితి, ఆమె యౌవన సౌందర్యంమీద ముసుగు కప్పేశాయి.

పది సంవత్సరాలు గడిచిపోయాయి. కుసుం యవ్వన ప్రాంగణంలోకి అడుగు పెట్టిందని ఎవరూ గుర్తించినట్టు లేదు

సెప్టెంబరు మాసాంతంలో ఒకనాటి సుప్రభాతంనాడు ఓ యువసన్యాసి ఇప్పుడు నా ముందున్న శివాలయంలోకి వచ్చాడు. అతడెక్కడనుంచి వచ్చింది నాకు తెలియదు.

కాని అతడక్కడే నివాసం ఏర్పరచుకొని ఉంటున్నాడు. అతని ఆగమనవార్త గ్రామమంతా పాకింది. ఆడవాళ్ళు నదిదగ్గరే కుండలు వదిలేసి అపవిత్రమైన సన్యాసిని దర్శించ డానికి గుళ్ళోకి పరుగెత్తారు.

రోజురోజుకి సన్యాసిని చూడ్డానికి వచ్చేజనం పెరిగి పోతున్నారు ఇంటింటా అతని పేరు మారుమోగుతోంది. ఒకోరోజున అతడు భగవద్గీతపారాయణం చేసేవాడు. మరో రోజున గీతా రహస్యాలు వెల్లడించేవాడు. కొంతమంది అతని సలహాలకోసం వచ్చేవారు. మరికొంతమంది మందుల కోసం వచ్చేవారు.

నెలలు గడిచి పోయాయి. ఏప్రియల్ మాసంలో సూర్యగ్రహణం నాడు గంగానదిలో స్నానం చెయ్యడానికి తండోప తండాలుగా జనం వచ్చారు. సన్యాసిని దర్శించ డానికి వేలాది స్త్రీ, పురుషులు శివాలయంలోకి వెళ్ళారు ఆ వెళ్ళిన వాళ్ళల్లో చాలామంది స్త్రీలున్నారు. కుసుం అత్త వారి ఊరునుంచి వచ్చిన స్త్రీలు కూడా అందులో కొంద రున్నారు.

అది ఉదయంవేళ. సన్యాసి నాముట్లుమీద నిలబడి జపమాల తిప్పుతున్నాడు. అంతలో ఓ యాత్రికురాలు ఆ పక్కనున్నామె చెవిలో ఊదింది. "ఇతడు మన కుసుంభర్త కదూ! చూడు." ఆపక్కనున్నామె కొద్దిగా ముసుగుతొల గించి సన్యాసి వైపు పరీక్షగా చూసింది. "అవును నిజమే. ఇతడు మనవూరి చటర్జీ కుటుంబములోని కడగొట్టువాడు." మరొకామె తన ముసుగు తొలగించి సన్యాసివైపు చూసి

అన్నది. "అవును ఇతడి ముక్కుతీరు, కళ్ళతీరు అచ్చం అలాగే వున్నాయి." మరొకామె కుండలో నీళ్ళు పట్టుకుంటూ సన్యాసి కేసి చూడకుండా అన్నది : "అయ్యో! అతడు చనిపోయాడు. చచ్చిపోయినవాడు తిరిగెలా వస్తాడు? ఇంతకీ కుసుం దురదృష్టమది!

"అతనికింత పెద్దగడ్డం లేదు. పైగా సన్నగా ఉంటాడు. ఇంత పొడుగ్గా కూడా ఉండడు." మరొకామె వ్యాఖ్యానించింది. ఇక అక్కడితో ఆ ప్రస్తావన ఆగిపోయింది.

ఒకనాటి సంధ్యవేళ పూర్ణచంద్రుడప్పుడే ఉదయించాడు. కుసుం నీటిముందు నాకిడ మెట్టుమీద కూర్చుంది. ఆమె నీడ నామీద పడుతోంది.

ఆ సమయంలో రేవుదగ్గర మరెవ్వరూ లేరు. కీచురాళ్ళు నా చెవులు దిబ్బళ్ళు పడేట్లు సంగీతం వినిపిస్తున్నాయి. గుళ్లో గంటలు మోగడంలేదు. ఆగంటల అంతిమశబ్దం తరంగాలు క్రమంగా క్షీణించి నదీ ప్రవాహధ్వనిలో మిళితమైపోయాయి. గంగానది నల్లటినీటిమీద చంద్రకాంతి ప్రతిఫలించి వింత వెలుగులు కనిపిస్తున్నాయి. ఊరి బయట నక్కల కూతలు వినిపించి ఆగిపోయాయి.

శివాలయంనుండి సన్యాసి నెమ్మదిగా బయటకొచ్చాడు రేవు మెట్లుదిగుతూ అక్కడో స్త్రీ ఒంటరిగా కూర్చొని ఉండడంచూసి వెనుదిరిగి వెళ్ళబోయాడు. కుసుం తల పైకెత్తి వెనుదిరిగి చూసింది. ఆమె ముఖంమీద ముసుగు తొలగిపోయింది చంద్రకాంతి ఆమె ముఖంమీద ప్రతిఫలించింది.

గుడ్లగూబ వారి తలలమీంచి తిరుగుతూ అరుచుకుంటూ పోయింది. ఆ శబ్దానికి కుసుం తిరిగి ఈ లోకంలోకి వచ్చింది. ముసుగు తిరిగి ముఖంమీదికి లాక్కొంది. సన్యాసి పాదాలకు ఒంగి నమస్కరించింది

అతడు దీవించి అడిగాడు. "ఎవరు నువ్వు?"

"నాపేరు కుసుం" చెప్పిందామె.

మరి వాళ్ళిద్దరిమధ్యా ఆరాత్రి సంభాషణేమీ జరగలేదు. కుసుం నెమ్మదిగా ఇంటిముఖం పట్టింది. కాని సన్యాసి మాత్రం ఆరాత్రి చాలా గంటలు నామెట్లమీదే కూర్చుని గడిపాడు. చంద్రుడు తూర్పునుండి పశ్చిమ దిశకు తిరిగిం తరువాత, అతని నీడ వెనుకనుంచి ముందుకొచ్చిన పిదప సన్యాసి అక్కణ్ణుంచి కదిలి గుళ్లోకి వెళ్ళాడు.

అప్పట్నుంచి కుసుం ప్రతిరోజూ సన్యాసి దగ్గరికొచ్చి అతని పాదాలకు ప్రణామం చేసింది. అతడు పవిత్ర గ్రంథాలను చదువుతూ చెబుతుంటే ఆమె ఓమూల నిశ్శబ్దంగా కూర్చొని వింటుండేది. అతడు ఉదయం తన కార్యక్రమమంతా ముగించుకొని కుసుంని పిలిచి మత విషయాలు బోధించేవాడు. ఆమెకా విషయాలు అర్ధమయ్యేవికావు. కాని తన శక్తినంతా కేంద్రీకరించి అర్ధం చేసుకోవడానికి ప్రయత్నించేది. ఆమె రోజూ గుళ్ళో పూజకు కావలసిన పనులన్నీ చేసేది. గంగానదినుంచి నీళ్ళు తెచ్చి గుడిని పరిశుభ్రపరిచేది.

హేమంతం క్రమంగా తన ప్రభావాన్ని కోల్పోతోంది. చెదురు మదురుగా చలిగాలులు కొడుతున్నాయి. సాయంత్రం వేళ అప్పుడప్పుడు వెచ్చటి దక్షిణ పవనపుగాలులు

వీస్తున్నాయి పడవవాళ్లు తమ పడవలను ప్రవాహ ఉరవడికి వదిలిపెట్టి, మురళీ గీతాలను ఆలాపించే కాలం ఆసన్నమైంది.

తిరిగి నాకు కుసుం కనిపించడం మానేసింది కొంత కాలం గుళ్ళోకికాని, రేవుదగ్గరకుకాని, సన్యాసి దగ్గరకుకాని రాలేదు.

అందుకు కారణ మేమిటో నాకు తెలియదు. కాని తరువాత కొంతకాలానికి ఒకనాటి సంధ్యవేళ వాళ్ళిద్దరూ నా మెట్లమీద కూర్చునుండడం చూశాను.

కుసుం నేలకేసి చూస్తూ అడిగింది. "స్వామీ! నా కోసం కబురు పంపారా!"

"అవును పంపాను ఇన్నిరోజుల్నుంచీ నువ్వు కనిపించడం లేదేం? దైవపూజ అశ్రద్ధ చెయ్యకూడదు."

ఆమె మౌనంగా కూర్చొంకిపోయింది.

"నీలో ఉన్న భావాలేమిటో దాచకుండా చెప్పు."

"స్వామీ! నేనుపాపిని అంచేతనే దైవపూజను ఉపేక్షించాను." ఆమె ముఖం ఓ ప్రక్కపెట్టి అన్నది.

"కుసుం. నీ హృదయంలో ఏదో అశాంతి చెలరేగుతోందని నాకు తెలుసు" అన్నాడు సన్యాసి.

ఆమె చీరచెంగు ముఖంమీదకు లాక్కొంది. అక్కణ్ణుంచి కొద్దిగా కదిలి సన్యాసి పాదాలకింద మెట్టుమీద కూర్చుని రోదించడం మొదలెట్టింది.

అతను కొంచెం పక్కకుతొలిగాడు. "నీహృదయంలో ఏముందో చెప్పు నీకు శాంతిమార్గం ఉపదేశిస్తా అన్నాడు. ఆమె అప్పుడప్పుడు మాటలకోసం తడుముకొంటూ చెప్పాను

పోతున్నది "మీరు అనతిస్తే మరినేనిక మాట్లాడి తీరాలి. అయితే నేను పూర్తిగా వివరించి చెప్పలేను. స్వామీ! మీరు ఊహించుకోవాలి. నేనొకర్ని దేవుడిగా ఆరాధిం అర్పించాను. అతనిమీద భక్తితో నా హృదయం నిండిపోయింది. కాని ఒకరాత్రి స్వప్నంలో నా హృదయేశ్వరుడు తోటలో పూలమాల కూర్చుని, నా కుడిచేతిని అతని వామహస్తంలో తీసుకొని, నా చెవిలో ప్రణయ పాఠాలు బోధిస్తున్నట్టు చూశాను. ఆస్వప్నం అదృశ్యమైంది. కాని అది ఇంకా నా హృదయ ఫలకంమీద నిలిచేఉంది. ఆ మర్నాడతడు మరింత వెలుగు కాంతులతో కనిపించాడు. ఆ స్వప్నదృశ్యం నన్ను వెంటాడుతోంది. భయంచేత అతనికి దూరంగా పారిపోయాను. కాని ఆ దృశ్యంమాత్రం అదృశ్యం కావడం లేదు. అప్పట్నుంచి నా హృదయం అశాంతితో అలమటిస్తున్నది నన్ను అంధకారం ఆక్రమించుకున్నది."

ఆమె తనకథ ముగించి కన్నీరు తుడుచుకుంటుంటే సన్యాసి తన కుడిపాదాన్ని నా రాతిమీద గట్టిగా నొక్కడం చూశాను.

"నీ స్వప్నంలో ఎవర్ని చూశావో చెప్పు." అడిగాడు సన్యాసి.

"చెప్పలేను" రెండు చేతులూ కట్టుకు కూర్చొని అన్నదామె.

"అతడెవరైందీ నువ్వు చెప్పితీరాలి" సన్యాసి పట్టు పట్టాడు.

"చెప్పి తీరవలసిందేనా ?" అని అడిగిందామె.

"ఆఁ తప్పకుండా" జవాబు చెప్పాడు.

ఆమె ఏడుస్తూ "స్వామీ ! మీరే అతడు" అన్నది. ఆమె నా రాతిమీద పడి వెక్కి వెక్కి ఏడ్చింది.

ఆమెకు తిరిగి తెలివొచ్చిం తరువాత సన్యాసి ... దిగా అన్నాడు : "ఇవ్వాళ రాత్రే ఇక్కణ్నుంచి వెళ్ళి పోతున్నాను. ఇక తిరిగి నువ్వు నన్ను చూళ్ళేవు నేనీ ప్రపం చానికి చెందినవాణ్ని కాదు సన్యాసినని మాత్రం గుర్తుం చుకో. ఇక నన్ను మర్చిపో."

"అలాగే స్వామీ !" అన్నది కుసుం నెమ్మదిగా.

"మరి సెలవు తీసుకుంటున్నా" చెప్పాడు సన్యాసి.

కుసుం మారు మాటాడకుండా అతనికి వంగి నమ స్కారం పెట్టింది. ఆతని పాదాలచెంత మట్టితీసి తలమీద పెట్టుకుంది. అత డక్కణ్నుంచి వెళ్ళిపోయాడు.

చంద్రుడ స్తమించాడు. ఆకాశంనుంచి భూమికి చీకటి తెరలు దిగాయి. నీటిలో ఒక్కసారి పెద్దగా గలగల శబ్దం వినిపించింది నాకు ఆ చీకట్లో ఆకాశంలోని నక్షత్రాల్ని ఎగరగొట్టాలని కాబోలు గాలి ఉధృతంగా వీచింది.

—::—

# నిత్యకాళి

ఓ పడవ నదిలో ఓ పురాతన స్నానవాటిక వద్ద లంగరు వేయబడివుంది. అప్పుడే సూర్యుడ స్తమించాడు.

పడవ మనుషులు పడవమీద సాయంత్రపు ప్రార్థనలు చేసుకుంటున్నారు. వారి మౌన ప్రార్థన, పశ్చిమాకాశంలోని కెంపు కాంతులు - ప్రకృతి రమణీయకత్వానికి మరింత శోభను చేకూరుస్తున్నాయి. అస్తమిస్తున్న సూర్యకాంతి నిశ్చలంగా ఉన్న నది నీటిమీద ప్రతిఫలిస్తోంది.

నాముందు ఓ శిథిలమైన గృహం ఉంది. నేను రేవు మెట్లమీద ఒంటరిగా కూర్చున్నాను. పనసకాయమీద పగులులా ఓ మర్రిచెట్టు వేళ్లు ఆ మెట్లను క్రారలుగా విడకొట్టాయి. నన్నేదో అస్పష్టమైన విచారభావం పట్టుకు పీడుస్తోంది. ఇంతలో ఏదో కంఠస్వరం నన్ను ఉద్దేశించి ప్రశ్నించింది.

"ఏ ఊరండి మీది?"

తల పైకెత్తి చూశాను. ఎండ ఒరుగులా ఉన్న ఓ మనిషి కనిపించాడు. అతడెక్కడో దూరదేశంనుంచి పొట్టకూటికి పనిచేసుకోటానికి వచ్చినవాడిలా ఉన్నాడు. అతడు వేసుకొన్న కోటు మురికితో అసహ్యంగా ఉంది. అతడప్పుడే పనిలోంచి వచ్చినట్టున్నాడు.

ఆ అగంతకుడు నా ప్రక్కన మెట్లమీద కూర్చు

న్నాడు. అతని ప్రశ్నకు సమాధానం చెప్పాను.

"మాది రాంచీ"

"ఏం పని చేస్తారు ?"

"వర్తకం చేస్తా"

"ఏం వర్తకం ?"

"కలప వ్యాపారం"

"మీ పేరేమిటి ?"

ఓ క్షణంసేపు సంకోచించి ఏదో పేరు చెప్పాను. అది నా పేరు కాదు.

నన్ను గురించి అతని విచారణ ఇంకా పూర్తికాలేదు. "ఇక్కడి కెందుకొచ్చారు ?" మళ్ళీ అడిగాడు.

"గాలి మార్పిడికోసం"

అతడు నాకేసి ఆశ్చర్యంగా చూశాడు. "ఇక్కడి గాలిని ఆరు సంవత్సరాల నుంచి పీలుస్తున్నాను. కాని నా ఆరోగ్యం ఏమీ బాగుపడలేదు." అన్నాడు.

"రాంచీకంటే నాకిక్కడిగాలి సరిపడింది" చెప్పాను.

"అయితే మీ రదృష్టవంతులే. మరి మీ రెక్కడుంటున్నారు ?"

రేవు దగ్గరున్న పాడుబడ్డఇంటివైపు చూపి "అక్కడ" అన్నాను.

నా వాలకంచూసి గుప్త ధనంకోసం నే నక్కడకు వచ్చినట్టుగా అతను అనుమానించాడు. 'ఏమైనా మళ్ళీ అతడు నన్నా విషయం కదపలేదు. ఆ పాడుబడ్డ ఇంట్లో

పదిహేను సంవత్సరాల క్రితం జరిగిన /సంఘటల్ని గురించి చెప్పుకొచ్చాడు.

అతడక్కడ ఉపాధ్యాయుడుగా పని చేస్తున్నాడని తెలిసింది. బట్టతల మధ్య అతని కళ్లు జ్యోతుల్లా వెలుగుతున్నాయి. ముఖం పాలిపోయింది. ఆకలితో అతని పొట్ట పేగుల నంటింది.

పడవవాళ్ళు సాయంత్రపు ప్రార్థన ముగించుకొని వంట పనిలో నిమగ్నులయ్యారు. క్రమంగా చీకట్లు అలుముకున్నాయి. ఆ చీకట్లో పాడుబడ్డ యిల్లు ఒంటరి దయ్యంలా ఉంది.

స్కూలు మాష్టరు చెప్పుకుపోతున్నాడు. "పదిసంవత్సరాల క్రితం నే నిక్కడకు వచ్చినప్పుడు ఈ ఇంట్లో భూషణ్ సాహా ఉండేవాడు. అతనికి అడివంత ఆస్తి ఉంది. పైగా అతని మేనమామ దుర్గాసాహాకు పెద్దవ్యాపారం ఉంది. కాని అతనికి పిల్లలు లేరు.

"అతడు బాగా చదువుకున్నవాడు ఒక తప్పుకూడా దొర్లకుండా ఇంగ్లీషు మాట్లాడేవాడు. అతడు క్రమంగా సాయిబులతో పరిచయం ఏర్పరుచుకున్నాడు. వారి లాగానే గడ్డం పెంచుకున్నాడు. చూపులకు బెంగాలీ నవయువకుడిలా ఉండేవాడు.

అతని భార్య చాలా అందమయింది, కాలేజీ విద్య ఒకపక్క; అందమైన భార్య మరోపక్క ఇంటివద్ద సనాతన సాంప్రదాయాలను మార్చివేశాయి. అతనికి జబ్బు చేసినప్పుడు అసిస్టెంటు సర్జనును పిలిపించారు. అది నయం కావ

డానికి జోలెడు ఖర్చయింది. అతడు తిండికి బట్టలకు విపరీతంగా ఖర్చుచేసేవాడు. ఇక భార్య నగల విషయం చెప్పనే అవసరంలేదు.

"మీకు వివాహమయ్యే ఉంటుంది. సాధారణ స్త్రీ మామిడి కాయల్ని, మిరపకాయల్ని, పరుషమైన భర్తని ఇష్టపడుతుందని మీకు చెప్పనవసరంలేదు. భార్యకు లోకువ గనుక ఇస్తే భర్త త్వరలోనే ఆమె ప్రేమను కోల్పోవడం ఖాయం.

"ఈ విషయంలో నాకూ కొంత అనుభవం ఉంది. లేడి తన కొమ్ముల్ని పదును పెట్టుకోవడానికి ఓ గట్టిచెట్టుని ఎంచుకుంటుంది అంతేగాని తన కొమ్ముల్ని అరటిచెట్టుకేసి రుద్దుకోదు. అనాదినుంచి స్త్రీ పురుషుణ్ని తన చేతికింద ఉంచడానికి ప్రయత్నిస్తూనే ఉంది. శతాబ్దాల తరబడి అమ్మమ్మల నుంచి అనువాయితీగా వస్తున్న కన్నీరు, అలక మొదలైన ఆయుధాలు నవీన స్త్రీలచేతులో ఎందుకూ కొరగావు.

"భూషణ్ అటు వ్యాపారంలో కాని, ఇటు ఇంట్లో కాని రాణించలేకపోయాడు. అతని భార్య మణి, కన్నీరు లేకుండానే ఢక్కా మజిలీచీరలు, తదితర విలాసవస్తువులు కొనుక్కోగలిగేది. భర్తదగ్గరున్న డబ్బే ఆతనిమీద ఆమెకు ప్రేమను కలుగజేసింది. అతని దగ్గర తీసుకున్న వస్తువులు ఆమె ఏ రూపంలోనూ ప్రతిఫలాన్ని ముట్టజెప్పి ఎరుగదు. ఆమెకు ఎంత ఎక్కువ ఇస్తే ఆమెదగ్గరనుంచి అంత ఎక్కువ పొందవచ్చని అనుకునేవాడా తెలివి తక్కువ భర్త. కాని ఫలితంమాత్రం తద్వతిరేకం.

"దీనిఫలితం ఏమిటంటే మణి ఆమె భర్తను కేవలం డకా్క మజిలీచీరలు, తదితర విలాసవస్తువులు కొనిపెట్టే యంత్రంగా భావించింది. ఆ యంత్రం సరిగా నడవడానికై దాని చక్రాలకు నూనె అవసరం ఉంటుందనికూడా ఆమె ఎప్పుడూ తలంచలేదు.

"అసలు భూషణ్ స్వగ్రామం పిల్‌బేరి. అయితే వ్యాపార నిమిత్తం ఇక్కడికొచ్చి స్థిరపడిపోయాడు. అతనికి తల్లిలేదు. అతని స్వగ్రామంలోని ఇంటినిండా కొళ్లలుగా మేనత్తలు, మేనమామలు తదితర బంధువులు ఉన్నారు. ఆ ఇంట్లోంచి తనభార్యను తీసుకొచ్చి ఇక్కడ కాపురంపెట్టాడు.

"భూషణ్ భార్య మితభాషి. ఇరుగుపొరుగు వాళ్ళతో కూడా కలుపుగోలుతనంగా మాట్లాడదు. బ్రాహ్మణులకు భోజనాలు పెట్టడంగాని దానధర్మాలు చెయ్యడంగాని ఆమె అభీష్టంగాదు. భర్త తనమీద చూపించే ప్రేమని తగ్గకుండా కాపాడటం ఎలాగా అని ఎప్పుడూ ఆలోచిస్తుండేది. ఆమెలో ఉన్న ప్రత్యేకతేమిటంటే తన యవ్వనసౌందర్యాన్ని ఒక్క అణువుకూడా తగ్గకుండా ఎల్లప్పుడూ కాపాడుకునేది. ఆమె వయస్సెంతో ఎవరికీ తెలియదు. కాని పదహారేళ్ళ వయస్సు కంటె ఎక్కువున్నట్లు పైకి కనిపించదు.

"అయితే ఇంటి పనుల విషయంలో మాత్రం మణి చాల నిక్కచ్చిగా ఉండేది. అవసరమైనవారికంటే ఎక్కువ సేవకుల్ని ఎప్పుడూ వుంచేదికాదు. తను చెయ్యగలిగిన పనికి మరెవరికైనా డబ్బిచ్చి చేయించుకోవడమంటే ఆమెకు ప్రాణం ఒప్పేదికాదు.

"ఎవరిగురించీ ఆందోళన పడకుండా, ఎన్నడూ ప్రేమ చేత తిరస్కృతి కాకుండా, ఏరోగమూ రొష్టూ లేకుండా, ఎవ్వడూ పని చేసుకుంటూ తద్వారా పొదుపు చేసుకునేది.

"చాలామంది భర్తలు దీన్ని అదృష్టంగా భావిస్తారు. భార్య అందంగా ఉంటే భర్త ఆమెను ప్రేమించడం సహజం. భార్య భర్తమీద ఎక్కువ మక్కువ చూపించడంవల్ల భార్య కేమీ నష్టంలేదు. కాని అది భర్తకు మాత్రం అదృష్టం కాదు. ఇది నానిశ్చితాభిప్రాయం.

"మీకు విసుగు పుట్టించడం లేదనుకుంటాను. నేను ఒంటరివాణ్ణి. భార్యచేత తిరస్కృతుడనైనవాణ్ని. ఎల్లపుడూ ఆ సామాజిక విషయాలన్నీ ఆలోచిస్తూ కూర్చుంటాను. కాని బళ్ళో పిల్లలతో ఆవిషయాలు చర్చించలేను. ఆవిషయాల్ని గురించి ఎంతగాఢంగా ఆలోచించినో ఇకముందు మన సంభాషణలో మీరే తెలుసుకుంటారు."

అతడు తిరిగి మాట్లాడటాని కుపక్రమిస్తుండగా దూరాన ఎక్కడో నక్కలకూతలు వినిపించాయి. స్కూలు మాష్టరు తనమాటల ప్రవాహాన్ని ఒకింతసేపునిలుపు చేశాడు. అంతటా నిశ్శబ్దం పాలిస్తోంది. ఆ చీకటిరాత్రిలో ఎర్రగాఉన్న అతనికళ్ళు జ్యోతుల్లా వెలుగుతున్నాయి. అతడు తిరిగి కథను చెప్పుకుపోతున్నాడు.

"అకస్మాత్తుగా భూషణ్ వ్యాపారంలో ఓ ఉపద్రవం వచ్చిపడింది దానిస్వరూపం ఎటువంటిదో, నాలాంటి సామాన్యుడికి అంతుచిక్కదు. అకస్మాత్తుగా అతనికి మార్కెట్లో అప్పు దొరకడం అసంభవమని తేలింది. ఒకవేళ దొరికితే

మాత్రం దాన్ని వ్యాపారంలో పెడితే తిరిగి వెంటనే డబ్బు చేతికొచ్చే అవకాశం ఉంది.

"కాని డబ్బు అంత తేలిగ్గా దొరకలేదు. ఆ ఊళ్ళోనే గనుక అతడు అప్పు పుచ్చుకుంటున్నట్లు వదంతి వ్యాపించిం దంటే అతని వ్యాపారం మరింత దెబ్బతింటుందని అతనికి తెలుసు. అంచేత ఇంకెక్కడైనా ఊళ్ళో ఎవరిదగ్గరైనా అప్పు పుచ్చుకోవాలి. కాని అటువంటి సందర్భంలో ఏదైన వస్తువులు తాకట్టు పెడితేనేగాని డబ్బుదొరకదు. అయితే తాకట్టు పెట్టటానికి తగిన వస్తువులు ఒక్క నగలు మాత్రమే ఉన్నాయి. అవి ఉంటేనేసులువుగా అప్పుదొరుకుతుంది.

"అంచేత భూషణ్ భార్యదగ్గరకు వెళ్ళాడు. అందరి భర్తల్లాగా అతడు తన భార్యదగ్గరకువెళ్ళి అడగలేకపోయాడు. అతని మనసులో ఉన్న విషయాలు విప్పి చెప్పలేకపోయాడు. భార్యమీద అతనికున్న ప్రేమ అటువంటిది.

"అత్యవసర సందర్భాల్లో ఆఖరికి ఒకటో తరగతి ప్రేమికుడుకూడా తన ప్రేయసిని డబ్బుకోసం నగలు అడగడమో, లేక ఆమెచేత ప్రామిసరీనోటు రాయించి డబ్బు తెప్పించుకోవడమో చేస్తూఉంటాడు. కాని భూషణ్ మాత్రం వాజమ్మలా మాట్లాడలేకపోయాడు. ఇదుగో చూడు! నాకు డబ్బవసరం. నీనగలు తీసుకురా!" అన్నాడు చివరకు తెగించి.

"అతడు చివరికెలాఅయితేనేం భార్యకు అసలు విషయాన్ని ముక్తసరిగానైనా చెప్పగలిగాడు కాని దాని ప్రయోజనం మాత్రం కనిపించలేదు. మణి ముఖం పక్కకు తిప్పుకొంది. ఏమీమాట్లాడలేదు. నిజంగా అతడు చాల బాధ

పడ్డాడు మరి కాసేపాగి తనలో అనుకున్నాడు. "అవును తన నగలివ్వడానికి నన్ను నమ్మకపోతే అందుకామెను బలవంతం చేసి లాక్కోవడానికి నాకేమధికార ముంది?"

"ఏమైనప్పటికీ భూషణ్ తన భార్యదగ్గర నగలు తీసుకోవడానికి వెరచి చివరకు కలకత్తా వెళ్ళాడు. అక్కడే లాగో లాగు అప్పు సంపాదిద్దామనుకున్నాడు.

"సాధారణంగా భర్తనుగురించి భార్య తెలుసు కున్నంతగా భార్యనుగురించి భర్త తెలుసుకోలేడు. మను ష్యుల్ని మూడు రకాలుగా విభజించవచ్చు. అందులో కొందరు మూర్ఖులు, మరికొందరు తెలివి తక్కువవాళ్ళు ఇక మిగిలినవాళ్ళు అంధులు. అయితే ఇప్పటి నాగరిక మను షులు ఇందులో ఏ రకానికీ చెందరు.

"భూషణ్ ఎస్టేటు వ్యవహారాల్ని ఓ ముసలి బ్రాహ్మ ణుడు చూస్తూండేవాడు. అతనికుటుంబం ఆ పదవిని వంశ పారంపర్యా నిర్వహిస్తోంది. అతనికి తోడుగా భూషణ్ మేన మామ మధుకూడా ఆ వ్యవహారాల్ని చూస్తూండేవాడు. మణి మధుని తనదగ్గరకు పిలిపించి జరిగిన విషయమంతా విప్పిచెప్పింది. "అయితే ఇప్పుడేం చెయ్యమంటావు?" అడిగింది చివరకు.

"అతడు చాలా తెలివైనవాడు. ఇటువంటి విష యాల్లో ఎలా తలదూర్చాలో అతనికి బాగా తెలుసు. ఇదే మంత మంచి విషయంకాదు. బాబు ఎట్లాగూ అప్పు సంపా దించలేడు. చివరికి నీనగలమీదే ఆధారపడతాడు" చెప్పాడు.

ఆమెకు అది యదార్థమైన విషయమే ననిపించింది.

విపరీతంగా ఆందోళన చెందసాగింది. ఆమె ప్రేమించడాని కెవరూ పిల్లలు లేరు భర్తను అర్థం చేసుకోలేదు. సంవత్స రాల తరబడి పసిపిల్లగా జాగ్రత్తగా సంరక్షించుకొంటూ వస్తున్న ఆమె నగలు యూనత్తూ వ్యాపారం అనే గంగలో కలపడం తలంచుకుంటే ఆమె ఒళ్ళు గగుర్పొడిచింది. రక్తం గడ్డ కట్టింది. "అయితే ఇప్పుడేం చెయ్యాలి!" అడిగిందామె.

"నీ నగలన్నీ తీసుకొని మీ పుట్టింటికి వెళ్ళిపో!" చెప్పాడు మధు. ఆ నగల్లో కనీసం నగమైనా తన చేతిని పడకుండా వుంటాయా అనుకున్నాడు తనలో.

"మణి అందుకు వెంటనే ఒప్పుకుంది. వేసవి కాలపు చివరిరోజుల్లో ఒకనాటి వర్షపు రాత్రి అది. ఇదే రేవులో ఓ పడవ కట్టేసివుంది. ఆపాద మస్తకం శాలువా కప్పుకొని మణి పడవలో కూర్చుంది ఆ వర్షపురాత్రి చీకట్లో బావురు కప్పలు బెకబెక మంటున్నాయి. పడవలో మధు నిద్రలోంచి లేచి కళ్ళు నులుముకుంటూ అన్నాడు. ఆ నగలపెట్టె ఇలా ఇవ్వు!"

"ఇప్పుడు కాదు, తరువాత. మన మిప్పుడు వెంటనే బయలుదేరుదాం" అన్నది మణి.

పడవ బయలుదేరింది. ప్రవాహ వేగంలో అక్క ణ్ణుంచి వేగంగా కదిలిపోయింది. ఆరాత్రి మణి తన ఒంటి నిండా నగలను దిగేసుకుంది. ఆ నగల్ని పెట్టిలో పెడితే ఎవరైనా ఎత్తుకుపోతారేమోనని భయపడింది. ఒంటికిగనుక పెట్టుకుంటే తనను చంపకుండామాత్రం నగల్ని తీసుకోలేరు. భూమణ్... మణి అర్థంచేసుకోలేదు. కాని మధుని అర్థంచేసు

కోపడానికి మాత్రం ఆయనకు సంకోచం కలుగలేదు.

"మణిని పుట్టింటివద్ద దింపి రావడానికి వెడుతున్నానని ఎప్పటు వ్యవహారాలు చూసే ముసలి బ్రాహ్మణునికి ఉత్తరం రాశాడు సుధు. ఆ ఉత్తరం చూడగానే అతనికి కోపం వచ్చింది. వెంటనే అందులోని విషయాలను పొందుపరుస్తూ భూషణ్‌కు ఉత్తరం రాశాడు. ఆడవాళ్ళకు అతి స్వాతంత్ర్యం ఇస్తే ఇలాగే జరుగుతుందని అందులో వెుత్తుకున్నాడు. భూషణ్ ఆ ఉత్తరాన్ని చదివి మణి రహస్య నిర్గమనానికి హేతువేమిటా అని ఆలోచించాడు. డబ్బుకోసం తనోపక్క యమయాతనలు పడుతుంటే, అంతగా ప్రేమించిన భార్య కూడా తనను నమ్మకుండా నగల్ని తీసుకువెళ్ళిపోవడం అతన్ని అన్నిటికంటే ముఖ్యంగా బాధించింది.

"కోపం రావలసిన సమయంలో భూషణ్‌కి దుఃఖం వచ్చింది. పురుషుడికి అడివి నిప్పులాంటి కోపం, స్త్రీకి వర్షా కాలపు మేఘంలా వర్షించే కన్నీరు ఏర్పాటు చేశాడు భగవంతుడు. కాని అది తారుమారైనట్టుంది.

"భూషణ్ తల వొంచుకొని తనలో అనుకున్నాడు. ఇదే నీ తీర్పు కావొచ్చు. కాని నా విధినిమాత్రం నెరవేరుస్తాను, అతడా విషయాన్ని గురించి భార్యకు ఒక్కమాట కూడా రాయలేదు. ఆమెతో ఆ విషయాన్ని గురించి ఇక ఎప్పుడూ చర్చించకూడదనుకున్నాడు. నిజంగా అది ఎటువంటి కఠినమైన శిక్ష!

"పది పన్నెండు రోజులు పోయిన తరువాత అప్పు సంపాదించి ఇక అక్కణ్నుంచి భూషణ్ ఇంటికి బయలు

దేరాడు. మణి పుట్టింటిదగ్గర తనపని పూర్తిచేసుకొని ఈపాటికి తిరిగి ఇంటికివచ్చి ఉంటుందనుకున్నాడు. ఆమె తనను చూడగానే సిగ్గు పడుతుందనో చేసినతప్పుకు పశ్చాత్తాపం చెందుతుందనో అనుకొని ఇంట్లోకి వెళ్ళాడు.

"తలుపు తాళం వేసుంది. తాళం బద్దలుకొట్టి లోనికి ప్రవేశించాడు. ఆమె గదంతా ఖాళీగా ఉంది. ఈ ప్రపంచం ఒకపెద్ద పంజరమని అందులోంచి ప్రేమఅనే పక్షి హృదయ మాణిక్యాలను, కన్నీటి ముత్యాలను విడనాడి ఎగిరిపోయి నట్టుగా తోచిందతనికి.

మొదట్లో భూషణ్‌కి భార్యలేని లోటు పెద్దగా ఏమీ బాధించలేదు. ఆమె ఎప్పుడు తిరిగొచ్చినా అహ్వా నించటానికి సిద్ధంగా ఉన్నాడు ఎస్టేటు వ్యవహారాలు చూసే ముసిలి బ్రాహ్మణుడు అతని దగ్గరకొచ్చి అన్నాడు. "మొదల కుండా కూర్చుంటే ఏమవుతుంది? అమ్మగార్ని గురించిన సమాచారం తెలుసుకోవాలి." ఈ సూచన ప్రకారం మణి పుట్టింటికి మనిషిని పంపాడు భూషణ్. అప్పటివరకు మణి గాని, మధుగాని అక్కడకు రాలేదని ఆవెళ్ళినమనిషి వార్త తీసుకొచ్చాడు.

"ఇక అన్నిచోట్లా వెతకడం ప్రారంభించారు. నది కిరువైపులా ఉన్న గ్రామాలకు వారి జాడలు తెలుసుకునేం దుకు మనుషుల్ని పంపారు. మధును గురించి పోలీసులకు రిపోర్టు చేశారు. కాని ఫలితం కనిపించలేదు. వాళ్ళు ఏ పడవ తీసుకొని వెళ్ళిందీ ఏ మార్గం గుండా ప్రయాణం చేసిందీ ఎంత ఆరాతీసిన కనుక్కోలేక పోయారు.

"తన భార్య తిరిగి కనిపిస్తుందనే ఆశ అన్నిరకాలు గాను వదులుకొని, ఒకనాటి సాయంకాలము, భూషణ్ విచారంలో తన పడకగదిలోకి ప్రవేశించాడు. ఆ వేళ కృష్ణాష్టమి. రోజంతా వర్షం హోరుమంటూ కురుస్తోంది. పండగ సందర్భములో ఆఊళ్ళో ఓ నాటకం కంపెనీవాళ్ళు ఆ రాత్రి ఓ నాటకం వేస్తున్నారు. హోరుమని కురుస్తున్న వర్షపు ధ్వనిలో ఆ నాటకంలోని పాటలు మిళితమై సన్నగా వినిపిస్తున్నాయి. భూషణ్ ఒంటరిగా కిటికీముందు కూర్చుని బయట చీకట్లోకి చూస్తున్నాడు. మీదపడుతున్న వర్షపు తుఫర్ల మీదగాని, దూరంగా వినిపిస్తున్న పాటలమీదగాని అతని దృష్టి లగ్నమైలేదు.

"గదిలోని ఓ గోడకు లక్ష్మీ సరస్వతుల చిత్రపటాలు వేలాడుతున్నై. దణ్ణెంమీద ఓ తువాలు ఓ బాడీ, ఓజత చీరలు ఉన్నై. ఓబులమీద తమలపాకుల పెట్టెలో, మణి తన స్వహస్తాలతో చుట్టిన చిలుకలు ఎండిపోయియున్నై. ఓ అల్మారాలో రకరకాల అందమైన వస్తువులు చక్కగా పేర్చిఉన్నై. అందులో పిల్లల ఆటవస్తువులు, సెంటుసీసాలు, సబ్బుపెట్టెలు - ఇంకా అనేకమైన ఆధునిక వస్తుసామాగ్రి ఉన్నాయి. గూట్లో ఓ అందమైన గుండ్రటి దీపంవుంది. మణి ప్రతిరోజూ సాయంత్రం ఆ దీపాన్ని తన చేతుల్తో వెలిగించేది. అన్ని వస్తువుల్ని విడిచి వెళ్ళేవాళ్లు జీవంలేని పదార్థాలమీద కూడా తమ ప్రభావాన్ని విడిచి వెడతారు కాబోలు. ఓ మణి, రా. వెనుదిరిగి రా! నీ దీపాన్ని వెలిగించు నీగది. నిమరోమారు కాంతితో నింపు. నీవు అద్దంముందు

నించొని చీర కట్టుకో. చూడు, నీ వస్తువులన్నీ నీకోసం నిరీక్షిస్తున్నై. నీనుంచి ఎవరూ ప్రతిఫలం ఆపేక్షించడం లేదు. చెల్లాచెదురైనా ఈ నిర్జీవ పదార్థాలకు నీ యవ్వన సౌందర్యంతో పాటు వెలుగు కాంతులిచ్చి జీవాన్నివ్వమని కోరుతున్నాం. కాని, అయ్యో! ఆ నిర్జీవ పదార్థాల మూగ మొరాలకించేవారు ఆ గదిలో ఎవరున్నారు ?

"అర్థరాత్రయింది. వర్షం వెలిసిపోయింది. నాటకం లోని పాటలు వినపడ్డంలేదు. భూషణ్ అదే స్థానంలో కదల కుండా కూర్చున్నాడు. కిటికీ బయట అంతా గాఢాంధ కారంగా ఉంది.

"అతడేదో ఆలోచిస్తుండగా ఎక్కణ్ణుంచో ఘల్లు ఘల్లుమని అందెల సవ్వడి వినిపించింది. రేవుకట్ల మీంచి ఆధ్వని వస్తున్నట్టుంది. ఆకాటివి చీకట్లను చీల్చుకొని భూషన్ అటుకేసి ఆదుర్దాగా చూశాడు. కాని అతని కెవరూ కనిపిం చలేదు అతడా శబ్దం వస్తున్న వైపు చూడ్డాని కెంత ఆతృత పడుతున్నాడో అంతకంటె వేగంగా చీకటి తన నల్లటి ముసు గును అతనిమీద కప్పతోంది.

ఆ శబ్దం మెట్లదగ్గర్నుంచి క్రమంగా ఇంటివైపుకు వస్తోంది అది తలుపు దగ్గరకు వచ్చి ఆగిపోయింది ఇంటి కావలాదారుకు నాటకానికి వెళ్ళేముందు ఆ తలుపుకు బయట తాళంవేసి వెళ్ళాడు. ఆ తలుపులమీద ఘల్లుఘల్లు మని అందెల సవ్వడి పెద్దగా వినిపించింది. భూషణ్ అక్కడ మరోక్షణంకూడా కూర్చోకుండా వెంటనేలేచి, చీకటి గదుల గుండా బయటకొచ్చి తలుపు దగ్గర నించున్నాడు. బయట

తాళంవేసి ఉండడంచేత తన బలమంతా ఉపయోగించి తలుపు తియ్యడానికి ప్రయత్నించాడు. అతడు తలుపు తియ్యడాని కుపయోగించిన శక్తి, అప్పుడైన శబ్దం - అతన్ని వెంటనే నిద్రలోంచి మేల్కొలిపాయి. తను నిద్రపోతూ-ఆ నిద్రలోంచి తలుపు దగ్గరకు వచ్చానని అప్పుడు తెలుసుకున్నాడు. అతని ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది. కాళ్ళు, చేతులు మంచులా చల్లగా ఉన్నాయి అతని హృదయం అప్పుడే ఆరబోతున్న దీపంలా కొట్టుకుంటోంది. అతనికి స్వప్నభంగం మయింతరువాత బయటనుంచి వస్తున్న శబ్దం వర్షపు హోరు తప్పితే మరేమీ కాదని తెలుసుకో గలిగాడు.

"అంతా కల అయినప్పటికీ ఒకవేళ నిజమేమోనని అనుకొన్నాడు భూషణ్. విశ్రాంతి నెరుగని ఆ వర్షపు హోరు అతనితో చెబుతున్నట్టుంది" ఈ మెలకువ ఒకకల ఈ ప్రపంచం ఒక మిథ్య!

"ఆ మర్నాడు కూడ ఆవూళ్ళో నాటకం ఉంది. ఇంటి కాపలా మనిషికి ఆవేళకూడా సెలవే. ఆ రాత్రికి వీధితలుపు తెరచి ఉంచమని చెప్పాడు భూషణ్. కాని కాపలామనిషి అందుకు ఒప్పుకోలేదు. ఆ ఊళ్ళో నాటకానికి పొరుగూళ్ళనుంచి కూడా జనం వచ్చారని అందుచేత తలుపు తెరచి ఉంచటం ఏమంత మంచిది కాదని అతడభ్యంతర పెట్టాడు. కాని భూషణ్ అతని మాటల్ని ఖాతరు చెయ్యలేదు. కాపలా మనిషి ఆరాత్రికి నాటకానికి వెళ్ళకుండా ఇంటిదగ్గరే ఉంటాననాన్నాడు. కాని భూషణ్

అందుకు ఒప్పుకోలేదు. అతడు కాసేపు సందేహించి చివరికి నాటకానికి వెళ్ళాడు.

"భూషణ్ ఆరాత్రి తన పడకగదిలో కిటికీముందు మునుపటిలాగానే కూర్చున్నాడు. ఆకాశం మేఘావృతమై కాటుకలా చీకటి అంతటా వ్యాపించింది. ఆ ప్రదేశాన్ని నిశ్శబ్దం పాలిస్తోంది. కప్పల బెకబెకలు దూరాన్నించి విన వస్తున్న పాటలు ఆ నిశ్శబ్దాన్ని పారదోలలేక పోతున్నాయి.

"అర్థరాత్రి దాటింది, కప్పల బెకబెకలు, నాటకంలోని పాటలు వినిపించడంలేదు. గాఢాంధకారపు ముసుగు రాత్రిని పూర్తిగా కప్పేసింది.

"అంతక్రితం రాత్రిలాగే రేవుదగ్గర అందెల ఘుల్లు ఘుల్లు వినిపించాయి. ఈసారి భూషణ్ అటువైపు చూడ్లేదు. నిరాశా నిస్పృహలతో కుములుతున్న అతని హృదయానికా మోతలు వినిపించలేదు. తనను తాను సంభాళించుకొని కదలకుండా కూర్చున్నాడు.

ఆ అందెల సవ్వడి క్రమంగా రేవుదగ్గర్నించి తెరచి వున్న వీధి తలుపు దగ్గరకు ప్రవేశించింది. ఇక భూషణ్ తనను తాను అదుపులో పెట్టుకోలేకపోయాడు. అతని హృదయం పెద్దగా కొట్టుకో నారంభించింది. విస్మయంతో ఏమీ మాట్లాడలేకపోయాడు. ఆ శబ్దం క్రమంగా వరండాలోంచి గది తలుపు దగ్గరకువచ్చి, ఒక్కసారి ఘులం ఘులాయమానంతో ఆగిపోయింది.

"భూషణ్ మరి నిశ్శబ్దంగా కూర్చోలేక పోయాడు. 'మణీ!' అంటూ ఒక్కసారి పెద్దగా అరిచి అక్కణ్నుంచి

లేచాడు. నిద్రలోంచి విభ్రాంతిపడి లేచి, కిటికీ చువ్వలు అతని అరుపుకు ప్రతిధ్వనిస్తున్నట్టు తెలుసుకో గలిగాడు భూషణ్. బయట తప్పల బెకబెకలు వర్షపు హోరు వినిపి స్తున్నాయి.

"నిరాశతో భూషణ్ తన నుదుటిని కొట్టుకున్నాడు.

"ఆ మర్నాడు నాటకం కంపెనీవాళ్లు ఆ ఊళ్ళోంచి వెళ్ళిపోయారు. ఆ రాత్రి తను తప్పితే ఎవ్వరూ ఆ ఇంట్లో ఉండటానికి వీల్లేదని ఆజ్ఞ ఇచ్చాడు భూషణ్. తమ యజ మాని శాంతిక్రియ చెయ్యబోతున్నాడేమో నను కున్నారు సేవకులు. ఆ వేళంతా భూషణ్ ఉపవాసం ఉన్నాడు.

"సాయంత్రం ఆ నిర్మానుష్యమైన ఇంట్లో కిటికీ ముందు యథాస్థానంలో కూర్చున్నాడు. ఆ వేళ ఆకాశం నిర్మలంగా ఉంది. నక్షత్రాలు మినుకుమినుకు మంటున్నాయి. బాగా చీకటి పడింతరువాత చంద్రోదయమయింది. అంత క్రితం రెండురోజుల్నుంచి గ్రామస్థులు అలసిపోయి ఉండడం చేత పెందలకడే ఎక్కడివాళ్ళక్కడ నిద్రపోయారు.

"భూషణ్ తన స్థానంలో కూర్చుని ఆకాశంలోని నక్షత్రాలకేసి తదేకంగా చూస్తున్నాడు. పందొమ్మిది సంవత్సరాల వయస్సులో కలకత్తా కాలేజిలో చదువు తుండగా, కాలేజీ మైదానంలో తలక్రింద చేతులు బెట్టుకొని వెల్లకిలా పడుకొని నక్షత్రాలకేసి చూస్తూ, పుట్టింటిదగ్గరున్న మణి అందమైన వదనాన్ని గురించి ఆలోచిస్తూ గడిపిన రోజుల్ని అతడు నెమరేసుకుంటున్నాడు.

"అతడలా చూస్తూ ఉండగానే నక్షత్రాలు ఒక్క

టొక్కటే అదృశ్యమయ్యాయి. ఆకాశంనుంచి భూమిమీదికి చీకటి తెరలు పరుచుకున్నాయి. ఇవ్వాళ రాత్రి భూషన్ మనస్సు నిర్మలంగా ఉంది.

"గడచిన రెండు రాత్రులవలెనే కేవులోంచి శబ్దం వినిపించింది. భూషన్ కళ్ళు మూసుకొని ధ్యానంలో పడ్డాడు. ఆ శబ్దం గది తలుపు దగ్గరకు ప్రవేశించింది అది క్రమంగా వరండాలోంచి పడగ్గది తలుపు దగ్గరకు వచ్చింది.

"అతని హృదయం వేగంగా కొట్టుకోసాగింది ఒళ్ళంతా వొణికిపోయింది. ఈసారతడు కళ్ళు తెరవలేదు. ఘలంఘలారావం గదిలో ప్రవేశించింది. అది నెమ్మదిగా గదంతా కలయ తిరుగుతూ దగ్గరగ్గర కాసేపాగింది. మూల్లోవున్న దీపందగ్గర టేబులుమీదున్న తమలపాకుల పెట్టెదగ్గర అల్మారాలో ఉన్న వస్తువులదగ్గర కొంతసేపాగి చివరకు భూషన్ దగ్గరకొచ్చి నిలబడింది.

"భూషన్ కళ్ళు తెరిచాడు. గుడ్డిగా ఉన్న చంద్ర కాంతిలో అతనిముందు ఓ అస్థిపంజరం ఉన్నట్లు కనిపించింది. దాని వేళ్ళన్నిటికీ ఉంగరాలు తళతళ లాడుతున్నాయి. చేతుల్ని బంగారు గాజులున్నాయి. మెడనిండా నగలు దిగేసి ఉన్నాయి. ఒళ్ళంతా బంగారు కాంతిలో మెరిసిపోతోంది. పాదాలకు అందెలున్నాయి ఎముకల గూడైన ఆ వదనంలో నిజంగానే రెండుకళ్లు ప్రకాశవంతంగా వెలుగుతూ అతనికేసి తీక్షణంగా చూస్తున్నాయి. అది చూడగానే అతని నరాల్లోని రక్తం గడ్డగట్టుకుపోయింది. కళ్ళు మూసుకోడానికి

ప్రయత్నించాడు; కాని విఫలుడయ్యాడు. నిశ్చేష్టుడై నిల బడి చూశాడు.

"ఆ అస్థిపంజరం తనదృష్టిని నిశ్చేష్టుడైయున్న భూషణ్ వైపు తిప్పి, దగ్గరకు రమ్మని చేతితో సంజ్ఞ చేసింది. ఆ ఎముకల చేతినున్న వజ్రపు టుంగరాలు మసగ్గావున్న చంద్ర కాంతిలో తళతళా మెరిశాయి.

"భూషణ్ మతిపోయినవాడిలా నిలబడి అస్థిపంజరాన్ని వెంబడించాడు. అది గది విడిచి నెమ్మదిగా వరండా దగ్గర కొచ్చింది. అది నడుస్తుంటే దాని ఎముకలకు ఆభరణాలు కొట్టుకుంటూ ఘులంఘులారావం వినవస్తోంది. అది వరండా దాటి చీకటిగావున్న హాలులోకి ప్రవేశించింది అక్కణ్నుంచి తిన్నగా తోటలోకి వెళ్ళింది. వెన్నెల మసక మసగ్గా వుంది దారి సరిగ్గా కనిపించటంలేదు. తడువుకుంటూ వాళ్లు నది రేవుదగ్గరకు చేరారు. ఆ అస్థిపంజరం ఒక్కొక్క మెట్టే దిగి ఇదివరకు శబ్దం వినవచ్చిన చోటికి ఘులం ఘులారావం చేసుకుంటూ నీటిదగ్గర ఆగింది. వరద నీటితో నది గర్జిస్తూ ప్రవహిస్తోంది.

"అస్థిపంజరం నీటిలోకి దిగింది. భూషణ్ దాన్ననుసరిస్తూ ఒక పాదాన్ని నీటిలో మోపాడు. కాలికి నీళ్ళుతగలగానే అతడు తెలివిలో కొచ్చాడు. అతనిముందు అస్థిపంజరం కనిపించలేదు. అవతలొడ్డున చెట్లుమాత్రం నిశ్శబ్దంగా నిలబడున్నాయి. నెత్తిమీద చంద్రుడు ఆశ్చర్యంగా అతని కేసి చూస్తున్నాడు. భూషణ్ ఒక్కఉదుటున నదిలోకి దూకాడు. తల నీటిలో మునిగిపోయింది. అతనికి ఈత చేతనైనా, అవ

యువాలు అతని స్వాధీనంలో లేకపోవడంచేత అశక్తుడై ఈద లేకపోయాడు. అతడు స్వప్న ప్రపంచంలోంచి వాస్తవిక జగత్తు సరిహద్దుల్లోకి ఒక్క అడుగు వేసి ఆ మరుక్షణంలోనే శాశ్వత నిద్రలో మునిగిపోయాడు."

కథ పూర్తిచేసి స్కూలు మాష్టరు కాసేపు మౌనంగా కూర్చున్నాడు కథ పూర్తయ్యేసరికి అతడు తప్ప, ప్రపంచ మంతా నిశ్శబ్దంలో నిద్రపోతున్నదని గ్రహించాను. చాలా సేపటివరకు నేను కూడా మౌనంగా కూర్చున్నాను. ఆచీకట్లో నా ముఖంలోని వళికలు అతడు చూడలేకపోయాడు.

చివరి కతడడిగాడు నన్ను. "ఈ కథను మీరు నమ్ముతారా?"

"మరి నువ్వో? అడిగాను.

అతడన్నాడు. "నమ్మను. అందు కొకటి రెండు కారణాలు చెబుతా."

అతడు చెబుతోంటే మధ్యలో కలుగ జేసుకున్నాను. "నా పేరు భూపతి సహా అయితే..."

"నేనంతే అనుకున్నాను. అయితే మీ భార్య పేరే మిటి!" అతని ముఖంలో అపజయం చిహ్నలేమీ కనపడ్చకుండా అడిగాను.

నే చెప్పాను. "సత్యకాళి."

—::—

# రాజా – రాణి

బిపిన్ కిశోర్ శ్రీమంతుల ఇంట్లో జన్మించాడు. రాజ భోగాలన్నీ అనుభవించాడు. అతనికి డబ్బును ధారాళంగా వెచ్చించడమే తెలుసుకాని ఆర్జించడం తెలియదు. తత్ఫలితంగా అతడు స్వగృహాన్ని విడిచిపెట్టాల్సొచ్చింది.

అతడు సంగీతం అంటే చెవి కోసుకునేవాడు. కాని ప్రపంచ జ్ఞానం శూన్యం. ఉన్నడబ్బు కాస్తా హారతి కర్పూరంలా ఆరిపోయిం తరువాత డాబు దర్పాలకు తిలోదకాలిచ్చి ఆఖరికి కట్టుబట్టల్తో మిగిలిపోయాడు.

అదృష్టవశాత్తూ రాజా చిత్తరంజన్, కోర్టుద్వారా తిరిగి తన ఆస్తిని పొందగలిగాడు. అతడో ఎమెచ్యూర్ నాటక మండలిని స్థాపించి నిర్వహించడానికి పూనుకున్నాడు! బిపిన్ కిశోర్ రూపు రేఖలు, సంగీత కళాభిరుచి గమనించి అతన్ని తన నాటక మండలిలోకి తీసుకొన్నాడు రాజా.

చిత్తరంజన్ బి. ఎ. చదివేడు, అతడు స్థితికి శ్రీమంతుడైనా పేదల ఇళ్ళల్లో భోజనం చేసేవాడు. వాళ్ళతో అరమరికలు లేకుండా కలిసిమెలిసి తిరిగేవాడు. బిపిన్‌తో పరిచయం వల్ల క్రమంగా అతడు వ్యసనానికి లోనయ్యాడు రాత్రి పొద్దుపోయేవరకు వాళ్ళిద్దరు నాటకాల్ని గురించి చర్చించుకునేవారు. బిపిన్‌వల్ల తన యజమాని దురభ్యాసాలకు లోనౌతున్నాడని దివాన్ తరచుగా వాపోతుండేవాడు.

రాణి వసంత కుమారికి ఇదంతా చూస్తుంటే ఒళ్ళు మండుకొచ్చింది. ఎందుకూ కొరగాని దేశదిమ్మరికి వ్యర్థంగా డబ్బు తగలెయ్యడం ఎందుకని ఆమె భర్తను నిగ్గదీసి అడిగింది.

బిపిన్ మీద తన భార్యకున్న అసూయకు లోలోన నవ్వుకునేవాడు రాజా. స్త్రీకి ఈ ప్రపంచంలో తను ప్రేమించిన వ్యక్తి తప్ప మిగతా మనుషుల్ని గురించి బొత్తుగా తెలియదు. భర్తకు భోజనం పెట్టేముందు భార్యపడే ఆందోళన అంతా ఇంతా కాదు. కాని ఇంటి నౌకర్లు కడుపునిండా అన్నం తింటున్నారో లేదో తెలుసుకోవలసిన అవసరం ఆమెకు లేదు. ఈ సాత్త్విక దృష్టిని తలచుకొని రాజా ఆమెను మృదువుగా మందలించేవాడు.

కాని వాళ్ళిద్దరి విషయం ఎలావున్నా మధ్యలో పడి నలిగిపోతున్నాడు బిపిన్. రాణి అతన్ని ఈసడించుకోవడంలో నౌకర్లుకూడా అతన్ని అలక్ష్యం చేశారు. ఇక అతనిపనులన్నీ అతనే చేసుకోవల్సి వచ్చింది. ఆవిషయాన్ని గురించి రాజాతో మాత్రం ఏమని ఫిర్యాదు చేసుకోగలడు? అంచేత మెదలకుండా ఊరుకున్నాడు.

రాణి ఒకసారి నౌఖరు వూటీని చీవాట్లు పెట్టింది. "నువ్వెప్పుడూ పని తప్పించుకుంటున్నావు రోజస్తమానం ఏం చేస్తున్నావ్!

"అమ్మగారూ! మహారాజాగారి ఆజ్ఞప్రకారం రోజంతా బిపిన్ బాబు దగ్గర పనిచేస్తున్నానమ్మ" చెప్పాడు నౌఖరు.

"మీ బిపిన్ బాబు నవాబా, ఏం!" రాణి అతన్ని వ్యంగ్యంగా దూషించింది.

ఇక అంతే, పూటీ ఆమె మాటను పట్టుకున్నాడు, ఆ మర్నాటినుంచి బిపిన్ బాబు గదిలోకి వెడితే ఒట్టు. అతనికి భోజనం తీసుకెళ్ళడంకూడా విరమించుకున్నాడు. తత్ఫలితంగా బిపిన్ తరచుగా పస్తులు వడుండేవాడు. ప్రతి చిన్న విషయాన్నీ తీసుకెళ్ళి రాజాకు చెప్పడం అతని కిష్టంలేదు. రాజాముందు తలవొంచి తన హీనత్వాన్ని ప్రదర్శించుకోవడం అతనికి చిన్నతనం అనిపించింది వాటినేమీ పట్టించుకోకుండా అంతా మన మంచికే అని ఊరుకున్నాడు. క్రమంగా అతనిమీద రాజాకు అభిమానం పెరుగుతున్న కొద్దీ రాణి అయిష్టత హెచ్చుతోంది.

సుభద్రా హరణం నాటకం రిహార్సిల్స్ పూర్తయిపోయాయి. ఇక ప్రదర్శించడమేనాయి తరువాయి కోర్టు ఆవరణలో వేదిక తయారయింది. రాజా కృష్ణుడి పాత్ర ధరించాడు బిపిన్ అర్జునుడుగా నటించాడు. అతడెంత బాగా పాడాడని! ఎంత అందంగా కనిపించాడని! ప్రేక్షకు లతన్ని తెగపొగిడారు.

నాటకం పూర్తయింది. రాజా, రాణి. దగ్గరకు వెళ్ళి ఎలావుందని అడిగాడు. "బిపిన్ అర్జునుడి పాత్ర చాలా గొప్పగా వేసి ఒప్పించాడు. అతడు వున్నత కుటుంబంనుంచి వచ్చినవాడులా వున్నాడు. అతని కంఠం ఎంతమాధుర్యంగా వుందనీ!" పొగిడింది రాణి.

"మరి నేనెలా వున్నాను! నే అందంగాలేనా! మరి

నాకు తియ్యటి గొంతు లేదా!" రెట్టించాడు రాజా.

"మీ విషయం వేరు. చెప్పింది రాణి. ఇలా అని ఆమె బిపిన్ నటనా చాతుర్యాన్ని గురించి మరొకమారు పొగడింది.

ఇప్పుడు పరిస్థితులు తారుమారయ్యాయి. ఇదివరకటి దాకా బిపిన్‌ని తెగపొగిడిన రాజా ఇప్పుడు తెగనాడుతు న్నాడు. ప్రజలు అనవసరంగా అతనికి లేని పోని ప్రాధాన్యత అంటగడుతున్నారని బాధపడ్డాడు. అతని రూపు రేఖల్లో కాని, కంఠంలో కాని ఏం ప్రత్యేకత వుంది! అంత క్రితం దాక బిపిన్‌కి అనవసర ప్రాధాన్యత ఇచ్చినవాడిలో తనూ ఒకడు. కాని ఇపుడు అకస్మాత్తుగా అతని అభిప్రాయం మారిపోయింది.

ఆ మర్నాటినుంచి బిపిన్‌కి మంచిమంచి వంటకాలతో భోజన ఏర్పాట్లు జరిగిపోతున్నాయి. రాణి రాజ తో అన్నది" బిపిన్ బాబు ఆమూల చీకటిగదిలో ఉండడం అతని హోదాకు తగినదికాదు. ఆయనకు మరో మంచిగది చూపిస్తే బాగుం టుంది."

"ఆఁ అలాగా!" అని ఎగతాళిచేసి ఊరుకున్నాడు రాజా.

ఆనాటకాన్ని మరోమారు ప్రదర్శించమని రాణిపదే పదేఅభ్యర్థించింది. కాని రాజా అందుకు పెడచెవిని పెట్టాడు.

తనపని సరిగా చెయ్యడంలేదని రాజా ఒకసారి పూటీని తెగ చీవాట్లు పెట్టాడు. "నేనేం చెయ్యనండీ! రాణిగారి ఆజ్ఞ ప్రకారం పగలస్తమానం బిపిన్ బాబుగారి పని చేస్తున్నాను" అన్నాడు పూటీ.

రాజాకు ఎక్కడలేని కోపం వచ్చింది. "బిపిన్ బాబు నవాబా ఏం! తనపని తాను చేసుకోలేడూ?" అన్నాడు. ఇక ఆ వేళతో పూటే బిపిన్ గదికి వెళ్ళడం స్వస్తి చెప్పాడు. బిపిన్ తిరిగి వెనకటి స్థితిలోకి మారాడు.

బిపిన్ పాటలంటే రాణి చెవి కోసుకునేది. అతని తియ్యటి గొంతిని తెగ పొగిడేది. సాయంత్రంపూట తన భర్త, బిపిన్ కలిసి క్రొత్తక్రొత్త పాటలకు ట్యూన్స్ కడుతోంటే ఆమె ఆ పక్క గదిలో పరదామాటున వుండి వాటిని కుతూహలంతో వింటుండేది. ఆ తరువాత రాజా ఆ కార్యక్రమాన్ని కట్టిపెట్టి తన సొంత వ్యవహారాలకి అధిక కాలాన్ని వెచ్చించ నారంభించాడు. సాయంత్రం వేళ సంగీత కార్యక్రమం ఆగిపోయింది.

చిత్తరంజన్ తన జమీందరీ వ్యవహారాల్ని మధ్యాహ్నం వేళ చూస్తుండేవాడు. ఓరోజు ఆయన పెందలకడే అంతఃపురంలోకి వెళ్ళాడు. రాణీ ఏదో చదువుతోంది. "నీ చేతిలోఉన్న పుస్తకం ఏమిటి?" అడిగాడు.

రాణి ముందు చెప్పడానికి కొంచెం సంకోచించింది. మరికాసేపటికి ఉన్నదున్నట్లుగా చెప్పింది. "బిపిన్ బాబు పాటల పుస్తకంలోని పాటల్ని వల్లెవేస్తున్నా. మీరు సాయంత్రం సంగీత కార్యక్రమం నిలిపివేసినతరువాత నాకేం తోసుపోవడంలేదు."

ఆ మర్నాడు బిపిన్‌ని బర్తరపు చేశాడు రాజా. అకస్మాత్తుగా అతన్ని తీసివేస్తే ఎలా బ్రతుకుతాడో అనికూడా ఆలోచించలేదు.

బిపిన్‌కి ఇదేమీ విచారం కలిగించలేదు. కాని అతడు రాజాతో ఎంతో సన్నిహితంగా మెలిగాడు అతన్ని డబ్బు కంటే అధికంగా ప్రేమతో కొలిచాడు. అటువంటి తనమీద అతని ఆకస్మిక కోపానికి కారణ మేమిటో బిపిన్‌కు అంతు చిక్కలేదు. "కర్మ ఇదంతా కర్మ అనుకున్నాడు తనలో. ఇక అప్పుడు పెద్దవేసి నిట్టూర్పు విడిచాడు. తన సామాన్లన్ని తీసుకున్నాడు. తన జేబులో మిగిలిన రెండు నాణేల్ని పూటికి కడసారి చిహ్నంగా యిచ్చి, తనకెవరూ బంధుమిత్రులు లేని విశాల ప్రపంచంలోకి నడిచి వెళ్ళాడు.

—::—

# అస్థిపంజరం

మా పిల్లలందరం ఓగదిలో పడుకునే వాళ్ళం. మా పక్కగదిలో ఓమానవ అస్థిపంజరం వ్రేలాడుతుండేది. రాత్రి పూట గాలికి దాని ఎముకలు గలగలలాడుతున్న శబ్దంవినిపించేది. పగటిపూట ఆ ఎముకల్ని మేము గలగలలాడించే వాళ్ళం. మా సంరక్షకులు సైన్సులో మమ్మల్ని దిట్టలుగా చెయ్యడానికని శరీరశాస్త్రం గురించిన పాఠాలు చెప్పడానికి ఓ ఉపాధ్యాయుణ్ణి నియమించారు. అయితే అందులో ఎంత వరకు కృతార్థులమైనదీ మేము చెప్పలేం.

చాలా సంవత్సరాలు గడిచిపోయాయి. ఈ లోగా అస్థిపంజరం గదిలోంచి అదృశ్యమైంది మేము శరీర శాస్త్రానికి సంబంధించిన విషయాలనన్నీ మర్చిపోయాం.

ఓ రోజున మా ఇల్లు అతిథులతో నిండిపోయింది. ఆరాత్రి నేను నా పాతగదిలో పడుకోవాల్సి వచ్చింది. ఆ పరిసరాలన్నీ నాకు కొత్తగాతోచాయి. అలవాటుతప్పిందేమో ఆగదిలో నాకు నిద్రపట్టడం లేదు. పక్కమీద అటూ ఇటూ దొర్లుతున్నాను. ఆరాత్రి చర్చి గడియారం వరుసగా గంటలు కొట్టటం వింటూ పడుకున్నాను. గదిమూలఉన్న దీపం నూనెలేక గప్పుమంటూ కొట్టుకుంటూ ఆరిపోయింది. దీపం ఆరిపోవడంతోపాటు నా ఆలోచనలు కూడా ఆగిపోయాయి.

అంతలో అస్థిపంజరాన్ని గురించిన జ్ఞాపకజాడలు నన్ను వెంటాడాయి. అది ఎలా ఉండేది స్మరణకు తెచ్చు కుంటున్న సమయంలో నా మంచంచుట్టూ ఏదో తిరుగు తున్నట్లుగా తోచింది. దాని వేగమైన ఉశ్వాసాన్ని నేను వినగల్గుతున్నాను. గదిలో అవి దేనికోసమో తారట్లాడు తున్నట్లుగా అడుగుల సవ్వడి వినిపిస్తోంది. వ్యర్థమైన ఆలో చనతో నిద్ర రాకపోవడంచేత నా నరాలస్పందనే అడుగుల సవ్వడిగా భ్రాంతిచెందానేమో ననిపించింది. ఏమైనప్పటికీ నావొళ్ళంతా జలదరించింది. నా అనుమానాన్ని తీర్చుకో వడంకోసం, "ఎవరక్కడ!" అని బిగ్గరగా అరచాడు. నా మంచం వద్ద అడుగుల చప్పుడు ఆగిపోయినట్లు వినిపించింది. "ఆఁ నేనే! నా అస్థిపంజరం ఓమాటు చూచుకుందామని వచ్చాను" అని సమాధానం వచ్చింది.

నా తలగడను గట్టిగా పట్టుకొని అన్నాను."ఈరాత్రి వేళ మంచి వ్యవహారమే దొరికింది. ఆ అస్థిపంజరం నీ కివ్వా డెందుకు పనికివస్తుంది!"

సమాధానం నాదోమ తెరలోంచే వచ్చినట్టుగా ఉంది. "ఏం ప్రశ్న? ఆ ఎముకల్లో నా హృదయం పవిత్రమై ఉంది. ఇరవైఆరు సంవత్సరాల యౌవ్వన సౌందర్యం అందులో ఇమిడివుంది. దాన్ని నేను ఓసారి చూడగూడదా ఏం!"

"అవును, మంచికోరికే! దానికోసం వెతుక్కో. నేనీ లోగా నిద్రపోతాను." అన్నాను.

నువ్వు ఒంటరిగా ఉన్నావుకదూ ! మంచిది. నేనో

ఘడియసేపు ఇక్కడ కూర్చుంటాను. మనిద్దరం కాసేపు మాట్లాడుకుందాం. కొన్ని సంవత్సరాల క్రితం నేను మనుష్యుల మధ్య కూర్చుని మాట్లాడేదాన్ని. కాని గతించిన ముప్పై అయిదు సంవత్సరాలనుంచి నేను స్మశానంలో, గాలిలో మూలుగుతున్నాను. పూర్వంవలె మరోసారి మానవుడితో నేను మాట్లాడతాను.

నా దోమతెర ప్రక్కన ఎవరో కూర్చున్నట్టుగా తోచింది. నేను ఉత్సాహంతో వినయపూర్వకంగా సమాధానం చెప్పాను: "మంచిది. మనం కాసేపు సరదాగా మాట్లాడుకుందాం."

"నేను ఆలోచించేది నా జీవిత చరిత్రను గురించి, దాన్నిప్పుడు చెబుతాను.

చర్చి గడియారం రెండు గంటలు కొట్టింది.

"నేను భూమిమీద జీవించి యౌవనంలో ఉన్నప్పుడు నాభర్తనుగురించి సదా భయపడుతుండేదాన్ని. గేలానికి చిక్కుకున్న చేపలా నా మనోభావాలు ఉండేవి. ఓ ఆగంతకుడు సూదుల్లాంటి గేలాలతో ప్రశాంతమైన నా బాల్య గృహ జీవితాన్ని బలవంతంగా లాక్కు వెళ్ళాడు. అక్కడనుంచి నాకు విముక్తి లభించలేదు. వివాహమైన రెండు మాసాలకే నాభర్త చనిపోయాడు. మిత్రులు, బంధువులు నామీద సానుభూతి ప్రకటించారు. మా మామ నాముఖాన్ని జాగ్రత్తగా పరిశీలించిన తరువాత మా అత్తతో అన్నాడు: చూశావా! కోడలికి దుష్టకన్నుంది!-సరే, నువ్వు వింటున్నావా? ఈ కథ నీకు ఆనందంగా ఉందికదూ!"

"నిజం. కథా ప్రారంభం అద్భుతంగా ఉంది" అన్నాను అయితే నన్ను చెప్పనియ్యి. "విచారవదనంతో" తిరిగి మా ఇంటికొచ్చాను. అసలు నేను సహజంగా ఎంతో అందగత్తెను. "నీ అభిప్రాయం ఏమిటి?"

"కావొచ్చు. కాని నిన్నెప్పుడూ చూడలేదని గుర్తుంచుకో" అని గొణిగాను.

"ఏమిటి నన్ను చూడలేదూ! నా అస్థిపంజరంయూటే మిటి! హా... హా... హా... సరే, నేనూరికేఅంటున్నాను. అస్థిపంజరంలోని గుహల్లాంటి రెండు పెద్ద ఖాళీ ప్రదేశాల్లో వెలుగుకాంతులు చిమ్మే రెండు విశాల నయనాలుండేవని నిన్నిప్పుడెలా నమ్మించను? నువ్వు చూసే పళ్ళకు పై భాగాన తమలపాకుల్లాంటి రెండు పెదవులు మందహాసంతో పారాడు తుండేవని నీకు అర్థం అయ్యేలా ఎలా చెప్పగలను? నిన్ను నమ్మించడానికి ఇప్పుడు ఎముకలుమీద ఒకప్పుడు పారాడిన నా ఒంటి కాంతిని, అందాన్ని, మృదుత్వాన్ని, ఒంపుల్ని, యావ్వనాన్ని గురించి చెబుతోంటే ఓ చెంప సంతోషము, మరో చెంప దుఃఖము కలుగుతున్నాయి. నా కాలంనాటి గొప్ప గొప్ప డాక్టరు నా దేహంలోని ఎముకలు; శరీర శాస్త్రపఠనానికి వినియోగపడతాయని కలలోకూడా తలంచ లేదు. నాకు తెలిసిన ఓ డాక్టరు నన్ను బంగారు చంపా పుష్పంతో పోల్చాడని నీ వెప్పుడైనా విన్నావా!"

"నేను నడిచేప్పుడు వజ్రం తన కాంతుల్ని వెదజల్లు తున్నట్లుగా నా ప్రతి కదలికా అన్ని వైపులకు సౌందర్య తరంగాలను చిమ్మేది. గంటలతరబడి నా చేతులను - సజీవ

మానవులను పాలించిన సుందరమైన చేతులను తనివితీరా చూసుకునే దాన్ని."

"ఆ అస్థిపంజరం నామీద నీకు తప్పుడు పాఠ్యాన్ని ఇస్తోంది కదూ! నా సుందర, మృదుల ప్రేమైక స్వప్నంతో నీమనస్సులో వున్న శరీర శాస్త్రానికి సంబంధించిన చెత్త నంతా తొలగించి, శాశ్వతంగా నీ కళ్ళనుండి నిద్రను పార ద్రోలాలని నాకు కోరికగా వుంది."

"నీతో ప్రమాణంచేసి చెబుతున్నాను నా మన స్సులో ఏ శాస్త్రానికి సంబంధించిన విషయాలూ గుర్తులేవు. గుబురుగా ఎదుగుతున్న గాథ తమస్సులో సుందరస్వప్నం ఒక్కటే నా మనస్సులో మెదలుతోంది. అంతకు మించి నేనేమీ చెప్పలేను" అన్నాను.

"నా కెవరూ ఆడపిల్లలు జతలేరు" కంఠం చెప్పుకు పోతోంది. "నాకున్న ఒకే ఒక సోదరుడు వివాహం చేసుకో డానికి యిష్టపడలేదు. ఇక మా యింట్లో నే నొక్కర్తినే. తోటలో చెట్లనీడని ఒంటరిగా కూర్చొని ప్రపంచమంతా నన్ను ప్రేమిస్తున్నదని ఆకాశంలో నక్షత్రాలు తదేకంగా నన్ను చూస్తూ నా అందాన్ని త్రాగుతున్నాయని, పిల్ల వాయువులు నన్నుతాకి పులకితులవుతున్నాయని, నా పాదా లను మోపిన పచ్చటి మైదానం నా స్పర్శతో స్పృహ తప్పిపోతున్నదని కలలు కనేదాన్ని. ప్రపంచంలోని యువకు లంతా నా పాదాలక్రింద గడ్డిపరకలుగా కనిపించేవారు. కాని నా హృదయంలో విచారం గుబురుగా యెందుకు అలుము కుంటుందో అర్థం కావడంలేదు."

"నా సోదరుని మిత్రుడు శేఖర్ మెడికల్ కాలేజీలో పాసై మా ఇంటి డాక్టరుగా వచ్చాడు. తెర వెనుకనుండి అతన్ని నేను చాలాసార్లు చూశాను. నా సోదరుడో వింత మనిషి. కళ్లు తెరచి ప్రపంచాన్ని చూడ్డానికి ప్రయత్నించే వాడు కాదు. శేఖర్ ఒక్కడే అతని యేకైక మిత్రుడు. అంచేత నాకు తెలిసిన యువకుడల్లా అతనొక్కడే. తోటలో సాయంత్రం కూర్చున్నప్పుడు నా స్మృతిపథంలో కదులాడే యువకులంతా శేఖర్‌గానే తోచేవారు. ఏం! వింటున్నావా! ఏమిటాలోచిస్తున్నావు?"

"నేనే ఆ శేఖర్ అనుకుంటున్నాను" నిట్టూర్పువిడిచి చెప్పాను.

"కాస్సేపాగు. ముందు కథంతా పూర్తిగా విను. వర్షాకాలంలో ఓసారి నేను జ్వరంపడ్డాను. డాక్టరు నన్ను చూడ్డానికివచ్చాడు. అదే మా తొలి కలయిక. డాక్టరు రాగానే నా ముఖంలోకి చూశాడు. నేనూ అతని ముఖం కేసి చూశాను సాయంత్రపు వింతకాంతిలో అతని ముఖం తెల్లటి మృదువైన తలగడమీద అప్పుడే రాలిపడుతున్న పువ్వులా వుంది.

"ఆమె నాడి చూడవచ్చా!" డాక్టరు నెమ్మదిగా నా సోదరునితో అన్నాడు.

నానుపైన గుండ్రటి నా మణికట్టును చాచాను. రోగినాడిని చూడడానికి భయపడుతున్న డాక్టరును నేనింత వరకు ఎక్కడా చూడలేదు. నా మణికట్టును పట్టుకోగానే అతని వ్రేళ్ళు వణికాయి. అతడు నా జ్వరాన్ని కొలిచాడు.

నే నతని హృదయ స్పందనను కొలిచాను - ఏం! నన్ను నమ్మవూ!

"ఓ తప్పకుండా! నమ్మకపోవడమేమిటి!" అన్నాడు.

నా జబ్బు నయమై కోలుకున్న తరువాత నా స్మృతి పథంలో ఒకేఒక డాక్టరు, ఒకేఒక రోగి మిగిలారు.

"రోజూ సాయంత్రంవేళ అందంగా అలంకరించుకొని, ఓ చిన్న అద్దాన్ని చేతపుచ్చుకొని, తోటలో చెట్ల కింద కూచునే దాన్ని.

"ఎవరి అందాన్ని వారు చూస్తూ కూర్చుంటేవిసుగు పుట్టదా అని అనుకుంటున్నావు కదూ! అది సరికాదు. నే నప్పుడు ఇద్దరు వ్యక్తులుగా కనిపించేదాన్ని. నేను డాక్టరు వలె చూసేదాన్ని. నను సంతోషం కలిగేది నేను ప్రేమ పిచ్చిలో పడ్డాను."

"ఏమైనప్పటికీ అప్పట్నుంచి నేను ఒంటరిదాన్ని కాదు. నేను నడుస్తున్నప్పుడు, నా బొటనవేళ్ళు నేలమీద వయ్యారంగా చేస్తున్న నృత్యాన్ని డాక్టరు చూస్తే ఎంత మధురంగా ఉంటుంది అని ఆలోచించేదాన్ని. మధ్యాహ్నం వేళ ఆకాశంలో ఎర్రటిఎండ, అప్పుడప్పుడు గ్రద్ద అరుపులు తప్ప మరేమీ కనిపించేవికావు. మా తోటగోడల అవతల గాజులుబత్తి కేకలుమాత్రం వినిపించేవి. నేను పచ్చికమీద తెల్లటి వస్త్రాన్ని పరుచుకొని, మోచేతిమీద తలపెట్టుకొని పడుకునేదాన్ని రెండోచేతిని నాజుగ్గా కింద ఆనించేదాన్ని. ఎవరో నామృదులహస్తాన్ని తన రెండు చేతులతో స్పృశించి నా అరచేతిని ముద్దిడి వెనుదిరిగి వెళ్ళిపోతున్నట్లుగా

భావించేదాన్ని - ఇక్కడితో కథను అంతంచేస్తే ఎలా ఉంటుంది?"

"అంత రక్తికట్టదు. అసంపూర్తిగా మిగిలిపోతుంది. అయినా శేషించిన రాత్రిని కథాంతంచెయ్యడానికి వెచ్చించ గలన"ని చెప్పాను.

"సరే నన్ను చెప్పనియ్యి. డాక్టరుకు కొంతప్రాకీసు వృద్ధికాగానే మా ఇంట్లో ఓగది తీసికొని అక్కడ రోగులకు సలహాలు చెప్పేవాడు. అప్పుడప్పుడు నేను మందులను గురించి, విషాన్ని గురించి హాస్యంగాఅడిగేదాన్ని. ఏమందు మనుష్యుల్ని చంపుతుందో తెలుసుకునేదాన్ని. అతనికివిసుగు పుట్టేది. ఆ సంభాషణలు నన్ను మృత్యుముఖంలోకిలాక్కు వెళ్ళేవి. నా చిన్నారి ప్రపంచంలో ప్రేమ, చావు - రెండే వస్తువులున్నాయి. నా కథ దాదాపు పూర్తయింది. పెద్దగా మిగిలిందేమీ లేదు.

రాత్రికూడా ఏమంత పెద్దగా శేషించిలేదు" గొణిగాను.

"కొంతకాలానికి డాక్టరు పూర్తిగా మతిమరుపుతో వింతగా ప్రవర్తించడం మొదలెట్టాడు. నాకేదో విషయాన్ని చెప్పకుండా దాచడానికి ప్రయత్నిస్తున్నాడు ఓరోజుసాయంత్రం అతడు కొత్తదుస్తులు వేసుకొని మా ఇంటికొచ్చాడు. నా సోదరుని బండి తీసుకొని ఎక్కడికో వెళ్ళాడు."

"ఆదుర్దాగా నా సోదరుని దగ్గరకు వెళ్ళి డాక్టరు ఎక్కడకు వెళ్లాడు" అడిగాను.

"మృత్యువును కలుసుకోవడానికి వెళ్ళాడు" అన్నయ్య చెప్పాడు.

నాకర్థం కాలేదు. "ఆయన నిజంగా ఎక్కడకెళ్ళిందీ చెప్పన్నయ్యా" అని అడిగాను.

"పెళ్ళి చేసుకోవడానికి" అన్నాడు తాపీగా.

"ఆఁ నిజంగా!" అని నేను విరగబడి నవ్వాను.

"వధువు కట్నంగా చాలా డబ్బు తీసుకొస్తుందని నాకు తరువాత తెలిసింది. ఈ విషయాలన్నీ నాకు చెప్పకుండా దాచిపెట్టి అతడు నన్నెందుకు అవమానించాలి! అతన్ని నేనేమైనా పెళ్ళిచేసుకోవద్దని బ్రతిమిలాడానా? నన్ను పెళ్ళి చేసుకోపోతే నా హృదయం వ్రయ్యలయిపోతుందని చెప్పానా? లేదే! మగవాళ్ళను నమ్మకూడదు. నా జీవితంలో ఒకే ఒక మనిషిని ఎరిగిఉన్నాను. ఒక క్షణంలో నే నీ విషయాన్ని కనిపెట్టగలిగాను."

డాక్టరు తనవని చూసుకొని వెళ్ళిపోబోతుంటే పిలిచి నవ్వుతూ అడిగాను. "అయితే డాక్టరుగారూ! మీ రీ రాత్రి పెళ్ళి చేసుకుంటున్నారన్నమాట"

ఆయనకు కోపం వచ్చింది.

"ఏమిటి! బేండు మేళం లేదా! విందు భోజనాలు లేవా!" మళ్ళీ అడిగాను.

అతడు నిట్టూర్పువిడిచి అన్నాడు: "వివాహం అంత సంతోషకరమైన సంఘటనా!"

నేను పగలబడి నవ్వాను. "మేళం లేకుండా, విందు

భోజనాలు లేకుండా పెళ్ళి జరగడాన్ని గురించి నేను సహించలేను" అన్నాను.

వధువును గురించి ఆలోచనతో నా మనస్సు నిండి పోయింది. "డాక్టర్, మీరింకా నాడులు చూస్తూనే ఉంటారా!" అడిగాను. ఈ మాటలు డాక్టరు హృదయంలో సూదుల్లా గుచ్చుకున్నాయి.

పెళ్ళి అర్థరాత్రి జరుగుతుంది. డాక్టరు, మా అన్నయ్య బయలుదేరబోయే ముందు గదిలో కూర్చుని ద్రాక్షరసం తాగుతున్నారు. అది వారి మామూలు అలవాటు, అప్పుడే చంద్రుడు ఉదయించాడు.

నేను నవ్వుతూ వెళ్ళి, "మీ పెళ్ళి సంగతి మర్చి పోయారా డాక్టర్! బయలుదేరే వేళయింది" అన్నాను.

"ఇక్కడ నీకో చిన్న విషయం చెప్పాలి. ఈ లోగా నేను డిస్పెన్సరిలోకి వెళ్లి కొంతపౌడరు తీసుకొచ్చాను. డాక్టరు చూడకుండా ఉన్నప్పుడు దాన్ని అతని గ్లాసులో కలిపివేశాను."

డాక్టరు గ్లాసును ఖాళీచేశాడు. నా వైపు తీక్షణంగా చూస్తూ "ఇక నే వెళ్లాలి" అన్నాడు.

"నేను గదిలోకి వెళ్లాను. పెళ్లికుమార్తెలా అలంకరించు కున్నాను. పెట్టెలోని నగలన్నీ తీసి ఒంటికి పెట్టుకున్నాను. నుదుటిమీద సింధూరం పెట్టుకున్నాను. పట్టుబట్టల్తో పెళ్ళి కూతురులా తళతళా మెరిసిపోతున్నాను. తోటలోకి వెళ్ళి కింద నాపక్క వరుచుకున్నాను."

"అది సుందరమైన రాత్రి. చల్లటి పిల్లవాయువులు

అలసట చెందిన ప్రపంచాన్ని వుపశమింప జేస్తున్నాయి. తోటంతా జాజిమల్లి సువాసనలతో గుబాళించి పోతోంది.

"క్రమంగా చంద్రకాంతి క్షీణిస్తోంది. సంగీతపుధ్వనులు వినిపించడంలేదు. ఈ ప్రపంచమంతా ఓ స్వప్నంలా కని పిస్తోంది నేను కళ్ళుమూసుకొని చిరునవ్వు నవ్వాను"

"ఎవరైనా నన్ను చూసినప్పుడు నా పెదవులమీద తారాడే చిరునవ్వును - అదే శోభనంగదిలో నా ముఖంలో ప్రకాశించవలసిన నవ్వును - అర్థం చేసుకోగలరా? కాని, అయ్యో! శోభనంగది! ... పెళ్ళికూతురు సింగారం! ... నాలోని గలగల శబ్దానికి లేచినప్పుడు నా అస్థిపంజరంవద్ద ముగ్గురు విద్యార్థులు నిలబడి నా ఎముకల్ని పరీక్షిసున్నారు. నా హృదయంలో ఎక్కడైతే సుఖదుఃఖాలు స్పందనచేసేవో యౌవ్వన వస్త్రాలు తొడుగులు విడిచేవో, అక్కడ మాష్టరు తన కర్రతో నా ఎముకల్ని తడుముతూ వరుసగా పేర్లు చెబు తున్నాడు. నా కడసారి చిరునవ్వును నా హృదయంలో పదిల పర్చుకున్నా. దాన్ని పదేపదే జ్ఞప్తికి తెచ్చుకుంటున్నాను. దాని చిహ్నలేమైనా నువ్వు చూశావా!"

"సరే. కథ యెలా వుంది!"

"అద్భుతంగా వుంది" అన్నాను.

కథపూర్తయ్యేసరికి తొలికోడి కూసింది. "నువ్వక్కడే వున్నావా!" అడిగాను. కాని జవాబు రాలేదు.

ఉదయభానుని లేత కిరణాలు గదిలో ప్రవేశించాయి.

—::—

# ధర్మకర్త

బృందావన కుందూ కోపంతో తండ్రిదగ్గరకు వచ్చి "తక్షణమే నే వెళ్ళిపోతున్నాను" అన్నాడు.

"కృతఘ్నుడా! ఇంతకాలంనుంచి నీ పోషణకోసం నే ఖర్చుపెట్టిందంతా చెల్లించిపోగల తాహతుంటే పో!" అన్నాడు తండ్రి జగన్నాథ కుందూ.

ఒక్కమాటలో చెప్పాలంటే జగన్నాథకుందూ ఉత్త పిసిసిగొట్టు. బృందావన్ ఒక్కడే వున్నంతకాలం తండ్రీ కొడుకులకు సాఫీగానే సాగిపోయింది. కాని బృందావన్‌కు పెళ్ళయినదగ్గర్నుంచి వ్యవహారం ముదిరి పాకాన పడింది. ప్రాపంచిక సుఖాలకోసం ప్రాకులాడవద్దని తండ్రి చెప్పేవాడు. సరైన జీవితాన్ని గడపటానికి మంచి తిండి, బట్ట కావాలని కొడుకు అడిగేవాడు.

ఈ విధంగా తండ్రికొడుకులకు తరచుగా అభిప్రాయ భేదాలు వస్తుండేవి. అవే క్రమంగా కొట్లాటలకు దారితీసేవి. ఒకసారి బృందావన్ భార్యకు పెద్ద జబ్బు చేసింది. ఓ నాటు వైద్యుణ్ణి పిలిపించాను. అతడో ఖరీదైన మందును కొనాలని చెప్పేసరికి జగన్నాథ్‌కు ఒళ్ళు మండుకొచ్చింది. వెంటనే అతన్ని అక్కణ్ణుంచి పంపేశాడు. కాని బృందావన్ ఊరుకోలేదు. వైద్యుణ్ణి తిరిగి తీసుకొస్తానన్నాడు. అక్కడ తండ్రీ కొడుకులమధ్య మళ్ళీ పెద్ద వివాదం చెలరేగింది. కాని తండ్రి

మూాలే నిగ్గింది. తత్ఫలితంగా చివరకు బృందావన్ భార్య చనిపోయింది.

"నా భార్యను చంపింది నువ్వే. నువ్వు హంతకుడవు అని దూషించాడు తండ్రిని కోపం పట్టలేక.

"నోరుముయ్! ఉండలు వేసుకుని చచ్చినవాళ్ళు లేరూ! ఖరీదైన మందులన్నీ మనుష్యుల్ని రక్షిస్తే మరి రాజులు, నవాబులు ఎందుకు చస్తున్నారు? నీభార్య నీ తల్లికంటే! బొమ్మకంటె వైభవంగా చావాలని నీ కోరికా! అందుకునే ఒప్పుకోను" అన్నాడు తండ్రి.

బృందావన్ దుఃఖం కట్టలు తెగి ప్రవహిస్తోంది. మానవత్వం కోల్పోయిన తండ్రి దగ్గర జీవచ్ఛవంలా పడి వుండటం అతని కెంతమాత్రం ఇష్టంలేకపోయింది. తననిశ్చయాన్ని తండ్రికి చెప్పాడు. నేనీ ఇంటినుంచి వెళ్ళిపోతున్నాను."

తండ్రి వెంటనే అంగీకరించాడు. అయితే ఒక్క షరతుమాత్రం పెట్టాడు. తన ఆస్తిలో ఒక చిల్లిగవ్వ కూడా కొడుక్కి దక్కదని చెప్పాడు.

తండ్రి ఆస్తిలో చిల్లిగవ్వకాదు గదా యావత్తు ఆస్తినంతా ఇచ్చినా తనకక్కరలేదు పొమ్మన్నాడు బృందావన్.

తండ్రీ కొడుకుల మధ్యదీర్ఘకాల సంఘర్షణ తరువాత జరిగిన ఈ విప్లవాన్ని గురించి గ్రామస్థులు పలుపలు విధాల వ్యాఖ్యానించారు. అయితే ఒక్క విషయంలో మాత్రం వాళ్ళంతా ఏకీభవించారు. "రోజులు మారిపోయాయి. భార్యను గురించి తండ్రి కొడుకుల మధ్య కొట్లాటలు వచ్చే

రోజులొచ్చాయి" అన్నారు. అక్కడితో ఆగలేదు. "నీ భార్య చస్తే వెంటనే నువ్వు మరో పెళ్ళి చేసుకోవచ్చు. కాని నీ తండ్రి మరణిస్తే అతని స్థానంలో మరి నువ్వెవరినీ పొందలేవు" అన్నారు బృందావన్‌తో. ఈ వాదన అద్భుతంగా ఉందనడంలో సందేహంలేదు. కాని కర్మ సిద్ధాంతాన్ని పట్టుకొని వ్రేలాడే వాళ్ళకు సహజత్వంతో సంబంధము ఉండదు.

బృందావన్ వెళ్ళిపోవడం మొత్తంమీద తండ్రికి సంతోషాన్నే కలిగించింది అతను పోవటంవల్ల ఇంటిఖర్చు చాలావరకు తగ్గింది. అంతేగాక తండ్రికి ఇప్పుడుమనశ్శాంతి చిక్కింది. అదివరకల్లా తన కొడుకు విషంపెట్టి చంపుతాడో నని భయపడేవాడు. మరి ఇప్పుడు భయపడవలసిన అవసరం లేదు.

అయితే తండ్రికున్న దిగులల్లా ఒక్కటే. బృందావన్ తనతోపాటు తన నాలుగేళ్ళ కుమారుడు గోకుల్ చంద్రను కూడా తీసుకెళ్ళాడు! ఆకుర్రాణ్ణి పెంచడానికి పెద్దగా ఏమంత డబ్బు ఖర్చుపెట్టనవసరంలేదు. అంచేత మనవడి మీద మక్కువ పెంచుకున్నాడు బృందావన్ అతన్ని తీసుకు వెళ్ళిన తరువాత జగన్నాధ్‌కు కోపం, దుఃఖము కలిగేయి. అయితే దాన్ని ఒక విధంగా ఉపశమింప జేసుకున్నాడు. వాళ్ళిద్దరూ వెళ్ళిపోయిన తరువాత తనకు సంవత్సరానికెంత ఆదా అవుతుందో వడ్డీతో సహా లెక్కలు చూసుకొని సంతోషించాడు.

కాని గోకుల్ చంద్ర లేకుండా ఆఇంట్లో ఉండగలగ

డం అతనికి రాను రాను అసంభవమనిపించింది. తను పూజలో ఉన్నప్పుడు కొంటె చేష్టలు చెయ్యడానికి ఇప్పుడెవరూ లేరు, ముద్దుగా మాటలు చెప్పడానికి ఇప్పుడా ఇంట్లో ఎవరూ లేరు. నిస్సారమైన ఒంటరి జీవితం అతనిలో నిరుత్సాహాన్ని నింపింది. కుర్రాడు తలగడకు పెట్టిన రంధ్రాలు చూస్తుంటే జగన్నాథ్ హృదయం వ్రయ్యలవుతున్నట్లుగా ఉండేది. ఒకసారి తన పంచెను చించినందుకు కుర్రాణ్ణి చితకొట్టాడు. ఆ పంచెను చూడగానే జగన్నాథ్ కళ్ళవెంట బొటబొటా అశ్రుబిందువులు రాలాయి. ఒకవేళ గోకుల్ తిరిగివస్తే ఈ సారి సంవత్సరానికో మాటు పంచె చింపినా ఏమీ కొట్టనని ప్రతిజ్ఞ తీసుకున్నాడు.

కాని గోకుల్ తిరిగి రాలేదు. జగన్నాథ్ వృద్ధుడై పోతున్నాడు. అతని యిల్లు బోసిగా వుంది.

అతడు స్మశానం ఇంట్లో ఉండలేక పోతున్నాడు. మధ్యాహ్నంవేళ గ్రామ ప్రజలంతా విశ్రమిస్తూ ఉంటే, జగన్నాథ్ గ్రామమంతా కలయ తిరిగేవాడు. అతన్ని చూడగానే పిల్లలు దూరంగా పోయి "పిసినిగొట్టు" అని మారు పేరు పెట్టి పిలిచేవారు.

## 2

ఒకనాటి మధ్యాహ్నం జగన్నాథ్ మామిడి తోపు లోంచి వెడుతోంటే ఓపిల్లలతండా కనిపించింది. జగన్నాథ్ వారి దగ్గరకు వెళ్ళేసరికి పిల్లలంతా పారిపోయారు. కాని

ఓకుర్రాడు మాత్రం పారిపోకుండా అక్కడే నిల్చున్నాడు. జగన్నాథ్ ఆతని దగ్గరకు వెళ్ళాడు. కుర్రాడు మంచి పసిమి రంగులో నిగ్గుదేరి ఉన్నాడు. బుగ్గలు పాలుగారుతున్నై. జగన్నాథ్ అతనితల నిమిరాడు. వెంటనే అతనిమనసులో ఓ ఆలోచన మెదిలింది. ఆ కుర్రాణ్ని తనవెంట ఇంటికి రమ్మని అడిగాడు. వాళ్ళిద్దరి మధ్య జరిగిన సంభాషణ ఇది.

"అబ్బాయీ, నీ పేరేమి?"

"నితాయ్‌పాల్"

"మీ ఇల్లెక్కడ?"

"చెప్పను"

"మీ నాన్నెవరు!"

"చెప్పను"

"ఎందుకు చెప్పవు!"

"నేఇంటిదగ్గర్నుంచి పారిపోయొచ్చాను"

"అలా ఎందుకు చేశావ్!"

"మానాన్న నన్ను బడికి పంపడానికి ప్రయత్నించినందుకు."

జగన్నాథ్‌కు ఇప్పటికి విషయమంతా అర్థమైంది. "సరే! అయితే నాతోవచ్చి మా ఇంట్లో ఉంటావా?" అడిగాడు.

"ఓఁ ఉంటాను" అన్నాడు కుర్రాడు.

నితాయ్, జగన్నాథ్ ఇంట్లో ప్రవేశించాడు. అలిసిపోయిన బాటసారికి చెట్టునీడ కనిపించినట్టుగా ఉంది అతనికి.

తన మనమడు లేనిలోటును ఈ కుర్రాడిద్వారా తీర్చుకుంటున్నాడు జగన్నాథ్.

౨

అకస్మాత్తుగా నితాయ్‌పాల్ ఆ ఇంట్లో అంత ప్రముఖమైన స్థానాన్ని పొందగలగడం గ్రామస్థులకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ముసలివాని మరణం త్వరలోనే సంభవమని అందరికీ తెలుసు. అతని ఆస్థి యావత్తూ ఓ దిక్కు లేని అవరిచిత బాలునికి దక్కడం వారికి దుఃఖభాజకంగా ఉంది. కోపం పట్టలేక చివరికా కుర్రాణ్ణి కొట్టడానికి కూడా సమకట్టారు. కాని జగన్నాథ్ అతన్ని తనప్రాణంకంటే అధికంగా చూడ్డం చేత వారికా అవకాశం దొరకలేదు.

ఒకోసారి కుర్రాడు ఇంటికెళ్ళి పోతానని మొరాయించేవాడు. ముసలివాడు అతనికో ఎరచూపించేవాడు. "నీకు నా ఆస్థంతా ఇచ్చేస్తాను" అనేవాడు. వయస్సులో కుర్రాడైనా నితాయ్ ఆస్థియొక్క విలువను వెంటనే గ్రహించేవాడు.

ఆ కుర్రాడి తండ్రిని గురించి గ్రామస్థులంతా ఆరా తియ్యడం మొదలెట్టారు. కుర్రాడి కోసం తలిదండ్రులు ఎంత బెంగటిల్లి పోతున్నారో అని జాలి పడేవారు. వారి నంత బాధ పెడుతున్న కుర్రాడు నిజంగా మూర్ఖుడై ఉండాలి. ఇలా అనుకొని నితాయ్‌ని శాపనార్థాలతో సత్కరించేవారు.

ఓ రోజు ముసలివాడు తోటనుంచి ఇంటికొస్తుంటే దారిలో ఓ బాటసారి కనిపించాడు. దామోదర్‌పాల్ అనే

ఓ వ్యక్తి తన కుమారునికోసం అన్ని ఊళ్ళూ గాలిస్తున్నాడని ఆ ఊరుకూడా వస్తున్నాడని అతను చెప్పాడు. ఈ సంగతి తెలుసుకోగానే నితాయ్ తన రాబోయే ఆస్తిని వదిలి పెట్టి పారిపోవడానికి సిద్ధమయ్యాడు. జగన్నాథ్ అతనికి ధైర్యాన్ని పురికొల్పాడు. "ఎవ్వరికీ తెలియకుండా నిన్నోచోట దాస్తాను" అన్నాడు.

నితాయ్‌కి కొంత ఆందోళన తగ్గింది వెంటనే అడిగాడు: "ఎక్కడ దాస్తావు, చెప్పు"

"ఇప్పుడే చూపిస్తే గ్రామస్థులు చూస్తారు. అంచేత రాత్రికి చూపిస్తా!" అన్నాడు.

నితాయ్ సంతోషానికి మేరలేదు. తండ్రి తనకోసం ఊరంతా గాలిస్తాడు. కాని తను ఎక్కడాకనుపించడు. తండ్రి విసుగెత్తి వెళ్ళిపోతాడు. ఇకప్పుడు తను బయటకొచ్చి ఇంచక్కా ఆడుకోవచ్చు. నితాయ్ ఈవిధంగా ఆలోచించసాగాడు.

మధ్యాహ్నమయింది. జగన్నాథ్ నితాయ్‌ని ఇంట్లో పెట్టి తాళం వేశాడు. ఎక్కడికో వెళ్ళి మళ్ళీతిరిగివచ్చాడు వచ్చీరాగానే నితాయ్ అతన్ని ప్రశ్నలవర్షం కురిపించసాగాడు.

ఇంకా చీకటి పడకుండానే నితాయ్, "తాతా వెడదామా! అన్నాడు. ఇంకా చీకటి పడలేదు" చెప్పాడు జగన్నాథ్.

మరి కాసేపున్న తరువాత. "ఇప్పుడు చీకటి పడింది చూడు తాతా! మనం వెళ్దాంపద!" అన్నాడు నితాయ్.

ఊళ్ళోవాళ్ళు ఇంకా నిద్రపోలేదు” గొణిగాడ జగన్నాథ్.

నితాయ్ మరోక్షణమాగి, “వాళ్ళు నిద్రపోయారు. తాతా! ఇక మనం పోదాంపద!” అన్నాడు.

రాత్రి గడుస్తోంది. నితాయ్ కనురెప్పలు బరువెక్కాయి. నిద్రకు తాళలేకపోయాడు. అర్థరాత్రి అయిన తరువాత జగన్నాథ్ కుర్రాడి చెయ్యి పట్టుకొని మెల్లగా బయటకొచ్చాడు. నిద్రిస్తున్న గ్రామ వీధుల్లోంచి ఇద్దరూ నిశ్శబ్దంగా ఊరు బయటకొచ్చారు అంతటా నిశ్శబ్దంగా ఉంది. అప్పుడప్పుడు నక్కలు కూతలు మాత్రం వినుపిస్తున్నాయి. నితాయ్‌కి భయంవేసి జగన్నాథ్ చేతిని గట్టిగా పట్టుకున్నాడు.

పొలాలు దాటి వాళ్ళు చివరికోఅడవి చేరుకున్నారు. ఓ శిథిలమైన దేవాలయం దగ్గర ఆగిపోయారు. నితాయ్ ఆశ్చర్యంగా అడిగాడు “ఇదేనా నే ఉండేచోటు” అతడూహించుకున్న దానికి దీనికి ఎక్కడా సంబంధంలేదు. ఇంటి దగ్గరనుంచి పారిపోయి వచ్చింది లగాయితూ ఇటువంటి పాడుబడ్డ దేవాలయాలలో అతడనేక మార్లు తల దాచుకున్నాడు.

ఇద్దరూ గుడిలోపలకు వెళ్ళారు. అక్కడో మూల ఓ రాతి పలక ఉంది. జగన్నాథ్ దాన్ని తొలగించాడు. దానికింద ఓ భూగర్భగుహ ఉంది. అందులోంచి ఓ దీపం వెలుగుతూ కనిపించింది. నిచ్చెనసాయంతో ఇద్దరూకిందకిదిగారు. నితాయ్ చుట్టూ కలయజూశాడు. అతనికో మూల బిందెలు

కనిపించాయి. గదిమధ్యలో ఓ తివాసీ ఉంది. దానిముందు పుష్పాలు, గంధం, తిలకం మొదలైన పూజా సామాగ్రి ఉన్నాయి నితాయ్ బొందెల్లో ఏమున్నాయోనని చెయ్యి పెట్టి చూశాడు. ఆశ్చర్యం! వాటిల్లో రూపాయలున్నాయి.

నితాయ్ వైపు తిరిగి అన్నాడు జగన్నాథ్: "నా దగ్గరున్న డబ్బంతా ఇదే దీన్ని నీకివ్వాళ వప్పజెపుతాను"

నితాయ్ సంతోషంతో ఎగిరి గంతేశాడు "అంతా ఇచ్చేస్తావా! ఒక్క రూపాయికూడా తిరిగి తీసుకోవుకదూ !" అన్నాడు.

"ఒక వేళ తీసుకుంటే నా చెయ్యి పక్షవాతంతో పడిపోకుంది. అయితే ఒక్క షరతుంది. ఒకవేళ నా మనుమడుగాని, ముని మనుమడుగాని, మరింకెవరైనా అతని తాలూకు వారుగాని నీకు కనిపిస్తే, ఇప్పుడు నీకిస్తున్న డబ్బంతా ఒక్క రూపాయికూడా బీకుపోకుండా ఇచ్చెయ్యాలి! తెలిసిందా!

"అలాగే!" అన్నాడు నితాయ్ ఉత్సాహంతో!

"అయితే ఈ ఆసనంమీద కూర్చో" అన్నాడు జగన్నాథ్.

"ఎందుకు?"

"నువిప్పుడు పూజ చెయ్యాలి"

"పూజెందుకు?" కుర్రాడు వెనక్కి తగ్గాడు.

"ఇది ఆచారం"

నితాయ్ ఆసనంమీద కూర్చున్నాడు జగన్నాథ్ అతని నుదుటిమీద గంధపు పూతలు పూశాడు. నొసటతిలకం పెట్టాడు. మెడలో పూలదండ వేశాడు. ఇక మంత్రాలు

చదవ నారంభించాడు.

లక్క విగ్రహంలా కదలకుండా మంత్రాలు వింటూ కూచోవడం నితాయ్‌కేమీ నచ్చలేదు. తాతా!" అని గొణిగాడు.

జగన్నాథ్ ఏమీ మాట్లాడలేదు. మంత్రాలు చదువు పోతున్నాడు.

చివరికి అక్కణ్ణుంచి లేచివెళ్ళి అతి కష్టంమీద ఓ బిందెను మోసుకొచ్చాడు. దాన్ని నితాయ్ ముందుంచి ప్రమాణం చేయించాడు.

"ఈ ధనాన్ని బృందావన్ కుందూ కొడుకు, జగన్నాధ్ కుందూ మనుమడు అయిన గోకుల్‌చంద్ర కుందూకు గాని, అతని వారసులకుగాని అందించగల వాడనని ప్రమాణం చేస్తున్నాను."

ఈ ప్రమాణాన్ని నితాయ్‌చేత అనేకమార్లు చేయించాడు జగన్నాథ్. పూజా కార్యక్రమం పూర్తియింది. గుహలోకి గాలివచ్చే మార్గంలేదు. దీపం పొగతో గుహంతా నిండిపోయింది. నితాయ్‌కి భయం వేసింది.

దీపం వెలుతురు క్రమంగా సన్నగిలుతోంది. మరి కాసేపటికి దీపం ఆరిపోయింది. గుహంతా చీకటిమయమయింది. ఆ చీకట్లో ఎవరో నిట్టూర్చుతున్న శబ్దం వినిపించింది. "తాతా! ఎక్కడికి వెడుతున్నావ్!" అడిగాడు నితాయ్ భయంతో.

"నే వెళుతున్నాను. నువ్విక్కడే ఉండు నిన్నెవరూ కనుక్కోలేరు. నా మనుమడు గోకుల్‌చంద్ర పేరు గుర్తుం

చుకో" అన్నాడు జగన్నాధ్.

అతడు నిచ్చెన తీసివేశాడు.

నితాయ్ బిక్కుబిక్కుమంటూ, "నే నిప్పుడు మా నాన్న దగ్గరకు వెడతా" అని రోధించాడు.

జగన్నాధ్ రాతి పలకను తిరిగి మామూలుచోట ఉంచేశాడు. కిందకు వంగి, రాతిమీద చెవిపెట్టి విన్నాడు. నితాయ్ మాటలు వినిపించాయి. "నాన్నా..." తరువాత మళ్ళీ శబ్దం వినిపించలేదు.

ఆ విధంగా కుర్రాడికి డబ్బు వప్పగించి జగన్నాధ్ ఆరాతి పలకను మట్టిలో కప్పేశాడు. దానిమీద ఇటుకరాళ్లు పెట్టాడు. ఆపైన గడ్డి గాదం విరజిమ్మాడు. చాలా రాత్రి గడిచింది. అతడాస్థలం వదిలిపెట్టి వెళ్ళలేక పోతున్నాడు. మళ్ళీ నేలకువంగి, చెవిబెట్టి వినడానికి ప్రయత్నించాడు. ఎక్కడో అట్టడుగున పాతాళంనుంచి రోదన శబ్దం వినిపించింది. ఆశబ్దానికి నిద్రపోతున్న వాళ్ళంతాలేచి అక్కడకు వస్తారేమోనని అతనికి భయం పట్టుకుంది. మరోకమారు చెవి పెట్టి విన్నాడు. "నాన్నా!" శబ్దం వినిపించింది.

జగన్నాధ్‌కు ఏంచెయ్యడానికి తోచలేదు, గట్టిగా నేలనుకొట్టి "ఎవరైనా వింటారు మాట్లాడకు" అని అరచాడు.

తూర్పు దిక్కున కెంపు కాంతులిన్ని వెదజల్లుతూ సూర్యు డుదయించాడు. ఇకప్పుడు జగన్నాధ్ ఆ దేవాలయాన్ని వదలిపెట్టి, పొలాల్లోపడి నడిచిపోతున్నాడు.

అక్కడెవరో అతన్ని నాన్నా అని పిలిచారు. ఆళ్ళ

ర్యంతో వెనక్కి చూచాడు. అతనికి తన కుమారుడు కనిపించాడు.

"నాన్నా నా కొడుకు నీ ఇంట్లో దాక్కున్నాడని తెలిసింది. వాణ్ని నేను తీసుకెళ్ళాలి" అన్నాడు బృందావన్.

జగన్నాథ్ ఈ మాటలు వినగానే స్థాణువైపోయాడు. కళ్ళప్పగించి చూస్తూ "నీ కొడుకా!" అన్నాడు.

"అవును నా కొడుకు గోకుల్. వాడిప్పుడు నిత్యాయ్ పాల్. నా పేరు దామోదరపాల్. నీ పేరు దేశమంతా ఘనంగా పాకిపోతోంది. నీ పేరు చెబితే మాకు నుంచి నీళ్ళు కూడా పుట్టలేదు. అంచేత విధిలేక పేర్లు మార్చుకున్నాం" అన్నాడు బృందావన్.

జగన్నాథ్ నెమ్మదిగా తన రెండు చేతులను పైకెత్తి ధ్యానంలో పడ్డాడు. అతని చేతులు వణికాయి. మరి కాసేపటికి స్పృహ తప్పి బిళ్ళబీటుగా కిందపడ్డాడు.

అతనికి స్పృహ రాగా నేలేచి తన కొడుకును తీసుకొని దేవాలయం దగ్గరకు వెళ్ళాము.

వాళ్ళు లోపలకు వెళ్ళిన తరువాత నీకేమైనా రోధిస్తున్న శబ్దం వినిపిస్తోందా? అన్నాడు తండ్రి.

"నాకేం వినిపించడం లేదు" అన్నాడు బృందావన్.

"జాగ్రత్తగా విను. "నాన్నా" అని ఎవరైనా పిలుస్తున్న శబ్దం వినిపిస్తుందా?"

"లేదు"

# 4

ఆ నాటినుంచి జగన్నాథ్ కనిపించిన వాళ్ళనల్లా అడుగుతున్నాడు "నీకేమైనా రోధన ధ్వని వినిపిస్తోందా?" అతన్ని చూడగానే అందరూ పిచ్చివాడని గేలి చేసేవారు.

నాలుగు సంవత్సరాల తరువాత జగన్నాథ్ మరణ శయ్యమీద ఉన్నాడు. క్రమంగా అతనికళ్ళకి ప్రపంచం కన బడకుండాపోయి, శ్వాస ఆగిపోబోతున్న సమయంలో మంచంమీద లేచి కూర్చున్నాడు. తన రెండు చేతులతోను భగవంతుణ్ని మొక్కుతూ సణిగాడు. "నితాయ్ నిచ్చెన ఎవరు తొలగించారు?"

గాలి, వెలుతురు లేని ఆపాతాళకూపంలోంచిబయట పడ్డానికి ఆఖరికి నిచ్చెనకూడా లేకపోవడంచేత బెంబేలుపడి, బేజారెత్తి, రోధనచేస్తూ చివరకు ప్రాణాలు విడిచాడు నితాయ్.

ఆ దృశ్యాన్ని తలుచుకోగానే జగన్నాథ్ ఒళ్ళంతా కంపించింది. వెంటనే మంచంమీద వరిపోయాడు అంతే, మళ్ళీ లేవలేదు.

# సంపాదకుడు

నాభార్య జీవించి వున్నంతకాలం ప్రభను గురించి అసలు నేను పట్టించుకోనేలేదు. నిజంచెప్పాలంటే నేను ప్రభ మీద కంటే ఆమె తల్లిమీదనే ఎక్కువ మక్కువ చూపించే వాణ్ణి.

ప్రభ వచ్చీరాని మాటలతో ముద్దుగా మాట్లాడు తోంటే అప్పుడప్పుడు వింటూ కూర్చునేవాణ్ణి. వాళ్ళమ్మతో దోబూచులాడుకొంటున్నప్పుడు పాప ముఖంలో మెరిసే నవ్వును తిలకిస్తుండేవాడిని. నాకు ముద్దొచ్చినప్పుడు పాపను ఎత్తుకొని తనివితీరా ముద్దాడేవాడిని. కాని నాకు విసుగు పుట్టగానే పాపను వాళ్ళమ్మ కందించేవాడిని. బోనులోంచి బయటబడ్డ సింహంలా పాప వాళ్ళమ్మ ఒళ్ళోకి దూకేది.

కాని నా భార్య అకాలమరణంవల్ల పాప, వాళ్ళమ్మ చేతుల్లోంచి నా చేతుల్లోకివచ్చింది. అప్పుడు పాపను నా హృదయానికి దగ్గరగా హత్తుకున్నాను.

తల్లిలేని పిల్లను అతిజాగ్రత్తగా పెంచి పెద్ద చెయ్య వలసిన బాధ్యత నామీద వుంది. కాని నా కుమార్తె, భార్య లేని తండ్రిని సంరక్షించవలసిన బాధ్యత తనదే అన్నట్టు మెలగసాగింది. ఏదిఏమైనా ఈవిషయం మాత్రం యదార్థం. ఆరు సంవత్సరాల వయస్సునుంచి ప్రభ ఇంటి యజమాను రాలైంది. ఈ చిన్నారి బాలిక తన తండ్రి సంరక్షకురాలుగా వుండడం ఎవరైనా వింటే నవ్విపోతారుకదూ! కాని ఇది

మాత్రం నిజం.

నేను దాదాపుగా ఆమె చేతుల్లోకి జారిగిపోయాను. నేను అసమర్థుణ్ణి, నిస్సహాయుణ్ణి అవుతున్నకొద్దీ ఆమె మరింత సంతోషించేది. నేను వంకిమీదనుంచి నా బట్టలు తీసుకుంటున్నా, బూట్లు తొడుక్కుంటున్నా ఆమె హక్కును నేను లాక్కుంటున్నట్టు ప్రథ బాధపడేది. ఆమె అంతకు ముందెప్పుడూ ఆట బొమ్మలనుకూడా అంత శ్రద్ధగా పోషించలేదు కాని ఇప్పుడు తన తండ్రికి భోజనం దగ్గరనుంచి రాత్రి పడుకోబోయేవరకు అన్ని పనులూ తనే నిర్వహిస్తుంది. ఆమెకు పాఠాలు చెప్పేటప్పుడుమాత్రం తండ్రిగా నా అధికారాన్ని వినియోగించుకునేవాడిని.

రోజులు గడుస్తున్నకొద్దీ నన్నొకవిషయం వేధించుకుతింటుండేవి. నా కుమార్తెకొక మంచి సంబంధం చూడాలంటే పెద్ద కట్నం ఇచ్చుకోగలిగిన స్థితిలో వుండాలి. కాని అంత డబ్బు నేనెక్కడనుంచి తేగలను! ఆమెకు నేను చక్కగా చదువు చెప్పిస్తున్నాను ఆమె ఒక మూర్ఖునిచేతిలో పడితే యేం జరుగుతుంది?

ఎలాగైనా డబ్బు సంపాదించాలని నిశ్చయించుకున్నాను. ప్రభుత్వోద్యోగం సంపాదించడానికి నాకు వయస్సు మీరిపోయింది. పోనీ ప్రయివేటు ఫరంలో ఎక్కడైనా ఉద్యోగం చూసుకుందామా అంటే నాకు తెలిసినవారూ లేరు. ఆలోచించి ఆలోచించి చివరకు పుస్తకాలు రాయడానికి నిశ్చయించుకున్నాను.

వెదురుగొట్టానికి రంధ్రాలు పెడితే అందులో నూన

కాని, నీళ్ళుగాని నిలువ వుండవు; కారిపోతవి కాని దానిని పట్టుకొని వ్రాదితే ఏమీ ఖర్చులేకుండా సంగీతం వినిపిస్తుంది. ఇతర రాగాలలో పనికిరాని మనిషి కనీసం సాహిత్యంలో నైనా తన కృషిని కనపర్చాలి. ఎందుకూ కొరగాని మనిషి కనీసం వినోదాన్నయినా అందించాలి. ఈ ఆలోచనలతో ప్రేరేపితుణ్ణయి నేనొక ప్రహసనం (హాస్యనాటకం) రాశాను. దాన్ని స్టేజిమీద ప్రదర్శించారు. ప్రజలంతా దాన్ని చూసి మెచ్చుకున్నారు.

ఒకసారి కీర్తి కండూతి చవిచూశాక ఆ రంగంలో ఇంకా ముందుకు వెళ్ళకుండా వుండలేకపోయాను. నెలల తరబడి స్థిరచిత్తంతో నేను నాటకాలు రాయ నారంభించాను.

ప్రభ చిరునవ్వు నవ్వుకుంటూ నా దగ్గరకు వచ్చి గుర్తు చేసేది; "నాన్నా, స్నానంచేసే వేళయింది, లే!"

"ఇప్పుడుకాదు, వెళ్ళు. నేనిప్పుడు పని తొందరలో వున్నది కనపట్టంలా! నన్ను విసిగించకు అని గదురుకునే వాణ్ణి.

వెలుగుతున్న దీపం ఒక్కసారిఆరిపోతే ఎంతచీకటిగా ఉంటుందో అంత చీకటి ఆమె ముఖంలో పెనవేసుకునేది, నాకు తెలియకుండానే నెమ్మదిగా అక్కడనుంచి వెళ్ళి పోయేది.

నేను దాసీ పనివాళ్ళను తరచు తరిమివేసేవాణ్ణి. సేవకుల్ని చితకొట్టేవాణ్ణి. అడుక్కునేవాడు ఇంటికొచ్చి పాటలు పాడుతుంటే నేను కర్రపుచ్చుకొని వాళ్ళ వెంటపడే వాణ్ణి. నాగది వీధిపక్కనే ఉండడంచేత దారేపోయేవాళ్లు

నా దగ్గరకొచ్చి దారి చెప్పమనేవాళ్లు. నేను వాళ్ళను పోయి పేట్లో కలవమనేవాణ్ని. నేనొక అపరహాస్య నాటకం రాయడంలో నిమగ్నుడనై ఉన్నాననే విషయం ఒకళ్ళు కూడా గుర్తించరు కదా!

నేను కీర్తి సంపాదించినంతగా డబ్బు సంపాదించలేక పోయాను. కాని అందుకు నేనేమీ బాధ పడేవాణ్ణి కాదు.

తరువాత నాకొక అపూర్వావకాశం లభించింది. ఓహిర్‌గ్రాం అనే ఊళ్ళో ఓ ధనికుడు ఓ పత్రికను నడపటం ప్రారంభించాడు. ఆ పత్రికకు నన్ను సంపాదకుడిగా ఉండమని వేడుకున్నాడు. అందుకు నే నంగీకరించాను.

మొదట్లో బ్రహ్మాండమైన కృషిచేసి మంచి మంచి రచనలతో పత్రికను ఉత్తమంగా తీసుకొచ్చాను. నేను బజార్లో పోతున్నప్పుడల్లా ప్రజలు నన్ను వేలెత్తి చూపించి, నా రచనలను గురించి చెప్పుకునేవారు.

జహిర్‌గ్రాం ఊరుపక్కనే ఓహిర్‌గ్రాం ఉంది. ఆ వూళ్లో ఓ ధనికుడున్నాడు. జహిర్‌గ్రాం ఓహిర్‌గ్రామంలోని ఈ ధనికులిద్దరికీ మొదటినుంచీ బద్ధవైరం. వాళ్ళిద్దరి మధ్య ఒకప్పుడు కొట్లాటలుకూడా జరిగాయి. నేనిప్పుడు అందులో ఒకరిపక్షాన చేరి పోరాడవలసి వచ్చింది. నేను కేవలం హోదాకోసం అక్కడ అంటిపెట్టుకు ఉన్నానని అందరూ అనుకోసాగారు.

నా రాతలు అహిర్‌గ్రాం మీద చాల తీవ్రంగా వుండేవి. వారిపుట్టుపూర్వోత్తరాలన్నీ ఏకరువు పెట్టిదూడేకి నట్టు వ కేసేవాడిని.

అప్పటివరకు నా రాతలు చూచుకొని నాలో నేను నవ్వుకునేవాడిని. నేనేదో ఘనకార్యం సాధించినవాడిలా నా ముఖం మందహాసంతో తొణికిసలాడుతుండేది. జహిర్ గ్రామాన్ని గురించి నేను చలోక్తిగా మాట్లాడుతుంటే ఓహి గ్రామంవాళ్లు పగలబడి నవ్వేవాళ్ళు. నేనప్పుడు నిజంగా గర్వపడేవాణ్ని.

చివరకు జహిర్ గ్రామంలో కూడా ఒకపత్రిక వెలిసింది. అందులో ప్రకటించేదంతా చెత్త. సాహిత్య విలువ ఏమీ ఉండేది కాదు కేవలం ఓహిర్ గ్రామం గురించిన బండ బూతులతో అది నిండి ఉండేది.

కాని నేను మాత్రం పత్రికా సాంప్రదాయ మర్యాదలను విస్మరించేవాణ్ని కాదు ఎంతో హుందాగా గంభీరంగా మృదువైన శైలిలో విమర్శలు రాసేవాణ్ని. ఈ పత్రికాయుద్ధంలో గెలుపు నాదేనని, ప్రజలు చెప్పుకునేవారు. కాని ఉదాత్త భావాలతో, ఉన్నత శైలిలో రాయడం నా పొరపాటని తరువాత గ్రహించాను. నా ప్రత్యర్థికి ఇవేమీ అక్కర్లేదు. కేవలం దుమ్మెత్తి పొయ్యడమే ఆపత్రికప్రధాన లక్ష్యం.

నా యజమానికి నామీద కోపం వస్తోంది. నారచనలలో ఉపయోగిస్తున్న మర్యాదకరమైన భాష ఆయనకు పేలవంగా తోచింది. బజార్లో వెడుతుంటే ఇప్పుడు ప్రజలు నా గురించేమీ చెప్పుకోవడంలేదు. నా శ్రేయోభిలాషులు నా నాటకాలన్నీ మర్చిపోయారు. నేనిప్పుడు పూర్తిగా కాలిన అగ్గిపుల్లలా ఉన్నాను.

నా మనస్సు వ్యథతో సతమత మైపోతోంది. నా మనస్సు నెంత కూడదీసుకున్నా ఒక్క వాక్యంకూడా సరిగా రాయలేకపోతున్నాను. నా జీవితం మాధుర్యాన్ని కోల్పోయి నట్టుగా వుంది.

ప్రభ ఇప్పుడు నన్ను చూస్తే భయపడుతోంది నేను పిలుస్తే నే కాని లేకపోతే నాదగ్గరకు రావడానికి సంకోచిస్తోంది. ఎల్లప్పుడూ హాస్యరచనలు చేసే వంకిపోయిన తండ్రికంటే ప్రాణంలేని ఆటబొమ్మ చాలా ఉత్తమమైనదని బహుశా ఆమె తలంచి వుండవచ్చు.

ఓ రోజున అహిర్ గ్రాం పత్రిక నా యజమానినివదిలి పెట్టి నామీద దండయాత్ర సాగించింది. నామీద చాల అసభ్యకరమైన రాతలు అందులో వున్నాయి నా మిత్రులు చాలమంది నాదగ్గరకువచ్చి వాటి ప్రస్తావన తీసుకొచ్చారు. దానికి ఘాటుగా సమాధానం రాయమని సలహా ఇచ్చారు.

మా ఇంటిముందు ఓ చిన్నతోట వుంది. సాయంత్రం వేళ ఏంకాంత ప్రశాంతుడనై తోటలో అటూ ఇటూ పచార్లు చేస్తున్నాను. పక్షులు అప్పుడే గూళ్ళకు తిరిగి వస్తున్నాయి. ప్రశాంతమైన ఆ సాయంత్రం ఆహ్లాదకరంగావుంది పక్షుల్లో రచయితలుకాని, కవులుకాని లేరు. విమర్శలు వాదోప వాదాలు అసలేరావు. నిజంగా ఆ జీవితం ఎంత మధుర మైనది!

నేను రాయవలసిన సమాధానాన్ని గురించి ఆలోచిస్తు న్నాను మర్యాదగా రాస్తే వచ్చిన నష్టమేమిటంటే అది అన్ని రకాల ప్రజలకు అర్థంకాదు. అంచేత నేనుకూడా, నా

మీాద దాడిచేసిన విధంగానే సమాధానం రాయదల్చు కున్నాను. నా ఓటమిని అంగీకరించటానికి నే నెంతమాత్రము సిద్ధంగా లేను.

నే నీ నిర్ణయానికి రాగా నే ఒక చిరపరిచిత కంఠం సంధ్యా చీకటిలోంచి వినిపించింది. మరుక్షణంలో నా అరచేతిని ఒక మృదుల హస్తం స్పృశించింది. ఆ కంఠము, స్పర్శ నాకు చిరపరిచితమైనవ్పటికీ నామనస్సు సరిగా లేకపోవడం చేత గుర్తించలేకపోయాను.

అవి నన్ను విడిచివెళ్ళగానే, కంఠం నా చెవుల్లో మారు మ్రోగింది : హస్త స్పర్శ గుర్తుకొచ్చింది. నా కుమార్తె నెమ్మదిగా మరొకసారి నాదగ్గరకువచ్చి మెల్లగా, "నాన్నా!" అన్నది. సమాధానంరాకపోయేసరికి నా కుడి చేయి మెల్లగా పైకెత్తి తననుదుటికి నెమ్మదిగా కొట్టుకున్నది. ఆ తరువాత మారుమాటాడకుండా వెనుదిరిగి ఇంట్లోకి వెళ్ళి పోయింది.

చాలా కాలం నుండి ప్రభ నన్ను అలా పిలవలేదు, అంత స్వతంత్రంగా నా దగ్గరకొచ్చి నన్ను స్పృశించలేదు. అంచేత ఈ వేళ ఆమె ప్రేమ స్పర్శ నాహృదయం తహ తహ లాడింది

మరి కొంచెం సేపటి తరువాత ఇంట్లోకి వెళ్ళాను. ప్రభ మంచంమీాద పడుకొని ఉండటం చూశాను. ఆమె కన్నులు అరమూతలు పడి ఉన్నాయి ఏదో బాధ పడు తున్నట్లుగా ఉంది సాయంత్రంవేళ రాలిపోయిన పుష్పంలా ఆమె మంచంమీాద పడుంది.

ఆమె నుదిటమీద చెయ్యిపెట్టి చూశాను. ఆమెకు జ్వరం వచ్చింది. నాడి వేగంగా కొట్టుకొంటోంది.

నేను పత్రికకు ఘాటుగా సమాధానం రాసే విషయాన్ని గురించి ఆలోచిస్తుంటగా, జ్వర చిహ్నాలు గమనించిన నా కుమార్తె తండ్రి ప్రేమను, మార్గాన్ని కోని పోవడానికి దప్పికగొన్న హృదయంతో నా దగ్గరకు వచ్చిందని అప్పుడు తెలుసుకోగలిగాను.

ఆమె ప్రక్కనే కూర్చున్నాను. నా కుమార్తె మాట్లాడకుండా నా చేతిని తన వెచ్చటి అరచేతుల్లోకి తీసుకొని ప్రశాంతంగా పడుకుంది.

ఇంట్లో ఉన్న జహీర్‌గ్రాం, అహీర్‌గ్రాం పత్రికలన్నీ తీసి దహనం చేశాను నా మీద విమర్శకు నేనేమీ సమాధానం రాయలేదు. నా ఓటమిని అంగీకరించినప్పటి ఆ సంతోషాన్ని నా జీవితంలో ఎప్పుడూ పొందలేదు.

ఆమె తల్లి చనిపోగానే నా కుమార్తెను ఎత్తుకున్నాను మరిప్పుడు ఆమెను మరొకసారి నా హృదయానికి హత్తుకున్నాను.

*　　　*　　　*

# బహిష్కరణ

అది నిండు పూర్ణిమనాటి రాత్రి. చల్లగా పిల్లవాయు వులు వీస్తున్నాయి. ముఖర్జీగారి ఇంటిపక్క మామిడిచెట్టు మీద కూర్చుని కోయిల మధురంగా గానం చేస్తున్నది. ఆఇంట్లోని ఓగదిలో హేమంత తన భార్య వక్కన కూర్చుని ఆమె జడలోని మల్లెపూల వాసనను ఆఘ్రాణిస్తున్నాడు. కుసుం కదలకుండా కూర్చుని కిటికీలోంచి వెన్నెట్లోకి తదేకంగా చూస్తున్నది. ఆమెపక్కన భర్త కూచునట్లు ఆమెకు స్పృహే లేదు.

మరి కాసేపటికి హేమంత తన భార్య చేతులను పట్టుకొని మెల్లగా అన్నాడు: "ఎక్కడున్నావు, కుసుం! ఆ ఊహాలోకంలోంచి విడిపడి వడివడిగా నా చెంతకు రా! నా నా హృదయానికి చేరువుగా రా! ఈరాత్రి ఎంత మధురంగా ఉందో చూడు!"

కుసుం తన దృష్టిని ఆకాశంనుంచి మరల్చింది. భర్త వైపుకు తిరిగింది. "ఈరాత్రిని, చంద్రుణ్ని వెయ్యి ప్రక్కలుగా చెయ్యగలిగిన మంత్రం ఒకటి నాకు తెలుసు" అన్నది మెల్లగా.

"అలాగా! అయితే దయచేసి దాన్ని మాత్రం ప్రయోగించకు. ఇంకా ఏదైనా మంత్రం వారానికి నాలుగు శని రాలు, రాత్రుళ్ళను ఆమర్నాటి సాయంత్రంవరకూ పొడి

గించ గలిగినది గనుక ఉన్నాయితే చెప్పు!" అన్నాడు హేమంత.

ఇలా అని భార్యను దగ్గరగా లాక్కోవడానికి ప్రయత్నించాడు. కుసుమ్ అతనికి కౌగిట్లోంచి విడివడి అన్నది: "నా మరణశయ్యమీద మీకొక సంగతి చెబుతానని వాగ్దానం చేసిన విషయం గుర్తుందా! చిరకాలం నుంచి చెప్పాలనుకుంటున్న ఆ విషయాన్ని ఇవ్వాళ వెళ్ళగక్కుతాను. మీరా రెటువంటి శిక్ష విధించినా అనుభవించటానికి సిద్ధంగా ఉన్నాను.

హేమంత ఏదో మాట్లాడబోతుండగా అంతలో జోళ్ళ చప్పుడు వేగంగా మోగుతూ అటువైపు వస్తున్న శబ్దం వినిపించింది. అతని తండ్రి హరిహర ముఖర్జీ పాదరక్షలవి. ఆశబ్దం వినగానే హేమంత ముఖంలో చిరునవ్వు రేఖలు మటుమాయమయ్యాయి.

తలుపు వెనుక నిలబడి హరిహర గర్జించాడు: "హేమంతా! నీ భార్యను వెంటనే ఇట్లోంచి గెంటెయ్యి."

హేమంత భార్య ముఖంలోకి చూశాడు. ఆమె కళ్ళలో ఏమీ మార్పు కనిపించలేదు. ఆమె ముఖాన్ని చేతుల్లో కప్పుకొని అక్కడికక్కడే అప్పటికప్పుడు తను కరిగి నీరైపోతే బాగుండునని కోరుకుంది.

కోయిలగానం ఆ గదిలో ప్రతిధ్వనిస్తుంది. కాని దాన్నెవరూ వినడంలేదు. వెన్నెలరేయి హాయిని నింపుతోంది. కాని ఆ గదిలో ఉన్నవారికి ఇప్పుడా సంగతే పట్టలేదు.

# 2

హేమంతగదిలోకి తిరిగివచ్చి, "విషయం నిజమేనా!" అని అడిగాడు.

"అవును" చెప్పింది కుసుం.

"మరి ఆ విషయం నాకు ముందెందుకు చెప్పలేదు!"

"చాలాసార్లు చెప్పడానికి ప్రయత్నించాను. కాని చెప్పలేక పోయాను. నేను దుర్మార్గురాల్ని."

"అసలు విషయమంతా ఇప్పుడు చెప్పు."

కుసుం నిశ్చలంగా కూర్చుని తొణక్కుండా తన కథంతా చెప్పింది. ఆమె చెప్పింది పూర్తిగా విని హేమంత అక్కణ్నుంచి బయటకెళ్ళాడు.

తన భర్త ఇక ఎప్పటికీ తిరిగి రాడనుకుంది కుసుం. అది ఆమెకు వింతగా తోచలేదు. నిత్య జీవితంలో జరిగే సహజ సంఘటనలా చలించలేదు. ఈ ప్రపంచము ప్రేమ ఆమెముందు నిర్వికారంగా గోచరించాయి. ఆమె భర్త తన మీద చూపించిన ఆదరణ ప్రేమ గతించిన వాటి జ్ఞాపకాల జాడలు ఆమెను వెన్నాడుతున్నాయి. పదునైన కత్తితో ఎవరో తన హృదయాన్ని కోత పెడుతున్నట్లు బాధ పడసాగింది. అంతకు ముందే హేమంత ఆమెతో అన్నాడు. "ఎంతటి మధురమైన రాత్రి!" అదే రాత్రి ఇంకాగడుస్తోంది అదే కోకిల ఇంకా గానం చేస్తోంది. అవే పిల్లవాయువులు ఇంకా ఆహ్లాదకరంగా వీస్తున్నాయి. అదే చంద్రకాంతి తెరచిన కిటికీలోంచి గదిలోకి తొంగి చూస్తోంది.

ఆ రాత్రంతా నిద్రపోకుండా గడిపి, ఆ మర్నాడుద ఉదయం హేమంత పేరీశంకర్ ఘోసాల్ ఇంటికి వెళ్ళాడు.

"విశేషా లేమి టబ్బాయీ!" అన్నాడు పేరీశంకర్.

హేమంత కోపంతో, వణుకుతున్న కంఠంతో బిగ్గరగా అరిచాడు. "మా కులాన్ని మంట గలిపావు. మమ్మల్ని నాశనం చేశావు. దానికి నిన్ను శిక్షించాలి. అతడంతకంటే మరి మాట్లాడలేకపోయాడు.

"మీరు నన్ను కులంలోంచి వెలేశారు. మీరుమాత్రం వదిలిపెట్టారా!" అన్నాడు పేరీశంకర్ తాపీగా.

తన బ్రాహ్మణకోపం పేరీశంకర్‌ని వెంటనే బూడిద చేస్తుందనుకున్నాడు హేమంత. కాని అతనికోపం అతనిలోనే అణగారిపోయింది. పేరీశంకర్ అతనిముందు నిశ్చలంగా, గాంభీర్యంగా కూర్చున్నాడు.

"నీకెప్పుడైనా నేను అపకారం చేశానా? అడిగాడు హేమంత వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ.

"నిన్నొక ప్రశ్న అడుగుతాను. దానికి జవాబు చెప్పు నా కుమార్తె, నా ఏకైక కుమార్తె - నీ తండ్రికి ఏం అపకారం చేసింది! అప్పుడు నువ్వు కుర్రాడివి. బహుశా నువ్వు విని ఉండవు. ఇప్పుడు చెబుతా విను. జాగ్రత్తగా విను. రెచ్చిపోకు" అన్నాడు పేరీశంకర్.

"మా అల్లుడు నవకాంత మా అమ్మాయి నగలు తీసుకొని ఇంగ్లండు పారిపోయినప్పటికి నువ్వు బాగా కుర్రాడివి. అయిదు సంవత్సరాల తరువాత అతడు బారిష్టరుగా తిరిగి వచ్చినప్పుడు గ్రామంలో జరిగిన గడబిడ నీకు తెలిసేఉంటుం

దను కుంటాను. లేక నువ్వు కలకత్తాలో చదువుకొంటుండ డంచేత ఆవిషయం తెలియకపోవచ్చు. మీనాన్న మనకులా నికి పెద్దకావడంచేత, నా కుమార్తెను తన భర్త దగ్గరకు పంపిస్తే నన్ను కులంనుంచి వెలేస్తానన్నాడు. అప్పుడు నేను మీనాన్న కాళ్ళమీదపడి వేడుకున్నాను "అన్నయ్యా! ఈ సారికి నన్ను రక్షించు. అల్లుడుచేత ఆవుపేడతినిపించి ప్రాయ శ్చిత్తం చేయిస్తాను. అతణ్ణి తిరిగి కులంలోకి తీసుకో" అని వేడుకున్నాను, కాని మీనాన్న రాతిగుండె కరగలేదు. మరి నా మట్టుకు నేను నాఏకైక కుమార్తెను విడిచిపెట్టలేను. అంచేత నా స్వగ్రామానికి, బంధువులకు ఓ సలాంపెట్టి కల కత్తా చేరుకున్నాను. అక్కడకూడ కష్టాలు నన్ను తరుము కొచ్చాయి. నామేనల్లుడి వివాహానికి ఏర్పాట్లన్నీ పూర్తి చేస్తే, మీనాన్న పెళ్ళికూతురు తరఫు వారికి పురెక్కించి ఆ సంబంధం కాస్తా చెడగొట్టాడు. అప్పుడు నేనో ప్రతిజ్ఞతీసు కొన్నాను. నా నరాల్లో ఒక్కబొట్టు బ్రాహ్మణ రక్తం ప్రవ హిస్తున్నా దానికి ప్రతీకారం చేసితీరుతానని శపథం తీసు కొన్నాను. ఇప్పుడు నీకు విషయం కొంతవరకు అర్థమైందను కుంటాను ఏం! మరి కాసేపాగితే పూర్తికథంతా విందువు గాని! అది బలే రసవత్తరంగా ఉంటుంది."

"నువ్వుకాలేజీలో చదువుతున్నప్పుడు మీగదిపక్కన విశ్వనాథ్ చటర్జీ ఇల్లుండేది. పాపం, అతడిప్పుడు మరణిం చాడు. అతని ఇంట్లోకుసుం అనే ఓ బాల వితంతువు ఉం డేది. ఆమె కాయస్థుల పిల్ల. తలిదండ్రులులేరు. ఆమె చాల అందంగా ఉండేది. కాలేజీ విద్యార్థుల దృష్టిలో పడకుండా

ఆమెను ఉంచాలని ముసలి బ్రాహ్మణుడు అనుకునేవాడు. కాని యువ్వనం వచ్చినవాళ్లు ముసలివాళ్ళ కళ్ళల్లో దుమ్ము కొట్టడం ఏమంత పెద్ద కష్టమైన పనికాదు. ఆమె తరచుగా బట్టలు ఆరేయడానికి డాబామీదికి వెళ్లేది. మరి నువ్వుకూడా మీ డాబామీది కెక్కి అక్కడే చదువుకునేవాడివి అనుకుంటాను. అక్కడ మీ ఇద్దరూ మాట్లాడుకునేవారో లేదో నాకు తెలియదు గాని ఆమె ప్రవర్తనను బట్టి ముసలివాడు కొంచెం అనుమాన పడ్డాడు. ఆమె ఇంటి పనులు సరిగా చేసేదికాదు. మతిమరుపు ఎక్కువైంది. ఎప్పుడూ పూజా పునస్కారాలు చేస్తూ నిద్రాహారాలు మాని, ఎండి వరుగులా అయింది ఒక్కోసారి ఏకారణంలేకుండానే ముసలి వానిముందు కూర్చుని కళ్ళనిండా నీళ్ళు పెట్టుకునేది.

మీ ఇద్దరూ డాబాలమీద తరచుగా ఒకర్నొకరు చూసుకునేవారనే విషయం చివరికతను తెలుసుకోగలిగాడు. నువు కాలేజీకూడా మానేసి, మధ్యాహ్నం పూట డాబామీద, చేతిలో పుస్తకం పెట్టుకొని ఒంటరిగా కూర్చుని చదివేవాడివి. విప్రదాసు నా దగ్గరకొచ్చి విషయమంతా విప్పిచెప్పాడు. నన్ను సలహా అడిగాడు "మామా! నువ్వు చాలా రోజులనుంచి కాశీయాత్రకు వెళ్ళాలనుకుంటున్నావు కదూ! నువ్విప్పుడు వెళ్ళడం మంచిది. ఆమెను నా అధీనంలో ఉంచు. జాగ్రత్తగా చూస్తాను" అన్నాను.

"అతడు కాశీ వెళ్ళాడు. నేనామెను శ్రీపతి చటర్జీ ఇంట్లో పెట్టాను అతడే ఆమె తండ్రిగా నలుగురికీ చెప్పాను. తరువాత జరిగిందేమిటో నీకు తెలిసిందే. మొదట్నుంచీ

చివరిదాకా నీకే విషయమంతా చెప్పి నేనివాళ ఉపశాంతి పొందుతాను. ఇదంతా ఓ ప్రణయచరిత్రలా ఉంది. అవును కదూ! ఇదంతా పుస్తకంగారాసి అచ్చు కివ్వాలనుకుంటు న్నాను. కాని నేను రచయితను కాదు. ఈ రంగంలో మా మేనల్లుడికేదో కొంత అభిరుచి ఉందంటున్నారు నాకీపుస్తకం రాయడానికి అతన్ని తీసుకొస్తాను. ఈ కథాంతం నాకు తెలియదు. కనుక నువ్వు అతనికి కొంచెం సాయపడాలి."

పేరీ శంకర్ చెప్పిన ఈ చివరి విషయాలను పట్టించు కోకుండా హేమంత అడిగాడు; "ఈ పెళ్ళికి కాసం అభ్యం తరం పెట్టలేదా!

"ఇది చెప్పడం కష్టం. స్త్రీల మనస్సు లెలా ఉం టాయో నీకు తెలుసు. వాళ్ళు 'కాదు' అని చెప్పారంటే అది 'అవున'న్నమాట. కొత్త ఇంటికి వెళ్ళింతరువాత మొదట్లో ఆమె నిన్ను చూడక పిచ్చిదైపోయింది. ఎలాగో నువ్వుకూడా ఆమె కొత్త చిరునామా సంపాదించి, కాలేజీకి వెళ్ళేదారిలో శ్రీపతి ఇంటిముందు ప్రదక్షిణలు చేసేవాడివి నీదృష్టి ప్రెసి డెన్సీ కాలేజీమీద ఉండేదికాదు. నీకళ్ళు ఓఇంటి గవా క్షాలవైపు వెదకేవి. మీాఇద్దర్నీ చూసి నాకు జాలివేసింది, ఓమూల నీ చదువు పాడైపోతోంది. మరో మూల ఆమె పరి స్థితి మరీ జాలికరంగా ఉంది.

ఓరోజున కుసుంను పిలిచి అడిగాను 'అమ్మాయీ! నే చెప్పేది జాగ్రత్తగా విను. నే ముసలివాణ్ణి. నాముందు సిగ్గుపడకు. నీ హృదయంలో ఎవర్ని కోరుకుంటున్నావో నాకు తెలుసు. అతగాడి పరిస్థితి కూడా నీలాగే ఉంది. మీా

ఇద్దరికి పెళ్ళి చేయ్యాలనుకుంటున్నాను! ఇలా అనగానే కుసుం కళ్ళనిండా నీళ్ళు పెట్టుకొని అక్కణ్ణుంచిపరుగెత్తుకుపోయింది ఇది జరిగింతరువాత చాలా రోజులకు ఓనాడు నేను శ్రీపతి ఇంటికి వెళ్ళాను. కుసుంను పిలిచి నీకు సంబంధించిన విషయాలను ఆమెతో చర్చించాను. నెమ్మదిగా ఆమె సిగ్గును పోగొట్టటంలో విజయం పొందాను. చివరికి పెళ్ళి చెయ్యడానికి పూనుకుంటానని చెప్పగా ఆమె అన్నది 'ఎలా జరుగుతుంది! ఫర్వాలేదు నిన్నో బ్రాహ్మణకన్యగా చెప్పి వివాహం జరిపిస్తాను. చాలాసేపు చర్చ జరిగింతరువాత నువ్వెందుకు ఒప్పుకుంటావో లేదో అని అన్నదామె. 'ఏమిటిదంతా! కుర్రాడు ప్రేమపిచ్చిలో పడ్డాడు. ఇప్పుడివన్నీ అతనికి చెప్పి ప్రయోజనం ఏమిటి! వివాహం అయింతరువాత అన్ని విషయాలు వాటంతటి కవే సర్దుకుపోతాయి. అసలావిషయం బయటికి పొక్కగల అవకాశం లేనప్పుడు ముందుగానే చెప్పుకొని జీవితాన్ని దుఃఖభాజకం చేసుకోవడం ఎందుకు?

ఈ ఎత్తుగడకు కుసుం అంగీకరించిందో లేదో నాకు తెలియదు, ఒక్కోసారి ఏడుస్తూ ఉండేది. మరోసారి మౌనంగా ఉండేది. అయితే ఆ విషయాన్ని ఇక్కడితో ఆపు చేద్దాం" అని నేనన్నప్పుడు ఆమెలో అశాంతి చిహ్నాలు కనిపించేవి. పరిస్థితులిలా ఉండగా నేను శ్రీపతిని పెళ్ళిప్రస్తావం మీద నీదగ్గరకు పంపించాను. ఒక్కక్షణంకూడా ఆగకుండా నువ్వెందుకుఅంగీకరించావు. అంతాసవ్యంగా జరిగిపోయింది.

"ముహూర్తం నిర్ణయించబోయే ముందు కుసుంతిరిగి మళ్ళీ మొదటికి వచ్చింది. "ఈ పెళ్ళి వొద్దు, మామయ్యా,"

అన్నది నాతో "ఏమనుకుంటున్నావమ్మాయి! అంతా నిర్ణయమైపోయిం తరువాత ఇప్పుడు మానమెట్లా వెనక్కి తగ్గుతాం!"

"నే వచ్చిపోయానని పుకారు పుట్టించండి. నన్నెక్కడికైనా పంపించండి" అన్నదామె.

అప్పుడా యువకుడి సంగతేమిటి! అతడు తన చిరకాల కోరిక రేపో మాపో తీరనున్నదని ఉవ్విళ్లూరుతుంటే ఇవ్వాళ నీచావువార్త అతని చెవిని పడెయ్యమంటావా! దాని ఫలితంగా అతని మరణవార్త రేపు నీకు నేను అందచెయ్యాల్సి ఉంటుంది. అదే సాయంత్రం నీ చావుకబురు నా చెవిని పడుతుంది. అమ్మాయీ! ఈ వయస్సులో నేను ఓ స్త్రీహత్యను, బ్రాహ్మణ హత్యను నా చేతులారా చెయ్యగలననుకుంటున్నావా!"

ఎలాగైతేనేం అనుకున్న ప్రకారం పెళ్ళి జరిగిపోయింది. నా తలమీద నుంచి పెద్దబరువు దిగిపోయినట్టనిపించింది. ఇక ఆ తరువాత జరిగిందేమిటో నీకే తెలుసు."

"మమ్మల్ని ఇంతగా అవమానపర్చింది చాలలేదా! మరిప్పుడా రహస్యాన్ని ఎందుకు బయటపెట్టావు?" అడిగాడు హేమంత చాలసేపు నిశ్శబ్దంగా కూర్చున్న తరువాత.

శేరీశంకర్ నిదానంగా. నిశ్చలంగా అన్నాడు "నీ చెల్లెలిపెళ్ళికి ఏర్పాట్లన్నీ జరిగాయని తెలుసుకోగా నేనాలో అనుకున్నాను. "సరే ఇప్పటికి నేనో బ్రాహ్మణుని కులాన్ని కల్తీ చేశాను. అదలా చెయ్యవలసి చేశాను. ఇప్పుడింకో బ్రాహ్మణకులం ప్రమాదంలో పడింది. ఈసారి దీన్ని రక్షిం

చడం నావిధి" అంచేత నేను వాళ్ళకి నువ్వు శూద్రుని కూతుర్ని పెళ్ళి చేసుకున్నావని, అవసరమైతే దాన్ని నిరూపిస్తానని రాశాను."

"ఇప్పుడు నేనామెను బహిష్కరిస్తే ఆమె గతేమిటి? నువ్వామెను పోషిస్తావా?" తనను తాను అదుపులో పెట్టుకోవడానికి ఎంతో ప్రయత్నిస్తూ అడిగాడు హేమంత.

"నా కర్తవ్యమేమిటో నేను నెరవేర్చాను. భర్తల చేత బహిష్కరింపబడ్డ భార్యలను కాపాడడం నాకర్తవ్యం కాదు. లోపల ఎవరైనా ఉన్నారా? హేమంత బాబుకు ఓగ్లాసు షరబత్ చేసి అందులోకాస్త ఐస్ వేసి తీసుకు రండి!

ఆతిథ్యాన్ని స్వీకరించకుండానే హేమంత అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

## 4

ఆ రాత్రి చీకటిగా ఉంది. పక్షులేమీ గానం చెయ్యడంలేదు. ముఖర్జిగారి ఇంటిపక్కనున్న మామిడిచెట్టు చీకట్లో కొరివిదెయ్యంలా ఉంది. పిల్లగాలులు వీచడంలేదు. ఆకాశంలో నక్షత్రాలు మినుకు మినుకు మంటున్నాయి.

పడగ్గదిలో దీపంలేదు. హేమంత మంచంపక్కని కూచుని కిటికీగుండా బయట చీకట్లోకి చూస్తున్నాడు. కుసుం తనభర్త పాదాలను రెండుచేతుల్లో గట్టిగా పట్టుకొని నేల మీద పడుకొంది.

జోళ్ళ చప్పుడు మళ్ళీ వినిపించింది. తలుపు దగ్గర కొచ్చి హరిహరముఖర్జీ అన్నాడు. "నీకు చాలా వ్యవధి ఇచ్చాను. ఇంతకంటె ఎక్కువివ్వను. ఆమెను ఇంట్లోంచి వెళ్ళగొట్టు!

ఇది వినకానే కుసుం భర్తపాదాలను తన చేతుల్లో మరింత గట్టిగా పట్టుకొంది. వాటిని ముద్దాడింది; నుదురుతో తాకింది.

హేమంత అక్కణ్నుంచిలేచి తలుపుదగ్గరకు వెడుతూ అన్నాడు. "నాభార్యను వెళ్ళగొట్టను."

"ఏమిటి! నీకులాన్ని వొదులుకుంటావా!" గర్జించాడు హరిహర్.

"నే కులాన్ని లెక్క చెయ్యను" హేమంత ప్రశాంతంగా జవాబు చెప్పాడు.

"అయితే నిన్నుకూడా వెలేస్తాను."



---

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 103 B 115 |
| పుస్తకం పేరు | ఆదర్శ ప్రేమ |
| తారీఖు | 25-10-2024 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 323 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sk. Rehana. |
| పేజీలు విడదీసినది | REHANA |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | LAKSHMI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |